# భారతదేశంలో ప్రభుత్వం భూస్వామి రైతు

## బ్రిటిష్ పాలన కాలంలో వ్యవసాయ సంబంధాలు

(1865 - 1935)

మూలం
డీట్‌మార్ రోథర్ మూండ్
అనువాదం
బి. జనార్ధన్ రావు

Konrad Adenauer-Stiftung వారి సౌజన్యంతో



BOOK BIRD
Publishers & Distributors

# భారత దేశంలో
# ప్రభుత్వం భూస్వామి రైతు

## బ్రిటిష్ పాలనా కాలంలో
## వ్యవసాయ సంబంధాలు
## 1865 - 1935

మూలం
డీట్‌మార్ రోథర్‌మూండ్

అనువాదం
బి. జనార్ధన్ రావు

ఈ పుస్తక అనువాద ప్రయత్నంలో
బి. శ్రీనివాస్ రెడ్డి, డా॥ యం. యాదగిరి చార్యులు, శ్రీ. రమేశ్ లు
వివిధ దశల్లో సహాయాన్ని అందించినారు
1997

Assistence to
The Translation and publication of the
Book is extended by
**Konrad - Adenauer Foundation, New Delhi.**
The Translator thankfully
acknowledges the same

*ప్రథమ ముద్రణ : 1997*

*అనువాద గ్రంథం:*
భారతదేశంలో ప్రభుత్వం భూస్వామి రైతు
(బ్రిటిష్ పాలనా కాలంలో వ్యవసాయ సంబంధాలు 1865 - 1935)

**మూలం :**
ప్రొ॥ డీట్మార్ రోథర్మూండ్, డైరెక్టర్, సౌత్ ఏషియా ఇనిస్టిట్యూట్
హైడల్బర్గ్ యూనివర్సిటీ, జర్మనీ.



**అనువాదం:**
డా॥ బి. జనార్దన్ రావు, రీడర్
పాలనాశాస్త్ర విభాగం, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్.





*వెల :*
సాదా ప్రతి - 95=00
బౌండు ప్రతి - 120=00

*ప్రతులకు :*
1) బుక్‌బర్డ్స్, హెడ్ పోస్టాఫీసు ఎదురుగా
హన్మకొండ, వరంగల్.
2) ఇం. నెం.2-5-230, నక్కలగుట్ట
హన్మకొండ, వరంగల్ - 506 001.

# అంకితం

రైతాంగ జీవితాన్ని మరింత మానవీయం చేయడానికి

**ఉద్యమించి అమరులైన ఎందరో ఉద్యమకారులకు,**

రైతాంగ జీవన అధ్యయనం పైన నా ఆలోచనలకు

పదును పెట్టి నిర్దేశననిచ్చిన అధ్యాపకులు

**ప్రొ॥ కె. మురళీ మనోహర్ గార్లకు**

నా ఈ అనువాదం అంకితం .......

iv

# విషయ సూచిక





# ముందుమాట

బ్రిటిష్ పాలనాకాలంలో భారతదేశం మూడు రకాలుగా పాలించబడేది. బ్రిటిష్ వారు ప్రత్యక్షంగా పాలించే మైదాన ప్రాంతాలు, అటవీ షెడ్యూల్డ్ ప్రాంతాలు, సంస్థానాధీశులు పరిపాలించే సంస్థాన ప్రాంతాలు. వలస వాద పూర్వకాలంలో భారతదేశంలో రాజాతోడర్ మల్ కాలంనుంచి, అక్బర్ ల దాకా పెద్ద యెత్తున రెవిన్యూ సంస్కరణలు ప్రవేశ పెట్టిన నేపథ్యం చరిత్రలో వుంది. బ్రిటిష్‌పాలనాకాలంలో అడవిపై 'అనుభవించడానికి' ఆదివాసులకు స్వేచ్ఛవుంది. వర్తకం చేయడానికి వీలులేదు. రైతాంగం భూమి సాగు చేస్తే దానిపై కొంత శిస్తు చెల్లించాలనే పద్ధతుల్ని ప్రభుత్వాలు ప్రవేశపెట్టినాయి. భారతదేశంలో వున్న 600 ల పైచిలుకు సంస్థానాల ప్రభువులకు , రైతులకు, మధ్య కౌలు సంబంధాల విషయంలో భూమి హక్కుల విషయంలో అనేక ఉద్యమాలు వచ్చిన విషయం స్పష్టమే. భారతదేశ గ్రామీణ సమాజం - వలసవాదపాలన - రైతాంగ ఉద్యమాల్లో మొత్తంగా కీలకపాత్ర వహించింది భూ యాజమాన్యధోరణులే. నైజాం సంస్థానంలో మూడు రకాల భూయాజమాన్య పద్ధతులు అమలులో వుండేవి. రాజకుటుంబ వ్యయం కొసం కేటాయించబడిన సర్ఫ్- ఇకాజ్ భూములు,వంశపారంపర్య అనుభైవిక హక్కులు కలిగి వున్న జాగీరు, మక్తా భూములు, రైతుల స్వాధీనంలో వున్న ఖల్సా భూములుగా భూ యజమాన్యం విభజించబడి వుండేది.

సర్‌బస్తా కాలంలో (సెటిల్‌మెంట్‌లేని కాలం) ప్రభుత్వ భూములను అజమాయిషీ చేసిన కుటుంబాలకే భూముల కేటాయింపు జరిగేది. ఈ కుటుంబాల వాళ్లే దేశ్‌ముఖ్‌లు, దేశాయ్‌లు గా సంస్థానధీశులచే నియమించబడేవారు. ఢిల్లీలో సామ్రాజ్యాలు మారి, చక్రవర్తులు మారితే, దేశంలో అన్ని ప్రాంతలలోని దేశ్‌ముఖ్‌లకు ఒక ఫర్మానా పంపించబడేది. దేశ పెత్తనం మారిన అంశాన్ని తెల్పేది ఈ ప్రకటన. స్థానిక సర్వాధికారాల కొసం సంస్థానీధీశులు ఆ ఫర్మానాను ఆమోదించేవారు. తిరుగుబాట్లను అణిచి చక్రవర్తి సార్వభౌమాధికారానికి భంగం వాటిల్ల కుండా చూడడమే సంస్థానాధీశుల కర్తవ్యం. యుద్ధ విరమణ సమయాల్లో సైన్య పోషణా భాధ్యతను హజారి, తీన్ హజరీ, పంచ్ హజరీలు చేపట్టి నిర్వర్తించాలి. పోషణ వ్యయం కోసం భూములను స్థానికులకు అప్పగించి సుంకం వసూలు చేయ్యాలి. ఆనాడు, ఢీల్లి నుంచి - మచిలీపట్నం దాకా వేసిన "దండు బాటల" లో (మిలిటరీ రూట్స్) వచ్చే మిలటరీ కదలికలకు మార్గం సుగమం చేయడం ఈ స్థానిక సంస్థానాధీశుల పనే. సుబేదారీ వ్యవస్థాపన, రాజ్యాధికార ప్రతిష్టాపన, తిరుగుబాట్లను లొంగుబాట్లుగా చేసుకొనే క్రమం నాటి నుండి నేటిదాకా సాగుతున్నది. సందర్భాలు, రూపాలు మాత్రమే మారినాయి.

భారతదేశంలో భగ్గుమంటున్న ఆధిపత్య పోరాటాలు స్థానిక సంస్థానాల మధ్య వున్న పరస్పర వైరుధ్యాలను ఉపయోగించుకొని ఈస్టిండియా కంపనీ, ఫ్రెంచ్ ఇండియా కంపనీలు భారత దేశీయ పాలనాధికారాన్ని చేతుల్లోకి తీసుకొన్నది. సైన్య పోషణ ఖర్చుల కోసం రాయలసీమ, సర్కార్ జిల్లాలను మహారాష్ట్రలో బేరార్ ప్రాంతాలను ఈ విదేశీ శక్తులకు నైజాం అప్పగించినాడు. తెలంగాణాలో రైతుల బాధలకు, భారతదేశంలో ఇతర ప్రాంతాల రైతుల పీడనకు మధ్య అంత తేడా ఏమిలేదు. జాగీరు దార్ల, జమీందార్ల, ప్రభుత్వాధికార్ల దోపిడీలో దేశంలో వున్న రైతాంగం అనుభవించిన తీవ్రత ఒకే తీరుగా వున్నది. నైజాం వృత్తి కులాలు, సాలెవాండ్లు కూడా తీవ్ర బాధలు పడ్డారు. 1933 కంటే ముందు సాలే వాండ్లు కూలీకి పోలేదు. ఏ సాలె స్త్రీ దాసీ తనం చెయ్యలేదు. దేశం మొత్త మీద గ్రామాల్లో అమలు చేయబడ్డ రాజ్య పెత్తనం వల్ల రైతాంగంతో పాటుగా వృత్తి కులాల కుటుంబాలు కూడా దెబ్బతిన్నాయి. రక్షణలేని కౌలుదార్లు రకరకాల బానిస చాకిరి చేయవలసి వచ్చేది.

నైజాం ప్రాంతంలో వున్న కౌలుదార్ల రక్షణ సమస్య, పెత్తన దోపిడీ, భూమిపై జమీందార్ల పట్టు, గ్రామాల్లోని సర్వ రంగాల్లో పెరిగిన పీడనకు వ్యతిరేకంగా ఆంధ్ర, మహసభ ఉద్యమం, సాయుధ రైతాంగ పోరాటాలు వచ్చినాయి. బ్రిటిష్ వారి కన్నా ముందే రెవిన్యూ విభాగాన్ని , న్యాయ విభాగాన్ని నైజాం వేరు చేసినాడు. తదనంతరమే బ్రిటిష్ వారు ఈ పద్ధతిని అనుసరించినారు. బ్రిటిష్ వారు తాము రూపొందించిన చట్టాన్ని తాము అమలుపరిచే ప్రయత్నం తు.చ. తప్పకుండా పాటించేవారు. రైతాంగ ఆందోళనల మూలాలను అధ్యయనం చేసి పాలనా చర్యలను రూపొందించేవారు. నైజాం పాలనలో దీనికి భిన్నంగా క్రింది స్థాయిలో దోపిడి పెరిగింది. దీనికి వ్యతిరేకంగా రైతాంగ సాయుధ పోరాటం వచ్చి పెత్తందార్లను తరిమికొట్టింది. నేడు 'నివాసేతర భూస్వామ్యం' పోలేదు. కోస్తా వలస భూస్వామ్యం పెరిగింది. క్రొత్త పద్ధతుల్లో వ్యవసాయ దోపిడి కొనసాగుతున్నది. దేశం మొత్తంగా 'చిన్న కమతాలు' రైతులు కేవలం బ్రతకడానికి ఆధారాలుగా మాత్రమే మిగిలినాయి. 'వ్యవసాయం' అనేక మంది రైతులకు అధనపు ఫలసాయాన్ని పొందే మార్గంగా మారలేదు. రైతులకు' పెట్టుబడి పెట్టే శక్తిని వ్యవసాయం రంగం ఇవ్వలేదు. అనుబంధ వృత్తి మార్గం లేకుండా వ్యవసాయ రంగం నేడు భద్రమైన జీవితాన్ని ఇచ్చేదిగా లేదు. మొగ్గం వేసే వేలును ఈస్టిండియా కంపినీ నరికితే, 'అధునిక దొరతనం' మగ్గాలనె నామరూపాలు లేకుండా చేసే స్థితికి నెట్టింది. వ్యవసాయ రంగం రైతాంగానికి కావలసిన భద్రతను, గౌరవాన్ని

ఇవ్వలేకపోయింది. ప్రభుత్వాలకు రైతుల పైన ఉండే వైఖరిలో రావలసిన మార్పు రాలేదు. ఆదివాసుల బ్రతుకు అంతకన్నా హీనంగా మారింది. మూడు, నాలుగు తరగతుల్లో నేను చదివిన వాక్యం గుర్తుకొస్తున్నది. "హిందుస్థానికే అసిలి బాసిందే కోల్ భీల్ సంతాల్ తోడ" అని మేం చదివేవాళ్ళం.

భారతదేశంలో రైతులతో పాటుగా వచ్చిన అనాదివాసులైన ఆదివాసులు దేశ అభివృద్ధిలో భంగపాటు పడ్డారు. రైతులకు భూమి ఫలసాయం దక్కక పోతే, ఆదివాసులకు ఆ భూమి కూడా దక్కటం లేదు. భూమిపై పెరిగిన అకాంక్షకు అంతులేకుండా పోయింది. ఈ సందర్భములో టాల్‌స్టాయ్ చెప్పిన కథ ఒకటి గుర్తుకొస్తున్నది. ఒక మనిషికి ఎంత భూమి కావాలన్న విషయమే ఇందులో ఉండే తాత్పర్యం. "ఒక వ్యాపారి భూమి కావాలని ఆటవిక నాయకునికి దగ్గరికి పోతాడు. ఈ వ్యాపారి ఆ నాయకునికి అద్దం, కానుకలు ఇచ్చి భూమికావాలని అడుగుతాడు. సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు నీవు తిరిగి వచ్చేదంతా నీకే ఇస్తానని నాయకుడు తెలుపుతాడు. భూమిని సాధ్యమైనంత ఎక్కువగా పొందాలన్న ఆదుర్దాతో తిరిగి తిరిగి వచ్చి వ్యాపారి, నాయకునికి వందగజాల దూరంలో పడి చనిపోతాడు. ఈ వ్యాపారిని బొందపెట్టడానికి కావలసింది వంద గజాలేనని నాయకుడు తెలుపుతాడు. భూమిపై అకాంక్ష, పెత్తనంపై దురాశ రెండూ నేడు భారతదేశంలో ప్రబలంగా వున్నాయి. ఇది ఒక రకమైన 'లూట్ మార్' పద్ధతి. వలసవాద కాలం నుండి నేటి దాకా భూములను ఆక్రమించి, అధికారాలను వశపరుచుకొని ప్రజలను లొంగదీసుకొన్న దీర్ఘక్రమాన్ని విశదీకరించిన రచయిత ప్రొ॥ **రోథర్‌మూండ్**, అన్ని కష్టాలకు ఓర్చి అనువాదం చేసి తెలుగు పాఠకులకు ఈ సుదీర్ఘమైన సమాజ సంబంధాల విశ్లేషణను అందజేసిన అనువాదకులు **డా॥ జనార్ధన్ రావు** కు నా అభినందనలు తెలుపుతూ సెలవు తీసుకొంటున్నాను.

- మీ

**కాళోజి నారాయణ రావు**

జనవరి 6, 1997

# అనువాదకుని మాట

రైతాంగ చరిత్ర రచన చేపట్టడం అంటే
- రాజుకొన్న కొలుములును ఆశ్వాసించడమే.......

రాజులకు చరిత్రవుంది. వారి చరిత్రలను రచించే వ్యక్తుల లభ్యమైనారు కాబట్టి ఆయా రాజవంశాల చరిత్ర ముందు తరాలకు కూడా అందుతూ పోయింది. అందుకే ఒక కాలంలో చరిత్ర ఎక్కువ శాతం రాజవంశాల చుట్టూ పరిభ్రమించడంలో ఆశ్చర్యమేమి లేదు. రాజులపాలన ప్రజలను ఇక్కట్ల పాలు చేసింది. నైజాం రాజరికాన్ని చవి చూసిన తెలంగాణ ప్రజల మనోభావాలకు మరో ఉదాహరణ దీనిపై అవసరం లేదు. కవులకూ, కార్మిక ఉద్యమాలకు చరిత్ర వుంది. ఆధునిక, ప్రజాస్వామ్యా ఉద్యమాలు కార్మికుల మధ్య తరగతి జీవితాలకు సంబంధించిన నేపథ్యాన్ని రచించి మహోపకారం చేసినాయి. చరిత్ర ఒక రచనగా రైతాంగ జీవితాలను బాహ్య ప్రపంచానికి తెలియజేయడం బహుశా 20వ శతాబ్దపు ఆరంభంలో మొదలైంది. మార్క్సిస్టు సంప్రదాయం మొదట్లో కార్మిక వర్గానికి సంబంధిచి అధిక ప్రాధాన్యత నిస్తేచైనా విప్లవం, రైతాంగపు రథసారధి స్వభావాన్ని నొక్కి చెప్పినట్లయింది. కర్షకుల, రైతాంగ జీవితానికి సంబంధించి వామపక్ష పార్టీలు అందించిన రచనలు, ఉదారవాద మేధావులు చేసిన రచనలు ఈ అంశాన్నే నొక్కి చెప్పుతాయి.

రైతాంగం ఆసియా ఖండపు సమాజాల ఇరుసు. నిత్యనిక్షిప్తమై వున్న ఎన్నో కోణాలు ఇంకా రైతాంగ జీవనం నుండి వెలువడవలసీ వున్నవి. నాటి డేనియల్ థార్నర్ తరంనాటి రచనల నుండి నేటి మోరల్ ఎకానామిస్టుల దాకా విస్తృత పరిశోధనల పరంపర కొనసాగుతూనే వున్నది. ఈ పరంపరలో రోథర్మూండ్ రచన విశిష్టమైనదిగా కొన్ని అంశాల దృష్ట్యా అనిపించి అనువదించాలని తపన పడ్డాం. చివరికి అనువదించాం. ఈ ప్రయత్నంలో కొన్ని అసంపూర్ణతలు వుండవచ్చు. వాటిని మళ్ళీ మళ్ళీ సరిదిద్దుకొనే ప్రయత్నం సర్వదా చేయవలసి వుంటుంది. మొదటి ప్రయత్నంలో మూలం చెడకుండా సారాంశాన్ని అందించే జాగ్రత్తలు ప[illegible] తెలియచేయడంలో సంకోచంలేదు. అంతేగాక, ఈ అనువాదం ప్రత్యేకించి కొన్న కారణాల దృష్ట్యా అత్యవసరం అనిపించింది.

గతంలో భారతదేశ రైతాంగ చరిత్ర అంతా బ్రిటిష్ కేంద్రీకృత భావజాలంపై ఆధారపడి ఉంది. అందువల్ల ఇతర యూరోపియన్ చరిత్రకారుల అంచనా బ్రిటిష్ పరిపాలన ప్రభావం పై ఎలా వుందో తెలుగు పాఠకులకు అందించాలనుకున్నాం. ఒక జర్మన్ చరిత్ర

కారుడి భావాలను వలసవాద పాలనపై తెలుసుకోవడం కూడా సబబు అనిపించింది. మరొకరకంగా సమకాలికంగా వుంటుందని కూడా భావించాం. అంతేగాక, బ్రిటిష్ "పాలన చరిత్రపై" రచనలు అరుదుగా వచ్చినాయి. ముఖ్యం బి.బి. మిశ్రాలాంటివారు వ్రాసిన రచనలు ఆంగ్లంలో అందుబాటులో వున్నా వాటిపై రాజ్యాంగ, చారిత్రక, మానసిక, విశ్లేషణ అంశాల ప్రభావమే అధికంగా వుంటూ వచ్చింది. దీనికి భిన్నంగా, భూస్వాముల, కౌలుదార్ల, వడ్డీ వ్యాపారస్తుల - ఆదివాసుల, వెనుకబడిన ప్రాంతాల, ప్రభుత్వావిధానాల మధ్య పెనవేసుకుపోయిన పరస్పర "వలసవాద అధికార సంబంధపు అనుశృత స్వభావాన్ని" ఈ రచన సమృద్ధిగా వివరించింది. పాలనా చరిత్ర విద్యార్థిగా ఈ అంశాన్ని తెలుసుకోవడానికి ఈ అనువాదం అవసరం.

ప్రభుత్వం ఒక అధికార నిర్మాణంగా అవతరించిన నేపథ్య చరిత్రను ఈ రచన సరళంగా ముందుంచుతుంది. భిన్న ప్రాంతాల్లో నాటి ఉన్నతస్థాయి పాలకులు ఉద్ఘాటించిన అనుభవాల్ని , అనేక అంశాలను కోకొల్లలుగా ఈ రచన ప్రస్తావిస్తుంది. **జ్ఞానం ఆంగ్లంలో వుండి నేర్చుకోవడంలో ఇంకా వ్యత్యాసాలున్న భారతీయ సమాజంలో 'వలస వాదశాసనం' ఎట్లా అనునిత్యం విభజనను పెంచి పోషించిందో కండ్లకు కట్టినట్లుగా అడుగడుగునా తెలియజెప్పే ఈ గ్రంథాన్ని తెనుగీకరించడం** మా ఈ తరం అధ్యాపకుల బాధ్యతగా స్వీకరించాం. ఈ పుస్తకాన్ని అనువదించే క్రమంలో ఎందరో పెద్దలు నన్ను ప్రోత్సహించారు. మరెందరో విద్యార్థి, అధ్యాపక మిత్రులు తోడ్పడ్డారు. ముఖ్యంగా ఈ క్రింది అధ్యాయాలకు అనువాద సహాయకులుగా కష్టపడిన ముగ్గురు మిత్రులను ప్రత్యేకించి ఈ సందర్భములో తెలుపాలి.

రెండవ, మూడవ, ఏడవ అధ్యాయాల అనువాదంలో భాగస్వామ్య కృషి చేసిన నాచిన్ననాటి స్నేహితులు సహచరులు, డా॥ యం. యాదగిరి చార్యులను తప్పనిసరిగా ప్రస్తావించాలి. ఈ అనువాదంలో ఆయన అందించిన కృషి అభినందనీయం.

ఐదవ, ఆరవ అధ్యాయంలో, పదవ అధ్యాయాల్లో నా విద్యార్థి సహచర మిత్రులు బి. శ్రీనివాస రెడ్డి, శ్రీ రమేష్, లెక్చరర్, సోషియాలజీ సహాయ అనువాదకులుగా వ్యవహరించినారు. వారి భాగస్వామ్యాన్ని కూడా ఇందులో ప్రస్తావించడం సరి అయినటువంటిది.

తెలంగాణాలో పుట్టి రైతాంగ జీవిత చరిత్ర రచనా అధ్యాయనంలో ఆసక్తిని కలిగి అహర్నిషలు ప్రజా జీవన హక్కులకై పరిశ్రమించి ఈ అనువాదానికి ముందు మాట రాసి ప్రోత్సాహన్నిచ్చిన గౌరవనీయులు ప్రజా కవి పద్మవిభూషణ్ శ్రీ కాళోజీ నారయణరావు గారికి అనువాదకులుగా మా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని అనువదించడానికి

అనుమతినిచ్చి, అడుగడుగునా ప్రోత్సాహమందించిన పుస్తక రచయిత ప్రొ॥ డి. రోథర్ మూండ్ గారికి మా ధన్యవాదములు. ఈ పుస్తక సారాంశానికి, అనువాదకుని భావానికి అద్దం పట్టే విధంగా ముఖ చిత్రం వేసి ఇచ్చిన మిత్రులు లక్ష్మన్-ఎలే, హైదరాబాద్ గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణలో కొనార్డ్ అడేనాయర్ ఫౌండేషన్, న్యూఢిల్లీ, 'కృషి' పరిశోధక మిత్రులు, వరంగల్, బుక్ బర్డ్స్ . పబ్లికేషన్స్, వరంగల్ వారు ఎంతో సహాయ సహకారాలందించినారు. వారికి మా ధన్యవాదములు. ఈ ప్రచురణలో ఉషోదయ గ్రాఫిక్స్ శ్రీను, లక్ష్మీ గ్రాఫిక్స్ యజమాన్యం, సిబ్బందికి, పుస్తక ప్రచురణలో వివిధ దశలలో సహాయం అందించిన ఎందరికో మా ధన్యవాదాలు. ఈ దేశ రైతు, కూలీల జీవితంపై నాకు ఇతమిద్ధమైన అవగాహన కలిగించడానికి ఉపకరించి, పరోక్షంగా ఈ అనువాద ఆసక్తిని పురికొల్పిన అనేక ఉదారవాద, వామపక్ష పార్టీలకు, మేధావులకు, రైతాంగ జీవితాన్ని అనుభవిస్తూ, సిద్ధాంత భేదాలతో నిమిత్తం లేకుండా వారి బాగోగులకు అనునిత్యం శ్రమిస్తున్న మధ్యేవాద పార్టీ రైతు సంఘాలకు, వేదికా భేదాలు లేకుండా అహర్నిశలు శ్రమిస్తున్న రైతుబిడ్డలందరికీ నాహృదయ పూర్వక ధన్యవాదాలు.

ఈ అనువాద ప్రయత్నంలో నాసహచరులు, విద్యార్థులు అనేకం సాయపడ్డారు. వారందరికీ నా కృతజ్ఞతలు. ప్రత్యేకించి యువ మిత్రులు శ్రీ సీతరామరావు, డా॥ పి. నరేంద్ర బాబు, కె. వెంకటనర్సింహా రావు, డా॥ విద్యాసాగర్ రెడ్డి, ఐ. జయకృష్ణ , జి. రవి, పి. సుభాన్, టి. యాదగిరి రావు లకు నా కృతజ్ఞతలు. నా కుటుంబ సభ్యులు డా॥ఎల్లంకి. రేవతి, బి. వర్ష, బి. శిశిర్ లకు, శ్రీ బుచ్చిబాబు, శ్రీదేవిలకు ప్రభుత్వపాలనా శాస్త్ర విభాగంలో నా సహ అధ్యాయులందరికీ ధన్యవాదములు. ప్రత్యేకించి నా ఈ అకడమిక్ ప్రయత్నాలకు నిరంతరం ప్రోత్సాహనిస్తున్న నా కుటుంబ సభ్యులు శ్రీ ఎల్లంకి జగన్నాధరావు గారికి, ఎల్లంకి రమాదేవి గారికి, బి. కిషన్ రావు గారికి, బి. అంజనమ్మ గారలకు నా ప్రత్యేక ధన్యవాదములు.


భవదీయ అనువాదకుడు,

**డా॥ బి. జనార్ధన్ రావు,**

పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, మానవవనరుల నిర్వహణ విభాగం

కాకతీయ విశ్వ విద్యాలయం.


మార్చి 10, 1997.

# పుస్తక పరిచయం

భారత దేశపు ఆర్థిక, సామాజిక, రాజకీయ అభివృద్ధి క్రమంలో దేశంలోని వ్యవసాయిక సంబంధాల తీరు తెన్నులకు అధిక ప్రాధాన్యత ఉన్నదనేది నిర్వివాదాంశం. ఈ సంబంధాలను అనేక మార్గాలలో అధ్యయనం చేయవచ్చు. గతాన్ని పునరుద్ధరించడం ద్వారా వర్తమానాన్ని అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించే చరిత్రకారుడిలా నా అధ్యయనం కొనసాగింది. బ్రిటిష్ పరిపాలన కాలంలో భారతదేశంలో వ్యవసాయిక సంబంధాల పూర్వ చరిత్రను పునర్నిర్మాణం చేయడంలో నేను ఆ కాలంలో రైతాంగ రుణగ్రస్తత, భూముల బదాలయింపు, కౌలుదారు రక్షణకు సంబంధించి ఆయా సందర్భాలలో చేయబడిన శాసనాలపైననే ప్రధానంగా ఆధారపడటం జరిగింది. అంత మాత్రన కేవలం శాసన పత్రాలతోనే నా అధ్యయనం జరిగిందని భావించవద్దు. శాసనాలనే కాకుండా అవి ఆ రూపం పొందడానికి దారి తీసిన పరిస్థితులు, శాసనపరమైన వివిధ ప్రాథమిక ప్రతిపాదనలు వాటి పరిణామ క్రమం, ముసాయిదా బిల్లులు, చర్చలు సభాసంఘాల నివేదికలు మొదలయిన వాటిని నిశితంగా పరిశీలించడం జరిగింది. దీనితో పాటు ఆయా చట్టాల పనితీరు నివేదికలను, చట్టాలకు తీసుకరాబడిన సవరణల గమనాన్ని అవగాహన చేసుకోవడమైనది. ఈ కృషి స్వరూపాన్ని గ్రామీణ భారత రాజ్యాంగ చరిత్రగా అభివర్ణించవచ్చు.

ఈ అధ్యయనం కోసం నేను ఎంపిక చేసుకున్న కాలం ఏడు దశాబ్దాలకు సంబంధించినది. ఈ మొత్తం కాలంలో భారతదేశ రాజకీయ ప్రయోజనాల పట్ల అంతగా శ్రద్ధ కనబరచకుండా, ఎప్పటికప్పుడు శాసనాలు తేవడం ద్వారానే పాలకులు చేసిన ప్రయత్నాన్ని శోధించడం జరిగింది. 1865 కు పూర్వం వారు ముఖ్యంగా పాలనా పరమైన నిర్ణయాలనే ఊతంగా తీసుకున్నారు. ఇక 1935 తర్వాత ప్రాదేశిక ప్రాంతాలనకు స్వయం ప్రతిపత్తి సంక్రమించడంతో వ్యవసాయిక విషయాలపై శాసనాలు రూపొందించే అధికారం భారతీయ శాసన సభలకు, మంత్రులకు దక్కింది. ఇది శాసన రూపకల్పనలో బ్రిటిష్ వారి ప్రాబల్యాన్ని నిరోధించగల్గింది. అయితే, వ్యవసాయిక సంబంధాలను ప్రభావితం చేసే ముఖ్యమైన అనేక శాసనాలు 1879-1908 ల మధ్యే ఆమోదించబడినాయి. అంతేకాదు, ఆ చట్టాలు ఏర్పరచిన మౌలిక చట్రం స్వాతంత్ర్యానంతరం కూడా చెక్కుచెదరలేదు. ఈ విషయాన్ని మరింత సమగ్రంగా అవగాహన చేసుకోవడానికి 1935 నుండి వర్తమాన కాలానికి వ్యవసాయిన సంబంధాలపై ఓ అధ్యయనం జరుపవలసిన ఆవశ్యకత ఉన్నది. అట్లాంటి

అధ్యయనం బ్రిటిష్ వారు ఏర్పరచిన సరళికి భారతజాతీయ కాంగ్రెస్ తో సహా ఇతర రాజకీయ పార్టీలు, సంస్థల వ్యవసాయ రంగానికి సంబంధించి కార్యాచరణ ఏమేరకు తదనుగుణంగా వున్నది, ఏమేరకు విభేదిస్తున్నది పరిశీలించేదిగా ఉండాలి. ప్రస్తుత అద్యయనంలో ఈ అంశాన్ని స్పృశించక పోవడానికి తగిన కారణమున్నది. అదేమంటే, బ్రిటిష్ వారి వ్యవసాయిక పరమైన శాసనాల సంప్రదాయం ఎంత బలీయమైనదంటే, భారతదేశ రాజకీయ వర్గాలు ఆ ప్రభావం నుండి ఏ మాత్రం తప్పించుకోలేక పోయాయి. ఎందుకంటే, ఈ నాటిరాజకీయ వాదులు ఆనాటి శాసన, పాలనా సాంప్రదాయపు వారసులే కనుక. స్వాతంత్ర్యానంతరం ఏర్పరుచుకున్న రాజ్యాంగానికి, బ్రిటీష్ వారు ప్రతిపాదించిన సంస్కరణల సమాహారమైన 1935 చట్టం పునాది కావడమే ఇందుకు ప్రబల నిదర్శనం.

బ్రిటిష్ సంప్రదాయాన్ని గురించి నేను పదేపదే ప్రస్తావించడాన్ని తప్పుగా అర్థం చేసుకోవద్దు. బ్రిటిష్ వారు ఒక స్పష్టమైన సంస్కరణలు క్రమాన్ని అందించి భారతీయులు స్వీయ ప్రభుత్వాన్ని ఏర్పరచుకోవడానికి సంసిద్ధులను చేసారని తెలిపే ఎలాంటి సిద్ధాంతాన్ని నేను ఆమోదించడం లేదని స్పష్టం చేస్తున్నారు. ఈ క్రమాన్ని భంగపరిచే రాజకీయ ఉద్యమాలు, సామాజిక ఒత్తిడులు భారతీయ సమాజానికి ఎంతో కొంత మేలు చేసాయని నేను విశ్వసిస్తాను. నేను చేపట్టిన వేరొక అధ్యయనంలో భారత దేశంలో స్వాతంత్ర్య ఉద్యమ పరిణామ క్రమం, రాజ్యాంగ సంస్కరణల తీరు వాటి పరస్పర ప్రభావితత్వం గురించి విశ్లేషణ చేసాను. బ్రిటీష్ వారి పక్షాన ప్రతిపాదించబడు రాజ్యాంగ సంస్కరణపై చెప్పబడిన భాష్యాలు స్వాతంత్ర్య ఉద్యమంపై భారతీయ రచయితల ఏకపక్ష వ్యక్తీకరణలురెండూ సరియైనవి కావని నేను స్పష్టం చేసాను. ఇవి ఏ రకంగాను రాజకీయ జీవితానికి న్యాయం చేకుర్చలేక పోయాయి. వారి వారిజాతీయ దృక్పథాలను అనుసరించి స్వీయ ఆమోదయోగ్యమైన ఉపమోగకరమైన గతాన్ని నిర్మించుకోవడానికే తోడ్పడినాయని చెప్పగలిగాను. వ్యవసాయిక సంబంధాలకు చెందినంత వరకు ఉపయోగకరమైన గతాన్ని ఏర్పరచుకోవలసిన అభిలాష మమ్మల్నేమి ఇబ్బంది పెట్టలేదు. గ్రామీణ భారతంపై అధికారాన్ని ధనిక రైతాంగానికి కట్టబెట్టడానికి బ్రిటిష్ వారు ఒక పథకం ప్రకారం ప్రయత్నించారని ఎవరు వాదించక పోవచ్చు. అయితే, అంతమంగా బ్రిటిష్ వారు అదేపని చేసినప్పటికి, దీని వెనుక పెద్ద తంత్రాంగం ఏమి లేదనడానికి వ్యవసాయిక శాసనాల రూపొందడంలో చపలత్వానికి సంబంధించి నా ఈ అధ్యయనంలో చేసిన వివరణయే ఒక నిదర్శనం. నిజానికి వారి

ప్రయత్నాలలో ప్రాంతీయమైన పరిస్థితులకు అనుకూల, ప్రతికూల ప్రమాదాల కలగలుపు, సందిగ్ధ ధోరణి, బహుళ స్పందనల మేళవింపు కనిపిస్తుంది. ఐనప్పటికి, సర్వ సాధారణమైన ఒక సంప్రదాయంలో ఈ ధోరణి ద్యోతకమవుతూనే వుంటుంది. వ్యవసాయ సంబంధిత శాసనాలలో గాని, వివాదాస్పద రాజ్యాంగ సంస్కరణలలో గాని కన్పించే ఆసాధారణ సంప్రదాయం లక్ష్యం ఒక్కటే. అది భారత దేశంలో బ్రిటిష్ పాలన సాఫీగా సాగడానికి కావలసిన సామాజిక పునాదిని పదిలపరచుకోవలసిన అవసరం. నిర్బంధాలతో కూడుకున్న ఓటు హక్కు, కౌలుదార్లకు కల్పించబడిన పరిమిత రక్షణ రెండూ ఈ క్రమంలో ఒకే నాణానికి గల బొమ్మ, బొరుసు వంటివే.

నా ఈ అధ్యయనంలోని అతిస్పష్టమైన సిద్ధాంతీకరణ బ్రిటిష్ పాలనలో రక్షిత రైతాంగ వర్గం ఆవిర్భావాన్ని బ్రిటిష్ పాలకుల పాలనా, సామాజిక స్థితి షరతులు నిర్దేశించాయే తప్ప అట్లాంటి ప్రక్రియ ముందస్తుగా సంధానం చేయబడినది కాదు. నేను ప్రస్తావించిన శాసన పరమైన సాక్ష్యం సంభావితమై ఆధారం చూపించగలదే తప్ప నిర్ణయాత్మక రూపం ఇవ్వజాలదనే వాస్తవం నాకు తెలుసు. రెవెన్యూ అధికారులు తయారు చేసే హక్కుల రికార్డులను ఇందుకు ఒక ఉదాహరణగా చెప్పవచ్చు ఈ సిద్ధాంతాన్ని ప్రామాణీకరించడానికి టామ్ కిసింజర్ యొక్క 'విలాయిత్‌పూర్' వంటి మరింత నిశితమైన విపులమైన అధ్యయనాల అవసరం ఎంతో ఉన్నది. ఇలాంటి అధ్యయానల ద్వారా మూడు, నాలుగు తరాలకు చెందిన రైతాంగ కుటుంబాల స్థితిగతులను తెలుసుకోవడం ద్వారా ఒక ఖచ్చితమై అభిప్రాయానికి వచ్చే అవకాశం వుంటుంది. ఇది, నా ప్రస్తుత అధ్యయనపు పరిధిలోనికి వచ్చేది కాదు. అయినప్పటికి, నాసిద్ధాంత ప్రతిపాదన రాబోయే పరిశోధనకు ఒక పరీక్షగా నిలుస్తుందనే విశ్వాసం నాకున్నది.

ప్రస్తుత రచనలో వ్యవసాయిక సంబంధాలలోని ఆర్థిక దృక్కోణం గురించి చాలా క్లుప్తంగా చర్చించడం జరిగింది. అందువల్లనే 1978 లో ఈ పుస్తకం ప్రచురించిన తర్వాత 1930లోని తీవ్ర ఆర్థిక మాంద్యం భారత రైతాంగంపై చూపిన ప్రభావాల నేపథ్యాన్ని అధ్యయనం చేసే కార్యక్రమాన్ని ప్రారంభించాను. (1929 - 1939 తీవ్ర ఆర్థిక మాంద్యం పరిస్థితులలో భారతదేశం, న్యూఢిల్లీ, 1992) భారత దేశ ఆర్థిక చరిత్రకు సంబంధించి నాచే ప్రచురితమైన మరో గ్రంథంలో రైతాంగం సమస్యలను ప్రముఖంగా ప్రస్తావించాను. (భారతదేశ ఆర్థిక చరిత్ర, న్యూఢిల్లీ, 1988).

ప్రస్తుత గ్రంథంలో నా కంటె ముందున్న కొంత మంది రచయితలు అందించిన అత్యుత్తమ అధ్యయనాలలోని అంశాలను కూడా చర్చించడం జరిగింది. అట్లాంటి కొందరిని ఇక్కడ మననం చేసుకోవడం ద్వారా వారి (రచనల)కి నేనెంత రుణపడి వున్నాని చెప్పుకోగల అవకాశం లభించింది. మొట్టమొదట గా నేను ప్రస్తావించదలచినది బాడెన్‌పావెల్ యొక్క ఉత్కృష్ట రచన. బ్రిటిష్ ఇండియాలో భూస్వామ్యా పద్ధతులు దీనికి మనస్థాయిలో గాని, పోటీగా గాని నా రచన జరుగలేదు. భారతదేశంలో పనిచేస్తున్న బ్రిటిష్ పాలనాధికారుల కోసం వ్రాయబడిన ఈ రచన ప్రస్తుత గ్రంథం కంటె సవివరమైన సమాచారం అందిస్తుంది. అయితే, ఈయన పాలనాధికారి కావడం వల్ల సహజంగానే ఇందులో విమర్శనాత్మక పరిశీలన జరుగలేదు. అంతేగాక, నేను ఉపయోగించుకున్నట్లుగా పురావస్తు (గ్రంథ) సమాచారాన్ని ఈ రచనలో వాడలేదు. నేను మరొక స్నేహితుడు ఎరిక్ స్టోక్స్ రచనకు కూడా నేను రుణ పడివున్నాను. చిన్న వయసులోనే మరణించడం వల్ల భారత దేశంలోని వ్యవసాయిక సంబంధాలపై ఆయన చేసిన రచనల నుంచి సరికొత్త ఆలోచనలు ప్రేరేపింపచేయగల, ఇతరులతో పంచుకోగల అవకాశం మనకు దక్కలేదు. ఈయన గ్రంథం నా రచనకు ప్రాథమిక స్థాయిలో కరదీపికగా ఉపయోగపడింది. భారతదేశ పరిస్థితులపై అతను చేసిన మొదటి రచనలో బ్రిటిష్ అధికారుల నమ్మబలికే వ్యవహార సరళి ఆయనపై చూపిన ప్రభావపు ముద్ర చాలా స్పష్టంగా ఉన్నట్లు ఆ తరువాతి కాలంలో గుర్తించాను. ఆ ప్రభావం ఎంతగా ఉందంటే, ఆయా వ్యక్తుల ప్రాబల్యాన్ని బట్టి వారు ముఖతా వెలిబుచ్చిన అభిప్రాయాలను యధాతథంగా ఆయన అంగీకరించడం కనిపిస్తుంది. ఇట్లాంటి రచనలను పరిశీలించేటప్పుడు నేను మరికొంత ఎక్కు జాగరూకతతో వ్యవహరించేవాడిని. అతని అవధులు లేని జ్ఞానానికి, లోతైన పరిశీలన దృష్టికి ఎప్పటికీ అబ్బురపడుతుంటాను.

నానుండి చాలా త్వరగా దూరమై పోయిన మరో మిత్రుడు డేనియల్ థార్నర్. ఆయనతో జరిపిన నిరంతర చర్చలు నా కెంతో ఉపయుక్తమైనాయి. సమకాలీన వ్యసాయిక సంబంధాల పట్ల ఆయన ఎక్కువగా ఆసక్తి కనబరిచేవాడు. ఆయన అనుసరించిన విమర్శనాత్మక సరళి నన్నెంతో ప్రభావితం చేసింది. సందర్భాను సారంగా నేను కూడా ఆ సరళిని ఉపయోగించాను. ఇప్పటికీ నా మిత్రులు, సహాధ్యాయులుగా ఉన్న కొందరి రచనల గురించి కొంత ప్రస్తావన చేస్తాను. ఆయా రచనలను నేనెంతో నిశితంగా ఆసక్తితో పరిశీలిస్తుంటాను. బెంగాల్ పై బినయ్ భూషన్ చౌధురి చేసిన, కృషి ఇప్పటికీ చాలా వరకు

అముద్రితంగా వున్న ఈ రచన భారతదేశంలో వ్యవసాయిక సంబంధాల అధ్యయన చరిత్రలో ఒక ఆణిముత్యం వంటిది. ఆయనతో జరిపిన సమాలోచనలు, 1970-71లో హీడెల్‌బర్గ్ లో మేం సంయుక్తంగా నిర్వహించిన "భారతదేశంలో రైతాంగ వ్యవసాయానికి సంస్థాగత నమూన" అన్న సెమినార్ నాకెంతో ఉపయోగపడింది. శ్రీ దివాన్ (చంద్) వాధ్వా భారతదేశంలో వ్యవసాయిక శాసనాల గురించి ప్రచురించిన సమగ్ర జాబితా ఈ విషయమై ఏకాగ్రతతో శోధన చేసే ప్రతి పరిశోధకుడికి ఒక కరదీపిక అనడంలో ఎలాంటి సందేహానికి తావు లేదు. దక్షిణ ఆసియా అంతర్ విషయ సంబంధమైన ప్రాంతీయ పరిశోధన కార్యక్రమంలో భాగంగా నడిచిన దన్‌బాద్ పరిశోధన ప్రాజెక్ట్‌లో నేను ఆయనతో కలిసి పనిచేసాను. సమాచార సేకరణ క్రమంలో జమిందారీ విధానపు పునాదులను, సర్వేసమాచారాన్ని కంప్యూటరీకరణ చేయడం వలన కలిగిన మార్పులను చక్కగా అవగాహన చేసుకొనే అవకాశం లభించింది. ఈ పరిశోధన ప్రాజెక్టులో పనిచేసిన విద్యార్థి డెట్లి గ్రాఫ్ షెరిన్ ను కూడా ఇక్కడ ప్రస్తావించాల్సి వున్నది. "ఛోటా నాగపూర్ లో భూమి, శ్రామికుల నియంత్రణ' ' పై అతను వ్రాసిన పరిశోధన వ్యాసాన్ని పర్యవేక్షించడం వల్ల సంబంధిత విషయంపై నా పరిజ్ఞానాన్ని మరింత పెంచింది.

నా ఈ రచనకు ఎన్నెన్నో సంస్థలు సహకరించాయి. అలాంటి సంస్థలలో న్యూఢిల్లీలో గల జాతీయ పురావస్తుశాల, కలకత్తాలోని జాతీయ గ్రంథాలయం, లండన్ లో గల భారత కార్యాలయ గ్రంథాలయం ముఖ్యమైనవి. జర్మన్ పరిశోధన మండలి, హీడల్ బర్గ్ విశ్వవిద్యాలయంలో దక్షిణాసియా సంస్థ నా అద్యయానానికి ఆర్థిక సహాయం అందజేసాయి. ఈ సంస్థ వ్యవస్థాపకులలో ఒకరైన 'వెర్నర్ కోన్‌జు' కు నేనెంతగానో రుణపడివున్నాను. ఈ అధ్యయనాన్ని చేపట్టడంలో వెన్ను తట్టినిలిచిన ఈయనకు నా వినమ్ర పూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. 1969-70 లో పూనాలో గల గోఖలే ఆర్థిక, రాజకీయ విషయాల అధ్యయన సంస్థలో సెలవులలో గడపడానికి, అధ్యాపక బృందంతో చర్చల ద్వారా లబ్ది పొందడానికి నన్ను ఆహ్వానించి అవకాశం కల్పించిన వి.యం. దండేకర్‌కు నా ప్రత్యేక అభినందనలు. నేను తరుచుగా భారతదేశాన్ని సందర్శించినపుడు నేను బసచేసిన ప్రతి ప్రాంతంలో నాకు సహకరించిన, ప్రతి సందర్శనను విజయవంతం అయ్యేందుకు దోహదపడిన ప్రతి ఒక్కరికి నా కృతజ్ఞతలు. వారి పట్ల నా గౌరవాన్ని ప్రకటించుకోవడానికి నా ఈ గ్రంథాన్ని వారికి చిరు కానుకగా సమర్పించుకుటున్నాను.

నా ఈ గ్రంథాన్ని తెలుగు భాషలో అనువదించడానికి ఎంతో శ్రమ తీసుకున్న నా సహధ్యాయి **డా॥ బి. జనార్థన్ రావు** (ప్రభుత్వ పాలనా శాస్త్రం, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్) గారికి నా ప్రత్యే క ధన్యవాదములు. నా పరిశోధన ఫలితాలను భారత ప్రజలకు తెలియజేయాలని నేనెప్పుడూ తపన పడుతుంటాను. అది కూడా ఆంగ్ల భాషద్వారా కంటే ఆయా భారతీయ భాషలలో అందించడం ఎంతో ప్రభావవంతంగా వుంటుందని కూడా నాకు తెలుసు. ఈ క్రమంలో నా గ్రంథానికి తెలుగు ప్రతి ఒక అద్భుతమైన ప్రక్రియయని, ఉత్కృష్ట కార్యక్రమమని భావిస్తున్నాను. ఈ కృషి మరెందరికో ప్రోత్సహకారి కావాలని నా ఆకాంక్ష. గిరిజనుల భూ సమస్యలపై విశేష కృషి చేస్తున్నజనార్థన రావుతో ఆ నేపథ్యంలోనే పరిచయమేర్పడింది. పరస్పర పరిశోధన ప్రయోజనాలకు సంబంధించినంత వరకు మా అభిప్రాయాలు, ఆలోచనలు, కలబోసుకోవడం జరిగింది. ఈ విధమైన ఆలోచనా ఏకత్వంలో బాగంగా **డా॥ జనార్థన్ రావు** స్వీకరించిన బాధ్యత కష్టతరమైంది. అనేక ఇబ్బందులు ఎదుర్కొని దేశీయమైన భాషలో ఈ వివరాలను అనేకులకు అందజేయాలనే ఆయన పడ్డ తపనను, ప్రయత్నాన్ని భావించి ఆయనను మనసారా అభినందిస్తున్నాను. **పద్మవిభూషణ్ శ్రీ కాళోజి నారాయణ రావు** తెలుగు రచనకు ముందుమాట వ్రాయడం నేనెంతో గర్వించే విషయం. నా రచనను ఎంతో ఆసక్తితో పరిశీలించి తన అమూల్య సమయాన్ని వెచ్చించి ముందుమాట వ్రాసినందులకు ఆయనకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. పుస్తక ముద్రణను, అనువాదాన్ని ప్రోత్సహించిన కాన్‌రాడ్ అడనాయిర్ ఫౌండేషన్, న్యూఢిల్లీ గారలకు నా కృతజ్ఞతలు. ఈ పుస్తక ప్రచురణలో సర్వదా ప్రోత్సాహన్ని అందించి ప్రచురణా భాధ్యతలను స్వీకరించిన శ్రీనివాస, ఉషోదదయ గ్రాఫిక్స్ గారికి. లక్ష్మి గ్రాఫిక్స్ ముద్రణా యాజమాన్య భాధ్యులైన శ్రీ రాజిరెడ్డి గారికి, ఆయా సిబ్బందికి నా ధన్యవాదములు.

**ప్రొ॥ డా. డీట్‌మూర్ రోథర్ మూండ్**

సౌత్ ఏసియా ఇనిస్టిట్యూట్

హైడల్‌బర్గ్, జర్మని

జనవరి 12, 1997

ఒకటవ అధ్యాయం

# పరిచయం

1. వ్యవసాయ సంబంధాల ప్రాథమిక అంశాలు:
రైతాంగ వ్యవసాయ నిర్ణాయకాలు:

భారత దేశంలో వ్యవసాయం ప్రాథమికంగా రైతాంగ కుటుంబాలకు సంబంధించినది. అందువల్ల వారి జీవితాలను నిర్ధారించే అంశాల విశ్లేషణ జరపడం ఈ సంధర్భంలో అత్యవసరమైన అంశం. చాలా వరకు ఈ నిర్ణాయకాలు (determinants) భారత దేశానికే ప్రత్యేకింప బడ్డవే కాకుండ, ఇతర దేశాల్లో కూడా వీనిని గమనించవచ్చు. ఈ విషయంపై పెరుగుతున్న ఆసక్తి వల్ల చాలా మంది వ్యక్తులు రైతాంగ ఆర్థిక వ్యవస్థను (peasant economy) గూర్చి విశ్లేషణలు జరిపినారు. ప్రస్తుత సమయంలో ఈ విషయ అధ్యయనంపై నానాటికి ఆసక్తి ఇంకా పెరుగుతున్నది. ఎందువలనంటే, పారిశ్రామిక దేశాలలో క్రమేపి వ్యవసాయం తగ్గడం, ప్రపంచంలో పెద్ద మొత్తంలో రైతులగానే వుండి, వారి యొక్క భవితవ్యంపైననే ప్రపంచ అభివృద్ధి ఆధారపడి వుండడమే దీనికి కారణంగా చెప్పాలి. రైతాంగ వ్యవసాయిక పరిశోధకులు మానవ సమాజంలో ఇమిడివున్న అంతర్గత వ్యత్యాసాల పట్ల అప్రమత్తంగా వున్నారు. అంతేగాక, కాలాను గుణ్యంగా వస్తున్న వ్యవసాయ వ్యత్యాసాలను, పునర్ నిర్మించ వలసిన రైతాంగ సమాజ వర్గాల పొందికను గుర్తించే బాధ్యతను కూడా ఈ విశ్లేషణలు విస్మరించలేదు. కొనసాగించబోయే చర్చలో భాగంగా, ప్రస్తుత అధ్యయన లక్ష్య వివరణకై సులభతరమైన రీతిలో రైతాంగ వ్యవసాయ నిర్ణాయకాల వర్గీకరణను ప్రవేశపెట్టడం జరిగింది. ఈ వర్గీకరణలో ఇమిడి వున్న ప్రయత్నం మౌళికంగా ఆయా కాలాల్లో వివిధ రచయితలు వ్యవసాయ సమాజంపై చేపట్టిన అధ్యయనాలు, వాటిలో వారు ప్రతిపాదించిన సూత్రీకరణలను సారంశీకరించడమే ఈ వర్గీకరణలో ఇమిడివున్న మౌళిక ప్రయత్నం.

వ్యవసాయ, రైతాంగ సంబంధాల ప్రాథమిక నిర్ణాయకాలుగా ఈ క్రింది వాటిని ప్రతిపాదించ వచ్చు. అవి ఎ) జీవసంబంధ బి) పర్యావరణ సి) సంస్థాగత డి) ఆర్థిక పరమైనవి. . వీటిని వేర్వేరు అంశాలుగా వివరించే ముందు ఇవి ఒక దాని కొకటి చాలా విషయాల్లో అంతర్ సంబంధాన్ని కలిగివున్న అంశాలుగా అర్థం చేసుకోవాలి. ఈ అంతర్ సంబంధాలను గూర్చి వివరించడమే ప్రస్తుత విశ్లేషణ ముఖ్య లక్ష్యము.

## ఎ) జీవ సంబంధ నిర్ణాయకాలు :

కొంత మంది పరిశోధకులచే జీవ సంబంధ నిర్ధారణాంశము ఏకైక అంశముగా పేర్కొనబడింది. వ్యవసాయ పనులకు లభించే కుటుంబ శ్రమ యొక్క సామీప్యత, శ్రమ విభజన పద్ధతులు తరాల వారీగా ఉండడం రైతాంగ వ్యవసాయమునకు వైయక్తిక అంశాలని కొందరు ప్రముఖ రచయితలు భావించారు. రైతాంగ ఆర్థిక వ్యవస్థకుండే ఇతర కారకాలు కేవలం ఆధారిత అంశాలుగా ఈ కేంద్ర అంశం చుట్టూ వుంటాయి. చయనోవ్ అనే వ్యవసాయ అర్థ శాస్త్రవేత్త ఈ దృక్పథంపై ఎక్కువ దృష్టిని సారించాడు. జీవ సంబంధ నిర్ణాయకాలచే ప్రభావం చూపిన నమూనాలకు ఒక విధంగా రష్యా, భారత అనుభవ :: నుంచి ఉదాహరణలుగా ఈ సిద్ధాంతములో ప్రముఖంగా పరిగణనలోకి తీసుకోబడ్డది. కొంత కాలంగా రష్యా పరిశోధకులు చేపట్టిన రైతాంగ ఆర్థిక అధ్యయనాలు ఏక ''గతిశీలక అధ్యయనాలు'' గా శానీన్ గుర్తించినాడు. రైతాంగ సంపదలోని కేంద్రీకరణ, వికేంద్రీకరణలో కొనసాగిన తరాలవారి చక్రీయ మార్పులు ధనిక రైతాంగాన్ని ఏకత్వ దృష్టి కలిగిన ఒక వర్గంగా ఆవిర్భవించడాన్ని నిరోధింపచేసింది. ఫలితంగా, పేద రైతాంగం నుండి ఈ వర్గాన్ని దూరం చేసింది.

ఈ ధనిక రైతాంగం జీవ సంబంధ ఘటన ఫలితంగా ఏర్పడినటు వంటిది. బెయిలీ ఒరిస్సాలో తాను జరిపిన ఒక విస్తృతాధ్యయనంలో ఇదే విషయాన్ని పేర్కొన్నాడు. ఆయన మాటల్లో ''మొత్తం గ్రామంలోని ధనిక వర్గం తమకు సంక్రమించిన భూములను ఆధీనంలో ఉంచుకొని, పూర్తి వారసులుగా కొనసాగు తున్నారని భావించినాడు. జీవ సంబంధమైన నిర్ణాయక ఊహనలను అన్వయించకున్నా, కిసింజర్ పంజాబ్‌లోని 110 భూయాజమాన్య కుటుంబాల పరిణామంపై జరిపిన అధ్యయనంలో దాదాపు పై అభిప్రాయాన్ని వ్యక్త పరచినాడు. 1848వ సంవత్సరాన్ని గీటురాయిగా (baseline) తీసుకొని చేసిన ఈ అధ్యయనంలో పరిశీలనా అంశంగా వున్న 110 కుటుంబాలలో సంభవించిన చావు, వలసలతో నిమిత్తం లేకుండా, కుటుంబ యూనిట్‌లో వచ్చిన మార్పులతో నిమిత్తం లేకుండా, కుటుంబ యూనిట్‌లో వచ్చిన మార్పులతో సహా ఆయా శతాబ్దాంతానికి గతంలో తాము కలిగి వున్న సంపదను అవిభాజ్యంగా కాపాడుకున్నారు. ఈ క్రమంలో మరొక వైపు 27 కుటుంబాల వారు క్రమేపి వృద్ధి చెందుతూ సంక్రమించిన భూమిని కొనసాగిస్తూ కుటుంబాల్లోని అంతర్ సంబంధాల్ని దృఢ పర్చుకుంటూ, గ్రామీణ వ్యవసాయ రంగానికి ఆవలిగా వున్న ఇతర రంగాల్లో ప్రవేశించారు. కొంతమంది విదేశాలకు వెళ్ళడం కూడా సంభవించింది. ఈ కుటుంబాలు స్వంతంగాను, ఆధీనంలో వున్న భూకమతాలలో వచ్చిన మార్పులను గమనిస్తే ''అందుబాటులో వున్న భూమికి అన్వయించ బడుతున్న కుటుంబ శ్రమకి నిలకడ గలిగిన సర్దుబాటు స్వరూపం''

వున్నదని కిసింజర్ ధృవీకరించాడు. పెరిగిన జనాభా వత్తిడి మూలంగా స్వంత, కౌలు భూముల వైశాల్యంలో గుర్తించ తగ్గ స్థాయిలో విభజన, తరుగుదల సంభవించింది. చిన్న కమతాలు రెండు నుండి ఐదు ఎకరాల మధ్య స్వంత భూకమతాలు,కౌలు భూముల పరిమాణం కంటే ఎక్కువగా పెరగడం జరిగింది. కొంత కాలంగా స్వంత, కౌలు (operated) కమతాలు, ఐదు నుండి పది ఎకరాల మధ్య తరహా కమతాలుగా నిలకడగా వుండడం జరిగింది. పది నుండి ఇరవై ఎకరాల పెద్ద కమతాలు స్వంత యాజమాన్య స్థాయిలో, కౌలు విషయంలో తగ్గి పోవడం జరిగింది. కౌలు, భాగస్వామ్య సాగు పద్ధతులను అవలంభించడం గృహంలోని వయోజన పురుషుల సంఖ్యపై ఆధారపడి సర్దుబాటు జరిగిందని, ఆర్థిక కమతాల సేద్యం కుటుంబ శ్రమకు తగిన ఉపాధి చూపడం కూడా కౌలుకు తీసుకోవడం, అద్దె కివ్వడం పైననే ఆధారపడినట్లుగా కిసింజర్ భావించినాడు. ఇతర అధ్యయనాలు కూడా ఈ విషయాలనే తెలియ జేస్తున్నాయి. ఈ విషయాలను జీవ సంబంధ నిర్ధారణాంశాల సిద్ధాంతానికి అనుసంధించినపుడు, ప్రతి రైతు రెండు ఆస్తులను కలిగి వుంటాడని భావించ వచ్చు. అవి పుత్ర సంతానం, భూములు. తన జీవిత కాలంలో ఈ రెండు చెదరకుండా వుండవచ్చు. కానీ, మొత్తంగా కుటుంబం మార్పుకు లోనయ్యే అవకాశముంది. ఒక పెద్ద భూకమతానికి తను యజమాని అయినపుడు, తనకు ఎక్కువ మంది కొడుకులున్నపుడు, భూమి సాగులో వారు సహాయపడ్డపుడు ఆ రైతు యాజమాన్యం సంక్రమణ రీత్యా కొనసాగుతుంది. కానీ, ఈ జీవ సంబంధ కారణాలు వాటి స్వరూపాన్ని బట్టి చిరకాలంగా ఇలాగే ఉండక పోవచ్చు. ఇవన్ని ఇలా ఉన్నప్పటికీ, చెప్పబడిన సమూహ జీవ సంబంధ కారణాలతో పాటు సంస్థాగత అంశాలను, వాటి పరిణామాలను కూడా దృష్టిలో వుంచుకోవాలి. ముఖ్యంగా ఆస్తుల భద్రత, చట్టాలు, న్యాయపరమైన బాధ్యతల కట్టుదిట్టాలు, కుటుంబ స్థితి, కులం వంటి భారత దేశ ప్రత్యేక పరిస్థితులైన సాంప్రదాయ వారసత్వ వ్యవస్థలుగా, సంస్థాగత కారకాలుగా, అంశాలుగా పనిచేస్తాయి. అయితే, ఈ సంస్థాగత అంశాల్ని అనంతరం చర్చించ వచ్చు. కానీ ఇచ్చట చేప్పేదేమంటే, జీవసంబంధ నిర్ధారణాంశాలు ఒక పరిమితి కలిగిన సంస్థాగత స్థితిలోనే పని చేస్తాయి. ఇతర స్థితిలో ఈ అంశాల ప్రస్తావన అసంగతంగా వుంటుంది. ఉదాహరణకు చైనా కమ్యూన్‌కానీ, ఉన్నటు వంటి ప్రత్యేక సంస్థాగత కార్యకారణాలు జీవ సంబంధ నిర్ధారణాంశాల నిర్వహణలో మన అధ్యయనం ప్రకారం ప్రత్యేక ప్రాముఖ్యాన్ని కలిగి వుంటాయి. షానిన్ ప్రకారం ధనిక రైతాంగం ఒక వర్గం కాదు. ధనిక రైతాంగం అనేకానేక జీవ సంబంధ సంస్థాగత కారకాల ఘటనలచే రూపాంతరం చెందిన సంక్షిప్త రూపం. రాజకీయ మద్దతుకు గానీ, రాజకీయ దాడుల సందర్భంలో ఈ వర్గాన్ని ఏకైక ప్రాతిపదిక అంశంగా వేరు చేయలేమని షానిన్ భావించాడు. ఇంతకంటే అధిక స్థాయిలో వర్గ కలహాలు, అసూయలు ఉన్నప్పటికీ, ప్రతీ

రైతు తన తోటి వారికన్నా పేద, ధనిక తేడాలకు గురయిన జీవిత సత్యాల యెడ అప్రమత్తతను కలిగి వుంటాడు. కనుక వారి జీవితంలో ఈ స్వీయ వివేచన అనునిత్యం కనబడుతుంది. ఈ జీవిత సత్యాల ఆధారంగా జగడాలు పెట్టుకోవడం వారికి ఇష్టం లేదు. అట్లాగే తన జీవిత భద్రతను కొనసాగించడానికి, పొరుగు వారి మనుగడకు తోడ్పడిన సంస్థాగత పరిస్థితులను ఛిన్నా భిన్నం చేయడానికి కూడా రైతు మనస్కరించడు.

మన ఈ అధ్యయన విశ్లేషణ ఆధారంగా జీవ సంబంధ నిర్ధారణాంశాలుగా క్రింది ముఖ్యమైన విషయాలను గుర్తించ వచ్చు. గ్రామీణ సమాజ విభజనను ఆర్థిక స్థితిగతుల ఆధారంగా కాల కొలమానముల ద్వారా వివరించడానికి వీలు లేదు. దీనికి బదులుగా వారు భూమి కలిగి వుండే స్వభావాన్ని వివరించాలి. అదేమంటే ఒక చిన్న కమతాన్ని కలిగివున్న పేద కౌలు దారు కలిగి వుండే గుర్తింపు భావనను, స్వేచ్ఛను అంతే భూ కమతం కలిగిన రైతు పట్ల కనబరిచే సంఘీభావం వల్ల ఇతర ధనిక రైతులతో కలవడానికి ఇష్టపడడు. రైతాంగ సామాజిక విభజన అంతర్గత వ్యత్యాసాలను ఈ పుస్తకంలోని ఇతర అధ్యాయములో చర్చించినప్పటికీ సంస్థా గత పద్ధతులు రైతాంగ సామాజిక వర్గీకరణ, అంతర్గత వ్యత్యాసాల వివరణే ఈ అధ్యయనంలో ప్రధాన కారకాలుగా పనిచేస్తాయి. వ్యక్తిగత ఆస్తులు లేదా పేదరికం ఆధారంగా కన్నా జీవ సంబంధ నిర్ధారణాంశాలు రైతాంగ విభజనను బలో పేతం చేసి కొనసాగించడానికి తోడ్పడుతున్నాయి.

## బి) పర్యావరణ నిర్ణాయకాలు

ఈ పర్యావరణ నిర్ణాయకాలు జీవ సంబంధ అంశాలతో దగ్గరి సంబంధాన్ని కలిగి వుంటాయి. ఎందుకంటే, రైతు పనిచేసే పర్యావరణంలోనే ఇది కూడా ఒక భాగం కనుక, వర్షపాతము, భూసార నాణ్యత ఇతర భౌతిక లక్షణాలు రైతు పండించే పంట రకాలు, ఇవన్నీ కలిపి నిర్ణయించే విషయంలో ప్రాథమిక స్థాయిలో వున్న వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానం, నీటి పారుదల సౌకర్యాలు ముఖ్య పాత్ర వహిస్తాయి. భారత దేశ వర్షపాత పటం ప్రాంతీయంగా ముఖ్య ఆహార పంటల విస్తీర్ణములను పరిశీలించినపుడు ఈ విషయం స్పష్టంగా తెలుస్తుంది.

ఈ స్వరూపానికి భూమి, మానవ జనాభా శాతం సమీప సంబంధాన్ని కలిగి వుంటుంది. గోధుమలు, మినుములకు బదులుగా వరి పెద్ద మొత్తంలో వున్న ప్రజలను పోషిస్తుంది. ఏదేమయిన, వివిధ పంటల పద్ధతులను అమలు చేయు స్థితిని వివరించడానికి ఎన్నో కారణాలు చెప్పవచ్చు. అందులో జనాభా ఒత్తిడి కూడా ఒకటి. (''భూమిని విడిచి పెట్టే, తక్కువ జనాభా, భూమి ( పోడు వ్యవసాయం ) గల ప్రదేశాలలో మొదలయి అంతర పంటలతో, వంట చెఱకు పంటలతో యుక్తంగా కృషించి పోయే పశువులకు గడ్డి భూములుగా

వాడడం జరుగుతుంది''.) సరిపోయిన విధంగా అనుకూల భౌతిక పరిస్థితులు ఉన్న స్థితిలో ఈ రకమైన వ్యవసాయం సాధ్యమవుతుంది. వర్షపాత నిశ్చితత్వం లేని ఎత్తైన ప్రాంత భూముల్లో వరి సేద్యం అనుకూలంగా వుంటుంది. దీని ప్రకారంగా ఈ ఆధునిక యుగంలో కూడా, భారత దేశంలోని ఈశాన్య కోస్తాలోని దిగువ భూముల ప్రాంతములలోని డెల్టా ప్రాంతాల కన్నా ఈ ఎత్తైన ప్రాంతాల్లో తక్కువ జన సాంద్రత కలిగి వుంది. ఇదే వరుస క్రమంలో భారత దేశంలో భూసార తరహా, వర్షాపాత స్వరూపాలు ఒకదానితో ఒకటి పెనవేసుకొని సమయకాల వ్యాప్తతలను (time & proximity) కలిగి వుంటున్నాయి. బ్రిటిష్ జిల్లా అటవీ అధికారులు అటవీ భూముల్లో గిరిజన ప్రజలు పోడు వ్యవసాయం చేయడాన్ని తుడిచి వేయడానికి కార్యాసక్తితో కృషి చేసినప్పటికి, అవసరమైన, ఈ సాగుపద్ధతి వినాశకారియైనదిగా భావించి తగ్గించడానికి చేసిన ప్రయత్నాలు సఫలం కాలేదు. స్థిర వ్యవసాయమునకు సంబంధించి వివిధ రకములయిన విస్తార, విస్తృత అధిక దిగుబడి సేద్య పద్ధతులను, నిశితంగానే పరిశీలించవచ్చు. ఈ కాలం నాటికి అన్ని ప్రాంతాల్లో జనాభా సమతులంగా వ్యాపించి లేదు. 1880 పూర్వం నాటికే అవద్ (udh) ఎక్కువ జన సాంద్రత కలిగి వుంది. ఇతర ప్రాంతాల్లో కూలీ ప్రజల కొరత కారణంగా సేద్యము అభివృద్ధి చెందలేదు. ఇలాంటి భిన్న ప్రాంతాల్లో సమతుల్యత సాధించడానికి వలసలు సహాయ పడలేక పోయినవి. ఆశ్చర్యకరమయిన స్థాయిలో రైతులు స్థానాంతీకరణ చెందినారు. తమ గృహానికి సంబంధించి పంట కోతల ముందు లేదా అనంతరం కానీ సేద్యపు పనులు పూర్తయిన తర్వాత సుదూర ప్రాంతాలకు సేద్యానికై వెళ్ళినారు. కొంత సమయం అవసరమయిన ఇలాంటి పనుల్కై వీరు వివిధ వాతావరణ పద్ధతులను సక్రమంగా వినియోగించుకున్నారు. అధిక జన సాంద్రత కలిగిన రైతాంగం, సారవంతం కాని ప్రాంతాల ప్రజలు అస్సాంటీ తోటలలోకి, బీహార్, బెంగాల్ బొగ్గు గనులలోకి ఇతర సుదూర తోటలలోకి కూలివారుగా వలస వెళ్ళినారు. పెద్ద మొత్తంలో రైతాంగ కుటుంబాలు అధిక జన సాంద్రత గల ప్రాంతాల నుండి సాగు యోగ్యమయిన భూమిగల ప్రాంతాలకు స్థిర వలసలు జరిగినట్లు తెలిపే దృష్టాంతాలు కనపడవు. కొన్ని ప్రదేశాల్లో చుట్టు ప్రక్కల ప్రాంతాల ప్రజలు పొరుగున వున్న మిగులు భూమి పొందడమనేది సాధారణంగా జరుగుతుంది. అటవీ సరిహద్దు లభ్యమయ్యే భూమి రైతాంగానికి అప్పగించడం స్పష్టంగా కనబడే అంశం. ఎంత వరకయితే గిరిజనులు విస్తృత అటవీ భూములను కలిగి వుంటారో ఇలాంటి వేవీ వారి మనసుల్లోకి రావు. సరిహద్దు ప్రాంతాల్లోని స్థిర వ్యవసాయం నెమ్మదిగా అటవీ భూముల్లోకి చొచ్చుకొని పోతుంది. కానీ ఈ పద్ధతి అంతటా ఒకే విధంగా లేదు. ఏదో సమయంలో చాలా ప్రాంతాలు ఎన్నో అవరోధాలను ఎదుర్కొన్నాయి. ఒక దాని వెంట ఒకటిగా వచ్చిన యుద్ధాలు, కరువులు, రోగాలు పెద్ద మొత్తంలో జనాభా నిర్మూలనకు కారణమయినాయి. భారత దేశంలోని చాలా

ప్రాంతాల్లోని ''బీడు గ్రామాలు'' (deserted villages) ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి. దురదృష్టమేమంటే, భారతదేశంలో ఈ గ్రామాలకు సంబంధించి ఎలాంటి అధ్యయనం చేపట్టబడలేదు. అదే యూరోపు దేశాలలో చరిత్రకారులు, వ్యవసాయార్థికవేత్తలు ఈ అంశంపై పెద్ద యెత్తున సున్నితమయిన పరిశోధనలు చేపట్టినారు. ఒకసారి భారత దేశంలోని బీడు గ్రామాల వితరణ గూర్చి అధిక విషయాలను తెలుసుకోగలిగితే, వ్యవసాయ సరిహద్దు భూముల కదలికల గూర్చి తెలుసుకోవడం చాల సులువవుతుంది.

ఇంత వరకు మనం ఏవైతే భౌతిక పరిస్థితులకు, సానుకూల, అననుకూలంగా వుండే సంస్థాగత విషయాలు ఉపయోగకరంగా వుంటాయో వాటిని పేర్కొనకుండా పర్యావరణ నిర్ధారణాంశములను చర్చించడం జరిగింది. గిరిజనుల సాంప్రదాయములు, కులము, రక్తసంబంధము, ప్రభుత్వ నిరుపయోగ భూముల నియమాలు, భూ సంపదను నియంత్రించు చట్టంల వంటి సంస్థాగత అడ్డంకులు పర్యావరణ నిర్ధారణాంశాల ప్రభావాన్ని మార్చుతున్నవి. ఇందులో కొన్నింటి గూర్చి ఈ సంధర్భంలో పేర్కొనడం జరిగింది. జీవ సంబంధ నిర్ధారణాంశాల ప్రభావం తప్పనిసరిగా సంస్థాగత పరిస్థితుల్లో ప్రభావాన్ని చూపినట్లే, పర్యావరణ ప్రభావాలు కూడా ఆయా సంస్థాగత స్థితి ఆధారంగానే ప్రభావం చూపుతాయనే విషయం ఈ సంధర్భంలో స్పష్టం.

## సి) సంస్థాగత నిర్ణాయకాలు:

సంస్థాగత నిర్ణాయకాలు, పర్యావరణ నిర్ణాయకాలను ప్రభావితం చేస్తూ వాటిని సమతూకించే ప్రక్రియలో కీలక పాత్ర వహిస్తాయి. కొన్ని సంధర్భాల్లో సంస్థాగత కారకాలు, పర్యావరణ నిర్ణాయకాలను మార్చగలిగేవిగా కూడా వుంటాయి. ఈ ఘటనలకు జనన నియంత్రణ పెంపుదలను ఉదాహరణలుగా పేర్కొనవచ్చు కానీ ,సంస్థాగత నిర్ణాయకాలు మన అధ్యయన కాలంలోని భారత రైతాంగ వ్యవసాయానికి సంబంధించి ప్రాముఖ్యం లేని కారణంగా వదిలివేసి కేవలం సంస్థాగత నిర్ణాయకాలకు, పర్యావరణ నిర్ణాయకాల మధ్య వుండే సంబంధాలను ప్రస్తావించడం మాత్రమే జరుగుతుంది. ఎందుకంటే పర్యావరణ నిర్ణాయకాలు సంస్థాగత నిర్ణాయకాల సంగతత్వపై ప్రభావం చూపుతుందే తప్ప వాటి సారాన్ని నిర్దేశించేదిగా వుండదు.

చాలామంది భారత రైతాంగ వ్యవసాయ పరిశీలకుల ప్రకారం కులాన్ని సంస్థాగత నిర్ణాయకంగా, గ్రామీణ సమాజ పునాదిగా పరిగణించారు. వాస్తవంగా, స్థిర వ్యవసాయంతో కులము చాలా సమీప సంబంధాన్ని కలిగి వున్న అంశం. గిరిజన పోడు సేద్యం చేసేవారికి కుల మనేది అర్థం లేనిది. కాని ఒకసారి స్థిర రైతు అతని భూములను దున్నే క్రమం ఆరంభించిన

నేపథ్యంలో కుల భావన వేళ్ళూనుకుంటూ వచ్చింది. భారత రైతాంగ సమాజ కుల లక్షణాల ప్రాముఖ్యాన్ని విశ్లేషించిన సమాజ శాస్త్రవేత్తల పరిగణన లేకుండా మనం పరిశీలిస్తే ఈ విషయానికి సంబంధించి కుల స్వభావం ఎంత వుందో స్పష్టంగానే తెలసవచ్చు. ముఖ్యంగా, కుల వ్యవస్థ గ్రామీణ సమాజానికి ప్రోదిచేసిన ప్రాథమిక విధుల వర్గీకరణ. అది రైతాంగ వ్యవసాయానికి అందించిన ప్రభావ విశ్లేషణను చేయడం ఆసక్తి కరమైన అంశం. ఈ విశ్లేషణ లక్ష్యము '' ఆధిపత్య కులము'' అనే భావన క్రమానుగత శ్రేణి పరమైన కర్మ స్వచ్ఛత భావనల కన్నా చాలా ఉపయోగ కరమయినదని చెప్పడమే . ' ఆధిపత్య కులం' భావన దాని విశ్లేషణ భావాత్మక క్రమానుగ్రత శ్రేణిస్థాయి మూలాల నుండి కాకుండా భూమి, శ్రమపై నియంత్రణ ఆధారంగా గ్రహించినది. కుల సంఘీభావం, కులాధిక్యత, ఆధిపత్య వ్యక్తీకరణకు తోడ్పడేవిగా భావించినప్పటికి ఇవే మూల కారణం కాదు. ఎప్పటైతే రాజకీయ పరిధిల నుండి కొంత మంది వ్యక్తుల లేదా సమూహాలకు భూములను నియంత్రించే వీలిస్తూ ఉన్నత కుల స్థాయీ, హోదా కల్పించ బడ్డదో ఆయా సంధర్భాల్లో పై అంశం కొంత మినహాయింపుగా వుంటుంది. కానీ ఈ విధమైన కులాధిపత్యం, ఆధిపత్య కులాధికారం కన్నా భిన్నమైనవి. ఇది ఆధిపత్య కులాల అధికార మూలం నుండి గ్రహించిన ఆధిపత్యం. రైతాంగ కులాల్లో ఎవరైతే భూమి నియంత్రణ, భూసేద్యము, ఉన్నత కుల హోదా కలిగి వుంటారో వారు కుల సూత్రాల ఆధారంగా సేద్యము నుండి మినహాయింపు పొందిన వారి నుండి వేరు చేయబడి వున్నారు. గ్రామాల్లో స్థానిక ఆధిపత్య కులాలకు బదులుగా చాలా సంధర్భాల్లో సంఖ్య ప్రకారం గణనీయంగా స్థాయీ పరంగా ఆధిపత్యం గల కులాలు, కొన్ని సేవాపర కులాలు అయినప్పటికీ, దాని కున్న కర్మ స్వభావం ఆధారంగా ఆధిపత్యం గల బ్రాహ్మణ పూజారి, గ్రామ గణాంకకుల కన్నా భిన్న హోదా పొంది వుంటారు. అట్లే క్రింది స్థాయిలో మంగలి, కమ్మరి, కుమ్మరి మొదలగు వారందరూ ఈ ఆధిపత్య కుల ప్రాపకత్వం మీద ఆధారపడి వుంటారు. రైతాంగ వ్యవసాయం లో చాలా ముఖ్యమైన విషయం ఏమిటంటే, చాలా గ్రామాల్లో సహాయ లేదా సేవా కులాలు, అంటరానివారు సాంప్రదాయ బద్ధంగా స్వంత భూ కమతాలు కలిగి వుండకుండా నిరోధింపబడి వ్యవసాయ కూలీలుగా వున్నారు. నిజంగా ఇది భారత దేశంలోని రైతాంగ వ్యవసాయ నిర్వర్తనలో కుల వ్యవస్థ అందించిన అతి ముఖ్యమైన అంశం. ఎవరైతే రైతులు తమ కుటుంబం చేయు సేద్యానికన్నా ఎక్కువ భూమి కలిగి వుంటారో, అట్లే సేద్యం నుండి మినహాయింపబడిన బ్రాహ్మణుల నిల్వ ఈ శ్రామికులపై ఆధారపడి వున్నారు. 1931 నాటి తాజా భారత గణాంకాల అధ్యయనం ప్రకారం కుల వ్యవస్థ నిర్మితి రీత్యా వ్యవసాయ రంగాన్ని ఎట్లు ప్రభావితం చేసిందో దాని ప్రతి అంశాన్ని గూర్చిన సమాచారాన్ని అందిస్తుంది. ఆ సమయంలో భారత దేశం 239 మిలియన్ల హిందూ జనాభాను కలిగివుంది. ఇందులో 177

మిలియన్లు బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలలోనూ, మిగతావారు సంస్థాన రాజ్యాలలో జీవిస్తున్నారు. దేశంలో మొత్తంగా 15 మిలియన్ల బ్రాహ్మణులలో 11 మిలియన్లు బ్రిటిష్ భారత దేశంలో వున్నారు. రాష్ట్రాల వారీగా వీరి పంపిణీ చాలా హెచ్చు తగ్గులుగా వుంది. (1.4 మి. బెంగాల్‌లో, 2 మి. బీహార్ ఒరిస్సాల్లో, 4 మిలియన్లు సంయుక్త రాష్ట్రాల్లో మరియు 2 మి. మాత్రం పెద్దవైన, దక్షిణ రాష్ట్రాలయిన బొంబాయి. మద్రాసుల్లో వున్నారు. ) కానీ ఈ ఒక్క బ్రాహ్మణ కుల సమూహం మాత్రమే పూర్తి భారత దేశంలో వ్యాపించిన ప్రాతి నిధ్యంతో కలిగి వున్నారు. భూమి కలిగిన ఆధిపత్య కులాలు ప్రాంతాల వారీగా వేర్వేరుగా వున్నాయి. ఆమిజాట్స్ పంజాబ్‌లో, 10.7 మి. రాజ్‌పూత్‌లు ఉత్తర భారత దేశంలో పెద్దమొత్తంలో, 3-7 మి సంయుక్త రాష్ట్రాల్లో, 6 మి. మరాఠీలు బొంబాయి, మధ్య రాష్ట్రాల్లో, 11 మి. రెడ్డీలు, వెలమలు, వక్కలిగస్ (Vakkaligas) ఇతర సమూహాలు దక్షిణ భారత దేశంలో వున్నారు. విచిత్రంగా చేసిన గణాంకాల ప్రకారం 4.7 మి అంటరాని వ్యవసాయ కులాలు, దక్షిణ రాష్ట్రాల సమూహాలలో వున్నారు. కానీ చాలా వరకు 3 మి. బెంగాల్ నామ శూద్రులు, 6.3 మి. సంయుక్త రాష్ట్రాల చమారులు కూడా ఆవర్గీకరణలో భాగమయ్యే అవకాశం వుంది. క్రింది స్థాయీ సేవలు, వృత్తి కులాలకు సంబంధించిన గణాంకాల ప్రకారం 7.3 మి. చేనేత (శా.ల), మి. కుమ్మరి, 3 మి. చాకలి, 5 మి. గానుగవారు (oil messurers), 10 మి. చెప్పుల తయారీ వారు, 7.7 మి. ఇతర వృత్తులవారు, మి. అంటరాని పాకీపని మొదలగువారు వున్నారు. ఈ విశ్లేషణ గణాంకాలు కుల వృత్తి విద్య చిత్ర పటాన్ని ప్రాంతీయంగా వేర్వేరుగా చూపించినప్పటికి ఇది సామాన్య గ్రామీణ వర్గీకరణ విధానంగా ఉద్భవించింది. దాని లక్షణాలను క్రింది విధంగా పేర్కోవచ్చు. ఆధిపత్య రైతాంగ కులాలు, భూమి కలిగిన బ్రాహ్మణులతో కలుపుకొని 1/3 గ్రామీణ జనాభా వుంది. ఇతర మూడవ వంతు ఎక్కువ మొత్తంలో వివిధ సేవలు నిర్వర్తించే వృత్తి కులాలు, ఐదవ వంతు (1/5) బయటి, అంటరాని కూలీకులాలు, మిగతా వ్యాపారులు, పశువుల,గొర్రెల కాపరులు మొదలగు వారున్నారు. ఇది 1931 గణాంకాల ఆధారంగా రూపొందించిన సరాసరి అంచనా. కానీ ఈ వర్గీకరణ అంచనాలు సంస్థాపరంగా గ్రామీణ ప్రాంతంలో వున్న కుల విశ్లేషణకు ఉపయోగపడే ప్రధాన అంశం.

కులం పిదప, 'గ్రామాన్ని' , గ్రామీణ సమాజానికి సంస్థాగత విశ్లేషణ కారకంగానూ, నివాస సంస్థాకారకంగానూ గ్రహించ వచ్చు. గ్రామీణ సమాజాల గూర్చి ఎంతైనా వ్రాయవచ్చు. కొందరు రచయితలు వీటిని చిన్న స్వయం సమృద్ధిగల రిపబ్లికులుగా వర్ణించగా, మరికొందరు రెవెన్యూ డిమాండు, ఇతర ప్రాంతాల భిన్నస్థాయిలకు వ్యతిరేకమయిన సంయుక్త బాధ్యత నిర్వర్తించే రూపంగా విశ్లేషించడానికి ప్రయత్నించినారు. గ్రామ పెద్ద మనిషి, గ్రామ కరణాల పాత్రలను పరిశీలించడం జరిగింది. వాడుకలో గల గ్రామన్యాయ పంచాయతీలు వీరి సృష్టించి

చాలా ఆకర్షించినాయి. తర్వాతి అధ్యయనాలలో కొందరు బ్రిటిష్ పాలకులు ఊహించిన పంచాయతీల స్వేచ్ఛ గురించి, అనంతర కాలంలో భారత రాజనీతిజ్ఞులు దానినే పున: నిర్వచించి స్థానిక స్వపరిపాలనకు వెన్నెముకగా తయారు చేయడం గూర్చి వివరించారు. ఈ అధ్యయానికున్న పరిమిత చర్చా పరిధి దృష్ట్యా సమస్య లన్నింటిని విపులంగా ప్రస్తుతం చర్చించలేక పోయాం. ఈ దృక్కోణం నుండి భారత గ్రామం చాలా ముఖ్యమైన సంస్థాగత రూపంగా సరయిన ప్రాధాన్యత ఇవ్వబడినప్పటికీ, నిర్మాణ పరంగా చాలా సందిగ్ధతలను కలిగివుంది. మానవ విజ్ఞాన శాస్త్ర వేత్తలు, వ్యవసాయార్థిక వేత్తలు, రెవెన్యూ అధికారి లేదా గణాంకాల సేకరణ పరిశీలకులు గ్రామ లక్షణాల వివరణ విషయంలో వేర్వేరు దృష్టితో వర్గీకరించినారు. గ్రామీణ సమాజంలో తమ స్థాయిాల గూర్చి గ్రామస్థులే వేర్వేరు భావనలను కలిగి వున్నారు. ఒక ఆధిక్యకుల వ్యక్తి దృష్టిలో తన రక్త సంబంధీకులచే ఆక్రమింపబడి వున్న చాలా నివాసములు గ్రామంగా భావించవచ్చు. అంటరాని కూలీలు దూరంలో విడిపోయినట్లుండే పల్లెను నివసించే ఏర్పాటుగా గుర్తించి తమకు ఆవలగా వున్నదానిని సంపన్న నివాస ప్రాంతంగా భిన్నమైన దృష్టితో చూడవచ్చు.

గ్రామంలో నిర్ణయీకరణ విధానం ఆధిక్య కులం, దాని కుల పెద్ద ద్వారా కేంద్రీకృతం చేయబడింది. పంచాయతీలు సంప్రదాయ పరంగా స్థిరమైన సంస్థాగత రూపాలుగా కాకుండా తాత్కాలికంగా వున్నా ఒకానొక అంశంపై ఏకాభిప్రాయం కోసం ఏర్పాటు చేయబడిన నిర్ణయీకరణ నిర్వహణ రూపం. గ్రామ నిర్ణయాలు సుదీర్ఘ చర్చలతో కూడి వుండి ఏవర్గముకైతే నిజంగా స్థానం, అభిప్రాయ ప్రాతినిధ్యం కల్పింపబడవలసి వుందో ఆ వర్గం అవకాశం నుండి తప్పించబడి ముఖం చాటు చేసుకొని పోయే విధంగా ఈ పంచయతీ నిర్ణయాలు ఉంటాయి. ప్రతి సాధారణ గ్రామంలోని వర్గాలను లాంఛనేతర సంస్థా రూపములుగా గుర్తించవచ్చు. వీటి నిర్వర్తనా విధానంకు సంబంధించిన విశ్లేషణకై సరిపోయిన రీతిలో ఇంకా సాహిత్యాన్ని అధికం చేయవలసి వుంది. దీనికి సంబంధించి ఇచ్చట పూర్తి వివరాలు ఇచ్చే ప్రయత్నం చేయడంలేదు. అయితే తగాదా వర్గాలు ఆధిక్య కులాల నుండి ఉద్భవిస్తాయనే విషయంలో అంగీకారం వుంది. నాయకత్వం చాలా విషయాల్లో దీనికి సంబంధించే వుంటుంది. వర్గాలలోకి నియామకాలు తరచుగా కుల పునాదులపై బంధుత్వం కలిగివున్న మరియు సంబంధిత (కౌలుదార్లు ,వృత్తి కులాలు) ప్రాపకత్వంకై ప్రాకు లాడే సముదాయాల నుండే జరుగుతాయి. ఈ దృక్పథం నుండి పరిశీలిస్తే 'తగాదా వర్గం' ఒక తప్పని సరయిన గ్రామీణ సంస్థాగత రూపమవుతుంది. ఈ రూపం ప్రాథమిక భావాత్మక సంబంధ మార్గాలైన స్నేహం, వైరములను వివిధ కుటుంబ వ్యక్తుల మధ్య ,వివిధ కులాల మధ్య, వివిధ వయసుల వ్యక్తుల మధ్య ఏర్పరుస్తుంది. జీవసంబంధ పర్యావరణ అడ్డంకులకు వ్యతిరేకంగా సంస్థాగత రూపాలు ఉన్నత స్థాయిలో

అధికారికంగా వర్గాన్ని పూర్తిగా వ్యక్తి వాదంగా, స్థానిక నియంత్రణా పరిధిలో వ్యవహరించే స్థితిగా ఇది వుంటుంది. అయితే, కొన్ని సంధర్భాల్లో వ్యాజ్య స్థితిగా వుంటుంది. కొన్ని సంధర్భాల్లో వ్యాజ్య పరిష్కార సంధర్భంలో ప్రమేయానికి, ప్రభుత్వ అధికారుల కార్య నిర్వాహక చర్యలకై గ్రామ పరిధికి ఆవలగా వున్న బయటి శక్తుల ప్రవేశానికి కూడా దారి తీయవచ్చు.

రైతాంగ వ్యవసాయంపై, కులము, గ్రామము అనంతరము మూడవ ప్రధాన సంస్థాగత నిర్ణాయక రూపంగా వుండేది కుటుంబము. ఇది ముందే పేర్కొవలసిన అంశము. కాని సంస్థాగతంగా కన్నా జీవ సంబంధ అంశంగా కులము, గ్రామ దృక్పథం నుండి ఎక్కువగా దీనిని అర్థం చేసుకునే వీలుంది. భూయాజమాన్య కులాలలో, అంటరాని కులాలలోకన్నా కుటుంబం సంస్థాగత ముద్రగా చాలా బలమయినదిగా వుంటుంది. ఉమ్మడి కుటుంబ బ్రాహ్మణులలో భూయాజమాన్యం వైపు మొగ్గు చూపడం చాలా తరాల వరకు బలంగా వుండేది. ఎందుకంటే, ఇతర రైతాంగ కులాల మాదిరిగా తమ స్వంత సేద్యం కాకుండా, వీరు సేద్యం చేయకుండా భూమి కలిగి వున్నారు.రైతాంగ కులాలు తమ స్వంత భూకమతాన్ని దున్నుకోవడానికి ఒక తరం తర్వాత చీలిపోవడం సహజమైన అంశం. కిసింజర్ జరిపిన పంజాబు గ్రామ అధ్యయనంలో వంశ పారంపర్య చీలికలు ప్రతి మూడవ తరంలో తరుచుగా తటస్థ పడుతుంటాయని పేర్కొన్నాడు. ఈ చీలికల అనంతరం నూతన ఆవాసాలు ఏర్పడుతాయి. కొందరు దీనిని ఉప గ్రామాలుగా పిలుస్తారు. కుటుంబ అంతర సంబంధాలు, కులము, గ్రామములను సామాజిక సంస్థాగత రూపాలకు సంబంధాన్ని కలిగి వుండే స్వభావాన్ని ఈ నూతన ఉప ఆవాసాలు కూడా కలిగి వుంటాయి.

రైతాంగ సమాజంలో పితృస్వామిక భూయాజమాన్య కుటుంబం చాలా ప్రధానమైన భాగం. కుటుంబ పెద్ద యజమాని, ఈ పేరు అతనికి గల మతపర కర్మ బాధ్యతలు, తమ సంబంధీకులతో గల సంబంధ బాంధవ్యాల ఏర్పాటుపై యజమాని వ్యవస్థ ఆధారపడివుంది. వృత్తులవారీ, కూలీవారీ సేవలను ప్రాథమిక రైతాంగగృహ అంశాలను ఈ పద్ధతి నిర్వహించుతూ, రైతు ఆయా, సేవలకు కృతజ్ఞతా భావంగా వెల నిర్ణయించి ఇవ్వడం జరుగుతుంది. ద్రవ్య ఆర్థిక వ్యవస్థ పెరుగుదల కారణంగా ఈ పద్ధతి అనేక ఒత్తిడులకు గురవుతున్నది. ఎందుకంటే, సేవలకు గిరాకీ ఉన్నచోట్ల ఇంటి యజమాని కృతజ్ఞతతో తన వృత్తి సంబంధ వ్యక్తికి శాశ్వతంగా మద్దతు ఇస్తాడు. కొన్ని సంధర్భాల్లో అవసరమైనపుడు చాలా మిత వ్యయపూరితంగా అందించిన సేవలకు మద్దతివ్వడం సాధ్యమయ్యే అంశం. ఇంతేగాకుండా, వృత్తికారులు తయారు చేసే స్థానిక ఉత్పత్తుల స్థానాన్ని తక్కువ ధరగల పారిశ్రామిక ఉత్పత్తులు ఆక్రమించిన సంధర్భంలో వృత్తికారులు , వలస కార్మికులకు సేద్యము, కోతల సమయములలో ఆదాయం లభిస్తుంది.

రైతాంగ వ్యవసాయానికి సంబంధించిన ఇతర సంస్థాగత నిర్ణాయకాలయిన ప్రభుత్వ బాధ్యతలు, భూస్వామి, చట్టకోర్టుల ప్రవేశం వంటి అంశాల విస్తృత చర్చను తర్వాతి సంధర్భంలో విపులంగా కొనసాగించవచ్చు. అయితే, ప్రస్తుతం యజమాని వ్యవస్థను చర్చించేటపుడు ప్రస్తావించిన ఆర్థిక నిర్ణాయకాల వివరణ వైపు దృష్టిని సారిస్తే మరికొన్ని విషయాలు బయటపడులాయి.

## డి) ఆర్థిక నిర్ణాయకాలు :

ఆర్థిక నిర్ణాయకాలు చాలా విషయాలను ప్రస్తావిస్తాయి. ప్రధానంగా మార్కెట్, ధరలు పడిపోవడము, పెరగడము మొదలగు అంశాలతో కూడుకొని, అవి రైతుల జీవితాన్ని ఎంతలోతుగా ప్రభావితం చేస్తాయో తెలుపుతాయి. తర్వాతి అధ్యాయము ఈ అంశాలకు సంబంధించి ఉంటుంది. అయితే, ఇచ్చట వివరించిన దాని ప్రకారం రైతు ఆర్థిక అవకాశాల యెడ స్పందించే తీరులో స్పందించడం అనేది అతనికి లభ్యమయ్యే చక్కని అవకాశపు అందుబాటుపై వుంటుంది. అతడు సాధారణంగా అధిక లాభాల కన్నా తక్కువ ఇబ్బందులవైపు మొగ్గు చూపుతాడు. రైతు ప్రాథమికంగా ఆర్థిక కారకాలు రైతుకు సంబంధించి నిర్ణాయకాలుగా గుర్తిస్తాడే తప్ప అందుబాటులో వున్న మంచి అవకాశాలుగా కాదు. రైతు ఈ కోణం నుండి తన ఆర్థిక జీవితాన్ని వీక్షిస్తున్నపుడు అతని భవిష్యత్తు వ్యక్తిగతంగా నిండుతనంతో కూడుకొన్న దానిగా భావిస్తాడు. వ్యాపారులు, వడ్డీ వ్యాపారులు ఈ విషయంలో నిర్ణయాలు తీసుకొని అతన్ని (క్రింది స్థాయిలోనే వుంచి) ఎదగకుండా చేస్తారు. రైతు తీసుకునే నిర్ణయాలు తను ఇంకా నష్టపోకుండా ఉండేట్టు తీసుకోవడం జరుగుతుంది. కాని తన కుటుంబ స్వయం పోషకత్వం దృక్పథం, అవకాశాల స్వేచ్ఛకు తీవ్ర అవరోధంగా వుంటుంది. ఒక వేళ రైతు మార్కెట్కై ఉత్పత్తి చేస్తున్నాడంటే రెవెన్యూ, అద్దె, అప్పుల ఒత్తిడులు లేదా వీటన్నింటి సమిష్టి ఒత్తిడి ప్రభావ కారకాలుగా వుండడమేనని భావించాలి. దీనికి భిన్నంగా వడ్డీ వ్యాపారులకంటె దృష్టి నష్టానికి సిద్దపడే దృక్పథం భిన్నంగా వుంటుంది. ఈ సమస్యను తర్వాత చర్చిద్దాం. ఈ ఉపోద్ఘాత అధ్యాయంలో 19,20 శతాబ్దాల్లో ఉద్భవించిన కొన్ని సామ్యవాద ఆర్థిక పరిణామాల ఆధారంగా ఆర్థిక నిర్ణాయకాల గురించి పరిశీలించడం జరిగింది.

ద్రవ్య ఆర్థిక వ్యవస్థ వ్యాప్తి దానికి అనుశృతంగా వుండవలసిన పెట్టుబడిదారీ విధాన వ్యాప్తితో ఎలాంటి సంబంధం లేకుండా వ్యాపించడం. భారతదేశంలో అతి ముఖ్యమైన పరిణామము దీనికి కారణములు, (ద్రవ్య వ్యాప్తిగురించిన పూర్తి వివరణ తర్వాతి అధ్యాయంలో చర్చిద్దాం). పెద్ద యెత్తున జరిగిన జనాభా పెరుగుదలతో వచ్చిన భూమిపై ఒత్తిడి, (తో కలుపుకొని) దానికి తోడుగా వలస పాలకులు ప్రవేశపెట్టిన న్యాయ పరచట్ట నిర్మితి అన్నీ

కలిపి భూ అమ్మకాలకు దారితీసినాయి. పెట్టుబడిలేని పెట్టుబడి దారీ విధానం కారణంగా, వ్యాపిస్తున్న ద్రవ్య ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యాన్ని ప్రోది చేసుకునే వారికి భూమి ఒకగొప్ప ఆకర్షణంగా మారింది. భారత దేశ ధరలపై పెరిగిపోతున్న ప్రపంచ మార్కెట్ ప్రభావము మూడవ అతిపెద్ద పరిణామంగా భావించవచ్చు. తర్వాత భారత దేశంలో కొంత కాలం ఈ ప్రభావం నుండి రక్షణ పొందుటకు వెండి నాణెముల మారకం తగ్గించడం చూడవచ్చు. ఫలితంగా 20వ శతాబ్దంలో భారత రైతాంగ వ్యవసాయం ప్రపంచ మార్కెట్ పరిధిలోకి త్వరితగతిన లాగబడింది. పాశ్చాత్య పారిశ్రామిక దేశాల రైతుల మాదిరిగా అధికంగా భారత రైతు ఆర్థిక మాంద్యానికి తీవ్రంగా గురికాబడి మళ్ళీ కోలుకోలేనంతగా కృంగిపోయాడు. దాని స్వభావంలోనే కుటుంబ స్వయం పోషకత్వం కలిగి సాధారణ మిగులు మాత్రమే మార్కెట్ కోసం కెటాయించ కలిగే రైతాంగ వ్యవసాయం ప్రపంచ మార్కెట్ తాకిడులకు ఎలా గురికాబడిందని ఎవరయినా అడగవచ్చు. అయితే దీనికి ఇచ్చే సమాధానంగా రెవెన్యూ, అద్దె, అప్పు ఒడంబడికలు ప్రపంచ పెట్టుబడికి వున్న గొలుసు సంబంధం ఏవిధంగా మారుమూల గ్రామాలకు మధ్య వ్యాపించడానికి తోడ్పడిన సంధర్భాన్ని తర్వాత వివరించడం జరిగింది. భారతదేశంలో ద్రవ్య , ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి దోహదపడిన కొన్ని ప్రత్యేకమైన కారణాలు వున్నాయి. రైతులు తమ పంటకాలంలోని ఆహారాన్ని చాలా కాలం తమ గుడిసెల్లో నిలవచేసుకోలేని నిస్సహాయ పరిస్థితివుంది. నిల్వ చేసుకునే వసతి లేని స్థితి సర్వసాధారణం, ధాన్య వ్యాపారి గోదాములకు, వడ్డీ వ్యాపారులకు తన పంట ధాన్యాన్ని ఆయా తక్షణ కాలాల్లో తక్కువ ధరలకు విక్రయించి అదే ధాన్యాన్ని తర్వాత సంవత్సరమంతా ఎక్కువ ధరలకు, అదీ అప్పుపై పొందడం జరుగుతుంది. ధాన్యాన్ని కొనుగోలు చేసే వడ్డీ వ్యాపారస్థులు, అప్పుతీసుకునే రైతుల పట్ల సాధారణంగా జాగ్రత్తగానూ, సాహసికంగానూ, క్రూరంగా ఉన్నప్పటికి , కాల క్రమంలో సాఫీగా వ్యవసాయం సాగే క్రమంలో ఏమైనా ప్రమాద సూచనలు ఆర్థిక పర్యావరణంలో కన్పించినపుడు రైతులపై పెరిగిన మొత్తాలను కుదించడం చేసేవారు. నిజంగా సమస్య బలవత్తరంగా తయారయినపుడు ఒక ఆర్థిక కలాపం నుండి మరొక ఆర్థిక కలాపానికి తమ కార్యరంగాన్ని మార్చుకోవడం సహజంగా జరిగే పని. ఈ రకంగా స్థానిక రైతు ప్రమేయం లేకుండానే ఎక్కడో జరిగిన పరిణామాలు రైతాంగ వ్యవసాయంపై ప్రభావం చూపిస్తాయి. ఎగుమతి మార్కెట్‌కు అనుకూలమయిన వాణిజ్యపంటలను పండించడంలో రైతు భాగస్వామి కానప్పటికీ స్థూల ఆర్థిక మార్పులు రైతాంగ వ్యవసాయంపై నిర్ణాయకాలు అవుతాయి.

ఆనాటి ద్రవ్య ఆర్థిక వ్యవస్థ ప్రభావం వల్ల భారత రైతాంగ వ్యవసాయంలో వాణిజ్యపంటల ఉత్పాదన అధికం కావడం కీలకమయిన అంశం. వాణిజ్య పంటల ఉత్పాదన

తక్కువ లాభాలను చేకూర్చి ఎక్కువ ఇబ్బందులకు పురికొల్పింది. నిజానికి కొత్త పంటల సాగు, శ్రమ సాంద్రమైన వాణిజ్య పంటల యెడల చూపించిన శ్రద్ధనే, శ్రమనే సాధారణంగా ఎప్పటికీ పండించే పంటలపై వెచ్చిస్తే ఫలితాలు భిన్నంగా ఉండేవి. ఈ విధమైన ఇతమిద్ధమైన పంటల సాగుకు పురికొల్పిన ప్రేరకాలు రైతుపై పట్టు కలిగివున్న ఆర్థిక యజమానుల ప్రాధాన్యతలేనన్న విషయం సుస్పష్టం. రైతుకు తన ప్రాధాన్యతలను నిర్ధారించుకునే స్వేచ్ఛాయుత అవకాశాలు లేవు. డబ్బును ఋణరూపంలో అందచేసే వారికి లభించే లాభపు శాతం ప్రాధాన్యం. గ్రామస్థాయి వడ్డీ వ్యాపారులకు కూడా తమకు డబ్బును ఏదో ఒక రూపంలో అందిస్తూ సంబంధం కలిగి వున్న పెద్ద వర్తకులు, వారి పంట ప్రాధాన్యతలను గుర్తించి దాని కనుగుణ్యంగా రైతుల పంట విధానాన్ని ప్రోత్సహించడానికి ప్రయత్నించినారు. ప్రత్యేకించి నొక్కి పెట్టబడ్డ వ్యవసాయ ఉత్పాదన విధానం ఈ అధ్యయన కాలం నాటి ముఖ్యమైన ఆర్థిక నిర్ణాయక అంశంగా చెప్పవచ్చు.

ఈ నాలుగు నిర్ధారణాంశాలు కలిసి రైతాంగ సామాజిక నిర్మితిపై కలిగించే ప్రభావాన్ని ప్రస్తుతం పరిశీలిద్దాం. రైతాంగ వ్యవసాయంపై జీవసంబంధ నిర్ణాయకం అంటే సుదీర్ఘ కాలంలో రైతాంగ కుటుంబంలో జరిగే భూకమతాల కుటుంబ విస్తృతితో పాటుగా వచ్చే హెచ్చు తగ్గుల మార్పుల సంచయానికి సంబంధించింది. పర్యావరణ పరమైన నిర్ణాయ కారకాలంటే, జనసాంద్రత పంటల స్వరూపం మధ్య వుండే హెచ్చుతగ్గుళ్ళ సంబంధ స్థాయి (Frequency Modulation) ని తెలిపేటు వంటిది. అయితే, జీవ, పర్యావరణ నిర్ణాయకాలు రెండూ కూడా సంస్థాగత నిర్ణాయకాలచే ప్రభావితమౌతాయి. ఈ నిర్ణాయకాలే రైలాంగ సమాజ సంఘీభావ నికి, స్థిరత్వానికి దోహద పడేటు వంటివికూడా. ఇటీవలి నేపథ్యంలో వున్న అనుభవాన్ని చూస్తే ఆర్థిక నిర్ణాయకాలు సంస్థాగత నిర్ణాయకాలను గణించ దగ్గ స్థాయిలో బలహీన పరచినాయి. అయితే వాటిని పూర్తిగా నిర్మూలించలేదు. అణగారిన జనంలో ఏర్పడ్డ విషాదాన్ని ఆయా వర్గాలు గ్రామ స్థాయిలో తన సమీప ప్రత్యర్థులపై ప్రయోగించకుండా స్థానిక నాయకత్వాన్ని బలపరచడం వల్లే రైతాంగ గ్రామ నాయకత్వం మద్దతును పొందింది. అట్లా మద్దతును ఆయా వర్గాలు అందించడం ద్వారా రైతాంగ సమాజం బలోపేతం అవుతూ వచ్చింది.

## ప్రభుత్వ మూలాలు

సమాజంలో రైతాంగ సమాజం ఒక అంతర్భాగం. మానవ సమాజ శాస్త్ర వేత్తలు చెప్పినట్లుగా గిరిజన సమాజాలే కాకుండా ప్రభుత్వ ఉన్నత సంస్థల పరిధిలో లేకుండా రైతాంగ సమాజ ఉనికిని ఊహించడం సాధ్యంకాదు. రైతాంగ సమాజంలో ప్రభుత్వ ఉనికి ఒక

ప్రామాణిక ఆమోద యోగ్యతగా గౌరవింపబడుతుంది. అయితే క్రింది స్థాయి ప్రభుత్వాధికారులు అవలంభించే నిర్బంధ వైఖరి ఒక చికాకుగా పరిగణించి నప్పటికీ స్థిర వ్యవసాయం కొనసాగిస్తున్న రైతు ప్రభుత్వ దృష్టినుండి తప్పించుకొనజాలడు. ఫలితంగా,రైతుకు ప్రభుత్వాధికార వ్యతిరేకత వున్నా ప్రభుత్వాన్ని కాదనలేని స్థితి వుంటుంది. దీనికి భారతీయ చరిత్రలో ఉదాహరణలున్నాయి. రైతాంగం ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి పారిపోయిన ఘటనలు కనిపిస్తాయి. అయితే ఇది స్థల చలనం మాత్రమే. ఒక ప్రాంత పరిధిని తప్పించుకొని, మరొక ప్రాంత పరిధికి గురికావడమే అవుతుంది. రైతాంగ సమాజంలోని ఉన్నత శ్రేణులు తమ హోదా రక్షణకై, ప్రయోజనాల పరిరక్షణకై ఎల్లప్పుడూ, ప్రభుత్వ ఉన్నత సంస్థలపై ఆధార పడ్డారు.

భారతదేశంలో పూర్వం రైతుకు సైన్య పదఘట్టనల ఆటంకాలు ఉన్నప్పటికి తన నాగలి చాళ్ళను వదలకుండా అంటి పెట్టుకొని ఉన్నస్థితి మొత్తంగా జరిగిన పరిణామంలోని ఒక భాగం మాత్రమే. రైతు ఒక మేరకు సైన్యాన్ని విస్మరించవచ్చు. కానీ రెవెన్యూ వసూలు అధికారిని కాదనలేక పోయాడు. అతను యుద్ధభూమిలో జరిగిన దాన్ని గూర్చి ఉదాసీనంగా ఉండవచ్చు కానీ తన హక్కులు, బాధ్యతలను తట్టేటువంటి పాలనా నియమాల యెడ ఆసక్తిని కలిగి వుంటాడు. బలమైన ప్రభుత్వాలు ఎప్పుడు కూడా భూమి కలిగివున్న రైతాంగంతో ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకోవడానికి ప్రాముఖ్యతనిచ్చి, భూస్వామ్య మధ్యవర్తిత్వాలు పెరగనీయకుండా కృషి చేసినాయి. అట్లాగే బలమైన ప్రభుత్వాలు తమ న్యాయపరిధి పెంపుకై శోధిస్తూ, ఆ ప్రయత్నంలో అవి విజయాన్ని సాధించినపుడు ఈ విధమైన ప్రత్యక్ష పాలన దూర ప్రాంతాలకు విస్తరింప చేయడానికి అరుదుగా ఆసక్తిని చూపినాయి. ఒకవేళ గొప్ప రాజ్యాధినేత, తాత్కాలికంగా ఈ స్థితిని పొందినప్పటికి, అతని తదనంతర అధికారులు ఆవిధానాలను కొనసాగనివ్వని సంధర్భాలే అధికం. దానివల్ల జరిగిన మధ్య వర్తిత్వ దళారీ విధానాల అభివృద్ధి గూర్చి తదుపరి అధ్యాయంలో వివరించడం జరిగింది. ప్రజలతో వుండే ప్రభుత్వ సంబంధాలలో వచ్చిన మార్పుల వల్ల, అవలంభించిన వివిధ మార్గాల ద్వారా రైతాంగ భవిష్యత్తు ప్రభావితం చేయబడింది. కొన్ని సార్లు కేంద్ర పాలన క్రింద రైతులు సాపేక్షికంగా సౌకర్యాన్ని అనుభవించినారు. తర్వాత దురాశాపూరితమైన మధ్య వర్తిత్వపు చేతుల్లో ఇక్కట్ల పాలయినారు. మరికొన్ని సమయాల్లో అసమర్థ మధ్యవర్తిత్వ దళారీల చేతుల్లో అష్ట కష్టాల పాలై, కొంత కాలానికి ఉన్నతాధికారుల ద్వారా మధ్యవర్తిత్వ దళారీలను త్రోసివేయటం జరిగి ప్రత్యక్ష పాలనను ప్రవేశపెట్టిన ఉన్నతాధికారుల చెప్పు చేతుల్లో బ్రతుకును రైతాంగం కొనసాగించవలసి వచ్చేది.

ఏ రకమయిన పాలన అయినప్పటికి ప్రభుత్వానికి, రైతాంగానికి మధ్య సంధానాన్ని ఏర్పర్చడానికి అధికారుల గణం తప్పనిసరిగా ఉండింది. నిత్యం గ్రామకరణం, గ్రామ పెద్ద ఈ అధికార సంధానంలో క్లిష్టమైన, సందిగ్ధమైన పాత్రను పోషిస్తారు. వారు, ప్రభుత్వ దృక్కోణం నుండి రైతుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించుట ద్వారా క్రింది స్థాయి రెవెన్యూ అధికారులుగా గుర్తింపుపొందుతారు. నిజానికి బలమైన ప్రభుత్వాలు గ్రామ పెద్ద తనాన్ని అధికార కార్యాలయంగా తరచుగా భావించి వారిని ఆయా పదవుల్లో నియమించేది. గ్రామ కరణంకు బయటి ప్రభావాల పరిధిలో నడవడానికి ఎక్కువగా అవకాశాలు వున్నాయి. అతడు సాధారణంగా విద్యావంతమైన కుటుంబం నుండి వచ్చినవాడయి, మరొకచోట పాలనా పదవుల్లో గల ఇతర కుల, రక్త సంబంధీకులతో సంబంధాలు కలిగి వుంటాడు. తరచుగా ఇతడు క్రింది స్థాయి అధికారులతో విస్పష్టమైన సంబంధాలు కలిగి వుంటాడు. ఈ సంబంధాలు ప్రభుత్వంలో జరిగే మార్పులతో నిమిత్తం లేకుండా కొనసాగుతాయి. 'చాలా సంధర్భాల్లో, ప్రభుత్వంలో వచ్చిన మార్పుల వల్ల నియుక్తం కాబడే ఉన్నతాధికారులు ఇతర ప్రదేశం వారయి, అధికార గణంలో నుండి పాలనకై పంపబడినవారో, లేదా పాలకుల ద్వారా ఆలోచన పూర్వకంగా ఆయా ప్రదేశాల్లో నియమింపబడిన వారయి వుండి స్థానికంగా అధికారాన్ని ఏర్పాటు చేసుకునే అవకాశం లేక, ప్రజలకు అంతగా తెలయనివారై ఉండటం, కొన్ని సందర్భాల్లో కనీసం స్థానిక భాష మాట్లాడలేని స్థితిలో ఉండడం వల్ల కరణం ప్రాబల్యం చెక్కు చెదరకుండా వుండేది. సంబంధాల అల్లికలపై ఎక్కువగా వీరు ఆధారపడవలసి ఉండేది. అంతేగాక ఉన్నత స్థాయిలో వ్యక్తి , నియమింపబడ్డ వ్యక్తి ఈ కారణాలకు అనేక మార్లుగా బంధువు, జాతి సంబంధికుడుగానో, కులానికి చెందినవాడో అయి వుంటాడు. ప్రాతినిధ్యం వహించేవారు ఈ సంబంధాలు తెలిసి వారి పరస్పర లాభాలపై మంచి భాంధవ్యాలు ఏర్పాటు చేసుకొని, అదే సమయంలో సామాజిక అంతరాన్ని పాటిస్తూ మారొకవైపు తప్పనిసరి నియమంగా విడిగా ఉండే ఏర్పాటు చేసుకుంటారు.

ఈ రకంగా ప్రభుత్వం ఒక గద్దెపై నున్న విగ్రహరూపంగా పోలివుండే నిర్మాణంగా కనపడుతుంది. అవసరమయితే ఈ విగ్రహాలను ప్రక్కకు నెట్టడం కానీ తొలగించడంకానీ జరుగవచ్చు. అయితే పీఠం (గద్దె) మాత్రం స్థిరంగా ఉంటుంది. భారతదేశ చరిత్రలో అనేక ప్రాంతాల్లో చాలా సార్లుగా గద్దెను నామరూపాలు లేకుండా చేసే ప్రయత్నాలు కొనసాగినా అవి మరింత దృఢమైన పీఠాలుగా ఏర్పడేందుకు ఉపకరించినాయి. సున్నితమైన విగ్రహాలకన్నా ఈ పీఠాలు మాత్రం చిరకాలంగా ఉన్నాయి. చిరకాలంగా అతి చిన్న సంఖ్యలో వున్న పరాయి దేశ సైనికులతో కూడుకొన్న బ్రిటిష్ పాలన భారత దేశంలో సుదీర్ఘ కాలంలో మనగలగడానికి కావలసిన నేపథ్యంగా పని చేసిన అంశం ఇదే, అయినప్పటికి గతంలోని ప్రభుత్వాల కన్నా బ్రిటిష్

భారత ప్రభుత్వ నిర్మాణం అనేక అంశాల్లో భిన్నమైన విధానంగా వున్నటువంటిది. మొదటుగా, ఉన్నతస్థాయి పాలనాధికారులు అందరికి జీతభత్యాలు ఏర్పాటుచేయబడి దేశవ్యాప్తంగా ఎక్కడికైనా బదిలీ చేయబడి పనిచేసేవారు. ఎటువంటి స్థానికమైన అధికార పునాదిని కలిగివుండని ఈ అధికారులకు చిరకాలంగా మిగిలిపోయే ఇతమిద్ధమైన దేశీయ అనుబంధాలు ఏవీ వుండేవి కావు. ఎవ్వరూ ఇక్కడ పుట్టి పెరిగిన వారుకాదు. ఒక వేళ ఎవరైనా పదవిలో వుండగా మరణిస్తే అది కేవలం మినహాయింపులుగా మిగిలిపోయిన యాధృచ్ఛిక ఘటనలు మాత్రమే.

పరాయి ఉనికిని నిరంతరంగా కొనసాగించుకొనే పాలనా సిబ్బంది అందుబాటు పోనూ, తాము ఏదైతే సరియైన న్యాయమని భావిస్తే దానిని అమలు పరుచగల పరాయి చట్టాలు, శాసన ఏర్పాట్లు, కోర్టుల ఏర్పాటు బ్రిటిష్ ప్రభుత్వానికి అండగా వున్న అంశాలు. ఈ కోర్టులు, న్యాయ సిబ్బంది ప్రభుత్వానికి ఏ విధమైన అదనపు భారంగా వుండలేదు. నిజానికి అవే ప్రభుత్వానికి అదనపు ఆదాయ మార్గాలుగా మిగిలినాయి. నల్లమందు, ఉప్పు గుత్తాధిపత్యం వల్ల వచ్చిన ఆదాయం తరువాత అత్యధికమైన విశ్వసనీయ ఆదాయ మార్గం ఏదైనా వుందంటే అది న్యాయ విధాన నిర్వహణే. (అంటే ఈ కాలంలో న్యాయం చెప్పటం, తగాదాలు తీర్చడం ప్రభుత్వానికి ఆదాయ మార్గంగా మిగిలిందన్న విషయం స్పష్టం.) బ్రిటిష్ పాలనకంటే ముందున్న ప్రభుత్వాలు కేవలం 'నేర రంగాన్ని' మాత్రమే న్యాయ వ్యవస్థ పరిధిలో చూసేవారు. రాజ్య సార్వభౌమాధికార పరిధికి ఈ అంశం ఆంతరంగికమైనది కూడా. ఫలితంగా 'లాభసాటి' ఆదాయ మార్గాన్ని గత ప్రభుత్వాలు కోల్పోవలసి వచ్చేవి. ప్రైవేటు తగాదాలు, చట్టాల ఆచరణ మొత్తంగా స్వతంత్ర నిర్మాణాల వివేచనం పరిధికే నాటి ప్రభుత్వాలు వదిలివేసేవి. కానీ బ్రిటిష్ భారత కోర్టులు ప్రయివేట్ చట్ట పరిధిలోకి చొచ్చుకొని పోయి అంతులేని వ్యాజ్య స్వభావాన్ని, ఎడతెగని తగాదా దోరణులను ప్రవేశపెట్టి పెద్ద మొత్తంలో కోర్టు ఫీజులను దండుకునే ఏర్పాట్లకు నాందీ ప్రస్తావన చేసినాయి. ( ఈ అంశాలకు సంబంధించిన సమగ్ర వివరణ తదుపరి అధ్యాయాల్లో చర్చించ బడింది) ఈ న్యాయపాలన ఏర్పాటు ఏరకంగా బ్రిటిష్ పాలనను భారతీయ గ్రామీణ సమాజంపై పరివ్యాపిత నియంత్రణను పొందగలగడానికి ఉపకరించిందో తెలుసుకోవలసిన ప్రాధాన్య అంశం.

ఈ ప్రాధాన్యత ఎందుకంటే బ్రిటిష్ న్యాయ వ్యవస్థ ఏర్పాటే భారతీయ గ్రామాల్లో వుండే అంతర్నిర్మిత ప్రాబల్య వర్గాలతో (Factions)సంబంధం ఏర్పాటు చేసుకోవడానికి పనిచేసిన అంశం. గ్రామాల్లో ఉండే ఈ ప్రాబల్య వర్గాలు, ముఠాలు భారతీయ గ్రామాల్లోని అన్ని స్థాయి సముదాయాల్లో (strata) స్పష్టంగా ఏర్పడి ఆయా సముదాయాల్లో ఒక

సంఘీభావాన్ని. పరస్పర సంబంధాన్ని బలోపేతం చేసుకున్నాయి. ఎప్పుడైతే బ్రిటిష్ న్యాయపాలనా విధానం అందుబాటులోకి వచ్చిందో ఆనాటినుండి ఈ సముదాయాలు దాని పరిధిలో వ్యవహరించే స్థాయికి పురికొల్పబడ్డాయి. విస్తారమైన చట్ట వివరణ బలీయమైన చిక్కు ముడులను వినోదాన్ని కలిగించే తగాదాల పుట్టుకకు, భూమికకు అందించినాయి. ముఠా తగాదాలను బొంబాయి, కలకత్తా, మద్రాసు హైకోర్టు స్థాయిల వరకు లాగగలిగినట్టయితే ఆ ప్రయత్నాలన్నీ ఒక ఘన కార్యానికి ప్రతీకగా భావించేవారు. ఈ సరళి బ్రిటిష్ వారికి మాత్రం తమ పాలనా వ్యవస్థకు అందుబాటులో వుండి అదనపు సమాంతర ఆదాయ వనరుగా వుండేది. అందువల్ల, గతంలోని వ్యాఖ్య ప్రకారం, బ్రిటిష్‌పాలనా విగ్రహపు ఒక కాలు స్థానిక పాలన మీద వుండే మరొకటి స్థానిక న్యాయ వ్యవస్థ వివాదాల పాలన రంగాల పరిధిపై వుండేది. అయితే బ్రిటిష్ వారు నెలకొల్పిన ఈ న్యాయపరమైన వంచనా శిల్పమే తమ పీఠంపై నున్న అధికార విగ్రహాన్ని సైతం కూలదోయగల జాతీయ వాదస్ఫూర్తిని పొందిన న్యాయవాదులను తయారు చేసినదన్న మాట కూడా గుర్తుంచుకోవాలి.

## భూస్వామి పాత్ర

### (The role of the Land Lord)

'భూస్వామ్యాన్ని' ఒక ''వ్యవస్థగా'' బ్రిటిష్‌న్యాయ విధానం సృష్టించినటువంటిది. అయితే, భూమికి సంబంధించిన ప్రభువులు ముందే ఏర్పడి వున్నారు. మనం వివిధ రాజ్య వంశాల పరిపాలనా కాలంలో మధ్య తరగతి వర్గాల ఎదుగుదల క్రమాల గురించి ముందే ప్రస్తావించాం. ఎక్కడయితే బలమైన ప్రభుత్వాలుంటాయో అవి తీక్షణస్థాయిలో భూస్వాముల ప్రమేయం లేకుండా నిర్మూలించాయి. మొఘల్ ప్రభుత్వ రికార్డుల్లో చెప్పిన ప్రకారం, మొఘల్ సామ్రాజ్య ప్రాభావ దశల్లో కూడా ఒత్తిడి ద్వారా జమిందార్ల నుండి రెవెన్యూ వసూలు చేసేవారనే ఆధారాలు వున్నాయి. అంటే బలమైన ప్రభుత్వం క్రింద కూడా ప్రభువులు (Lords) ఆయా ప్రభుత్వ అధికారాన్ని తిరస్కరిస్తూ, వ్యవసాయిక మిగులును సరిపోయినంతగా నిలువ చేసుకొనేవారు. ఇట్లా నిలువ చేసుకొన్న మిగులుపై నాటి కేంద్రీయ ప్రభుత్వాలు కూడా తప్పనిసరిగా ఆధారపడి వుండేవి.

ప్రభుత్వానికి అనుగుణంగా వుండి అధికారాన్ని కలిగివుండే వారికి, గెలుపు పొందిన రాజులకు, ఉన్నత బలంగల స్థానిక ఆధిపత్య కులాలకు, బలవంతంగా కాని, కపటంవల్ల గాని స్థానిక ప్రాంతంపై నియంత్రణ ఏర్పర్చుకున్న సాహసికులకు, పూర్వపు రాజులు, అధికారులు మొదలగువారు వారు నిర్వహించే అధికార బాధ్యతలను సాంప్రదాయ సంస్థానంగా మలచుకునే వారికి, ''జమీందార్'' హోదాను అన్వయించేవారు. ఈ పద్ధతికి అదనంగా మొఘల్ ప్రభుత్వం

'జాగీర్‌దార్' అనబడే వేరే విధానాన్ని కలిగివుంది. వీరు, కొంత మిగులు భూమిని కలిగివుండి, జీత భత్యాలను పొందుతూ యుద్ధ సమయంలో సేనలను పంపుతూ రాజ్యాధికారానికి మద్దతు నిచ్చేటువంటి వారు. మొఘల్ పాలనా పరిభాషలోని జమిందార్, జాగిర్థార్ వ్యవస్థలను సమాంతర స్థాయిల్లో పరిగణలోకి తీసుకొన్నా వారు ప్రభుత్వపు ప్రాథమిక, బాహ్య నిర్మాణంలో ఇమిడివుండేవారు. జమిందార్ల గూర్చి చెప్పుకోవాలంటే పీఠము యొక్క ఉపరితలంపై ఉన్న అధికారానికి ప్రతీకగా వుండేవారైతే, జాగిర్దారును మాత్రం విగ్రహ పాదముగా వర్ణించవచ్చు. అయినప్పటికి, జాగిర్దార్లు పీఠంతో కలిసిపోయేవారు. రాజ్యాలు కూలిపోయినా జమిందార్లుగా వీరు బ్రతకగలరు. అధికారంకు అనుగుణంగా, మర్యాదగా ప్రవర్తించినపుడు జమిందార్లు జాగిర్దార్లుగా ఉన్నత స్థాయి పొందడం సామాన్యం. అయితే, ఈ రెండింటి మధ్య హోదాల్లో కొనసాగే తేడా మాత్రం అలాగే మిగిలిపోయింది.

ఈ రెండు పద్ధతులకు తోడుగా మూడవ రూపంగా ఇనామ్‌దార్ వ్యవస్థను కలపవచ్చు. వీరు తమ కుటుంబ, వ్యక్తిగతంగా ఏదో ఒక ప్రత్యేక ప్రయోజకత్వంకు ఉన్న ప్రత్యేక యోగ్యతకు బదులుగా ప్రభుత్వ గ్రాంటుగా చిన్న మొత్తంలో మిగులు భూమిని పొందేవారు. జమిందార్‌లాగా వీరు తమ ప్రాంతంపై శాశ్వతంగా నియంత్రణను కలిగి వున్నప్పటికి, జాగిర్దారీ హక్కులాగా వీరి హక్కులను బదలాయింపు చేయవీలు లేదు. కానీ జాగీర్‌దార్‌లాగా దేవస్థానములు, మత సంబంధ సంస్థల గ్రాంటుల వల్ల వచ్చే మిగులును పరిహార రూపంతో వీరు పొందవచ్చు. దేవస్థానాలకు, మత సంస్థలకు అందించే గ్రాంటుల విషయాల్లో కూడా దాదాపుగా పై పద్ధతే పాటించబడింది. ఇవి సమిష్టిగా సంస్థా రూపేణా ఇచ్చిన గ్రాంటులు కనుక ఇవి పెద్ద మొత్తంలో ఉండేవి. ఆయా సంస్థల నిర్వాహక వ్యయాల కోసం ఈ విధంగా ఒనగూరిన వనరులు వెచ్చింపబడేవి. వ్యక్తులకు ఇచ్చే గ్రాంటులు మాత్రం వంశపారంపర్య జన్య నిర్ణాయకాలమీద ఆధారపడి కొనసాగేవి. ఉపమాలంకార పరిభాషలో చెప్పాలంటే, అధికార పీఠపు విగ్రహ-పునాదుల్లో ఇనామ్‌దార్ ప్రత్యేక అస్థిత్వాన్ని కలిగివుంటాడు. ఉన్నత స్థాయి అధికార వర్గపు అనుగుణ్యతవల్ల అధికారం పొందడం వల్ల, పొందిన లబ్ధి స్వభావం వల్ల అధికార పీఠకంలో అవిభాజ్య భాగంగానే విలీనమౌతాడు. చెప్పాలంటే వీరు ఎచటినుండయితే గ్రాంటు పొందుతారో కొంత వరకు ఆ రాజ్యంపై ఆధారపడి, ప్రభుత్వ మార్పులకు వారు, వారియొక్క కుటుంబం లోనవుతూ, బ్రతుకుతూ వుంటారు. ఎందుకంటే ప్రభుత్వాలు మారినా, మారిన ప్రభుత్వాలు ఆయా భూయాజమాన్య ఏర్పాట్లను సడలించడానికి అనాసక్తంగా వుంటాయి. ఎందుకంటే ఇనామ్‌దారులు మారుతున్న ప్రభుత్వ నిర్మాణంలోని స్థానిక అధికార యంత్రాంగంలో భాగం కాని వారయినప్పటికి ఏదో ఒక స్థాయిలో దానిపై ప్రభావాన్ని కలిగిస్తారు. చాలా మంది బ్రహ్మణులు వివిధ రాజ్యాలలో, సమయములలో

ప్రత్యేక పరిస్థితుల్లో భూమిని పొంది ప్రత్యేకమైన పాలనా పరిభాషలో ఇనామ్‌దారులుగా ఇట్లా కొనసాగింపబడిన వారే. ఇలాంటి భూప్రభువులు చిన్న, పెద్దవారయినప్పటికి వ్యవసాయ మిగులులో ప్రాథమిక భాగాన్నే పొందడానికే అర్హులు (entitled). వారు రైతాంగ వ్యవసాయం జోలికి పోలేదు. నిజానికి భారత వ్యవసాయంలోని అనూహ్యతలు భూస్వాముల ఎస్టేటులను వ్యవసాయ కమతాలుగా మార్చడానికి గానీ, రైతులను బానిస స్థాయికి దిగజార్చే ప్రవృత్తులను కొనసాగనీయడానికి కాని అంత త్వరగా అనుమతించలేదు. ఎంతవరకయితే జనాభా ఒత్తిడి అధికంగా లేదో రైతాంగాన్ని కౌలుదార్లుగా సానుభూతితోనే పరిగణించారు. నూతనార్థంలో వారు ''అభివృద్ధి కాముక భూస్వాములు'' కారు. కాని వారి స్వంత ప్రయోజనాల మూలంగా రైతుల పనులను ఇబ్బందులకు లోను చేయకుండా స్థానిక నీటి వనరులను నిర్వహించినారు. వారి మిగులుగా వచ్చిన వాటాను సాధారణంగా నిలువచేసి వారి కోసం, వారి ఆశ్రితులకు వాడుకొని ముఖ్యంగా కొంత భాగం ప్రభుత్వానికి రెవెన్యూ డబ్బు రూపంలో చెల్లించడానికి మార్కెటు చేసేవారు (అమ్మేవారు).

స్థానిక ప్రభువు తన స్థాయికి తగినట్లుగా ఆడంబర వ్యయాన్ని చేయవలసి వచ్చేది. ఆనందభరిత సందర్భాల్లో రైతుల మత సంబంధ ఉత్సవాల్లో ఇలాంటి వ్యయానికి అవకాశాలు ఎక్కువగా వుండేవి. ఇట్లా వ్యయమైన డబ్బు చాలా వరకు స్థానికంగా ఉత్పత్తుల్లో నిమగ్నమైన వృత్తుల వారికి, సంగీతకారులకు, కవులకు జీవనభృతి కలిగించి, ఇతర సాంస్కృతిక జీవనాన్నికై వెచ్చింపబడేది. బ్రిటిష్ పాలన బలీయం కావడం వల్ల చాలా వరకు ఈ పద్ధతులు విధానాలు మారిపోయినాయి. (మనం ఈ విధానాన్ని కూలంకషంగా రెవెన్యూ సంపద అధ్యాయంలో చర్చించ వచ్చు) మొత్తంగా బ్రిటిష్‌పాలన స్థానిక భూస్వాముల, రాజకీయ ప్రాబల్యాన్ని విధులను చాలా వరకు తగ్గించింది. ఫలితంగా సంస్థాన రాజ్యాలలో తప్పించి కోర్టు ప్రాపకత్వం ఎక్కడా కూడా ఉండకుండా పోయింది.

భూస్వామి ప్రజారంగంలో వహించవలసిన పాత్ర కుదించబడి భూస్వామ్యత్వం ప్రైవేట్ పరిధికి పరిమితమయింది. అతడు ఏ ప్రాంతం నుండయితే వ్యవసాయ మిగులుపొందుతున్నాడో అది ''నిజ ఆదాయ వనరుగా '' మిగిలింది. అతని అధికారం తగ్గించినప్పటికి పరపతి (Credit) మాత్రం విస్తరించింది. రైతాంగం వారి ఉత్పత్తిలోని ప్రభువుకిచ్చే 'వాటా' ప్రస్తుతం 'అద్దె' గా చెల్లించబడి నందువల్లవారు కౌలుదార్లుగా మారినారు. తదనంతర కాలాల్లో ఈ ప్రమాదకర మార్పు దేనికి దారి తీసిందో అర్థం చేసుకోవచ్చు. భూస్వాములు ఇదివరకటి మాదిరిగా వారి ఆశ్రితుల ద్వారా కాకుండా చట్టం ద్వారా రక్షణ పొందుతూ కౌలు కిచ్చే (Rentiers)వారుగా కొత్త పాత్రను అంగీకరించినారు. సంపద, విద్య కారణంగా

దేశంలోని ఇతర ప్రాంతాలకు వెళ్ళి ప్రవాస (నివాసేతర) భూస్వామ్యముగా మిగిలిపోయి, తమ ఎస్టేటులను, సంపదను చూసే బాధ్యతను తమ అధీన గ్రామస్థులకు అప్పగించినారు. పట్టణ ప్రాంతములో భూస్వాములు వెచ్చించే డబ్బు ఈ భూస్వాములు తరలి వచ్చిన ప్రాంతాలకు ఉపకరించకపోగా, బ్రిటిష్‌పాలనా ప్రాపకంలో పెరిగిన పట్టణాల్లో కేంద్రీకృతమైంది. ఫలితంగా పాలనాధికార కేంద్రీకరణ ఒకవైపు పెరిగి మరొకవైపు అసంఖ్యాక గ్రామాలు అధికార పరిధికి ఆవల వుండేవిగా మారినాయి.

విషమ గ్రామీకరణ (Mofisilization) విధానం నిజానికి భారతదేశంలో క్రొత్త రాజ్యాల అవతరణ, సముద్రయానం మొదలయిన వాటి నుండే కాకుండా ఒక భూసంబంధంగా పూర్వ రాజ్యాలచే కొనసాగింపబడి బ్రిటిష్ పాలన స్థితి క్రింద (Conditioned) అమలు చేయబడుతూ వచ్చింది. ఈ సముద్రయాన అధికార సంబంధం నుండి (Maritime Power base) క్రొత్తపాలకులు భూసంబంధపరమైన (Land Base) పాలనా ఏర్పాటును ఒకదానికన్నా ఒకటి ఎక్కువ బలంగా మొత్తం ఉపరితలంపై ఏర్పాటు చేసుకొన్నారు. ఈ నూతన పద్ధతిలో భూ ప్రభువుల అవసరం లేకుండా తమ కనువైన భూస్వాములను మాత్రమే కలిగి వుంటారు. అందువల్ల చాలా తెలివైన ఈ వర్గపు వ్యక్తులు అభివృద్ధి సాధించడానికి నూతన మార్గాలయిన పాశ్చాత్య విద్య, న్యాయ, చట్ట సభలలో ప్రవేశించడం తర్వాత కాలంలో రాజకీయాధికారం కోసం ప్రచండమైన జాతీయోద్యమంలో ప్రవేశించడం వంటి చర్యలను చేపట్టిన వారి పూర్వీకుల కన్న విభిన్నమైన రంగాలలో అడుగు పెట్టినారు.

ఈ ప్రత్యేక రీతుల్లో జరిగిన గ్రామాల 'ప్రాభావపు కుదింపు క్రమం' క్రొత్తగా ఏర్పడిన బ్రిటిష్ పాలనా ఫలితమే. గత ప్రభుత్వాలన్నీ స్థానిక భూసంబంధ పునాదుల్లో నుండి పుట్టిన అధికార ఫలితంగా కొనసాగినవి. సముద్రయానం నుండి ( బిటిష్ వర్తకానికి ప్రతిఫలనగా వాడిన పదం) విస్తరించిన అధికారం వల్ల భారతీయ గ్రామాల స్థానిక అధికార ప్రభావం కుదించబడింది. సముద్రయానం నుండి సమాజాధికారాన్ని చేపట్టిన నూతన అధికార వర్గం తన కనుకూలమైన పాలనను, భూసంబంధ పునాదిని స్పష్టంగానే ఏర్పరచుకొంటుంది. ఈ నూతన పరిస్థితిలో ''భూస్వాముల'' అవసరం లేకుండా అధికార కనుగుణ్యమైన 'ఆసాములు' మాత్రమే అవసరమౌతారు. ఈ వర్గాల నుంచి వచ్చిన తెలివైన వారు క్రమేపి పాశ్చాత్య విద్యను అభ్యసించి న్యాయ చట్ట సభల్లో ప్రవేశించి, బలోపేతమై తదనంతర కాలంలో రాజకీయాధికార వికేంద్రీకరణ పోరాటాల్లో గణతకెక్కిన జాతీయ వాదులుగా మారినారు. తమ గ్రామీణ పూర్వీకుల వరవడి నుండి భిన్నమైన రీతిలో రూపాంతరం చెంది రాజకీయాధికార భాగస్వామ్య పోరాటంలో పాత్ర వహించినారు.

రెండవ అధ్యాయం

# ఆర్థికనేపధ్యం

ఖండాంతరాల నుండి సముద్రయాన వ్యాపారులచే దురాక్రమించబడిన భారతదేశంలో భూ ఆధారశక్తులు సన్నగిల్లడం ఆరంభమయింది. క్రమేపి మొగలాయిల అధికార పీఠం బీటలు వారడంతో, దాన్ని మరింత బలహీనపరిచి ఆ స్థానంలో తమ ఆధిపత్యాన్ని సుస్థిరం చేసుకొనేందుకు, ఉత్కృష్టమైన మొగలాయీ సంప్రదాయపు జాడలను అనుసరిస్తూనే బ్రిటిష్ వారు అతి వేగంగా తమ పోటి దార్లనందర్ని తరిమి కొట్టారు. శతాబ్ద కాలం పాటు భారత దేశపు ఖజానాకు అతి విలువైన లోహాలను (నాణెములను) దారపోసిన బ్రిటిష్ వారు మొదటిసారిగా బెంగాల్ ప్రాంత రాబడిపై పూర్తి పట్టు సాధించగలగడం వారి స్థైర్యాన్ని పెంచింది. ఒక ప్రక్క చైనాలో వ్యాపారం విస్తరిస్తున్న తరుణంలో యూరప్‌లో జరుగుతున్న యుద్ధం వల్ల ఆర్థిక వనరుల కొరత ఎదుర్కొంటున్న బ్రిటిష్ వారికి ఈ రాబడి అనుకోని వరమైంది. అంతర్జాతీయ ఆర్థిక రంగంలో ఎదుగుతున్న శక్తులను ప్రధానంగా బ్రిటిష్ పాలకులు అన్ని రంగాలలో ఈ దేశాన్ని దోపిడీకి గురి చేయడానికి ఇది ప్రారంభమే . వ్యవసాయ రంగంలోని మిగులు ఇక భారతదేశ ప్రజల వినియోగానికి ఎంతమాత్రం అందుబాటులో లేకుండా పరాయి పాలకులు అతి తెలివిగా తమ హస్తగతం చేసుకున్నారు. అంతర్గత కుమ్ములాటలు బ్రిటిష్‌వారి మార్గాన్ని సుగమం చేసాయికూడా.

బ్రిటిష్ వారు పారిశ్రామిక విప్లవంతో సాధించిన విజయాలవల్ల 19వ శతాబ్దంలో పారిశ్రామిక ఉత్పత్తులను అమ్మడం ద్వారా అదనపు లాభాన్ని పొందే స్థితికి చేరుకున్నారు. మొదలు వస్త్ర పరిశ్రమ ఉత్పత్తులు భారతీయ మార్కెట్‌ను ముంచెత్తాయి. ఫలితంగా ఉపాంత గ్రామీణ వృత్తి పనివారలు తమ సాంప్రదాయిక వృత్తిని వదిలిపెట్టి వ్యవసాయ రంగంలో ఉపాధి కోసం అప్పులు చాచే పరిస్థితి ఏర్పడింది. గతంలో భారతదేశంనుంచి వస్త్రపు ఎగుమతులు చేసుకొనే బ్రిటిష్ వారు వ్యవసాయరంగపు ముడి పదార్థాలను మాత్రమే డిమాండ్ చేయడం ద్వారా భారతీయ మార్కెట్‌లతో తమ ఆధిపత్యాన్ని చాటుకున్నారు. తేయాకు మినహా నల్లమందు, నీలిమందు, జనుము మొదలైన వాణిజ్య పంటలు, మరియు గోధుమ , వరి వంటి ఎగుమతి ప్రధానమయిన ఉత్పత్తులన్నీ గ్రామీణ వ్యవసాయరంగానికి చెందినవే. వ్యవసాయ సంబంధమైన పరిజ్ఞానం లేనప్పటికి, భూమికి స్వంతదారులు కానప్పటికి పెద్ద మొత్తంలో కమతాలను అదుపులోకి తెచ్చుకున్న బ్రిటన్‌కు చెందిన నీలిమందు తోటల పెంపకందారులు బాటకం మరియు పరపతి సదుపాయాలను నియంత్రించడం ద్వారా

రైతాంగాన్ని భిన్న పద్ధతులలో దోపిడి చేస్తూ ప్రపంచ మార్కెట్‌లో ఇండిగో ధరలు తగ్గుముఖం పట్టినప్పటికి లాభాలు పొందగలిగారు. మరికొన్ని సంధర్భాలలో రైతాంగ ఆర్థిక వ్యవస్థ యొక్క ధరలు తగ్గుతున్నప్పుడు ఉత్పత్తులను పెంచడం ద్వారా పూర్వపు ఆదాయపు స్థాయిని నిలబెట్టుకునే సహజ స్వభావాన్ని గమనించవచ్చు. దీనికి సంబంధించిన మరికొన్ని విషయాలను ఈ అధ్యాయపు చివరి భాగంలో చర్చించడమైనది. ప్రస్తుత చర్చలో వాణిజ్య పంటలు భారత దేశ రైతాంగ వ్యవసాయ స్థితిని ఏరకంగా దిగజార్చాయో, ఉత్పత్తి ఫలితాలకు వారెంత దూరమయ్యారో, దోపిడి తీవ్రత గ్రామీణ రైతాంగ ఆర్థిక, సామాజిక జీవనంపై చూపిన ప్రతికూలతను పరిశీలించడానికి దృష్టిని కేంద్రీకరించడం జరిగింది.

చాలా అరుదైన సందర్భాలలో మాత్రమే రైతాంగం వాణిజ్య పంటలను పండించడం ద్వారా ప్రయోజనం పొందగల్గుతారు. అది కూడా స్వేచ్ఛా మార్కెట్ వాస్తవంగా వీరికి అందుబాటులో ఉండడం, ఏరకమైన ముందస్తు నిబంధనలు లేకుండా స్వేచ్ఛగా తన ఉత్పత్తులను పోటీతత్వంగల కొనుగోలుదారుల సమూహంలో అత్యధిక ధరను ఇవ్వగలవారికి అమ్ముకునే అవకాశం మొదలైన అంశాలపై ఆధారపడి ఉంటుంది. కాని మార్కెట్ దాదాపు ఎప్పుడు ఈ రైతాంగానికి అత్యంత దూరంగానే ఉంటుంది. (గ్రామంలో ఉండే స్థానిక (డీలర్) వర్తకుడు సహితం) రైతు ఉత్పత్తిపై అదుపును సాధించిన స్థానిక వర్తకుడు సయితం, వాస్తవంగా బేరసారాలు జరిగే మార్కెట్ స్థాయి కంటె తక్కువ వాడే. ఈ స్థాయి వర్తకులు మరియు బ్యాకంర్ల నియంత్రణలో వుండేవి. ముందస్తు వర్తకం, పరపతి సప్లయ్‌ల ఆధారంగా మార్కెట్‌ను శాసించే వీలు ఎలాంటి నష్టభయాన్నైనా ఎదుర్కొవడానికి సిద్ధంగా వుండే అధిక లాభాలను తమ స్వంతం చేసుకోగలిగారు. గ్రామీణ సామాన్య రైతాంగం సహజంగా నష్ట భయాన్ని ఎదుర్కొవడానికి ఆసక్తి గాని, ధైర్యంగాని ప్రదర్శించరు. గాలి పాటు లాభాల సందిగ్ధతకన్న తక్కువ ధర నిశ్చిత ఆదాయానికి మొగ్గు చూపుతారు. మరో రకంగా చెప్పాలంటె గాలి పాటు లాభాలు పొందగల అవకాశాలు కూడా అంతంత మాత్రమే. ఇలాంటి అదనపు లాభాలు వచ్చే ప్రాంతాలకు వీరు అతి దూరంలో మారుమూల గ్రామాల్లో ఉంటారు.

క్రింది స్థాయిలో అతి పరిమితమైన పరిధిగల మార్కెట్లు, మధ్యలో నష్టభయాన్ని ఎదుర్కోవడమే ధ్యేయంగా గల వర్తక, వడ్డీ వ్యాపారుల సముదాయం ఉన్నతస్థానంలో ఇతరుల అవకాశాలనన్నింటిని హరించివేయగల ప్రపంచ మార్కెట్ వీటితో పాటు ముందస్తు వర్తకం, పరపతి సదుపాయం ను ఆర్థిక దోపిడికి సాధనాలుగా వాడుకోవడం రైతాంగ వ్యవసాయం పై భూస్వామి, కౌలుదార్ల సంబంధాలపై ఎన్నో ప్రధానమైన, తీవ్ర పరిణామాలు కలుగజేసాయి. ఉత్పత్తి తరహా నిర్ణయించే వ్యక్తిని/ శక్తిని గుర్తించడంకోసం వ్యవసాయ ఆర్థిక వేత్తలు గ్రామీణ

భూభాగాలను నిశితంగా పరిశీలిస్తూ వుంటారు. పైన వివరించిన పద్ధతిలో వ్యవస్థ పనిచేస్తున్న స్థితిలో వాస్తవ నిర్ణాయిక కర్తను పంటపొలాల్లో కంటె వడ్డీ వ్యాపారుల దుకాణంలో, బ్యాంకర్ల, వర్తకుల కార్యలయాల్లో మాడగలుగుతారు. వ్యవసాయోత్పత్తి విధానాన్ని నిర్ణయించేశక్తి ప్రధానంగా గ్రామీణ వడ్డీ వ్యాపారుల చేతుల్లో వీరిని ప్రభావితం చేయగల దేశీయ బ్యాంకర్ల చేతిలో వుండేవి. భూస్వాములు ఈ తరహా వర్గంలో చేరకుండా భాటకం వసూలు చేసుకునే స్థితిని అంగీకరిస్తూ, రైతు భాటకాన్ని చెల్లిస్తున్నంతకాలం అతని వ్యవహారాలలో జోక్యం చేసుకొనే వారుకాదు. ఈ అధ్యయనం జరుగుతున్న కాలంలోనే భాటకం వస్తు రూపంనుండి నగదుకు మారింది. ఇది భూస్వామికి, కౌలుదారుకు మధ్య ప్రత్యక్ష సంబంధాన్ని తగ్గించింది. భూస్వామి భాటకాన్ని పెంచదలచుకున్న ప్రతి సంఘటనలో వీరి మధ్య ఘర్షణలు ఏర్పడేవి. ఈ సమస్యపై ముందు ముందు వివరంగా చర్చించడం జరిగింది.

భారత గ్రామీణ రైతాంగ వ్యవస్థపై వర్తకుల పట్టు 19వ శతాబ్ది చివర్లో రైల్వే యంత్రాంగం విస్తృత ఫలితంగా మరింత బలపడింది. పరిమితి సామర్థ్యంగల 'ఎడ్లబండి' రవాణా వ్యవస్థ వల్ల దేశంలోని అనేక ప్రాంతాలు ఏకాకి అవడమేకాక అతి తక్కువ పరిధిగల తమ మార్కెట్లకే పరిమితి అవ్వాల్సి వచ్చింది. స్థానిక ప్రాంతాలకు పరిమిత మవ్వడం అంటే బయటి ప్రపంచంలో జరుగుతున్న అభివృద్ధిని గుర్తించలేక పోవడం, మరియు స్పందించలేక పోవడం కన్పిస్తుంది. రైల్వేల విస్తరణ వర్తక వర్గం కొత్తరకమయిన నియంత్రణలను రైతాంగ వ్యవస్థలోకి జొప్పించడానికి ప్రయత్నించినప్పటికి, సుదూర ప్రాంతాలలోని మార్కెట్లు కూడా అభివృద్ధి క్రమానికి స్పందించగల నూతన వాతావరణం ఏర్పడింది. అయితే ఇది ఆశించినంతగా మారుమూల మార్కెట్లను ప్రభావితం చేయలేకపోయింది. రైల్వేల అభివృద్ధి వల్ల కలిగిన మార్పు వ్యాపార వర్గం తమ యంత్రాంగాన్ని చాలా వేగంగా విస్తృతపరిచి రైతాంగం స్వేచ్ఛా మార్కెట్ వ్యవస్థను అవగాహన చేసుకొని సమీపించేలోపుగానే వారికి ఈ వ్యవస్థ ఇచ్చే ఫలితాలను దక్కనీయకుండా చేయగలిగే అవకాశాన్నిచ్చింది. రైల్వేలు భారత దేశపు మారుమూల ప్రాంతాల్లోకి ప్రవేశించిన తరుణంలోనే స్థానిక నియంత్రణల స్వభావం మారి నైపుణ్యంతో కూడుకొన్న విస్తృత యంత్రాంగం కనుసన్నలలో మెదిలే నియంత్రణలుగా రూపుదిద్దుకున్నాయి.

1862-1882వ సంవత్సరం మధ్య రైల్వేల విస్తరణ చాలా వేగంగా 10,000 మైళ్ళకు చేరింది. ఇదే కాలంలో అవి చేరవేసే సామాగ్రి 12 నుండి 15 మిలియన్ టన్నులు మాత్రమే పెరిగింది. ఈ కాలంలో రైల్వేలపై ప్రైవేట్ పెట్టుబడులపై 5 శాతం వడ్డీ చెల్లించేందుకు ప్రభుత్వం అంగీకరించటం వల్లనే డిమాండుతో సంబంధం లేకుండానే రైల్వేల విస్తరణ

జరిగింది ఈ వడ్డీ రేటు బ్రిటన్‌లో అదే సమయంలో 3 శాతం వడ్డీరేటు కంటె ఎక్కువగా ఉండడం గమనార్హం. 1882-1900 సంవత్సరాల మధ్య రైల్వేల విస్తరణ మరింత వేగాన్ని పుంజుకున్నా , సరకుల రావాణా కూడా దాదాపు సమాన స్థాయిలో ఎదిగింది. 1900 సంవత్సరం నుండి మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభం వరకు రైల్వేల విస్తృతి పూర్తిగా ఆగిపోయినా సరుకు రవాణా మాత్రం అనూహ్యంగా పెరిగింది. ఇది 1882లోని 15.మి.టన్నుల నుండి 100 మి.టన్నులకు చేరుకున్నది. ఈ పెరుగుదల దేశీయ మార్కెట్‌లో ద్వారాలు ఎంతగా తెరుచుకున్నాయో సూచిస్తుంది. మనం దీన్ని గొప్ప మార్పుకు అనుకూల సమయంగా చెప్పుకోవచ్చు. ఈ మార్పు మరోవైపు బహిర్గత ఫలితాలను ధరల పెరుగుదలను గుర్తించి చర్చించినపుడు విశ్లేషించడం జరిగింది. గ్రామీణ రైతాంగం ఈ మార్పుల ప్రభావానికి గురయినప్పటికి తద్వారా చేకూరిన లాభాలను మాత్రం ఇతరులు హస్తగతం చేసుకున్నారు.

పైన వర్ణించిన అభివృద్ధి క్రమం దేశవ్యాప్తంగా వడ్డీ వ్యాపార వర్గానికి అనుకూలించిందని చెప్పడంలో ఎలాంటి సందేహంలేదు. కులం రీత్యా వీరు వర్తకులు కూడా అవడంచేత గ్రామ స్థాయినుంచి పెద్ద పట్టణాలలోని మార్కెట్ల వరకు వీరి సంబంధాలు విస్తరించాయి. బ్రిటన్ న్యాయ వ్యవస్థ ఋణదాతకు ఇచ్చే రక్షణ కూడా వీరికి ఎంతగానో ఉపకరించింది. మార్కెట్ ఆధారిత వ్యవస్థ వృద్ధి చెందడంలో బ్రిటన్‌లోని ఉమ్మడి చట్టంలో వచ్చిన సరళతరమైన మార్పు ఎంతగానో కీలకమైన పాత్ర నిర్వహించింది. ఋణాల వసూలు, బాండ్ల తాకట్టులు, మారకపు సాధనాల ద్వారా రక్షణ కల్పిస్తూ పెట్టుబడి దార్లలో, వ్యాపార వర్గంలో విశ్వాసపూరిత వాతావరణాన్ని ఏర్పరచడం ద్వారా అన్ని రకాల వ్యాపార రంగాల్లోకి వనరుల కేటాయింపు సాఫీగా, వేగంగా జరిగేందుకు అనుకూల పరిస్థితులకు చట్టం వీలుకల్పించింది. ఋణదాతకు పూర్తిగా అనుకూలమైన లేదా మొగ్గుచూపేరీతిగానే చట్టం పని చేసింది. ఋణగ్రహీతకు/ అప్పు తీసుకున్న వానికి తన వాదన తెల్పుకొనే కనీస అవకాశాన్ని కూడా ఇవ్వలేదు. ప్రతి అప్పు పత్రం ఒక రిట్ వంటిదేనని, అప్పు పత్రాన్ని అంగీకరించని ప్రతి ఋణగ్రహీత నేరస్తుడే అని పరిగణించింది. ఆర్థికంగా, సామాజికంగా, సమాన స్థాయిలో ఉన్నవారి మధ్య ఈ ఏర్పాటు సక్రమంగానే అను జరుగవచ్చునేమో, కాని, నిరుపేద, నిరక్షరాస్యుడయిన రైతుకు, అన్ని హంగులు గల వడ్డీ వ్యాపారికి మధ్య జరిగే ఇలాంటి లావాదేవీల్లో వడ్డీ వ్యాపారికే చట్టం చుట్టమయిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

కొద్ది మొత్తంలో అందించే ప్రాథమిక పెట్టుబడి ద్వారా వడ్డీ వ్యాపారి, రైతును శాశ్వతంగా తన బానిసగా చేసుకోగలుగుతాడు. అతని ఉత్పత్తి ముందుగానే తన హస్తగతం చేసుకోగలుగుతాడు. ఇది ముందస్తు వర్తకానికి ఎంతగానో అవకాశాన్నిచ్చింది. రైతాంగం

శ్రమను అతి చౌకగా వాడుకుంటూ, వారి శ్రమతో ఎదిగే విస్తారమైన పంట పొలాలను తమ ఆధీనం చేసుకోవడం సహజంగా గమనించవచ్చు. తమ కుటుంబ వ్యవహారలకు మాత్రమే పరిమితమై ఉండే రైతాంగం మానసిక స్థితిని, అసంఘటితత్వాన్ని తమకు పూర్తి అనుకూలంగా మార్చుకోవడం ద్వారా వీరు అనూహ్యమైన ఫలితాలను అతి తక్కువ ఖర్చుతో పొందగలిగారు.

కొంతస్థాయివరకు ఈ విధానం బ్రిటిష్ వారికి బాగానే అనుకూలించింది. వ్యాపార విస్తరణ వారి రాబడిని పెంచడంతో పాటు భారతదేశానికి ఎగుమతుల ద్వారా మిగులు ఏర్పడింది. ఈ మిగులు 'హోం చార్జీల' రూపంలో బ్రిటన్‌కు చెల్లించడానికి సరిపోయాయి. రైతాంగ అలజడులు ప్రారంభమయిన తరువాతనే బ్రిటిష్ వారు కళ్ళు తెరిచారు. ఈ అలజడులు చట్ట సంస్కరణలకు వీలుకల్పించాయి. ఈ శతాబ్దపు చివర్లో వరుసగా సంభవించిన అనేక సంఘటనలు రైతాంగ వ్యవస్థపై ఒత్తిడులను సడలించాయి, ఆర్థిక దృక్పథంలో మార్పులకు దారితీసాయి. ఉధృతంగా వచ్చిపడిన భయానకమైన కరువు కాటకాలు, వ్యాధులవల్ల అత్యధిక శాతంలో రైతాంగ జనాభా తుడిచి పెట్టుకపోయింది. రెండు దశాబ్దాల పాటు భారతదేశంలోని అనేక ప్రాంతాలలో జనాభా పెరుగుదల నిలిచిపోయింది. ధరల పెరుగుదల, యుద్ధకాలంలో ఏర్పడిన అనుకూల ఆర్థిక పరిస్థితులు మరియు భూమిశిస్తులో తగ్గింపు రైతాంగం ఊపిరి పీల్చుకోవడానకి అవకాశాన్ని ఇచ్చింది. అయితే పాత విధానాలు ఎలాంటి ఎదురు లేకుండా యధాతథంగానే కొనసాగాయి. అర్థిక మాంద్యం పరిస్థితులు మళ్ళీ రైతాంగ తిరుగుబాట్లను ప్రేరేపించాయి. జనాభా పెరుగుదల వ్యవస్థపై ఒత్తిడి పెంచింది. ధరలు తగ్గుముఖం పట్టడం వల్ల ఆ వెంటనే రైతాంగ ఆదాయాలు తగ్గాయి. ఋణ సంబంధమైన ఒప్పందాలు వీరి పరిస్థితిని మరింత దిగజార్చాయి. దేశంలో ప్రతిచోట వడ్డీ వ్యాపారులు నూతన భూతనఖా ఒప్పందాలు కుదుర్చుకోడానికి విముఖతలను ప్రదర్శించారు. రైతాంగం భూమిని అమ్మాలని తీవ్రంగా ఒత్తిడి చేసాయి. ఏదో విధంగా డబ్బు సమకూర్చుకోవడానికి ప్రయత్నించినా గతంలో భూతనఖావల్ల పొందిన ఋణంలో అతి తక్కువ మొత్తాన్నే పొందగలిగారు. క్రమంగా భూమి విలువ పెరుగుతున్న అప్పురూపంలో వారు ఈ విలువలో మూడోవంతు, 1930లలో నైనా నాల్గోవంతు మాత్రమే పొందగలిగారు.

బలవంతంగా జరిగిన అమ్మకాలు అనేక సంధర్భాలలో రైతు, 'పంట వాటాదారు' స్థాయికి దిగజారాడు. దీని ఫలితంగా అభివృద్ధి సన్నగిల్లింది. వ్యవసాయ ఉత్పత్తి తగ్గుముఖం పట్టింది. పంట వాటాదారుడుగా మారక ముందు కూడా రైతు ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా ఉన్నప్పటికి, అతని హోదాలో వచ్చిన మార్పు అనేక రూపాల్లో తీవ్ర పరిణామాలకు దారితీసింది. 'పంట వాటాదారు' గా వ్యవసాయ వ్యవస్థలో ప్రత్యేక స్థానం ఉండదు: అతనికి

మిగిలిన ఆస్తి అతని సంతానమే. వారి శ్రమే జీవనాధారం. రైతుల మధ్య ఉండే ఐక్యతకు, సమాజం ఇచ్చే గౌరవానికి దూరమవుతాడు. ఇంకా పరిశీలిస్తే, భూమిని అమ్ముకోక ముందుకు తనకున్న కమతంలో సాంద్రవ్యవసాయానికి ప్రాధాన్యతనిచ్చిన రైతు తదనంతర పరిస్థితుల్లో సాధ్యమైనంత అధికంగా భూమిని తన కుటుంబ సభ్యుల ద్వారా సాగుచేయడానికి అంటే విస్తృత వ్యవసాయరంగానికి ఇష్టపడతాడు. స్వంత భూమి లేనందునే ఎకరం దిగుబడిపై కంటే ప్రతి యూనిట్ శ్రమకు లభించే దిగుబడిపై ఆసక్తి చూపుతాడు. ''ఇలాంటి పరిస్థితిలో ఇతనికి, భూమి యజమానికి వారి అభిప్రాయాల మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. భూమికి పెరుగుతున్న విలువను దృష్టిలో పెట్టుకొని రైతును భూమి అమ్మడానికి ఒత్తిడి చేసిన ఋణదాత తన ప్రయోజనాలకు విరుద్ధంగా తానే నిర్ణయం తీసుకున్నట్లయింది. వ్యవసాయ పంటల ధరలలో ఉండే అనిశ్చిత పరిస్థితి వీరికి ప్రతికూలంగా వుంటుంది. అయినా వ్యవసాయరంగం అభివృద్ధి పట్ల ప్రత్యేక ఆసక్తి లేని వీరు అసమర్థమైన సాగునైనా అంగీకరిస్తారుగాని, భూమి, విలువల పెరుగుదలవల్ల వచ్చే లాభాన్ని వదులుకోడానికి ఇష్టపడరు. అంటే వ్యవసాయరంగంలోని అశ్చిత పరిస్థితులు, స్థిరాస్తులు లావాదేవీల్లో పెట్టుబడులు ఆకర్షింపబడటానికి అవకాశం కల్పిస్తాయి. జనాభా పెరుగుదల ఒత్తిడిని దృష్టిలో పెట్టుకున్నపుడు ఇదిసురక్షితమే కాకుండా లాభదాయకమైన పెట్టుబడిగా పరిగణించబడింది. వ్యవసాయ ఉత్పత్తి తగ్గడం వల్ల ఈ ఉత్పత్తుల ధరలు మరింత క్షీణించేవని కూడా వీరి అభిప్రాయం. వడ్డీ వ్యాపారి అతి యుక్తిగా అంచనాలు వేసుకొని లాభాన్ని తనగుప్పట్లో నుండి జారనీయకుండా కాపాడుకోగలిగితే, పూర్తిగా నష్టపోయినవాడు భారతీయ రైతు. ఋణదాతల్లో అందరూ ప్రతికూల పరిస్థితులను అధిగమించిన వారేంకాదు, కాకపోతే రైతాంగం నష్టపోయినంతగా మాత్రం వీరు నష్టపోలేదు. కొంత మంది మారిన పరిస్థితులను గమనించి కమతాలస్థిరీకరణకు ఇష్టపడ్డారే తప్ప వ్యాపార విస్తరణగూర్చిగాని అదుపు సాహసానికిగాని ప్రయత్నించలేదు. 1930లలోని ఆర్థిక మాంద్యం ప్రపంచ ఆర్థిక సమాజంలో అతి పరిమితమైన పాత్ర కల్గిన భారత దేశపు మారుమూల ప్రాంతాలను సయితం ఎంతగా కుదిపివేసిందంటే దాని ప్రభావ ఫలితాలను అనేక సంవత్సరాల అనంతరం కూడా అనుభవించవలసి వస్తోంది. ఈ పరిణామాల ఫలితంగా ఎదురయిన (భూమి) ఆస్తి,హోదాల నష్టం నుండి తప్పించుకోగలిగిన వారు రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ఏర్పడిన ఆర్థిక వికాస పరిస్థితులను సద్వినియోగపరచుకున్నారు. ఈ కాలంలో కూడా కరువుకాటకాలు, వ్యాధులు సోకినా జననష్టం అంతగా జరుగలేదు. శాస్త్ర,సాంకేతిక రంగాలలో మార్పు ఇందుకు తోడ్పడింది. ఇది జనాభా పెరుగుదలకు ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోని పేద వర్గాల జనసంఖ్య వెల్లువలా పెరిగింది. సమకాలీన పరిశీలకులు హరిత

విప్లవం ఈ అంశాలన్నింటి సంఘటిత ప్రభావంగా పేర్కొన్నారు. ఆర్థిక మాంద్యం తదనంతర కాలంలో ఈ మార్పుల జాడలు గమనించవచ్చు.

## 2.2 కరెన్సీ

భారత దేశంలో జపాన్ మినహా ఇతర ఆసియా దేశాల వలె అమూల్యమైన లోహాలు అందించే దేశీయ వనరులు అందుబాటులో లేకపోవటం వల్ల ఇతర దేశాల నుండి దిగుమతి చేసుకోవలసి వచ్చేది. రోమన్‌లతో వర్తకం జరిపిన నాటి రోజులనుండి భారత దేశం విలువైన లోహాల 'లోటు' వున్న దేశంగా గుర్తించబడింది. మన దేశం నుండి అన్ని రకాల వస్తువులు ఎగుమతి చేయబడినప్పటికి, బంగారం, వెండి లోహాలను ప్రధానంగా దిగుమతి చేసుకోవడం జరిగింది. దీన్ని ఎన్నడూ ఇబ్బందికరమైన పరిస్థితిగా కూడా భావించలేదు. బంగారాన్ని ప్రధానంగా ఆభరణాల రూపంలో దాచుకోవడానికే భారతీయులు ఇష్టపడతారు. వెండి మాత్రం చాలాకాలం, చాలా ప్రాంతాల్లో కరెన్సీగా ఉపయోగించబడింది. బంగారు నాణేలు కూడా అప్పుడప్పుడు కరెన్సీగా ఉపయోగించబడినా వాటికుండే అత్యధిక విలువ దృష్ట్యా అవి గ్రామీణ ప్రాంత ప్రజలకు అందుబాటులో వుండేవి కావు. ద్రవ్యీకరణ పరిమితంగా వున్నా, ప్రభుత్వం ఆదాయాన్ని సమకూర్చు కోవాలనుకున్నప్పుడల్లా దేశ ప్రజలకు కరెన్సీ అందుబాటులో వుండాలి కదా ! ఆయా కాలాలను బట్టి ద్రవ్యపు (కరెన్సీ) చలామణి యొక్క వేగము నిర్ణయించబడేది. సగటు రూపంలో కాకుండా ఇతర పద్ధతులలో ద్రవ్యపు బదిలీలు కొంతవరకు పరిమితమైనప్పటి కి వర్తకులు జారీ చేసే ప్రామిసరీనోట్లు లేదా హుండీలను దూర ప్రాంతాలలో నివసించే వారు కూడా అంగీకరించేవారు అయితే ఈ ప్రైవేట్ కాగితపు కరెన్సీని లోహాల్లోకి లేదా అధికార కరెన్సీలోకి మార్చుకోవడం తరచుగా జరుగుతుండడంవల్ల వెండి రూపంలో ఉన్న కరెన్సీకి నిరంతరం డిమాండు ఉండేది.

బ్రిటిష్ పరిపాలన కంటె ముందు కూడా భారత దేశపు కరెన్సీ ముద్రణాలయాల్లో వెండి నాణేలు ప్రజల ఉపయోగానికి వీలుగా ముద్రింపబడేవి. ఇలాంటి కరెన్సీ వెంటనే కావాలని డిమాండు చేసే ఖాతాదారుల నుండి రుసుము వసూలు చేస్తూ ముద్రణదారులు అదనంగా ఆదాయాన్ని సంపాదించేవారు. వెండి రూపాయల ముద్రణపై ఉన్న డిమాండును నిరుత్సాహ పరిచేందుకు వీలుగా ఇలాంటి రుసుము (charge) ను సక్రమంగా గాని అక్రమంగా గాని వసూలు చేస్తున్నా ప్రభుత్వం ఈ పద్ధతిని నిషేధించలేదు. మొగలాయిల అధికారం ఉచ్ఛ స్థితిలో ఉన్నప్పుడు కూడా వెండి దేశంలోకి తరలిరావడం గమనించవచ్చు. 1660-1720 సంవత్సరాల మధ్య బ్రిటిష్ వారి ఈస్టిండియా కంపెనీ ఒక్కటే 20 మిలియన్ పౌండ్లను

దేశంలోకి చేరవేసింది. మెక్సికోనుండి భారతదేశంలోకి తరలించబడే వెండి క్రమంగా పెరుగుతుండడం వల్ల ధరల స్థాయిలో వచ్చిన మార్పులను గురించి ఆర్థిక చరిత్ర కారుల మధ్య తీవ్రమైన చర్చ జరిగింది. వెండి దేశంలోకి ప్రవహించడం వల్ల ఏర్పడిన ప్రభావాల స్థాయి గురించి భేదాభిప్రాయాలు వున్నా, దాని కీలకమైన ప్రాధాన్యత గురించి ఎలాంటి సందేహానికి తావు లేదు. దేశంలో బ్రిటిష్ పాలన స్థిరత్వం సాధించుకున్న తర్వాత పరిస్థితులు తారుమారు అయ్యాయి. 6వ శతాబ్దపు ప్రారంభ కాలమంతా ధరలు తగ్గుముఖం పట్టడాన్ని గమనించవచ్చు. అనేక కారణాలు ఇందుకు దోహదం చేసాయి. భారత దేశపు వస్త్రాలను కొనడానికి బదులుగా తమ మిల్లులద్వార తయారయిన వస్త్రాన్ని దేశంలోకి చేరవేసారు. వ్యవసాయ ఎగుమతులకు ఆ కాలం నాటికి తగిన ప్రాధాన్యం లేదు. ఇదే సమయంలో బ్రిటిష్ వారు ఖచ్చితంగా వసూలు చేసిన భూమి శిస్తు కూడా ప్రతి ద్రవ్యోల్బణ ప్రభావాన్ని కలుగజేసింది. దీనిని గురించి రాబోయే అధ్యాయంలో మరింత వివరించడం జరిగింది. 1835 నుండి వెండి రూపాయలే భారత దేశంలో చట్టబద్ధ ద్రవ్యంగా చలామణి అయ్యాయి.

ఈ మార్పులన్నీ మన అధ్యయన కాలం ప్రారంభంలోనే చాలా వేగంగా జరిగాయి. 1876లో వెండి రూపాయి మారకపు రేటు పడిపోవడం మొదలయింది. అనేక యూరోప్ దేశాలు వెండిని చలామణి నుండి తొలగించి స్వర్ణ ప్రమాణాన్ని అనుసరించడం ప్రారంభించాయి. ఇలాంటి పరిస్థితులలో ప్రపంచ మార్కెట్ లో ఉన్న వెండి అంతా అమూల్యమైన లోహాలను అక్కున చేర్చుకొనే గని వంటి భారతదేశంలోకి ప్రవేశించడం ఒక్క 1877 సంవత్సరంలోనే ప్రపంచ వెండి ఉత్పత్తిలో 84 శాతం భారత దేశంలోకి వచ్చి చేరింది. మారకం రేటు మాత్రం యాథావిధిగా పడిపోవడం కూడా చూడవచ్చు. ఏమయినప్పటికి, భారీ మొత్తంలో వెండినిఇముడ్చుకోగలశక్తి భారతదేశానికి ఉండడం రాబోయే ఉపద్రవాలను అరికట్టే అవకాశాన్నిచ్చింది. ఇలాంటి పరిస్థితిని సరి చేసేందుకు భారత ప్రభుత్వం ఉచితంగా వెండి నాణేలు ముద్రించడాన్ని నిలుపు చేయడం లేదా ఈ ముద్రణపై విధించి సుంకాన్ని పెంచడం వంటి చర్యలు తీసుకున్నది. బ్రిటిష్ ప్రభుత్వం ఇలాంటి జోక్యాన్ని వ్యతిరేకించింది. వ్యక్తిగత స్వార్థం, ఆర్థిక సిద్ధాంతాలను ఇందుకు అనుకూలంగా ఉపయోగించుకున్నది. ఇంగ్లండు కు చెందిన వర్తకులు, బ్యాంకర్ల నుండి భారతదేశానికి తరలించబడుతున్న వెండి ప్రవాహాన్ని ఆపడానికి భారత ప్రభుత్వం తీసుకొనే ఏ చర్యలనైనా బ్రిటిష్ ప్రభుత్వం ఆమోదించలేదు. స్వేచ్ఛా ఆర్థిక విధానం అందుకు సంబంధించిన సిద్ధాంతాలు స్థిరమైన ఆలోచన గల ప్రతి వ్యక్తి విలువైన లోహాలు స్వయంచాలకమైన సముతౌల్యాన్ని తెస్తాయని గుర్తించగలడని, ఇలాంటి. పద్ధతులకు ఆటంకం కలిగించకూడదని ప్రచారం చేసాయి. స్వల్పకాలంలో ఎలాంటి

పరిణామాలు సంభవించిన కరెన్సీ ముద్రణ యధావిధిగా కొనసాగాలని, ఒక క్రమమైన ద్రవ్యవిధానం కోసమే దృష్టిని కేంద్రీకరించరాదని తెల్పిచెప్పడం జరిగింది. ఇట్లాంటి సమకాలీన ఆర్థిక సిద్ధాంతం కూడా భారత దేశానికి ఒక అవకాశాన్నిచ్చింది. అదే స్వర్ణ ప్రమాణాన్ని అనుసరించడం. అయితే ఆనాటి ఆర్థిక పరిస్థితులను, ద్రవ్య వ్యవహారాల రేటును దృష్టిలో ఉంచుకున్నట్లయితే భారత దేశం స్వర్ణ ప్రమాణాన్ని అనుసరించడం అభిలషించటం కాదని, ఈ మార్పును అమలు చేయడం అసాధ్యమని నిపుణులు అభిప్రాయపడినారు. 1893 వరకు వెండి ప్రమాణాన్నే భారతదేశం అనుసరించింది, టంకశాలలు కొనసాగించి ఆ తరువాత కాలంలో బంగారం రేటులో నిర్ధారించబడిన 'హోంఛార్జీలకు' విలువకోల్పోతున్న వెండి రూపంలో వచ్చే రాబడికి మధ్య పొంతన లేకపోవడంతో కాలం చెల్లిన సిద్ధాంతాన్ని వదిలించుకొని వెండి టంకశాలలను మూసివేయడం జరిగింది.

రైల్వేలు, ఇతర పనులలో బ్రిటిష్ పెట్టుబడుల ఋణ భారాన్ని తీర్చడం, వెండి మారకపు రేటు తగ్గుతుండడం వల్ల 19వ శతాబ్ది చివరికల్లా 'హోంఛార్జీలు' క్రమంగా పెరిగాయి. బ్రిటన్ మూలధన మార్కెట్ అందుబాటులో ఉండడం వల్ల తక్కువ వడ్డీకి ఋణసదుపాయం పొందుతూ భారత దేశం ఎంతగానో లాభపడిందని కొందరు చేసిన వాదనలో నిజంలేదు. 1875లో బ్రిటన్ నుండి వచ్చిన ఒక (1) లక్ష పౌండ్ల పెట్టుబడికి 3 శాతం వడ్డీ చొప్పున రూపాయి విలువ 1s = 10d ఉన్నప్పుడు రూ13,27,777 ఋణ మొత్తాన్ని తిరిగి చెల్లించాల్సి వుండగా, రూపాయి విలువ 1892లో 1s = 2d కి తగ్గినపుడు రూ॥ 5,12,428 చెల్లించవలసివచ్చింది. ఈ ఉదాహరణను పరిశీలిస్తే వడ్డీ రేటు ప్రారంభపు 3 శాతం నుండి 5 శాతానికి పెరిగిందని వేరే చెప్పనక్కరలేదు. ఇలాంటి స్థితిలో కూడా భారతదేశంలో కంటె బ్రిటన్‌లో వడ్డీరేటు తక్కువగానే ఉండటం వలన రూపాయి విలువ తగ్గుతున్నా కొద్దీ మూలధన మార్కెట్ మరింతగా చీలిపోయింది. ఇంగ్లండు నుండి బంగారం రూపంలో మూలధనం సేకరించే పెట్టుబడిదారు తక్కువ వడ్డీకి దీర్ఘకాలిక పెట్టుబడిని పొందగలిగితే, వెండి రూపంలో ఋణం తీసుకొనే వాడు అధిక వడ్డీకి స్వల్పకాల ఋణాలతో సంతృప్తి పడవలసి వచ్చేది. దీని ఫలితంగా భారతీయమూలధనం రైల్వేలు, మౌలిక సదుపాయల వంటి దీర్ఘకాలిక పథకాలలో కంటె వర్తక రంగానికి మాత్రమే తరలించబడటం గమనించ వచ్చు. వ్యాపార వర్గం ఇతర పెట్టుబడులకంటె వర్తక రంగంలో పెట్టుబడే భారతదేశంలో లాభదాయకంగా ఉంటుందని గ్రహించడమే దీనికి కారణం. ఈ అంశంతో పాటు గతంలో ప్రస్తావించిన వర్తక యంత్రాంగం విస్తరణను కూడా పరిశీలనకు తీసుకున్నట్లయితే భారతీయ వర్తకులు ఇతరుల పెట్టుబడులతో విస్తరించిన రవాణా వ్యవస్థను తెలివిగా తనకు అనుకూలంగా ఉపయోగించుకొని రైతాంగం

ఉత్పత్తిని అతి తక్కువ ధరలకు పొందేందుకు వీలుగా అతని భూమిపై అదుపు సాధించడం ఈ మొత్తం చర్చకు కొస మెరుపు.

మారకపు రేటు తరుగుదల ప్రారంభానికి, వెండి టంకశాలలు మూసివేయడానికి మధ్య 16 సంవత్సరాలలో కరెన్సీ చలామణి 1250 మిలియన్ రూపాయల నుండి 1900 మిలియన్ రూపాయలకు పెరిగింది. ఈ కాలంలో రూపాయి విలువ మూడు వంతులు తగ్గడంతో మొత్తం చలామణిలో ఉన్న ద్రవ్యం విలువ బంగారం రూపంలో ప్రారంభ కాలంలో ఎంత ఉన్నదో 16 సంవత్సరాల అనంతరం కూడా అంతే ఉన్నది. ఈ రకంగా తరుగుదలకు లోనైన కరెన్సీ మూలంగా భారత దేశం భారీ మూల్యాన్నే చెల్లించవలసి వచ్చింది. కరెన్సీ విలువ తగ్గిన కారణంగా 650 మిలియన్ రూపాయల విలువైన భారతీయ ఉత్పత్తులను ఎలాంటి ప్రతిఫలం పొందకుండానే ఎగుమతి చేయవలసి వచ్చింది.

కరెన్సీ విలువతో తరుగుదల ఎగుమతులకు అదనపు అవకాశాన్ని ఇచ్చిందని, టంకశాలల మూసివేత వల్ల ఎదురయ్యే ప్రతిద్రవ్యోల్బణ ప్రభావాలు భారత ఆర్థిక వ్యవస్థను దెబ్బతీయగలవని వీరు నమ్మారు. అందువల్లనే జాతీయవాదులు టంకశాలలు మూసివేయడాన్ని గర్హించారు. విలియమ్ జెన్నింగ్స్ బ్ర్యాన్ వంటి వారు స్వర్ణ ప్రమాణాన్ని ఇతరత దేశాలపై రుద్దడాన్ని వ్యతిరేకించారు. ఆ కాలానికి చెందిన భారతీయ గ్రామీణ రైతు, అమెరికా వ్యవసాయదారుపై ఒకే రకమైన భారం పడవేస్తుందని వీరు అభిప్రాయపడినారు. కొత్త విధానం వల్ల వెను వెంటనే ఏర్పడే ప్రభావాలపైననే తమ దృష్టినంతా కేంద్రీకరించడం వల్ల, ఈ విధానం భారత దేశానికి చెరుపు కలిగించేదే అయినా, ప్రవాహ రూపంలో వచ్చి పడిన వెండి జాతీయ ఆర్థిక వ్యవస్థపై ఎలాంటి ప్రభావాన్ని చూపిందో విశ్లేషించడం విస్మరించారు. బ్రిటిష్ - ఇండియా అధికార యంత్రాంగం టంకశాలలు తెరచి ఉన్నప్పుడు, వాటిని మూసివేసినప్పుడు, ఏ సంధర్భంలోనూ భారత దేశ సంక్షేమం గురించి ఎన్నడు ఆలోచించలేదు అన్నది వాస్తవం; బ్రిటిష్ పాలనను, వారి వ్యాపార ప్రయోజనాలను కొనసాగించడం మరియు కాపాడుకోవడమే వారి ఏకైక ధ్యేయమయింది.

టంకశాలల మూసివేతతో వెండి రూపాయి చిహ్నం గల నాణెంగా మారింది. దాని అంతర్గత విలువ మారకపు రేటు ( 1s= 4d ) కంటె తక్కువగా ఉన్నప్పటికి ప్రభుత్వం అదే రేటును కొనసాగించింది. వెండి ప్రమాణం స్థానంలో స్వర్ణ ప్రమాణం మారకం ప్రవేశపెట్టబడింది. అయితే బంగారం ప్రామాణిక విలువగా గుర్తించబడిందేకాని వినిమయ మాధ్యమంగా మాత్రం కాదు. జె.యమ్. కీన్స్ భారతీయ కరెన్సీ , విత్త విషయాలపై జరిపిన నిశిత పరిశీలనలో ఈ అంశాన్ని గురించి చర్చించాడు. ఈ పరిశీలన ఇందుకు సంబంధించిన

వివిధ విషయాలపై అవగాహన కోరుకునే వారందరికి ఎంతగానో ఉపయోగపడుతుంది. బంగారపు కరెన్సీ ఎందుకు అవసరం లేదో, ఎందుకు ఆశించదగినది కాదో వివరించాడు. భారత ప్రభుత్వం తన వద్ద ఉన్న వివిధ నిల్వలను సద్వినియోగం చేసుకోవడం ద్వారా ఏరకంగా ఆర్థిక వ్యవస్థను నిర్వహించవచ్చో చర్చించాడు.

భారత ప్రభుత్వానికి నిల్వలతో పాటు ఆర్థిక భారం కూడా సమృద్ధిగానే ఉన్నది. లండన్లో మన వ్యవహారాలు చూసే కార్యదర్శి కౌన్సిల్ డ్రాఫ్టులను భారత్ మరియు లండన్లలో బ్యాంకులలో అమ్మడం ద్వారా పెద్ద మారక హోంచార్జీలను భారత దేశం నుండి లండన్కు బదిలీ చేసాడు. లండన్లో నివసించే వర్తకులు భారత దేశంలో తమ బిల్లులు చెల్లించటానికి డ్రాఫ్టులను కొంటే, అందుకు నిర్ధారించబడిన మొత్తాన్ని భారత ప్రభుత్వం చెల్లించేది. టెలిగ్రాఫ్ సౌకర్యం ఏర్పడిన తరువాత ఇలాంటి బదిలీలు సులభంగా, వేగంగా జరిగే అవకాశం ఏర్పడింది. ఈ బదిలీలు అన్ని విధాలుగా మన విత్త వ్యవస్థను నష్టపరిచాయి. వనరుల తరలింపు ఎలాంటి ఆటంకం లేకుండా కొనసాగింది. వర్తకులు డ్రాఫ్టులను నగదుకు ప్రత్యామ్నాయంగా గుర్తించి, నమ్మకం పెంచుకోవడం వల్ల వీటి గిరాకి విపరీతంగా పెరిగింది. దీంతో పాటు మారక బ్యాంకులు, కార్యదర్శి కొంత లాభం కూడా పొందగలిగారు. డ్రాఫ్టులకు గిరాకీ పెరగడంతో కార్యదర్శి తన విచక్షణాయుత అధికరాలతో ఎంత మొత్తానికి, ఏ సమయంలో డ్రాఫ్ట్ జారీ చేయాలో నిర్ణయించే వాడు. ఈ మొత్తం చర్చలో కరెన్సీ నిర్వాహణయే అతని ప్రధాన లక్ష్యం.

స్వర్ణ ప్రమాణ మారకపు పద్ధతి, వెండి విలువ మరోసారి పెరిగేంతవరకు మాత్రమే విజయవంతంగా పని చేసింది. వెండి నాణెపు అంతర్గత విలువ చట్టబద్ధమైన బహిర్గత విలువను మించిపోయింది. దీంతో వెండి నాణేలను కరిగించడం లాభదాయక మయింది. మార్కెట్ నుండి కరెన్సీ అదృశ్యమవుతుందో అన్నంతగా ప్రభుత్వం ఆందోళన చెందింది. అధికార మారకపు రేటును పెంచడం ద్వారా మాత్రమే దీన్ని నిరోధించడం వీలయ్యేది. దాదాపు 20 సంవత్సరాల పాటు ప్రభుత్వం మారకపురేటును 1s = 4d వద్ద నిలకడగా స్థిరంగా ఉంచగలిగింది. మొదటి ప్రపంచ యుద్ధం వల్ల ఈ సమతూకం దెబ్బతిన్నది. ఇందువల్ల ప్రపంచ మార్కెట్లో వెండి ధరలు పెరగడమే కాక బయటి ప్రభావాలకు గురి అయింది. ఈ పరిస్థితి సృష్టించబడటంలో భారత దేశం పాత్రను కూడా విస్మరించలేము. ఒక్క సంవత్సర కాలంలోనే సంవత్సరిక ప్రపంచ వెండి ఉత్పత్తికి రెండు రెట్లు మొత్తాన్ని భారత దేశం దిగుమతి చేసుకున్నది. 1919లో ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత వాస్తవిక సంక్షోభ పరిస్థితులు ఏర్పడినాయి. రూపాయి మారకపు విలువ 1s = 8d నుండి 2s = 4d కి కొద్ది నెలలోనే

పెరిగింది. తన అధికారయుత చర్యల ద్వారా రూపాయి విలువను ఒక రేటు వద్ద నిలబెట్టుకుంటూ వస్తున్న భారత ప్రభుత్వానికి వెండి ప్రవాహంలో ఏర్పడిన మార్పులు ఇబ్బందికరంగా పరిణమించాయి. ప్రవాహంలా తరలి వచ్చే వెండి రూపాయి విలువలో తరచూ ఏర్పడే ఒడుదొడుకులనుగాని యధార్థమైన స్వర్ణ ప్రమాణాన్నిగాని అంగీకరించే స్థితిలో లేదు. మారకపురేటుకు సంబంధించి ప్రత్యేక చర్యలు తీసుకోవడానికి కార్యదర్శికి చట్టం అధికారాలేవి ఇవ్వనప్పటికి, మారకపు రేటు అస్థిరత్వానికి లోనైనప్పుడల్లా కౌన్సిల్ డ్రాఫ్టులను జారీ చేయడంపై తనకు గల నియంత్రణ అవకాశాన్ని ఉపయోగించి సమతుల్యతను కాపాడటానికి ప్రయత్నించే వాడు . మారకం రేటు పెరుగుతుంటే డ్రాఫ్టులను రాబట్టుకొని, ఈ రేటు తగ్గితే డ్రాఫ్టులను తిరిగి అమ్మడం వంటి చర్యలకు పూనుకొనేవాడు. ఇందుకు అనుగుణంగా లండన్‌లో ఉన్న మన నిల్వలను అమ్మడం, లేదా ఋణ సమీకరణ చేయడం ద్వారా స్థిరమైన మారకపు రేటుకు బలం చేకూర్చేందుకు ప్రయత్నించేవాడు. ఈ రకమయిన చర్యలను కొన్ని పరిమితులకు లోబడే చేపట్టవలసి ఉంటుంది. అంతేగాక ప్రభుత్వం మారుతున్న పరిస్థితులను ఎదుర్కొనేందుకు ఒక సందర్భంలో వెండి రూపాయి రేటును హెచ్చు స్థాయిలో నిర్ణయించింది. అంటే, అది అలాగే కొనసాగుతుందనుకోడానికి వీలులేదు. పరిస్థితిలో ఏర్పడే మరో మార్పు రూపాయి రేటును కూడా మార్చుకోవాల్సిన స్థితికి దారితీయవచ్చు. మార కపు రేటు పెరగడం గాని, తగ్గడంగాని తీవ్రస్థాయికి చేరుకున్నప్పుడు ( బ్రిటీష్ వారి ) కార్యదర్శి ఎత్తులు ఏమాత్రం పరిస్థితిని సరిదిద్దలేవు. అలాంటిది అతి కొద్దికాలంలోనే సంభవించింది కూడా.

అతిగా మార్పులకు, చేర్పులకు లోనవుతున్న భారతీయ కరెన్సీ చరిత్రను పరిశీలించడానికి ఏర్పాటయిన అనేక కమీషన్లలో ఒకటయిన 1919లో నియమింపబడిన కరెన్సీ కమీషన్ స్థిరమైన మరియు దీర్ఘకాలం పాటు అదే రీతిలో, ముందు ఈ రేటును కొనసాగే సరియైన కరెన్సీ రేటు నిర్ధారించడానికి ఎంతో శ్రమించింది. మారకపు రేటు **1s = 8d** గా ఉన్న సమయంలో కీన్స్ కమీషన్ **2s = 8d** గా నిశ్చయించాలని తన కున్న అధికారిక అవకాశాలను అన్నింటిని ఉపయోగించుకొని సూచించాడు. ప్రపంచ మార్కెట్లో ధరలు పెరగడం కొనసాగుతూనే వుంటుందని భారత దేశంలో ప్రస్తుత మున్న ధరల, ఆ ధర స్థాయి కంటె చాలా తక్కువగా ఉన్నాయని, హెచ్చు మారకపు రేటును నిర్ణయించడం వల్ల భవిష్యత్‌లో భారతదేశంలో ధరల స్థిరీకరణ జరుగుతుందని కీన్స్ అభిప్రాయ పడినాడు. ధరల స్థిరీకరణ సాధించడం కోసం హెచ్చు మారకపు రేటును ప్రతిపాదించడం ఎగుమతులపై ప్రధానంగా అధారపడే భారతీయ వర్తకుల ప్రయోజనాలకు ప్రతికూలమైనదిగా చెప్పవచ్చు.

కమీషన్ తన నివేదికను సమర్పించి **2s = 8d** గా మారకపు రేటును సూచించే

నాటికే, లోగడ తెల్పినట్లు మారకపు రేట్లు అంతకంటే ఎక్కువ స్థాయికి పెరగటం వల్ల, ఈ సూచన ప్రాధాన్యతను కోల్పోయింది. కీన్స్, తదితరుల అంచనాలకు విరుద్ధంగా అతికొద్దికాలంలోనే ప్రపంచ మార్కెట్‌లో ధరలు పడిపోవడం ప్రారంభమయింది. ఈ అనుకోని మార్పును ఎవరూ ఊహించ లేకపోయారు. మన వ్యవహారాలు చూసే బ్రిటిష్ కార్యదర్శి ఇక వెనుకా ముందు ఆలోచించ కుండా వెర్రిగా కౌన్సిల్ డ్రాఫ్ట్‌లను తెగనమ్మాడు. ధరలు పడిపోయే అగాధపు అంచున వ్రేలాడుతున్న స్థితి నుండి రూపాయి విలువను కృత్రిమంగానైనా కాపాడటానికి, ప్రయత్నించాడు. ఇలాంటి ప్రయత్నం పట్ల భారతీయ వర్తకులు కోపోద్రిక్తులయ్యారు. వీరు తమ అవకాశాలకు భంగకరంగా ఉన్న ప్రస్తుత విధానాన్ని నిర్ద్వంద్వంగా వ్యతిరేకించే గాంధేయ వాదం వైపు మొగ్గు చూపారు. మారకపురేటును తమ దేశపు అవసరాలకు అనుకూలంగా ఎప్పటికప్పుడు అక్రమంగా మార్పులకు గురిచేయడం ఘోరపరిణామంగా భావించిన ఈ వర్తక వర్గం స్వాతంత్ర్యపోరాటమే తమకు మిగిలిన ఏకైక మార్గంగా గుర్తించగలిగింది. యుద్ధకాలంలో పరిస్థితులు ఆశాజనకంగా ఉండగలవ ని భావించిన వీరికి పాలనా యంత్రాంగం విధించిన నియంత్రణలు తమ అవకాశాలను దెబ్బ తీస్తున్నట్లు గ్రహించడం వల్లనే సర్వత్రా అసంతృప్తి పెరిగి ఉద్యమరూపాన్ని పొందింది. ప్రపంచ మార్కెట్‌లోని మాంద్య పరిస్థితుల సంకుచిత ప్రభావం ఒక వైపు అప్పటికే హెచ్చుస్థాయిలో ఉన్న భారత దేశ మారకపు రేటు మనకు ప్రతికూలమైన పరిస్థితినే సృష్టించాయి. 1920లో 1200 మిలియన్ రూపాయల అనుకూల వర్తక సంతులనం కలిగివున్న మన దేశం 1921లో 800 మిలియన్ రూపాయల ప్రతికూల వర్తక సంతులనాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఒక్క సంవత్సర కాలంలోనే దాదాపు 2000 మిలియన్ రూపాయల మేరకు ఏర్పడిన ఈ తేడా ప్రభావం ఎంతగా ఉంటుందో సులభంగా గమనించవచ్చు.

ఈ పరిస్థితి తీవ్రతను దృష్టిలో పెట్టుకొని కార్యదర్శి కౌన్సిల్ డ్రాఫ్ట్‌ల అమ్మకాన్ని వెంటనే నిలిపివేసాడు. బ్రద్దలవ్వ బోతున్న ఉత్పత్తిని కొంత నివారించ గలిగాడు. రూపాయి మారకపురేటు 1924 కల్లా యుద్ధానికి పూర్వమున్న 1s = 4d రేటుకు పడిపోయింది. 1924 నుండి 1926 సంవత్సరాల మధ్య భారతదేశంలో వర్తకం మరోసారి ఊపందుకున్నది. వర్తక సంతులనం అనుకూలంగా మారింది. ఇది ప్రతి ఏటా దాదాపు 1300 నుండి 1600 మిలియన్ రూపాయల మధ్య ఉన్నట్లుగా లెక్కింపబడింది. స్వాతంత్ర ఉద్యమ ప్రభావాలను గుర్తించకుండా మరో కరెన్సీ కమీషన్ మారకపు రేటును 1s = 6d గా నిర్ధారించింది. ఈ కమీషన్ ఇందుకు సంబంధించి 'కరెన్సీ చట్టాన్ని రూపొందించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరింది. మొదటి సారిగా ఇలాంటి చట్టం మారకపురేటు నిర్వహణకు చట్టబద్ధతను

ఆపాదించింది. 1927లో ఈ చట్టం అమలులోకి వచ్చింది. అప్పటి నుండి చాలా సంవత్సరాల పాటు భారతీయ వర్తకం మరోసారి ప్రతికూల పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. 1927 నుండి 1930 సంవత్సరాల మధ్య వర్తక సంతులనం ప్రతి ఏటా 800 మిలియన్ రూపాయలకు తగ్గిపోయింది. కొత్త మారకపు రేటు పట్ల కూడా తీవ్రనిరసన వ్యక్తమయింది. 1930లో స్వాతంత్రోద్యమం తిరిగి ప్రారంభించబడినపుడు ప్రధాన సమస్యలను ప్రస్తావించే సందర్భంలో గాంధీజీ మారకపురేటును కూడా ఒక సమస్యగా చేర్చడం జరిగింది. మన భారతీయ ప్రముఖ పారిశ్రామిక వేత్త సర్ పురుషోత్తమ్‌దాస్ ఠాండన్ 1926లో కరెన్సీ కమీషన్ సభ్యునిగా పాత మారకపు రేటయిన 1s = 4d కి మన దేశంలో ఉన్న ప్రాధాన్యతను తెల్పుతూ అందుకు అనుకూలంగా మైనారిటీ అభిప్రాయాన్ని కమీషన్ ముందు వ్యక్త పరచడం జరిగింది.

1921 కరెన్సీ సంస్కరణలు సృష్టించిన సమస్యలను యుద్ధానంతర పరిస్థితులు అధిగమించినట్లే, 1930కి పూర్వం జరిగిన తర్జన భర్జనలన్నీ ఆర్థిక మాంద్య పరిస్థితులతో చెల్లుబాటుకాకుండా పోయాయి. 1931 తర్వాత స్వర్ణ ప్రమాణాన్ని బ్రిటన్ వదిలించుకోవడానికి రంగం సిద్ధం కావడంతో, భారతదేశంలో స్వర్ణ ప్రమాణం గురించిన చర్చతీరు మారిపోయింది. భారతీయ కరెన్సీని (రూపాయిని) అనిశ్చితమైన బ్రిటిష్ పౌండు భవిష్యత్తుతో ముడివేయడం జరిగింది - దేశంలో నిరసనలు ధ్వనించాయి. తరువాతి కాలంలో రూపాయిని పౌండ్ నుండి వేరుచేసి మూల్యహీనీకరణ చేయడం జరుగుతుందనే విస్తృత ప్రచారం జరిగిన ప్రభుత్వం రవ్వంత అవకాశం కూడా ఇవ్వక 1s =6d మారకపురేటునే కొనసాగించటానికి సిద్ధపడింది. యథాస్థితి కొనసాగించడానికి బ్రిటిష్ పాలనలో పేరుకు పోయిన భారీ జాతీయ ఋణాన్ని, బ్రిటిష్‌కు చెందిన ఋణదాతలు, ఋణగ్రహీతలకు ఎలాంటి రాయితీలు ఇవ్వడానికి సిద్ధంగా లేరనే వాదనను ఒక సాకుగా తీసుకోవడం జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఋణదాత స్థాయికి రూపాంతరం చెందిన పరిస్థితుల్లో ఈ సమస్యను విస్మరించారు. 1930లలో మాత్రం జాతీయ ఋణం సమకాలీన చర్చలలో ప్రాధాన అంశంగా కొనసాగింది.

మారకపు రేటు గురించి ఎంతో నిక్కచ్చిగా వ్యవహరించిన ప్రభుత్వం మాంద్య పరిస్థితుల వల్ల బంగారం పెద్ద మొత్తంలో ప్రవాహంగా దేశం నుండి తరలిపోతున్నా పూర్తి స్వేచ్ఛా వ్యాపార స్వభావాన్ని ప్రదర్శించింది. గతంలో విలువైనలోహాల రాకపోకలతో బ్రిటిష్ ప్రభుత్వ ప్రయోజనాలు దెబ్బతిన్నప్పుడు వెంటనే స్పందించింది. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత వెండి తరలి వస్తునప్పుడు అసాధారణ రీతిలో వెండిపై దిగుమతి సుంకం విధించింది. కాని, ప్రస్తుతం బంగారం - దేశం వెలుపలికి పోతుంటే అది ప్రభుత్వం నిర్ధారించిన

హెచ్చుమారకపు రేటును కొనసాగించటానికి తోడ్పటంతో భారత దేశ వ్యాపార వర్గం ప్రయోజనాలకు భంగకరంగా ఉన్నప్పటికి ఎలాంటి ప్రతి చర్య చేపట్టక పోగా, ప్రోత్సహించడం గమనించవచ్చు. 1931-1937 సంవత్సరాల మధ్య 3,000 మిలియన్ రూపాయల విలువైన బంగారం భారతదేశం నుండి తరలిపోయింది. ఖ్యాతిగాంచిన లోహాలగని వేగంగానే తరగిపోయింది. అయినా ప్రభుత్వం బంగారం ఎగుమతులపైననే ఆధారపడింది. ఎందుకంటే హోంచార్జీల రూపంలో బ్రిటన్‌కు చెల్లింపులు యధావిధిగా జరగాలంటే భారత్ అనుకూల వర్తక సంతులనాన్ని కలిగి వుండాలి. మాంద్య పరిస్థితులవల్ల భారతీయ ఉత్పత్తుల ఎగుమతులు తగ్గినప్పటికి, బంగారం ఎగుమతి ద్వారా నైనా, ఈ అంతరాన్ని పూడ్చి వర్తక సంతులనం అనుకూలతను కాపాడేందుకు ప్రయత్నించింది. భారత దేశ జాతీయ వాదులు, పరాయి పాలకులు కేవలం తమ స్వార్థ ప్రయోజనాల కోసమే దేశాన్ని పాలించారని, వారు దయలేని నిరంకుశ ఋణదాతలని భావించడంలో ఆశ్చర్యపడాల్సిందేమి లేదు. జాతీయ వాద వర్తకులు సయితం భారతీయ రైతుగురించి, అతని ఆదాయస్థాయి గురించి, సమకాలీన పరిస్థితులు అతనిపై చూపే ప్రభావాన్ని గురించి తాపత్రయ పడుతున్నట్లుగా కన్పించినా, వారి ఆలోచన మాత్రం రైతాంగం ద్రవ్య ఆదాయంపైననే కేంద్రీకృతమై ఉండేదని సులభంగా గ్రహించవచ్చు. ఇదివరకు చర్చించినట్లుగా రైతాంగ ఆదాయంలో అత్యధిక భాగం వర్తకులకు వివిధ రూపాల్లో చేరేదని తెలుసుకోవచ్చు.

సులభ ద్రవ్య విధానం గురించి ప్రస్తావించిన ఈ జాతీయ వాద వర్తకులు ఋణగ్రహీతకు ఉపశమనం కల్గించడం గురించి కూడా చర్చించడం గమనించవచ్చు. అయితే వ్యవస్థ ఋణగ్రస్తుడైన రైతుకు ఏ పరిస్థితుల్లోను రాయితీలు గాని, సహాయం గాని అందించేదిగా పనిచేయలేదని అవగతమవుతుంది. ఎందుకంటే ఋణదాతకు అసలు కంటె వడ్డీ ముద్దు, అంతేగాక వడ్డీ నిరాటంకంగా క్రమంగా రైతు నుండి రాబట్టుకోవటానికి ఇష్టపడతాడు. పై స్థాయిలో ఋణగ్రహీతలకు ఎలాంటి ఉపశమనం అందినా, వాటిని పరిగణనలోకి తీసుకోకుండా రైతాంగం నుండి క్రమం తప్పకుండా ఇచ్చిన అప్పుకు ప్రతిఫలంపొందడమే వర్తకుని ఆలోచన. వ్యవసాయ ఉత్పత్తులను విదేశాలకు ఎగుమతి చేయడం ద్వారా వచ్చే లాభ నష్టాలతో గ్రామీణ రైతాంగానికి ప్రత్యక్ష సంబంధం లేక పోయినా, అదే భారతీయ , బ్రిటిష్ వర్తక వర్గాలకు ప్రధాన ఆధారం.

ఈ వ్యాపారంలో ఎలాంటి ఒడుదొడుకులు కొనసాగినప్పటికీ భారతీయ రైతాంగం నుండి ఖచ్చితమైన ప్రతిఫలాన్ని రాబట్టుకోవడంతో వీరువురి సమిష్టి ప్రయోజనం యిమిడివున్నది. భారతీయుడైనా, బ్రిటిష్ వాడైనా వర్తకుడు నిర్దయుడే. గ్రామీణ రైతాంగాన్ని తమ కబంధ హస్తాల్లోంచి జారీ పోకుండా ఎప్పటికప్పుడు జాగ్రత్త పడటంలో కూడా ఈ ఇద్దరిలో తేడా ఏమీ లేదు.

దేశంలో రుణ విధానం తాము అనుకున్నట్లుగా నడుస్తున్నంత కాలం రుణదాతలకు సులభద్రవ్య విధానం, తరుగుదల, ద్రవ్యోల్బణం మొదలయిన వాటి గురించి పట్టింపే లేదు. కరెన్సీలో నిలకడ లేకపోయిన ఋుణ కార్యకలాపాలు సాఫీగా సాగుతున్నట్లు అయితే మిగతా పరిస్థితులు ఏమయిపోయినా వారికి అవసరం లేదు. భారత దేశ వర్తకులు, ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల వారు తమ రుణ విధానం ద్వారా రైతాంగాన్ని కట్టు బానిసలుగా మార్చిన దారుణ పరిస్థితులను చూడవచ్చు. ఏదో ఒక రూపంలో రైతును తమ గుప్పిట్లో ఉంచుకోగలిగినపుడు వర్తకుడు తన ప్రాథమిక పెట్టుబడిపై ఏర్పడే తరుగుదలను కూడా లెక్క చేయని రీతిలో రైతును ఉపయోగించుకునేవారు. ఇక బ్రిటిష్ పెట్టుబడి దారు తనకు అనుకూలమయిన, ప్రామాణికమైన విలువకే తన ఋుణ సేవలను అనుసంధానం చేసాడే తప్ప భారతీయ కరెన్సీకి తగిన ప్రాధాన్యత ఇవ్వలేదు. తాము ఆశించిన మేరకు రాబడిని సేకరించినంత కాలం రూపాయి విలువ ఏమయి పోయినా పట్టించుకోవాల్సిన అవసరం బ్రిటిష్ వారికి కలుగలేదు. గ్రామీణ రైతాంగాన్ని దోచుకోవడంలో ఏకీకృత ధోరణులను కనబరిచిన భారతీయ, బ్రిటన్ వ్యాపార వర్గం తమ వ్యక్తిగత ప్రయోజనాలు దెబ్బతిన్నప్పుడు ఘర్షణ వైఖరి అవలంబించడం గమనించ వచ్చు. బ్రిటష్ వారి పాలనా పరమైన ఒత్తిడులు పెరిగినపుడు గాని, రుణదాత అయిన పరాయి దేశం ద్రవ్య సప్లయ్‌ని లేదా దేశీయ వర్తకం తెచ్చిపెట్టే లాభాలను నియంత్రించటానికి ప్రయత్నించినపుడు ఇలాంటి సంఘర్షణలు తలెత్తేవి. ఆర్థిక మాంద్య పరిస్థితులు తీవ్రంగా ఉన్న సమయంలో రుణగ్రస్తమయిన భారతదేశాన్ని ( అది కూడా బ్రిటిష్ వారు అనుసరించిన ప్రతికూల వర్తక విధానం వల్ల) తన మారకపు రేటుకు కట్టుబడి వుంచడం కోసం, తన పట్టును దేశంపై బిగించడం కోసం రుణదాతగా చలామణి అయిన బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించిన విధానాలకు వ్యతిరేకంగా భారతీయ వర్తక వర్గం మరో సారి జాతీయ ఉద్యమంలోకి ప్రవేశించారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత పరిస్థితులు తారుమారై బ్రిటన్ రుణ గ్రస్తం కావడం, బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండ్ లో భారత్‌కు అపారమైన స్టెర్లింగ్ నిల్వలు ఉండటం, ఆ తరువాతి కొద్దికాలంలోనే భారత దేశం స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడం ఊహించని పరిణామాలేమి కావు .

**ధరలు** (The Price)

భారత దేశ వ్యవసాయక ఉత్పత్తుల ధరలు కరెన్సీ స్థితి గతుల ద్వారా తీవ్రంగా ప్రభావితమైనాయి. ఇది గమనించిన జాతీయ వాదులు మారకపు రేటు పడిపోతున్నప్పుడు ఎగుమతి బోనస్ అందజేయాలని, కరెన్సీని తమకు ఇష్టానుసారంగా మార్పులకు లోను చేస్తూ మారకపు రేటును హెచ్చు స్థాయికి పెంచుతున్నప్పుడు దానికి వ్యతిరేకంగా ప్రతిఘటన తెలిపారు. ఎగుమతి బోనస్ అనేది కొంతకాలమే ఆచరణ సాధ్యమని బ్రిటిష్ ఆర్థిక వేత్తలు వాదించారు. ధరల పెరుగుదల వేతనాల పెరుగుదలకు దారి తీస్తుందని దానంతట అదే సమతౌల్యత సాధించబడుతుందని రికార్డో వెలిబుచ్చిన సంప్రదాయ అభిప్రాయాన్ని ఈ సందర్భంగా వారు పేర్కొనడం గమనార్హం. 1877లో తరుగుదలకు లోనవుతున్న కరెన్సీ విషయంలో జోక్యం చేసుకోరాదని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరడానికి మరియు స్వేచ్ఛగా వెండి నాణేలు ముద్రించడానికి టంకశాలలు తెరచివుంచే విధానాన్ని సమర్థించడానికి బోహట్ కూడా రికార్డో అభిప్రాయాలను ఆధారం చేసుకొని వాదించాడు. కీన్స్ 1919లో కరెన్సీ కమీషన్ ముందు అప్పుడు ఆచరణలో ఉన్న మారకపు రేటు కంటె హెచ్చు రేటును సూచించటానికి కూడా ఇదే సిద్ధాంతాన్ని ఉపయోగించాడు. భారతీయ ఎగుమతి దార్లు, తాము పొందే ఎగుమతి బోనస్‌ను కోల్పోవలసి వస్తుంది కనుక ఈ మార్పును వ్యతిరేకిస్తారన్న అభిప్రాయాన్ని కీన్స్ త్రోసి పుచ్చాడు. మారకపు రేటుకు సంబంధించి బ్రిటిష్ ప్రభుత్వ జోక్యానికి అనుకూలంగా గాని, వ్యతిరేకంగా గాని జరిగిన ఏ వాదన భారత రైతాంగ ఆర్థిక వ్యవస్థపై ఏ విధమైన ప్రభావాన్ని చూప లేకపోయాయి. వేతన శ్రామికులు స్వేచ్ఛగా వ్యవహరించే అవకాశాలు, వర్తమాన రైతాంగ వ్యవస్థలో వారి పాత్ర కూడా బహుస్వల్పం. కుటుంబ శ్రామికులు ఎంతగా దోపిడికి గురి చేయబడినారంటే, కనీస జీవనం కూడా వారికి గగనమైపోయింది. ఇలాంటి పరిస్థితులలో ఎగుమతి బోనస్ వల్ల స్వయం చాలక సవరణలు ఆ వెంటనే తప్పనిసరిగా చోటుచేసుకోకపోవచ్చు.

ధరలు - వేతన సవరణల వలెనే, భాటక సిద్ధాంతాన్ని కూడా రైతాంగ ఆర్థిక వ్యవస్థకు అపాదించడానికి ప్రయత్నించడం గమనించవచ్చు. ఈ రెండు సిద్ధాంతాలతో విధానకర్తలు వాస్తవాలను గ్రహించలేదు. వీటిని తమకు అనుకూలమైన రీతిలో పరిస్థితులను సమర్థించటానికి కంటితుడుపుగా వాడుకున్నారు. భాటక సిద్ధాంతాన్ని గురించి తరువాత మరికొంత చర్చించినప్పటికి, ఈ సిద్ధాంతం భాటకం ధరలను ప్రభావితం చేయదని ధరల వల్లనే భాటకం

ప్రభావితం అవుతుందని ఇక్కడ పేర్కొనడం సముచితంగానే వుంటుంది. ధరలు - వేతనాలు సవరణ మరియు తదనుగుణమైన అంతర్జాతీయ వర్తకంలో సమతౌల్యానికి భాటక సిద్ధాంతాన్ని కూడా చేర్చి భారత రైతాంగానికి అద్భుతమైన కల్పనను, మూఢనమ్మకాన్ని అందించడం జరిగింది. అధికారిక ప్రకటనల పట్ల అంతర్లీనంగా ఉన్న నమ్మకం వల్ల ఈ సిద్ధాంతాన్ని అంగీకరించినా, ఆచరణలో బహిర్గతమయ్యే వాస్తవాలు తెలిసిన వడ్డీ వ్యాపారం ప్రవర్తన రైతు మనసులో అనుమాన బీజాలు తలెత్తియుండ వచ్చు.

భారతదేశానికి సంబంధించి జనాభా ఒత్తిడి, కమతాల విఘటన, వ్యవసాయరంగంలో స్థిరంగా ఉన్న సాంకేతిక పరిజ్ఞానం, భాటకం లేదా రాబడి, రుణ విధానం ధరలను ప్రభావితం చేస్తాయి. ధరలు పెరిగినట్లు రైతాంగం ఆదాయాలు పెరగవు. వాస్తవంగా 19వ శతాబ్ది చివర్లో సంభవించిన వినాశకరమైన కరువు కాటకాలలో నిరుపేద రైతాంగం అనుకోకుండా సంభవించిన ఉపద్రవాన్ని తట్టుకోవటానికి వీలైన వనరులు లేక అలమటించిన స్థితిని బహిర్గతం చేసాయి. భారత దేశ చరిత్రలో గతంలో సంభవించిన క్షామ పరిస్థితులు ప్రాంతీయ పరమైన ఆహారకొరత, ఆహారోత్పత్తిలో మిగులు, కొరత గల ప్రాంతాల మధ్య రవాణా సౌకర్యాలు తగినంతగా లేకపోవడం మరియు దేశంలోని వివిధ ప్రాంతాలలో ఋతు పవన ప్రభావం వేర్వేరుగా ఉండటం వంటి కారణాలవల్ల ఏర్పడితే, ప్రస్తుత కరువు కాటకాలకు ఆహారపదార్థాల అధిక ధరలు, గ్రామీణ జనాభాలోని నిరుపేదలకు తగినంత ఆదాయం లేకపోవడమే అసలు కారణాలని చెప్పవచ్చు. ఎగుమతి బోనస్ సిద్ధాంతం చెప్పిన విషయాన్ని వాస్తవం చేస్తున్నట్లుగా, ఘోరమైన కరువు తాండవిస్తున్న రోజుల్లో కూడా దేశం నుండి భారీ మొత్తంలో ధాన్యం ఎగుమతులు జరిగాయి. కాని, స్వయంచాలక సమతౌల్య సూత్రం మాత్రం పనిచేయలేదు. 19వ శతాబ్దపు రెండవ అర్ధ భాగంలో ముఖ్యంగా 1876లో మారకపు రేటు పడిపోయిన తర్వాత భారతదేశంలో ఆహారధాన్యాల ధరలు క్రమంగా పెరిగాయి. వెండి విలువలో తరుగుదల వల్ల ప్రపంచం వ్యవసాయిక సంక్షోభాన్ని అనుభవిస్తూ ప్రపంచ మార్కెటంతటా ఆహారపదార్థాల ధరలు పడిపోతూవుంటే అందుకు విరుద్ధంగా భారత దేశంలో ధరలు పెరిగాయి, మరియు ఎగుమతి ధరలు స్థిరంగా వున్నాయి. ఇది ఒక ఆసక్తికర పరిణామం. కలకత్తా నుండి గోధుమ మరియు బియ్యం ఎగుమతి ధరలను లండన్ ధరలతో 1873ను ఆధార సంవత్సరంగా స్వర్ణప్రమాణంలో పోల్చిచూసినట్లయితే ముఖ్యంగా లండన్‌లో వెండి ధరలను కూడా పరిశీలనకు తీసుకున్నట్లయితే తేడాను సులభంగా గ్రహించవచ్చు.

| వస్తువు | ప్రాంతం | 1873 | '76 | '79 | '82 | '85 | '88 | '91 | '94 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వెండి | లండన్ | 100 | 89 | 86 | 87 | 82 | 72 | 76 | 49 |
| గోధుమ | కలకత్తా | 100 | 74 | 107 | 85 | 69 | 81 | 92 | 75 |
| గోధుమ | లండన్ | 100 | 79 | 75 | 77 | 56 | 54 | 63 | 39 |
| వరి | కలకత్తా | 100 | 107 | 158 | 84 | 142 | 110 | 138 | 164 |
| వరి | లండన్ | 100 | 99 | 110 | 79 | 83 | 69 | 96 | 90 |

పై సూచీ సంఖ్యలను నిశితంగా పరిశీలించడానికి ముందు ఎగుమతుల స్థాయిని కూడా పరిగణలోకి తీసుకోవాలి. వరి సాంవత్సరిక ఎగుమతులు 1873 కంటె ముందుగానే ఒక మిలియన్ టన్నుకు పెరిగాయి. 1880ల వరకు 1.2 నుండి 1.5 మిలియను టన్నుల మధ్య ఉన్న ఈ ఎగుమతులు 1890 లలో 1.7 మి.టన్నుల గరిష్ఠ స్థాయికి చేరుకున్నాయి. గోధుమల ఎగుమతులకు మారకపు రేటు పడిపోవడానికి ముందు అంతగా ప్రాధాన్యత లేదు. ఆసక్తికర విషయమేమంటే 1876 నుండి 1878 సంవత్సరాల మధ్య కరువు తాండవిస్తున్న రోజుల్లో గోధుమ ఎగుమతులు (మూడు) లక్షల టన్నుల స్థాయికి చేరుకున్నాయి. 1880లలో ఈ ఎగుమతులు అత్యధిక స్థాయికి చేరుకున్నాయి. ఈ కాలంలో అనేక సార్లు ఎగుమతుల స్థాయి ఒక మిలియన్ టన్నుకు చేరుకున్నది. 1888-1891 సంవత్సరాల మధ్య కొంత తగ్గినా 1892లో గరిష్టంగా 1.5 మి టన్నుల మేరకు ఎగుమతులు జరిగాయి. ఆ తరువాత సం॥లలో క్రమంగా తగ్గుతూ 1895లో పూర్వపు 3 లక్షల టన్నుల స్థాయికి చేరుకున్నాయి. గోధుమల ఎగుమతి చాలా త్వరగా విస్తరింపబడటానికి సముద్ర సరకు రవాణా ఛార్జీలు చాలా వేగంగా పడిపోవడం, ఈ ఎగుమతులకు ప్రధాన ఆధారమయిన యూరప్ సూయజ్ కాలువ తెరచిన తర్వాత మరింత దగ్గరకావడం వంటివి దోహదం చేసాయి. వరి ఎగుమతులు హిందూ మహా సముద్రం చుట్టు ప్రక్కల గల ఇతర దేశాలకు అధికంగా జరుగుతుండటం వల్ల ఈ ఎగుమతులు ప్రారంభం నుండి ఎక్కువగాను ఒక క్రమరీతిలో జరగడం గమనించవచ్చు.

ఇక సూచీధరలను ఎగుమతుల స్థాయి , అవి ఎగుమతి చేయబడిన ప్రాంతాలను దృష్టితో వుంచుకొని పరిశీలిస్తే వరి ,గోధుమలకు సంబంధించి భిన్నమైన తరహాను గమనించవచ్చు. 1880ల ప్రారంభంలో మాంద్యాన్ని మినహాయిస్తే వరి ధరలు సాధారణంగా పెరుగుతున్న ధోరణినే కనబరిచాయి. ఈ మాంద్యానికి వరి ఎగుమతుల స్థాయి అతి వేగంగా విస్తరింపబడడమే కారణం. తర్వాత కాలంలో వరి ధరలు మళ్ళీ పుంజుకోవటానికి ఎగుమతులస్థాయి కొంత తగ్గడం వల్లనే అని చెప్పవచ్చు.

బెంగాల్‌లో ధరలు సహితం 1880ల మధ్య కాల మంతా తీవ్రమైన ఒడుదొడు కులకు గురికావడం, ఆ తరువాత 'క్రమంగా' పెరగడం చూడవచ్చు. భారత దేశపు వివిధ ప్రాదేశిక ప్రాంతాలలో ధరల తీరును గురించి ప్రస్తావించినప్పుడు, అంతర్గత ధరల స్వభావాన్ని గురించి చర్చించడం జరుగుతుంది. లండన్‌లో వరికి బంగారం విలువ ఆధారిత ధరల స్థితిని పరిశీలిస్తే 1880ల మధ్యకాలం వరకు ఒడుదుడుకుల పాలయిన రూపాయి విలువ ఆధారిత ధరలకంటె, ఆ తరువాత కాలంలో అతి వేగంగా పెరుగుతున్న వెండి ఆధారిత ధరల కంటె నిలకడగా ఉండటాన్ని కూడా గమనించవచ్చు. వరి ధరలో నిలకడకు, ప్రపంచ మార్కెట్ ఎదుర్కొన్న వ్యవసాయక సంక్షోభం, గోధుమ ధరల సంక్షోభంగా రూపుదాల్చడం, వరి ధరలపై దీని ప్రభావం అంతగా లేకపోవడమే ప్రధాన కారణం. అంతేగాక పరిమిత స్థాయిలోనే గోధుమ, వరి ప్రత్యామ్నాయ ఆహారపదార్థాలు కాగలుగుతాయి. భారత దేశ గోధుమలకు పశ్చిమ దేశంలలో తీవ్రమైన పోటీ ఎదురయింది. 1880ల మధ్య భాగంలో బంగారం విలువలో గోధుమ ధరలు తగ్గిపోతున్నప్పుడు ఎగుమతుల స్థాయిని పెంచేందుకు ఏమాత్రం అవకాశం లభించలేదు. ఇట్లాంటి సందర్భాల్లోనే వెండి కరెన్సీ విలువ తగ్గుతున్నప్పుడు ఎగుమతి బోనస్ ఇవ్వడం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. 1885 మరియు 1888 సంవత్సరాల స్థితిని పరిశీలిస్తే, 'గోధుమల' బంగారం రూపంలో ధర అప్పటికే తక్కువగా ఉన్నా ఇంకా తగ్గుముఖం పడుతుంటే, వెండి ధరలు అతి త్వరగా, అంతకంటె వేగంగా పడిపోవడం ,అదే కాలంలో కలకత్తాలో గోధుమ ధరలు పెరగడం గమనించవచ్చు.

గోధుమ ధరలలో మార్పులకు అనుగుణంగానే ప్రత్తి ధరలు కూడా మారడం చూడవచ్చు. భారత దేశపు అతి ప్రధానమైన వాణిజ్య పంట అయిన ప్రత్తి కూడా అంతర్జాతీయ మార్కెట్‌లో తీవ్రమైన పోటీని ఎదుర్కొన్నది. జనుము విషయంలో భారతదేశం గుత్తాధిపత్యం కలిగి వుండడం వల్ల దీని ధరలు వరి ధరల ధోరణినే అనుసరించాయి. గోధుమ మరియు ప్రత్తి ధరల పోకడలో సారూప్యతతో పాటు లండన్, కలకత్తాలలో వీటి ధరలు 1880ల చివరి దాకా ఒకే రకంగా ఉండగా, 1890లో గోధుమలకు బంగారపు ధరలు తగ్గితే, రూపాయి విలువలో వీటి ధర కొంత మేరకు పెరిగింది. ఇది రెండు రకాల ధరల మధ్య తేడా ఏర్పడటానికి దారి తీసింది.

భారత దేశంలో అంతర్గత ధరలు కేవలం ఎగుమతులకు డిమాండు పెరగడం వల్లనే కాకుండా జనాభా ఒత్తిడి వల్ల కూడా పెరిగాయి. గతంలో ప్రస్తావించినట్లుగానే భారత దేశం నుండి ఆహార పదార్థాలు ఎగుమతి చేయబడినాయంటే, ఆ దేశ ప్రజల అవసరాలకు మించిన మిగులు ఉన్నట్లు భావించడానికి వీలు లేదు. పరాయి పాలకులకు 'నజరాన'గా నిరుపేదల

ఆకలి చావులు సాక్ష్యంగా ఎగుమతి అయినవే తప్ప అవి ఎగుమతి చేయడానికి వీలయినంత మిగులు ఏర్పడటం వల్ల మాత్రం కాదు వస్తువులు వాటంతట అవే బలవంతంగా తరలిపోవు. పాలకులు స్వేచ్ఛా మార్కెట్ వ్యవస్థకు పరిస్థితులను అప్పజెప్పడంలో భారతీయ వర్తకులు మరియు వడ్డీవ్యాపారులు తమ వంతు పని చేయడానికి వీలు కలిగింది. ఈ మార్కెట్ శక్తులన్నీ కలిసి తమ తమ స్వార్ధ ప్రయోజనాలకు అనువుగా తీవ్రమైన క్షామ పరిస్థితులలో కూడా ఆహార ధాన్యాలను ఎగుమతి చేస్తూ గ్రామీణ నిరుపేద రైతాంగ కుటుంబాలలో లక్షల కొలది మరణాలకు కారకులయ్యారు. ఎగుమతి బోనస్ ఆశ, ఆహారపధార్ధాలకు పెరుగుతున్న డిమాండు రెండూ దేశం అంతటా రైల్వేల ద్వారా సరకు చేరవేయడం ఊపందుకున్నది. ధరలు పెరుగుతున్నప్పటికి దాదాపు అంతటా ఒకేరకంగా ఉండేందుకు ఇది దోహదపడింది. 1880ల మధ్య కాలానికి పూర్వం దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య ముఖ్యంగా ఉత్పత్తి సాధించే ప్రాంతాలకు కేవలం ఆ ఉత్పత్తులను వినియోగించుకొనే ప్రాంతాల మధ్య ధరలలో చాలా తేడాలుండేవి. ప్రధానంగా వరి పండించే బెంగాల్‌లో 1860 నుండి 1880 సంవత్సరాల మధ్య ధాన్యం ధర ప్రతి రూపాయికి 26 నుండి 13 'సీర్'ల మధ్య ఊగిసలాడింది. ప్రధానంగా గోధుమ పండిస్తూ, ఆ కాలంలో వరిని ఇతర ప్రాంతాలనుండి దిగుమతి చేసుకుంటున్న, పంజాబ్‌లో ధాన్యంధర రూపాయికి 12 నుండి 8 సీర్' ల మధ్య హెచ్చు రేటులో కొనసాగింది. 1885 తర్వాత బెంగాల్‌లో కూడా ధాన్యం ధరలు చాలా స్పష్టంగా మరియు క్రమంగా పెరగడాన్ని గమనించవచ్చు. ధాన్యం ధర బెంగాల్‌లో రూపాయికి 19 నుం ॥ సీర్‌ల మధ్య, పంజాబ్‌లో ఇంకా హెచ్చు రేటులో 11 నుండి 9 సీర్‌ల మధ్య తక్కువ ఒడుదొడుకులతో నిలకడగా కొనసాగింది. బెంగాల్, పంజాబ్‌ల పరిస్థితికి మధ్యస్తంగా ఉండే ఔధ్ మరియు వాయువ్య ప్రాదేశిక ప్రాంతాలను కూడా పరిశీలిస్తే 1885కు ముందు ప్రతి రూపాయికి 22 నుండి 12 'సీర్‌ల మధ్య, 1885 తర్వాత అధిక స్థాయిలో రూపాయికి 16 నుండి 9 సీర్‌ల మధ్య ధాన్యం ధరలు ఎంతో కొంత ఊగిసలాటతో కొనసాగడం చూడవచ్చు. దేశంలో అన్ని ప్రాంతాలలో ఒకే రకమైన ధర కోసం ప్రయత్నం జరుగుతున్న రోజుల్లో ఔధ్ ప్రాంతంలో సాధారణంగా ధాన్యం ధరలు చౌకగానే ఉన్నాయి. ఆగ్రా కంటె ఔధలో ప్రతి రూపాయికి అదనంగా ఒక సీర్ లభించేది.

20వ శతాబ్దంలో ధరలు మరింత పెరిగాయి. భారత దేశం ప్రపంచ మార్కెట్‌కు మరింత చేరువయింది. వాణిజ్య పంటల సాగుపెరిగింది. ప్రపంచ మార్కెట్‌లోని ఆశాజనకమైన ధరలకు వాణిజ్య పంటల స్పందన బాగా స్పష్టంగా కనిపించింది. తగు నీటి వసతి లేదా ఖచ్చితమైన వర్షపాతం అందుబాటులో ఉన్న మంచి సారవంతమైన భూములను

వాణిజ్య పంటలు పండించటానికి కేటాయించబడటాన్ని సహజంగా గమనించవచ్చు. వాణిజ్య పంటలు పండించే సాగు భూమి విస్తీర్ణం వాటి ధరలలో వచ్చే మార్పుల వల్ల ప్రభావితం అయితే, ఆహార పంటలు పండించే భూమి వర్షపాతం స్థాయిని బట్టి నిర్ణయించబడుతుంది. వాణిజ్య పంటలకు అధిక ధరలు, వర్షపాతం అంతంత మాత్రంగా ఉండటం కారణంగా ఆహారపంటలు పండించే విస్తీర్ణం తగ్గి, ఫలితంగా వాటి ధరలు పెరిగే అవకాశం ఉన్నది. వీటన్నిటి వల్ల ప్రధాన ఆహార పంటలయిన వరి, గోధుమల ఉత్పత్తిలో ఒడుదొడుకులను చూడవచ్చు. బీహార్, పశ్చిమ బెంగాల్‌లలో వ్యవసాయ కార్యకలాపాలు తగ్గు ముఖం పట్టడం వల్ల వరి పండించే ప్రాంతం నిలకడగా ఉంది. వ్యవసాయం మందకొడిగా కొనసాగటానికి అడవులు అంతరించిపోవడం, వర్షపాతం సాధారణంగా తగ్గిపోవడం వంటివి ముఖ్యకారణాలుగా చెప్పుకోవచ్చు. వీటితో పాటు ఆ ప్రాంతంలోని భూస్వామ్య పద్ధతుల ప్రభావం కూడా ఉన్నది. మద్రాస్ రాష్ట్రంలో మాత్రమే వరి పండించే ప్రాంతం విస్తరించబడటం చూడవచ్చు. 20వ శతాబ్దపు మొదటి దశాబ్ది కాలంలో దాదాపు 30 శాతం భూమిలో అదనంగా వరి పండించడం గమనించవచ్చు . దక్షిణానికి ఈ పెరుగుదల వరి ఉత్పత్తిలో ప్రధాన పాత్ర వహించే దేశపు తూర్పు ప్రాంతాలలో స్తబ్దతను తొలగించేంత ప్రత్యామ్నాయం కాలేకపోయింది. ధాన్యం ధరలో క్రమమైన పెరుగుదల ధోరణి కన్పించడమే కాక, రెండు దశాబ్దాల కాలం ఈ ధరలు రెట్టింపు అయినాయి. ఇందుకు భిన్నంగా గోధుమ పండించే ప్రాంతం ఈ శతాబ్దపు మొదటి దశాబ్ది కాలంలో 10 శాతం పెరిగింది. గోధుమ ఎకరా దిగుబడి కూడా ముఖ్యంగా పంజాబ్‌లో పెరిగింది. గోధుమ ధరలు కూడా వరికి దాదాపు సమానస్థాయిలో పెరిగినా, గోధుమ ధరలు, వరికంటె సహజంగా తక్కువగానే ఉన్నాయి. వరి, గోధుమ తర్వాత స్థాయికి చెందిన జొన్న, సజ్జలవంటి తృణధాన్యాలు ప్రత్తినుండి పోటీ ఎదుర్కోవలసి వచ్చింది. కాని, వాటి సాగుభూమిలో దాదాపు మార్పులేదని చెప్పవచ్చు. వీటి ధరల మధ్య కూడా పెద్దగా తేడాలు లేవు. వీటి ధర సహజంగా గోధుమ ధర కంటె చాలా తక్కువగానే ఉండేది. 1919లో యుద్ధానంతర పరిస్థితుల వల్ల అతి కొద్ది కాలం వరి, గోధుమల వలె ఖరీదయినవిగా మారినప్పటికి, చాలా వరకు వాటి ధరలు సాధారణ స్థాయిలోనే కొనసాగాయి. అనూహ్యమైన మార్పులు చోటు చేసుకోలేదు.

ఆర్థిక మాంద్యం తీవ్రత ధరల స్థాయి పెరుగుతూ వుండే సాధారణ క్రమాన్ని ఊహించని రీతిలో తలక్రిందులు చేసింది. వ్యవసాయిక సంబంధాలు కూడా దెబ్బతిన్నాయి. వీటిని గూర్చి తరువాత పరిశీలించడం జరిగింది. ఈఘాతుకమైన మార్పును క్రింది పట్టికలో ఇచ్చిన సూచీ సంఖ్యలు మరింత స్పష్టంగా తెల్పుతున్నాయి.

| ఆహార ధాన్యాల ధరల సూచీ సంఖ్యలు ( 1900 = 100) | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పంట | 1901 | 1903 | 1905 | 1907 | 1909 | 1911 | 1913 | 1915 | 1917 | 1919 |
| వరి | 105 | 93 | 98 | 134 | 129 | 116 | 149 | 144 | 125 | 208 |
| గోధుమ | 91 | 73 | 80 | 95 | 115 | 87 | 100 | 129 | 116 | 193 |
| జొన్న | 68 | 54 | 66 | 78 | 85 | 76 | 91 | 97 | 93 | 211 |

| పంట | 1921 | 1923 | 1925 | 1927 | 1929 | 1931 | 1933 | 1935 |
|---|---|---|---|---|---|---|---|---|
| వరి | 207 | 180 | 206 | 215 | 196 | 110 | 89 | 101 |
| గోధుమ | 204 | 202 | 167 | 151 | 149 | 71 | 86 | 80 |
| జొన్న | 189 | 104 | 137 | 141 | 142 | 64 | 70 | 76 |

మాంద్య పరిస్థితులు గోధుమ , జొన్నల ధరలను సూానికి సగం తగ్గించివేసాయి, 1900 నాటి ప్రాథమిక స్థాయికంటె కూడా వీటి ధరలు పడిపోయాయని పై పట్టికను పరిశీలిస్తే తెలుస్తుంది. చాలాకాలం వరకు ఈ ధరలు తిరిగి పుంజుకోలేదని కూడా గమనించవచ్చు; ధరలు పెరగటం, పడిపోవటం రెండూ చాలా స్వల్పకాల వ్యవధిలోనే జరిగాయి. 1917లో మధ్యస్తంగా ఉన్న ధరల స్థాయి 1919లో అతిగా పెరిగి, 1920లలో దాదాపు అదేస్థితిలో కొనసాగి 1930లలో అదే వేగంతో పడిపోవడం, ఈ మొత్తం తతంగాన్ని ఒకే తరం అనుభవించడం విచిత్రమైన పరిస్థితిగా చెప్పవచ్చు ,ధరలు వేగంగా పెరగటం గాని తగ్గటంగాని భారతీయ రైతాంగ వ్యవసాయ పరిస్థితులకు ఏమాత్రం సంబంధం లేనివిగా చెప్పవచ్చు. తన కుటుంబ కనీస జీవన స్థాయి కోసం మాత్రమే శ్రమించే గ్రామీణ రైతు ద్రవ్య వ్యవస్థతో అతి పరిమిత సంబంధం కలిగివున్నాడు. ఈ ధరలలోని హెచ్చు, తగ్గులు అతని ఆర్థిక పరిస్థితులను, ఆర్థిక ప్రవర్తనను గాని ప్రభావితం చేయలేకపోయాయి. అదే విధంగా తన ఆర్థిక ప్రవర్తనను వెంటనే మార్చుకోవడం ద్వారా ఈ పరిస్థితులకు అతను తోడ్పడ లేదు కూడా. 1920లలో జనాభా పెరుగుదల ప్రభావం మరోసారి స్పష్టమయింది. దాదాపు రెండు దశాబ్దాల సాపేక్ష స్తబ్దత తర్వాత ఈ ఏర్పడిన పెరుగుదలకు అనుగుణంగా సాగుభూమి పెరగకపోవడంతో ధరల స్థాయి నెమ్మదిగా , క్రమంగా పెరగడం గమనించ వచ్చు. ధరలు అతిగా పెరగటానికి ఆహార పంటలు పండించే విస్తారమైన భూమి వాణిజ్య పంటలకు తరలించబడటమే కారణమని భావించనట్లయితే ధరలు తగ్గడానికి వాణిజ్య పంటలు పండించే భూమి విస్తీర్ణం తగ్గిపోయి, ఆహార పంటలు పండించే భూవిస్తీర్ణంతో పాటు ఉత్పత్తి పెరగటం కూడా కారణమని

అంగీకరించక తప్పదు. దీన్ని పరిశీలించటానికి ధరలు అతిగా పెరిగిన ,వేగంగా తగ్గిన కీలకమైన సంవత్సరాలలో వివిధ పంటల క్రింద సాగుఅవుతున్న భూమి విస్తీర్ణాన్ని గమనించాల్సి వుంటుంది.

**బ్రిటిష్ ఇండియాలో వివిధ పంటల క్రింద భూవిస్తీర్ణం**

| పంట | 1917 | 1919 | 1921 | 1929 | 1931 | 1933 |
|---|---|---|---|---|---|---|
| | | | వేల ఎకరాలలో | | | |
| వరి | 69863 | 68053 | 68989 | 66536 | 68774 | 67503 |
| గోధుమ | 26359 | 23438 | 22314 | 24669 | 25249 | 27527 |
| జనుము | 2700 | 2800 | 1506 | 3310 | 1847 | 2492 |
| ప్రత్తి | 15092 | 14834 | 11314 | 15771 | 14231 | 14019 |
| వేరుశనగ | 1654 | 1292 | 1755 | 4442 | 3818 | 5309 |

ఆహార ,వాణిజ్య పంటల మధ్య భూవిస్తీర్ణం మార్పులను, ముఖ్యంగా గోధుమ, ప్రతి మధ్య మాంద్య కాలంలో జరిగిన మార్పులను చూడవచ్చు. గోధుమ భూవిస్తీర్ణం 2 మిలియన్ ఎకరాలు పెరిగితే, ప్రత్తి పండించే ప్రాంతం 1.5 మిలియన్ ఎకరాలు తగ్గింది. ప్రాంతీయ గణాంక సమాచారాన్ని మరికొంత నిశితంగా పరిశీలిస్తే ఏఏ ప్రాంతాల్లో ఈ మార్పులు జరిగాయో కూడా స్పష్టంగా తెలుస్తుంది. మధ్య భారత ప్రాదేశిక ప్రాంతాల్లో ప్రత్తి పండే ప్రాంతం 1929, 1933ల మధ్య 5.2 మిలియన్ ఎకరాల నుండి 4.3 మి ఎకరాలకు తగ్గితే, ఇదే కాలంలో గోధుమ పండించే భూమి 3 మి. ఎకరాల నుండి 3.4 ఎకరాలకు పెరిగింది. భారత దేశం పరిస్థితిని మొత్తంగా పరిశీలించినపుడు మార్పులే ప్రధాన కారణమని వివరించదగినంత స్థాయిలో లేవని చెప్పవచ్చు. ద్రవ్య సప్లయ్, మార్కెట్ వ్యవసాయరంగానికి అందుబాటులో ఉన్న పరపతి మొత్తంల ప్రభావం ఆధారంగానే ధరల స్థితిని గమనించాల్సి వుంటుంది. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన వెంటనే ధరలు పెరగడానికి దేశంలోనికి కొత్తగా వెండి భారీగా చేరడం, అది ద్రవ్యం చలామణిని పెంచడం ప్రధాన కారణంగా పేర్కొనవచ్చు. ప్రపంచ మార్కెట్‌లో ధరలు పడిపోతూ రూపాయి మారకం రేటు తగ్గుతున్నప్పటికి దేశంలో ఆహార ధాన్యాల ధరలు పెరుగుతుండటానికి కూడా ఇదే కారణమని చెప్పవచ్చు. ఈ కాలంలో పరపతి కూడా చాలా సులభంగా లభించింది. కాని, మాంద్య పరిస్థితులు చోటు చేసుకున్న తర్వాత వడ్డీ వ్యాపారులు కొంత గందరగోళానికి గురయినారు. అప్పులివ్వడం మానివేసి అప్పులు వసూలు చేసుకోవడంలో అతృత చూపారు. ద్రవ్యోల్బణ పరిస్థితులు కొనసాగిన రోజుల్లో పరిస్థితులు ఎంత ముమ్మరంగా మారాయో అందుకు ప్రతిగా

ప్రతి ద్రవ్యోల్బణ కాలంలో కూడా అంతే వేగంగా పరిస్థితులు మారాయి. ఈ స్థితి మనకు ప్రధాన రుణదాతలయిన బ్రిటిష్ వారికి అనుకూలంగా మారింది. రూపాయి మారకపురేటు కృత్రిమంగా హెచ్చుస్థాయిలో నిలబెడుతూ భారతదేశం నుండి బంగారాన్ని తరలించుకపోయారు. భారతీయ కరెన్సీలో వచ్చిన ఒడదొడుకుల వల్ల ఏర్పడిన్న ద్రవ్యోల్బణ, ప్రతిద్రవ్యోల్బణ ప్రభావాలకు వెంట వెంట ప్రభావితం అయ్యారు. ఈ పరిణామాలు మొత్తంగా వ్యవసాయ సంబంధాలమీద తీవ్ర ఒత్తిడి కలుగజేసింది. ద్రవ్యోల్బణ కాలంలో పెరుగుతున్న ధరలు, భూస్వాములు భాటకాన్ని పెంచడానికి లేదా చట్టబద్ధంగా ఇది వీలు కానప్పుడు అక్రమంగా కౌలుదార్ల నుండి సెస్సు రూపంలో వసూలు చేయడానికి ప్రోద్భలం చేసాయి. భాటకాన్ని పెంచడంలో భూస్వాములు విజయం సాధించే సరికల్లా ఆర్థిక మాంధం వల్ల పరిస్థితులు పూర్తిగా మారి పోయాయి. కౌలుదా[illegible]కు ఇటుగాని స్థితిలో కొత్తగా అప్పు పొందడంగాని, తీసుకున్న అప్పును తీర్చడం వీలుకాని పరిస్థితి ఎదురయింది. వడ్డీ వ్యాపారులు భూస్వామి కౌలుదారును ఒత్తిడి చేయడంతో సమస్యలను అధిగమించలేని సంకట స్థితి ఏర్పడింది. భూస్వామి. కౌలుదార్ల మధ్య ఘర్షణ వైఖరి ఏర్పడింది. భూయజమానికి, కౌలుదారుకు మధ్య సమతూకాన్ని కాపాడుతూ తమ రాబడిని పెంచుకోవాలనుకున్న బ్రిటిష్ వారు తమ ఆర్థిక విధానాల ఫలి[illegible]గానే ఈ సమతూకాన్ని దెబ్బతీసారు.

మూడవ అధ్యాయం

# శిస్తు , ఆస్తి

## భూమి శిస్తు పద్ధతులు : సంప్రదాయ నవీన పద్ధతులు

భూమి ద్వారా వచ్చే రాబడి భారతదేశంలో ప్రభుత్వ విత్త వనరులకు సంప్రదాయకంగా ప్రధాన ఆధారంగా నిలిచింది. ప్రతి పాలకులు రెవెన్యూ పాలన సంబంధమైన సిద్ధాంతపరమైన, ఆచరణపరమైన అంశాలకు అధిక ప్రాధాన్యత ఇచ్చారు. బ్రిటిష్‌వారు కూడా ఈ పద్ధతిని వారసత్వంగా స్వీకరించారు. వారి పరిపాలనా విధానాన్నే ఇది ప్రభావితం చేసింది. బ్రిటిష్‌వారి పాలనా కాలంలో వివిధ ప్రాంతాలలో భూమి శిస్తు పద్ధతులు వేర్వేరుగా ఉండటానికి, ఆయా ప్రాంతాలను బ్రిటిష్ వారు తమ ఆధీనంలోకి తెచ్చుకొనే సమయానికి అక్కడ ఉన్న రాజకీయ పరిస్థితులే కారణమని చెప్పవచ్చు. బ్రిటిష్ వారి సిద్ధాంతాలే వేద శాసనాలుగా ప్రాధాన్యం పొందడం వల్ల చారిత్రికమైన ఈ తేడాలను విస్మరించారు. బ్రిటిష్‌పాలకులు ఇందుకు సంబంధించి అద్భుతమైన సమాచారాన్ని పొందుపరిచారు. నూతన భూమి శిస్తు పద్ధతులను రూపకల్పన చేయడంలో తమ ప్రాముఖ్యాన్ని చాటుకునేందుకు, ''భావి తరాలకు ఇందుకు సంబంధించిన సాక్ష్యాధారాలను'' ఈ రూపంలో మిగిల్చారు. వారి వ్రాతలు, చేతలకు ప్రతిరూపాలవలె, వీరి సిద్ధాంతీకరణలో నూతన భావ జాలం పుట్టుకొచ్చింది. వారి స్వంత పరిజ్ఞానానికి, నిరంకుశ విధానాలకు ఖచ్చితమైన ఆమోదముద్ర వేయించుకున్నారు. భూమి శిస్తు నిర్వాహణకు సంబంధించి గత ప్రభుత్వాలకాలంలో పనిచేసిన సిబ్బందినే వీరూ ఉపయోగించుకున్నారు. సిబ్బందికి సిద్ధాంత పరమైన అంశాలతో, వాటి ప్రభావాలతో సంబంధం లేదు. పై స్థాయిలో ఉన్న అధికార గణం కను సన్నలలో మెలగడం, ఏ పని చేసినా పై వారి మెప్పు పొందడం, వారి ఆలోచనలకు అనుగుణంగా పనిచేయడమే ఈ సిబ్బందికి తెలిసిన సిద్ధాంతం. అధికార గణాన్ని సంతృప్తి పరచగలిగినంత కాలం కింది స్థాయి సిబ్బంది ఏ పద్ధతులలకు తమ పనులు చేస్తున్నారనేది కూడా ముఖ్యం కాదు.

తమకు కెటాయించబడిన రెవెన్యూ ప్రాంతం శిస్తు చెల్లింపు సామర్థ్యం ఎలాంటిదైనా, ఆ ప్రాంతం మీద పూర్తి ఆధిపత్యం సాధించటం, శిస్తు నిర్ధారించడానికి వీలైన వారిని గుర్తించడం, చివరగా వారినుండి శిస్తు వసూలు చేయడం వంటివి రెవెన్యూ యంత్రాంగం యొక్క మౌలిక విధులు. దేశీయ పాలకులు భూమి శిస్తు మదింపు, సర్వే, శిస్తు నిర్ధారణ, వసూళ్ళకు రక రకాల పద్ధతులు అనుసరించారు. అధికారకేంద్రానికి దగ్గరలో ఉన్న ప్రాంతాలలో పద్ధతుల ద్వారా దూరంగా ఉన్న సామంత రాజ్యాలలో రెవెన్యూ యంత్రాంగం ఈ వ్యవహారాలపై అంతగా ఆసక్తిలేని వర్తకులపైన కాకుండా మధ్య దళారీలతో ఒప్పందాలు కుదుర్చుకోవడం

ద్వారా ఈ కార్యక్రమాలను పూర్తి చేసేవారు. ప్రత్యక్ష నిర్వాహణ ఉన్న ప్రాంతాలలో మంత్రాంగం రైతాంగానికి సాధ్యమయినంత దగ్గర కావాడానికి వారి భూములను కొలవడానికి, మదింపు చేయడానికి ప్రయత్నించేవారు. వసూలు చేసిన రాబడి మొత్తంలో జాగీర్దార్‌కు వేతన రూపంలో చెల్లించాల్సివున్నా, సర్వే, మదింపు, నిర్ధారణ-వంటి పనులను సామ్రాజ్యవాద దేశపు అధికారులే నిర్వర్తించేవారు . మొగలుల, మహారాష్ట్రుల రెవెన్యూ పద్ధతిలోని కొన్ని అంశాలను క్లుప్తంగా పరిశీలిస్తే తత్సంబంధమైన సాంప్రదాయిక వ్యవహారాలు అవగతమవుతాయి. మొఘలాయిల విధానం అక్బర్ సామ్రాజ్య విస్తరణ వల్ల ప్రభావితమయింది. అంతకు ముందు 'షేర్‌షా' విధానం అమలులో వుండేది. సమర్థుడైన షేర్‌షా పాలనలో ఆనాడే అత్యధిక ఉత్తర భారతదేశంలో రైతాంగం భూస్థాయిని బట్టి నగదు రూపంలో భూమి శిస్తు నిర్ణయించబడింది. ఉత్పత్తిలో మూడవ వంతు శిస్తుగా నిర్ణయించడమే కాక ఆ సంవత్సరపు ధరలలో హెచ్చు తగ్గులను బట్టి ఈ శిస్తును మార్చడం కూడా జరిగింది. అక్బర్ కూడా ఈ విధంగానే పాటించినప్పటికి విశాలమైన ఇతని సామ్రాజ్యంలో, ఆయా స్థానిక ప్రాంతాల ధరల్లో ఉండే తీవ్రమైన తేడాలవల్ల క్రమంగా ఈ పద్ధతిని అమలు చేయడం కష్టతరమైంది. దీంతో అక్బర్ భూమి శిస్తు పద్ధతిని వికేంద్రీకరణ చేసాడు. వీటిని ' ' కానుంగో రేట్లుగా వ్యవహరించారు. ఆయా ప్రత్యేకకేంద్రాలలో నియమింపబడే గణకులు ఆ ప్రాంతపు వ్యవసాయోత్పత్తి వివరాలను, స్థానిక ధరలను, అంతకు ముందు జరిగిన రెవెన్యూ మదింపుకు సంబంధించిన అన్ని విషయాలను సమగ్రంగా పొందుపరిచేవారు. ప్రభువుల ప్రత్యక్ష పాలన క్రింద ఉన్న భూమికి సంబంధించి ఈ కార్యక్రమాన్ని రెవెన్యూ మంత్రిత్వశాఖ నిర్వహించేది. జాగీర్దార్లకు కేటాయించబడిన భూమి విషయంలో కొన్ని ఇబ్బందులు ఎదురయ్యేవి. ఈ జాగీర్దార్లు స్థానిక సమాచారాన్ని సక్రమంగా అందించడానికి అంతగా ఆసక్తి చూపేవారు కాదు. అట్లాంటి సమాచారం వల్ల తమ పరిధిలోని భూమిపై ఖచ్చితమైన మదింపు, ఎలువ నిర్ధారణ జరగడాన్ని వారు అంతగా ఇష్టపడలేదు. ఈ పరిస్థితులల్లో అక్బర్, జాగీర్దార్లకు నగదు వేతనాలు నిర్ణయించి స్వాధీనం చేసుకున్న భూములపై రెవెన్యూ కలెక్టర్లను నియమించడం ద్వారా జాగీర్దార్లకుండే అధికారాలను తాత్కాలికం చేసాడు. స్థానిక పరిస్థితులకు, మారిన రెవెన్యూ విధానానికి మధ్య సరిగా పొంతన కుదరక కొత్త సమస్యలు తలెత్తాయి. శిస్తును స్థానిక ధరల ఆధారంగా నిర్ధారించినా, అంతిమ నిర్ణయం యుద్ధభూమిలో ఉన్నా చక్రవర్తి చేతుల్లో వుండేది. అక్బర్ దీని స్థానంలో నూతన విధానాన్ని ప్రవేశపెట్టాడు. నూతన పద్ధతి ప్రకారం 10 సంవత్సరాల వ్యవసాయోత్పలి, వాటి ధరల సగటు ఆధారంగా శిస్తు నిర్ణయించబడింది. కానుంగోల ద్వారా ఈ విధానం అమలులోకి రాక ముందున్న పది సంవత్సరాల సమాచారాన్ని సేకరించేవారు. గత కాలపు మదింపు, వసూళ్ళలో అనుభవంతో ఆయా స్థానిక ప్రాంతాల ఉత్పాదన సామర్థ్యపు అంచనాలను కూడా గమనంలోకి తీసుకొనే వారు. ఆయా ప్రాంతాలను వాటి భౌగోళిక

సారూప్యతను బట్టి మదింపు మండలాలుగా విభజన చేసారు. జాగీర్దార్లు శిస్తు మదింపు చేయడానికి కూడా ఈ పద్ధతినే అనుసరించారు. మొఘలాయిల రెవెన్యూ పరిపాలన మొత్తానికి ఈ పద్ధతే వెన్నెముకగా నిలిచింది. ఈ విధానంలో శిస్తు మదింపుకు, వసూలయిన మొత్తానికి సారూప్యత లేకపోవడం గమనించవచ్చు. మొగులాయి పాలకులు కూడా ఈ వాస్తవాన్ని గమనించారు. ఉత్పత్తి , ధరల సగటు ఆధారంగా శిస్తు నిర్ధారించే పద్ధతికి రాజ్యంలోని మధ్య ప్రాంతాలకే పరిమితమై ఉండేది. కొత్తగా ఆక్రమిత ప్రాంతాలలో లేదా రాజ్యపు చివరి ప్రాంతాలలో భూమి శిస్తు వారి వారి స్వంత పద్ధతులలో నిర్ధారణ (నసాక్) చేసేవారు. మదింపుకు సంబంధించి అందుబాటులో వుండే ఏ సమాచారాన్నైనా ఉపయోగించేవారు. నసాక్ అనే భావన గత అంచనాల ఆధారంగా నిర్ణయించబడిన శిస్తు రేట్లను కొనసాగించడాన్ని సూచించడంతో స్థానిక ప్రాంతాల లేదా అన్ని సామంత మండలాల సంక్షిప్త శిస్తు నిర్ధారణ అనే అర్థాన్ని కూడా ఇస్తుంది. ఈ రకమయిన సందిగ్ధంకిగల నసాక్ అనే భావనకు బదులుగా 'నిర్ధారణ' అనే ఆంగ్ల భావనను ఉపయోగించినప్పటి ఈ భావనకూడా సందిగ్ధతను తొలగించ లేకపోయింది. బ్రిటిష్ వారు ప్రారంభంలో ఈ భావనను వాడారు. సర్వే మరియు మదింపు అంతగా సాధ్యంకాని రోజుల్లో ఈ బాధ్యతలను అప్పగించడంలోనూ, నిర్వాహణలోను ఊహాజనితంగానే వ్యవహరించారు. భూమిశిస్తు నిర్ధారణకు ప్రత్యేక అధికారులు నియమింపబడి వారు వాస్తవంగా సర్వే నిర్వహించి, రెవెన్యూ మదింపు చేసిన రోజుల్లో కూడా ఈ సందిగ్ధత మరికొన్ని ఇబ్బందులను సృష్టించింది. మొఘలుల రెవెన్యూ విధానం నిశితంగా పరిశీలించిన వారికి ఆ భావజాలంలోని అస్పష్టత మరింత అవగతమవుతుంది.

మరాఠీ పాలకుల రెవెన్యూ పద్ధతులు మొఘలులు ఆచరించినదానికన్నా చాలా రకాలుగా భిన్నమైనవని చెప్పవచ్చు. వీరి ఆచరణ షేర్‌షా మూల విధానానికి చాలా దగ్గరగా ఉన్నదని చెప్పవచ్చు. అక్బర్ కాలంలో జరిగిన మార్పులకు వీరు చాలా దూరంగా ఉన్నారు. పంట భూస్వామ్యం (crop sharing) పద్ధతిని ఆధునికీకరించడానికి మరాఠులు ప్రయత్నించారు భూసారాన్ని బట్టి నిర్ణయించే ఉత్పాదనా సామర్థ్యం ఆధారంగా భూములను వర్గీకరించారు. విలువ నిర్ణయించడంలో ' అణాలకు' సమానంగా గుర్తించబడిన రూపాయిని ప్రాతిపదికగా తీసుకున్నారు. పంటమార్పిళ్ళ అంచనాలు అందిన వెంటనే ప్రతి ఏటా వాస్తవ మదింపులను ప్రకటించేవారు. పంట భాగస్వామ్యం ఏ అనుపాతంలో ఉండాలో ముందుగానే నిర్ణయించబడినా సమగ్రమైన నిర్ధారణ మాత్రం వాస్తమైన పంట దిగుబడిపై ఆత్మ విశ్వాసంతో కూడిన అంచనాల ద్వారానే జరిగేది. అంటే మరాఠా పాలకులు ఆయా సంవత్సరాల లోని బుతుపవన సంబంధమైన అంచనాలపై ఆధారపడితే, మొఘలులు దశాబ్దకాలపు సగటు వివరాలపై ఆధారపడినారని చెప్పవచ్చు.

పైన వివరించిన రెండు పద్ధతులలో ప్రయోజనాలతో పాటు లోపాలు కూడా ఉన్నాయి. మొగలాయిల పద్ధతి సక్రమంగా అమలుజరిగిన చోట రెవెన్యూ ఆదాయాన్ని ముందుగా అంచనా వేయడం వీలయ్యేది. మారాఠాలు అనుసరించిన పద్ధతిలో ఈ ఆదాయం కాల ప్రభావాన్ని బట్టి ఒడుదొడుకులకు లోనయ్యేది. మొఘలాయిల విధానంలో మదింపు చేసిన మేరకు వసూళ్ళు కాకపొయ్యేవి. మరాఠా పాలకులు ప్రతి సంవత్సరం ఋతువుల ప్రభావాన్ని ఆధారం చేసుకొని శిస్తు మదింపు చేయడం వల్ల, ఆ మొత్తానికి దాదాపు సమానంగా వసూళ్ళు కూడా ఖచ్చితంగా జరపడంలో యంత్రాంగం విజయవంతమయ్యేది. మొఘలాయి పాలకులు రెవెన్యూ మదింపు తమ బాధ్యతగా స్వీకరించి, దాని వసూలు బాధ్యత అప్పగించిన వారికే వదిలివేసారు. రెండు బాధ్యతలు తమవిగా గుర్తించి, అమలు పరచిన మరాఠుల పద్ధతిలో బహుశ రెవెన్యూ అధికంగా సమకూరి ఉండవచ్చు. ఏరకంగా చూసినా ఈ రెండు పద్ధతులలో రెవెన్యూ ఆదాయంలో వాస్తవమైన హెచ్చుతగ్గులు ఎంతో కొంత దగ్గరగానే కన్పిస్తాయి.

మొఘలాయిల ప్రత్యక్ష నియంత్రణ తగ్గిపోయిన ప్రాంతాలలో శిస్తు వసూలు చేసే అధికారం అత్యధిక వెలపాడిన వారికి ఇచ్చే పద్ధతి చోటు చేసుకున్నది. దీని వల్ల పాలకులకు రెవెన్యూ మదింపు చేయడంలో, వసూళ్ళలో ఉండే ఇబ్బంది తొలగిపోయింది. బెంగాల్ నవాబుల్లో చాలా వరకు ఈ ప్రమాదకరమైన పద్ధతి అమలు పరిచారు. కొన్ని ప్రాంతాల్లో మొఘలు జాగీర్దార్ల విధానాలు కూడా ఆచరింపబడినాయి. ఈ నవాబులు స్వతంత్రంగా కేంద్ర పాలకులతో సంబంధం లేకుండా స్వంతంగా భారీగా ఆదాయాన్ని ప్రోగుచేసుకోగలిగారు. బెంగాల్‌ను తమ ఆధీనంలోకి తెచ్చుకున్న బ్రిటిష్ వారు కూడా పూర్వీకుల అడుగుజాడల్లో ఇదే పద్ధతిని అనుసరించారు. బ్రిటిష్ మరికొంత తెలివిగా మధ్యవర్తులతో శాశ్వతమైన ఒప్పందాలు కుదుర్చుకున్నారు. నిర్ధారించిన రెవెన్యు మొత్తాన్ని ఎగవేసే వారి ఆస్తులను వేలం వేయడానికి కూడా వెనకాడక అందుకు సంబంధించిన శాసనాన్ని శక్తి వంతంగా ఉపయోగించేవారు. వేలం పాడిన వారు తమ అధికారాన్ని సక్రమంగా నిర్వర్తించనట్లయితే వారి స్థానంలో మరొకరికి అవకాశం ఇచ్చేవారు. అయితే భూమి శిస్తు ద్వారా వచ్చేరాబడిని శాశ్వత స్థాయిలో నిర్ధారించడంవల్ల, ఆ మొత్తం అప్పటి పరిస్థితుల్లో అధిక స్థాయిలో ఉన్నప్పటికీ అందులో మధ్య వర్తులకున్న లాభం దృష్ట్యా వేలం పాడటానికి అత్యధికులు ముందుకు వచ్చేవారు.

యుద్ధం వల్ల, వ్యాపార విస్తరణ వల్ల అధికరాబడి కోసం ఆతృతగా ఎదురుచూస్తున్న బ్రిటిష్ వారికి ఈ ఏర్పాటు అద్భుతమైన అవకాశాన్నిచ్చింది. అయితే ఈరకమయిన శాశ్వత పద్ధతి రాబడిని పెంచుకోడానికి అవరోధమని తర్వాతి కాలంలో గుర్తించారు. వీరి అధికారం పటిష్టమైన తర్వాత 1793లో ఏర్పాటు చేసుకున్న దాని కంటే అధిక మొత్తంలో బెంగాల్ నుండి పిండుకోవాలని అకాంక్షించారు. ఇదే కాలంలో పాలనాయంత్రాంగం ప్రత్యక్షంగా

వ్యవహరించే దేశంలోని ఇతర ప్రాంతాలలో రెవెన్యూ ఏరకంగా మదింపు చేయబడేదో తెలుసుకున్నారు. టిప్పుసుల్తాన్ ప్రాబల్యం క్రింద ఉన్న దక్షిణ భారత దేశాన్ని తమ పాలన క్రిందకు తెచ్చుకొని, అదే అడుగుజాడల్లో రెవెన్యూ పరిపాలన నిర్వహిస్తూ, ఔథ్ నవాబు ఆధీనంలోని కొన్ని ప్రాంతాలను తమ ప్రత్యక్ష పాలన ఏర్పరచుకున్న తర్వాత ఈ మార్పులను గమనించగలిగారు. ఔథ్ నవాబు మొఘలాయిల పద్ధతులకు కొంత దగ్గరగా వ్యవహరించేవాడు. సమర్థుడు మరియు కటువైన పాలకుడుగా గుర్తించబడిన టిప్పుసుల్తాన్ రాజ్యాన్ని ఆక్రమించుకున్నప్పుడు అతని సంప్రదాయాన్నే అనుసరిస్తూ రైతులతో ప్రత్యక్ష సంబంధం కలిగి వుండి, అతని భూములను మదింపు చేసే రైత్వారీ పద్ధతిని అమలు పరిచాడు. ఉత్తర భారతదేశంలో వీరు మహల్వారీ పద్ధతిని అనుసరించారు. ఈ పద్ధతిలో తమ ప్రతి నిధిగా కొన్ని గ్రామాలకు నాయకత్వం వహించగలిగే గ్రామ పెద్దను గాని, వివిధ రూపాల్లో వుండే జమిందార్లను గాని ఉపయోగించుకొనేవారు. చివరగా మరాఠాను ఆక్రమించుకున్న తర్వాత మరాఠులు అనుసరించిన విధానాన్నే మరింత పదునుగా అమలులో పెట్టారు. భూములను ఖచ్చితంగా సర్వే చేయడం, సాపేక్ష ఉత్పాదన సామర్థ్యాన్ని బట్టి వాటిని వర్గీకరించటం, ఈ వర్గీకరణను బట్టి సమగ్ర మదింపు జరపడం వంటి చర్యలు పటిష్ఠంగా అమలు చేసారు. అయితే ఈ మదింపు ప్రతి ఏటా ఋతుపవనాల క్రమాన్ని బట్టి మార్పిళ్ళ అంచనాల ద్వారా కాక మొఘలులు అనుసరించిన దీర్ఘకాల సగటుల ఆధారంగా నిర్వహించారు. ఈ మదింపు ఒప్పందాలను 30 సంవత్సరాల తర్వాత సమీక్షించారు. ఈ విధానంలో కఠినత్వం లేదా దృఢత్వం కన్పిస్తుంది. బొంబాయి ప్రెసిడెన్సీ అధికార యంత్రాంగం తాము నిర్వహించే సర్వే, శాస్త్రీయత, ఖచ్చితమైన మదింపు దృష్ట్యా, పూర్తిగా ఫలితాల సంవత్సరాలలో శిస్తు చెల్లింపు తాత్కాలికంగా ఆపుచేయడానికి అంగీకరించారే తప్ప, దాంట్లో ఎలాంటి తగ్గింపుకు ఆమోదించలేదు. దేశీయ భూమి శిస్తు విధానంలో బ్రిటిష్ వారు చేసిన మార్పులతో దృఢత్వము, బూటకపు - శాస్త్రీయత, నిర్దయ, కౄరత్వం వంటి లక్షణాలు ఈ విధానంలో చోటుచేసుకున్నాయి. రెవెన్యూ ఆదాయం పెంచుకోవడమే ఏకైక లక్ష్యంగా పెట్టుకొన్న బ్రిటిష్ వారు, రాను రాను దారుణమైన పద్ధతులను అనుసరించారు. బ్రిటిష్ ఇండియాలో చివరగా చేరిన ప్రాంతం పంజాబ్. పంజాబ్ సిక్కుల శక్తివంతమైన ప్రత్యక్ష పాలనను అనుభవించింది. ఇక్కడ కూడా బ్రిటిష్ వారు సిక్కుల అడుగు జాడల్లోనే రైతాంగంతో ప్రత్యక్ష సంబంధాలు కొనసాగించారు. అయితే దక్షిణాది తరహాలో రైత్వారీ పద్ధతి బదులుగా వాయువ్య ప్రాదేశిక ప్రాంతాలలో పని చేసిన అధికారుల ప్రాబల్యం వల్ల ఇక్కడ మహల్వారీ పద్ధతిని అనుసరించారు.

బ్రిటిష్ వారి పాలన క్రింద ఉన్న వివిధ ప్రాదేశిక ప్రాంతాలపై జరిపిన పరిశీలనలో దాదాపు అన్ని చోట్ల వారి పూర్వీకులు అనుసరించిన విధానాల్నే బ్రిటిష్ వారు అమలు

పరిచినట్లుగా వెల్లడి అవుతున్నది. ఈ విధానాలలో వారు చేసిన మార్పులు వాటిని మరింత దృఢతరం చేయడం రెవెన్యూ మదింపు, వసూళ్ళలో ఎలాంటి తేడాను సహించలేకపోవడం వంటి అంశాలపైన కేంద్రీకృతమైనాయి. సరళత లోపించిన ఈ కఠిన విధానమే బ్రిటిష్ వారికి 19వ శతాబ్దపు చివరి దశలో ఇబ్బందికరంగా పరిణమించింది. ఈ కాలంలో రైతాంగ రుణ భారం సమస్య ఒక వేపు, భారతీయ కరెన్సీ తరుగుదలకు లోనవుతున్న స్థితుల్లో హోంఛార్జీలను పెంచేందుకు రెవెన్యూ వసూళ్ళను పెంచవలసిన తప్పని సరి పరిస్థితి మరోవైపు బ్రిటిష్ వారి సమస్యను తీవ్రతరం చేసాయి. ఈ సందర్భంలో వారు తమ కంటె ముందు పరిపాలన చేసిన స్వదేశీ రాజులు సంస్థానాధీశులు అనుసరించిన రెవెన్యూ విధానంలోని వ్యాకోచ స్వభావాన్ని గురించి పరిశీలించారు. వారి ప్రస్తుత రెవెన్యూ యంత్రాంగాన్ని రద్దు చేయకుండానే రెవెన్యూ ఆదాయాన్ని పెంచుకునేందుకు వీలుగా అనేక పద్ధతులను గురించి చర్చించారు, విశ్లేషించారు . ఈ క్రమంలో ఆచరణాత్మకమైన, దూరదృష్టితో కూడుకున్న మదింపుతో పాటు దశల వారీగా శిస్తు రేట్లను పెంచాలనే సూచన చేయబడింది. దీని వలన శిస్తు నిర్ణయం ధరల పెరుగుదల దృష్టిలో ఉంచుకొని జరుగుతుందని, శిస్తు నిర్ధారణను సమీక్షించేటప్పుడు ఒకేసారి హెచ్చురేట్లను విధించే పద్ధతికి స్వస్తి చెప్పి దశలవారీగా రేట్లను మారుస్తున్నప్పుడు రైతాంగంపై అంతగా భారం ఉండదని ఆశించారు. గతంలో ముప్పయి సంవత్సరాల కాల వ్యవధిగల శిస్తు నిర్ధారణ ఒప్పందాల వ్యవధిని తగ్గించాలని మరోసూచన ముందుకు వచ్చింది. భూమిశిస్తు వసూలు చేసే హక్కును శాశ్వతం చేయడం ఔచిత్యం పై వివాదం కొనసాగు తుండడం వల్ల ఈ సూచనకు ఆదరణ లభించలేదు. మరికొందరు రాబడిలో వ్యాకోచత్వం సాధించాలంటే మదింపు పై కంటె రెవెన్యూ వసూళ్ళ పై ఎక్కువ దృష్టి కేంద్రీకరించాలని, అదే ప్రధాన సమస్యలని భావించడం జరిగింది. హెచ్చుతగ్గులకు లేదా సరళత్వానికి వీలుండే రెవెన్యూ పద్ధతుల గురించి అన్వేషించడం జరిగింది. ఈ సూచనలు వేటిపై కూడా పాలనాపరమైన చర్యలు తీసుకో లేదు. ప్రభుత్వం విత్తపరమయిన సంక్షోభంలో సతమతమవుతుండడంలో ఈ సమస్య కొంత ప్రక్కదారి పట్టింది. ఫలితంగా రెవెన్యూ యంత్రాంగం ఊపిరి పీల్చుకున్నది. అయితే ఈ చర్చల ఫలితంగా పూర్వపు దేశీయ సంప్రదాయిక విధానాలకు, బ్రిటిష్ వారి రెవన్యూ విధానాలకు మధ్యగల ప్రధాన తేడాలు ప్రస్ఫుటమయ్యాయి.

తమకు ముందున్న పాలకుల పద్ధతులకు, తమ రెవెన్యూ పరిపాలనకు ప్రాథమికంగా తేడాను గుర్తించేందుకు వీలుగా బ్రిటిష్ వారు చేసిన ప్రధానమైన మార్పులు లేదా నవకల్పనలు నిర్వాహణ సంబంధమైనవని చెప్పేకంటే నూతన భావనల వ్యక్తీకరణకు సంబంధించినవిగా పేర్కొనవచ్చు. భూసంబంధమైన ఆస్తి, భాటకం ద్వారా ఏర్పడే విలువ వంటి నూతనమైన

భావనలు చోటు చేసుకున్నాయి. ఇవి ప్రధానంగా బ్రిటీష్ వారి సిద్ధాంతాలనుండి వారి అనుభవం నుండి బయటపడ్డవేనని చెప్పవచ్చు. భూమి కొరత ఉండటంవల్ల, అది విలువైన ప్రైవేట్ వస్తువని, పెరుగుతున్న డిమాండుకు అనుగుణంగా భూమి సప్లయ్ పెరగదు కనుక భూమి యజమానికి అనార్జిత ఆదాయం లభిస్తుంది. ఇది భాటక సంబంధమైన విలువ రూపంలో ఉంటుందన్న ఆలోచనలపై ఈ భావనలు ఆధారపడి ఉన్నాయి. భూమికి డిమాండును కల్పిస్తూ భూమి యజమాని హక్కులను గుర్తిస్తూ, వాటిని రక్షించే ఈ అనార్జిత ఆదాయం నుండి భూమి శిస్తు రూపంలో ప్రధాన వాటాను పొందడంలోనే సామాజిక న్యాయం ఇమిడి వున్నది. అన్ని రకాల పన్నుల్లోకి భూమి పై విధించే పన్ను ఉత్తమమైనది. ఇది ఉత్పత్తితోగాని, వినియోగంతోగాని సంబంధం లేనిది. పూర్తిగా భాటకం విలువపై ఆధారపడినది. ఇది భూమి కల్గివున్నందుకు ఏర్పడిన హోదాకు చెల్లించే నజరానాయే తప్ప వస్తు, సేవలకు చేసే చెల్లింపుకాదు. వేతనం లేదా వస్తు, సేవలకు చెల్లించే ధరల వలె కాక భాటకం ఒక నజరానా కనుక అది ధరలకు ప్రభావితం అవుతుందని పేర్కొనడం జరిగింది. అందువల్ల భాటకం పై విధించే పన్ను, ఒక వినియోగ వస్తువుపై విధించే పన్ను వలె ధరల పెరుగుదలకు దోహదం చేయదని, ఆ పన్ను అంతిమ భారం పూర్తిగా భూమి స్వంతదారుపైనే ఉంటుందని, బదిలీ చేసే వీలుండదని కూడా భావించడం జరిగింది. అదే విధంగా భూమిని ఉపయోగించుకోవడం, బదిలీ చేయడం, తాకట్టు పెట్టడం వంటి వ్యవహారాలలో భూమి యజమానికి ఎలాంటి నియంత్రణలు లేని స్వేచ్ఛ ఉండాలనే భావన కూడా ఇమిడి వున్నది. ఎందుకంటే, ఎలాంటి నియంత్రణ విధించినా, అది భూమి విలువ తగ్గిస్తుందని, తత్ఫలితంగా రెవెన్యూ చెల్లించే సామర్థ్యం కూడా సన్నగిల్లుతుందని భావించారు. ఇంకా, భూమి శిస్తు చెల్లించని పక్షంలో, భూమిని అమ్ముకునేందుకు ఎలాంటి అవరోధాలు ఉండకూడదు. ఏది ఏమైనా రెవెన్యూ ఆదాయం సక్రమంగా, సాఫీగా రావడమే ప్రధాన ధ్యేయం భాటక సంబంధమైన విలువకు ఎలాంటి ఇబ్బందులుండవు. అయితే ఇందుకు సంబంధించిన సమాచారం తగినంతగా లభిస్తుంది. కనుక స్వేచ్ఛా మార్కెట్లో ఈ మదింపు సులభమే.

భాటక భావనను కూలంకషంగా పరిశీలించినట్లయితే భూమిశిస్తు ఒక పన్నే (tax) కాదు. ఎందుకంటే భూమి శిస్తుకు పన్నులకుండే సాధారణ లక్షణాలు కనిపించవు. సహజంగా పన్నులు ప్రభుత్వపు కోశపరమైన అవసరాలు తీర్చేందుకు ఉద్దేశించబడినవైతే, ప్రభుత్వానికి వచ్చే ఎన్నో రకాల ఏకసామ్యాల ఆదాయాలలో భూమి శిస్తు ఒకటి. ఇతరత్రా పన్నుల ద్వారా లభించే ఆదాయం సరిపోనప్పుడు వీటి ఆదాయంతో ప్రభుత్వం తన అవసరాలను సర్దుబాటు చేసుకుంటుంది. భూమి యాజమానులు అదనంగా పొందే అనార్జిత ఆదాయం పైననే ప్రభుత్వం భూమి శిస్తు విధిస్తుంది. కనుక ప్రజలపై ఎలాంటి పన్ను భారం ఉండదని కొందరి

వాదన. కీన్స్ భారతదేశ పరిస్థితుల గురించి వ్రాసేటప్పుడు అన్నిరకాల పన్నులలోకి భూమి శిస్తు ప్రజలపై అతి తక్కువ భారం వేస్తూ, కనీస ఖర్చుతో పొదుపుగా వసూలు చేయడానికి అనువయినదని వ్యాఖ్యానించాడు.

19వ శతాబ్దికి చెందిన భారతదేశపు శిస్తు చెల్లింపు దారులలో అత్యధికులకు ఈ సిద్ధాంతీకరణ గురించి తెలియదు మరియు "అన్ని పన్నులలోకి అతి తక్కువ భారం వేసే" ఈ శిస్తులో అంతర్లీనంగా ఉన్న అంశాలనైనా తమ అనుభవం ద్వారా గ్రహించ లేదు. అయితే భూమి ఉత్పాదకత సామర్థ్యం కంటె ఎక్కువగా శిస్తు మదింపు చేయడం, బలవంతమైన వసూళ్ళు, బకాయిలను రాబట్టు కోనడం కోసం నిర్దయగా భూములు అమ్మడం ఆనాటి నిజస్థితి. భూమి సామర్థ్యానికి మించిన మదింపు తరచుగా భాటకమిచ్చే ఆస్తుల అంచనాలు తప్పుగా ఉండడం వల్లనే జరిగింది. గతంలో ప్రస్తావించినట్లు తగిన సమాచారం ఉంటే చాలు, ఇలాంటి ఆస్తుల మూల్యాంకన జరిగినట్లేనని భావించారు. కాని, భారత దేశానికి సంబంధించి, సిద్ధాంతాల్లో ప్రస్తావించినట్లు కనీస పరిస్థితులు లేవు. అట్లాంటి సమాచారం కూడా అందుబాటులో ఉండదు. అందువల్ల రెవెన్యూ అధికారి ఏవేవో అంచనాలు వేసి భాటకమిచ్చే ఆస్తుల సమాచారం సిద్ధంచేసినట్లు స్వయంగాతనను, తనపై అధికారులను మోసపుచ్చాడే తప్ప నిజంగా అతను మాత్రం గత ప్రభుత్వాలలో పని చేసిన భారతీయ మదింపు దారుల వలెనే ఊహాజనితమైన అంచనాలే వేసాడు. పూర్వకాలంలో అంచనాలలో అసంబద్ధతకు మదింపు దారు అసమర్థత కారణమని చెప్పలేము. ఎందుకంటే ఆనాటి సమాచార అవకాశాలు అలాంటివి. ప్రస్తుత రెవెన్యూ అధికారి మాత్రం తన ఊహాజనితమైన అంచనాల ద్వారా విలువల మదింపులోని నిజానిజాలను నిర్ధారించుకోలేకపోయారు కూడా. తాము చేస్తున్న కార్యక్రమమంతా సరియైన మార్గంలోనే నడుస్తోందన్న గుడ్డి నమ్మకంతో ఉన్న యంత్రాంగం, వాస్తవ పరిస్థితిని సమస్య తీవ్రతను గుర్తించటానికి చాలా కాలం పట్టింది.

ప్రారంభంలో భూ సంబంధమైన ఆస్తి, భాటక విలువలు వంటి భావనలేవి గ్రామీణ భారతంలో అన్వయింపబడలేదు. భూమి సాగు చేసుకొనే వంశపారంపర్యమైన హక్కు గురించి మాత్రమే వారికి తెలుసు. రకరకాల శక్తులు ఉత్పత్తిలో భాగస్వామ్యం కోసం ప్రయత్నించినా, ఈ ప్రయత్నాలు ప్రైవేట్ ఆస్తులపై కేంద్రీకృతం కాలేదు. భూమి వ్యక్తుల మధ్య బదిలీ చేయబడినా, భూమి ఆధారంగా గ్రాంట్లు మంజూరు చేయబడినా, భూమిపై నియంత్రణకు ఉండే నిబంధనలన్నింటిపై పూర్తి అవగాహనతోనే జరిగాయే తప్ప భూ సంబంధమైన మార్కెట్ ఏదీ సృష్టించబడలేదు. భూమి శిస్తు చెల్లించే బాధ్యతను నిర్వర్తిస్తున్నందుకు ప్రతిగా భారతీయ శిస్తు చెల్లింపుదారులకు బ్రిటిష్ పాలకులు ధారాదత్తం చేసిన ఆస్తి హక్కులు ప్రారంభంలో నిగూఢంగానే ఉన్నాయి. వస్త్రంలో చుట్టబడిన వజ్రం గట్టిదనం గుర్తించలేనట్లే, భూమి

వేలం వేయడమో, న్యాయ స్థానాలకు వెళ్ళడమో జరుగనంతవరకు సంబంధిత వ్యక్తులకు ఈ హక్కులు ఏమీ తెలియవు. సాలుసరి ఉత్పత్తి విలువకంటె అధిక మొత్తంలో పరపతి అందుతున్నా రైతాంగం భూమి పట్ల తమకుగల ప్రత్యేక హక్కులను గుర్తించలేక పోయారు. రెవెన్యూ మదింపు వారి స్తోమతకు మించి హెచ్చు మొత్తంలో జరిగి రైతాంగం ఇబ్బందుల పాలయినపుడు వడ్డీ వ్యాపారి అందించిన సహాయం వెనుక ఉన్న అసలు ఉద్దేశ్యాన్ని, భూమి విలువగురించి, హక్కుల గురించి అందులో యిమిడి వున్న వ్యవస్థ పనితీరుగురించి కూడా రైతులు చాలా కాలం గ్రహించ లేదు. వడ్డీ వ్యాపారుల వల్లనే రెవెన్యూ వసూళ్ళు సక్రమంగా జరుగుతున్నాయని గమనించిన బ్రిటిష్ పాలకులు వారి అక్రమ కార్యకలాపాలను నిరోధించడానికి సందేహించారు. ఈ అంశంపై తరువాత కూడా దృష్టి సారించడం జరిగింది.

విస్తృతి చెందిన పరపతి, సంబంధిత వ్యవహారాలలో వడ్డీ వ్యాపారులకు రక్షణ కల్పించే బాధ్యతను న్యాయస్థానాలకే వదిలివేసారు. అయితే రెవెన్యూ వ్యవహారాలకు సంబంధించి తాము తీసుకొనే నిర్ణయాలు ఈ పరిధిలోకి రాకుండా జాగ్రత్త పడ్డారు. రెవెన్యూ పాలనా నిర్వాహణకు సంబంధించినంతవరకు ఈ పద్ధతి బాగానే పని చేసింది. న్యాయస్థానంలో సవాలు చేసే అవకాశం కూడా లేదు. అయితే ఇట్లాంటి సందర్భాలలో ఉన్నత స్థాయి రెవెన్యూ అధికారులు ఈ నిర్ణయాలను తనిఖీ చేసేవారు. అయినా వీరు రెవెన్యూ అధికారినే సమర్థిస్తారని ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు. రెవెన్యూ అధికారిపై ఫిర్యాదును అంగీకరించడమంటే తమను తాము శిక్షించుకున్నట్లే నని భావించే బ్రిటిష్ రెవెన్యూ యంత్రాంగం అతని ప్రతి నిర్ణయాన్ని సమర్థించేది. ఫలితంగా రైతుకు హెచ్చు మదింపుకు వ్యతిరేకంగా తన అసమ్మతిని ఖచ్చితంగా తెలియ జేసే న్యాయమైన కనీస అవకాశం కూడా లేకుండా పోయింది. శిస్తు కట్టలేని పరిస్థితులలో భూమిని స్వాధీన పరచుకొని రెవెన్యూ యంత్రాంగం ఆ భూమిని ఇతరులకు అమ్మేది. ఇందులో ఎలాంటి జాప్యం లేకుండా, రైతుకు ఎలాంటి అవకాశం దొరకని రీతిలో వ్యవహరించడానికి యంత్రంగా ప్రయత్నించేది. వడ్డీ వ్యాపారి గనక ఆ శిస్తును చెల్లిస్తే, అట్టి రుణాలను రైతు చెల్లించలేని పక్షంలో వడ్డీ వ్యాపారి ఏదో ఒక న్యాయస్థానంలో తన యంత్రాంగం ద్వారా రైతు భూమిని ఆక్రమించుకోగలిగేవాడు. కొంతలో కొంత తన ఉనికిని అవకాశంలో ఉంటుందనే ఆశతో రైతు వడ్డీ వ్యాపారి షరతులన్నిటికీ తలఒగ్గి అతనికి అనుకూలమైన మార్గంలో పయనిస్తూ, తన అదృష్టం ఇంతేనని సమాధాన పడవలసి వచ్చేది.

బ్రిటిష్ వారు పన్నిన ఈ యంత్రాంగంలో రైతులే కాక వీరి హయాంలో భూస్వాములుగా మారిన యజమానులు సైతం చిక్కుకున్నారు. వడ్డీ వ్యాపారులుగానో, వేలంలో కొనుగోలుదార్ల నుండి భూస్వాములుగా ఎదిగినవారో అయితేనే నూతన పోకడలను అర్థం చేసుకోగలిగేవారు తప్ప ఇతరులయితే పరపతి విస్తరణ ప్రభావానికి తొందరగా

లోనయ్యేవారు. ఈ పేరాశతో అప్పుల ఊబిలో కూరుకుపోయిన ఎస్టేట్ లు వీరి చేతుల్లోకి చేరేవి. రుణదాతలు చుట్టూ చేరి సంకట పరిస్థితులను సృష్టించేవారు. ఈ ఎస్టేట్‌లు తమ రాజకీయ లబ్దికి ఉపయోగపడేంత స్థాయిలో వుంటే రెవెన్యూయంత్రాగానికి నూరు రూపమయిన దయాదాక్షిణ్యాలకు (court of words) వదిలేవారు. ఒకవేళ ఆ ఎస్టేట్ ఏ ప్రాబల్యం లేనిదయితే దిక్కు మొక్కు లేని స్థితిలో వ్యవస్థలోని తోడేళ్ళకు బలివేసేవారు.

వివిధ సర్దుబాట్ల క్రమంలో రెవెన్యూ అధికారులు ఎవరి నుంచైతే రెవెన్యూ సక్రమంగా వస్తుందని భావించారో ఆ ఆస్తులను అనుభవించే అవకాశం కల్పించారు. మిగతా గ్రామీణ సమాజాన్ని వారు లెక్కలోకే తీసుకోలేదు. రైతాంగం నుండి ఆందోళన ఎదురయ్యేంతవరకు ఈ అవకాశం లభించని వారు తమకు తామే తలవంచుకొని పరిస్థితులతో రాజీపడాల్సి వచ్చేది. రెవెన్యూ అధికారుల విచక్షణాయుత చర్యలతో గ్రామీణ సమాజాన్ని కొత్త తరహాలో విభజించే ప్రక్రియకు నాందీ ప్రస్తావన జరిగింది. రెవెన్యూ యంత్రాంగం తమ ఇష్టాను సారంగా, అది ఒక 'లక్కీ ఛాన్స్' అన్నట్లు ఒక రైతుకు హక్కులను రికార్డుల్లో నమోదు చేస్తే మరో రైతును ఏ కారణం లేకుండానే అశాస్త్రీయంగా అందులో చేర్చక ఏ హక్కులు లేని కౌలుదారు (tenant - at - will) స్థాయికి దిగజార్చడం జరిగింది. ఇలాంటి కౌలుదారు ఎవరి ఇష్టానుసారం వ్యవహరించాలో, ఎవరి అధికారం నడుస్తుందో తెలియని అనిశ్చిత పరిస్థితి కొనసాగింది. భూమి మీద ఒత్తిడి లేనంతకాలం సంప్రదాయ సంబంధాలు కొనసాగుతుండేవి. నూతన మార్పులగురించి విశ్లేషణ గురించి ఎవరూ అంతగా పట్టించుకునే వారు కాదు .నిజం చెప్పాలంటే, రెవెన్యూ చెల్లించే బాధ్యతను స్వీకరించడం అంటే అది 'భారమే' కాని 'వరం' కాదని భావించిన రోజులవి.బెంగాల్‌లో ఉపభూస్వామ్య ప్రక్రియ ఏదైతో ప్రారంభమయిందో దాని ప్రభావం తర్వాతి కాలంలో కొట్టవచ్చినట్లు ప్రతిఫలించింది. భాటకపు విలువలో వాటాపై ప్రభుత్వం పన్ను విధించలేదు. ఇది హెచ్చుగా ఉన్న రెవెన్యూ డిమాండును తట్టుకోవడానికి ప్రారంభంలో చేసిన ఏర్పాటు గా చెప్పవచ్చు. ఇరు వర్గాల వారు పెరిగిన రెవెన్యూ భారాన్ని పంచుకోడానికి వీలుంటుందని అధికారులు భావించారు. ఎప్పుడైతే జనాభా పెరుగుతూ, భూమి ఒక విలువైన వస్తువుగా మారిందో రెవెన్యూ చెల్లింపుదారులకు హక్కులతో సంక్రమించిన భూమికి నిజమైన ఆస్తిగా గుర్తింపు వచ్చింది. రెవెన్యూ, పరపతి యంత్రాంగం ద్వారా ఈ ఆస్తుల విలువలను కృత్రిమంగా పెంచారు. బ్రిటిష్ రెవెన్యూ పాలనా యంత్రాంగం ముందుకు తెచ్చిన సిద్ధాంతాలు వారి స్వీయ - అవసరాలను తీర్చే ప్రవచనాలుగా మారాయి. ఊహాజనితమైన భాటకపు విలువ వల్ల భూమికి డిమాండు పెరగడం దీన్ని తట్టుకొనేందుకు ఈ ఆస్తిని పూచీగా పెట్టుకొని ఇచ్చే పరపతి అవకాశాలను విస్తృత పరిచారు. ఋణదాత పెట్టుబడులు, భూమికున్నధర; భూమిపై నియంత్రణ, వివిధ రకాల తనాఖాలు మొదలయిన

వాటిని ప్రభావితం చేసాయి. ఈ పెట్టుబడులు రాను రాను మరింత లాభదాయకంగా మారాయి. పరపతి దార్లు ఏ పద్ధతులలో భూమిపై పట్టు సాధించినా అనార్జిత ఆదాయంపై అదుపు సంపాదించగలిగారు. రెవెన్యూ చెల్లించే యజమానులకు జీవనాధార స్థాయి మాత్రమే మిగిలింది. రెవెన్యూ పరిపాలన కఠినంగానే ఉండాలని ప్రతిపాదించినవారు, ఈ పరిస్థితికి మదింపు చాలా తక్కువ స్థాయిలో కొంత నిజం కూడా లేకపోలేదు. బ్రిటిష్ వారి పాలనా ప్రారంభంలో అతి హెచ్చుగా ఉన్న మదింపులు తరువాత కాలంలో బాగా తక్కువగా ఉన్నాయని చారిత్రక దృక్కోణం నుంచి పరిశీలిస్తే అవగతమవుతుంది. ఈ అధ్యాయం చివర్లో చర్చించినట్లు భూమి శిస్తు విధానం నిర్ణయాత్మకమైన పాత్ర పోషిస్తున్న రోజుల్లో 20వ శతాబ్దంలో ఆర్థిక, కోశ విధానపు సాధనంగా భూమిశిస్తు బాగా తగ్గించారు. ఈ రకమయిన ఆచరణను స్వతంత్ర భారతదేశంలో పూర్తిగా వదిలివేసారు. ఈ అసంబద్ధమైన మార్పులు రైతుల, భూస్వాముల దుస్థితికి అద్దం పట్టాయి. భూసంబంధమైన విలువలకు ప్రాధాన్యత లేని రోజుల్లో ధారా దత్తం చేయబడిన ఆస్తులు ఆతరువాత వీరు రుణదాతలకు తాకట్టు చేయబడి కొత్త పద్ధతులు అందించిన లాభాలను వీరు ప్రోది చేసుకొనేందుకు ఉపయోగపడినాయి.

**హక్కుల రికార్డులు** (Record of Rights)

భూమిపై రైతాంగానికి వుండే హక్కులను పరిరక్షించడం అంటే, అందుకు సంబంధించిన సమాచారాన్ని సక్రమంగా రికార్డులో నమోదు చేయడం, వాటిని ఎప్పటికప్పుడు సరిచేస్తూ వర్తమాన పరిస్థితులకు సంబంధించి ఖచ్చితమైన వివరాలు ఇచ్చేట్లుగా తయారు చేయడం అని అర్థం. రెవెన్యూకు, భూసంబంధమైన ఆస్తులకు మధ్య ఉన్న సంబంధాన్ని గుర్తించినట్లయితే, రెవెన్యూ యంత్రాంగం అలాంటి రికార్డు సిద్ధంగానే ఉంచినట్లు భావించాల్సి వుంటుంది. అయితే ఆస్తులపై హక్కులను కల్పించింది కేవలం రెవెన్యూ ఖచ్చింతంగా వసూలు చేసుకోవడానికే అని కూడా గమనించగలిగితే, రెవెన్యూ అధికారులు తమ అవసరాలకు మాత్రమే పరిమితమై, ఒక్క అడుగుకూడా ముందుకు వెళ్ళ లేదు. ఏ ఇతర మార్గాలలో ఆస్తులకు రక్షణ కల్పించడానికి, హక్కులను క్రమబద్ధం చేయడానికి ప్రయత్నించలేదు. భూ సంబంధమైన ఏ వివాదాలు తలెత్తినా న్యాయస్థానాల నిర్ణయానికే వదిలి వేసారు. బ్రిటిష్ వారు బహిరంగ రికార్డులలో భూసంబంధమైన ఆస్తి వివరాలను పొందు పరచడానికి ఆసక్తి పత్రాలను వ్రాయించడం ద్వారా పూర్తి చేసేవారు. ఇదంతా ఈ పనులలో అనుభవం గడించిన న్యాయవాది ద్వారా జరిగేది. ప్రతి ఒక్కరూ ఆస్తిపై గల హక్కు తమదేనని సంతృప్తి పడేవారు. భారత దేశంలోని రెవెన్యూ పరిపాలనలో పాలు పంచుకున్న మరియు సన్నిహిత సంబంధంగల హెన్రీ మెయిన్ భారతీయ రెవెన్యూ యంత్రాంగం భూ సంబంధమైన హక్కుల బహిరంగంగా రికార్డును తయారు చేయగలదన్న సదభిప్రాయాన్ని వ్యక్త పరిచారు. బ్రిటన్‌లో జరిగే బదిలీలపై

అసంతృప్తి వ్యక్తం చేస్తూ, చట్ట పరంగా, బహిరంగంగా ప్రజలమధ్య ఆస్తుల బదిలీలు జరగడం 19వ శతాబ్దపు ప్రధాన విజయంగా అభివర్ణించాడు. అయితే భారతీయ రెవెన్యూ అధికారులు హెన్రీ పవిత్రమైన ఆశకు, ఆశయానికి అనుగుణంగా వ్యవహరించలేదని, ఆయన ఆశించిన 'విజయానికి అల్లంత దూరంలో ఉండటానికే ప్రయత్నించారని, భూమి శిస్తు సక్రమంగా వసూలవుతున్నంత కాలం ఈ అంశాలగురించి ఎంత మాత్రం ఆలోచించలేదు. భూమిపై ఎవరికి హక్కు ఉన్నదో, ఎవరు స్వంతదారో వీరికి అవసరం లేదు. రెవెన్యూ ఉంటే భూమిని అమ్మేందుకు సిద్ధపడేవారు. దీన్ని నివారించేందుకు ఎవరో ఒకరు ఈ బకాయిలు చెల్లించేవారు. వారికే ఆ హక్కు భుక్తం అయ్యేది. భూమికి సంబంధించి వివాదం తలెత్తితే యంత్రాంగానికి రెవెన్యూ చెల్లించేందుకు సిద్ధపడే మరో వ్యక్తి లభిస్తాడనే ఆనందం కలిగేది. భూమి శిస్తు అనేది భూమిపై విధించే పన్నేగాని భూమిపై హక్కుగల వ్యక్తి పై విధించేది కాదు గనుక వాస్తవంగా భూమి ఎవరి ఆధీనంలో ఉన్నదో వారే శిస్తు చెల్లించాల్సి వచ్చేది. భూమి శిస్తుకు, ఆస్తికి సంబంధం ఏర్పరచినా, రెవెన్యూ యంత్రాంగానికి మరియు శిస్తు చెల్లించే వారికి మధ్య ఉన్నది కేవలం ద్రవ్యపరమైన సంబంధమే. శిస్తు సాఫీగా వచ్చినన్నాళ్ళు ఈ సంబంధం కొనసాగుతుంది. లేదా మరొకరితో ఒప్పందం కుదురుతుంది. ఇందులో మానవీయతకు గాని, దయా దాక్షిణ్యాలకు గాని తావులేని కరుకు దనమే దాగి వుంటుంది. రైతాంగం రుణగ్రస్తమైనప్పుడో, భూమిని మరొకరికి హస్తగతం చేయాలను కున్నప్పుడో మరియు కౌలుదారీ రక్షణకు సంబంధించిన సమస్య ఉత్పన్నమైనప్పుడో యంత్రాంగానికి రెవెన్యూ వసూలుకు సంబంధించి ఇబ్బంది కరమైన పరిస్థితులు ఏర్పడినపుడు మాత్రమే అధికారులు భూమి రికార్డులకు ప్రాధాన్యమివ్వటాన్ని బ్రిటిష్ ఇండియాలోని అన్ని ప్రాంతాలలోనూ గమనించవచ్చు. గ్రామీణ భారత దేశపు పరిస్థితులతో సన్నిహిత సంబంధం గల ఈ సమస్యలన్ని రెవెన్యూ వసూళ్ళపై తప్పక ప్రభావం చూపుతాయని యంత్రాంగం సహజంగానే ఆంధోళన చెందింది. అయితే ప్రస్తుత రెవెన్యూ మదింపు వసూళ్ళతో ఈ సమస్యలకు సంబంధం లేదని, భవిష్యత్ కార్యాచరణపై దృష్టి సారిస్తే సరిపోతుందని అభిప్రాయపడినారు. ఈ సమస్యలు తలెత్తే సమయంలో కేంద్ర ప్రభుత్వపు రెవెన్యూశాఖ ఉత్తర భారతదేశంలో పనిచేసి అనుభవం గడించిన అధికార్ల ఆధీనంలో పనిచేస్తుండేది. దేశపు వాయువ్య ప్రాంతాలలో, పంజాబ్‌లో భూసంబంధమైన హక్కుల రికార్డులు నిర్వహించడం రెవెన్యూ పాలనలో అంతర్భాగంగా వుండటం వల్ల ఈ అధికార్లు మాత్రమే ఇందుకు సంబంధించిన అన్ని విషయాలపై అవగాహన ఏర్పరచుకోగలిగారు. ఇలాంటి ఏర్పాటు లేని బెంగాల్, రైత్వారీ పద్ధతి అమలులో వున్న బొంబాయి, మద్రాస్ తదితర ప్రాంతాలకు సంబంధిత సమాచారాన్ని, ఆలోచనలను అందించడానికి, వారికి అవగాహన కల్పించటానికి ఎంతో శ్రమించ వలసి వచ్చింది.

తమ ప్రాంతాలలో అమలులో ఉన్న రెవెన్యూ రికార్డులే అసలయిన భూమి రికార్డులుగా చెప్పుకోవడం సాధారణమై పోయింది. బెంగాల్ రెవెన్యూ అధికారులు శాశ్వత ఒప్పందాలు కుదుర్చుకున్న జమిందార్లతోనే వ్యవహరించవలసి వచ్చేది. 1885 కౌలుదారీ చట్టం తెచ్చిన మార్పులను గురించి తరువాత చర్చించడం జరిగింది. బొంబాయి ప్రెసిడెన్సీలో రైత్వారీ విధానాన్ని రూపకల్పన చేసినవారు భూమి యాజమాన్యంలో వచ్చే మార్పులను రెవెన్యూ రికార్డులు చూపించవని బాహాటంగా చెప్పడం గమనించదగిన విషయం. ఆ ప్రాంతంలో న్యాయస్థానాల ప్రాబల్యం ఎంత బలంగా ఉండేదంటే రెవెన్యూ అధికారులు తయారుచేసే భూమి రికార్డులను న్యాయమూర్తులు ఖాతరు చేయకపోయేవారు. 1903లో రూపొందిన ప్రత్యేక శాసనం ఆధారంగా ఏర్పడిన 'హక్కుల రికార్డులను గురించి తరువాత చర్చించడం జరిగింది. బొంబాయి రెవెన్యూ సిబ్బంది ఇచ్చిన సర్వే నెంబర్లు వాస్తవ యాజమాన్యాన్ని గుర్తించే ఎలాంటి ఆధారం చూపించలేకపోయాయి. మొదటిసారి భూయాజమాన్య నిర్ధారణకు సర్వే నెంబర్లను రూపకల్పన చేసినప్పుడు, ఒక ఎడ్ల జతతో రైతు కుటుంబం సాగు చేసుకోనేందుకు అనువైన కమత పరిమాణాన్ని నిర్ధారించేవిగా ఉండాలని నిర్ణయించినప్పటికి వాస్తవంగా ఒక రైతు స్వాధీనంలో ఉన్న కమత పరిమాణం కంటే సర్వే నెంబర్ సూచించే విస్తరణ ఎక్కువగా ఉండటం తటస్థించింది. అంటే ఒక సర్వే నెంబరు భూమిపై ఒకరి కంటె ఎక్కువ మంది యాజమాన్య హక్కును కోరడం గమనించవచ్చు. ఇందుకు భిన్నంగా మద్రాస్ ప్రెసిడెన్సీలో ఎలాంటి ఊహాగానాలకు అవకాశం లేకుండా భూములను వాస్తవంగా సర్వే చేసి, మదింపు యాజమాన్యంలో మార్పులు రెవెన్యూ రికార్డులలో చేరకపోవడం గమనించదగినది. భూమి యాజమాన్యపు హక్కులను రిజిస్ట్రేషన్ చేయడం అనే అద్భుతమైన ప్రక్రియను ప్రారంభించిన ఘనత మొదట మద్రాస్ కేదక్కుతుంది. ఈ విధానాన్ని అమలు జరిపే అధికారి ఇందులో ఎలాంటి తేడాలు రాకుండా వేరే పద్ధతులు చోటు చేసుకోకుండా భూమి యజమాని రిజిస్ట్రేషన్ చేయించుకొనే విధంగా కఠినంగా వ్యవహరించడం కూడా చూడవచ్చు. అయితే భూమిపై హక్కులను రిజిస్టర్ చేసుకోవడం రైతాంగం ఇష్టాయిష్టాలకే వదిలారు. రిజిస్ట్రేషన్ కార్యాలయానికి వాస్తవంగా అందజేసిన ఒప్పందాలనే అమలుచేయడం జరిగింది. ఈ రకమయిన రిజిస్ట్రేషన్ రైతు మోసానికి గురికాకుండా కాపాడగలుగుతుందే కాని రైతుకు పూర్తి స్థాయి సంబంధించి బ్రిటిష్ పాలనలో మద్రాస్ ప్రెసిడెన్సీలో ఎలాంటి శాసనం చేయబడలేదు. రైతు హక్కులను రికార్డు చేయడం గురించి ఉద్బోధించే కేంద్ర ప్రభుత్వం కూడా ఈ విషయంలో ఏమీ చేయలేకపోయింది. భూమియాజమాన్యపు రికార్డులు తయారు చేయడంలో ఉత్తర భారతం ప్రథమంగా నిల్చింది. రెవెన్యూ రికార్డులను నిర్వహించడం కేవలం రెవెన్యూ అధికార దృష్ట్యానే కాక గ్రామ స్థాయి ప్రయోజనం దృష్ట్యా కూడా ముఖ్యమని భావించారు. ఈ సమూహాలు

ఇతర ఆస్తులుగల సంస్థలు రెవెన్యూ చెల్లించే సమిష్టి బాధ్యతను కల్గివుండటం వల్ల, వారి మధ్య రెవెన్యూ చెల్లింపు వాటాలను నిర్ణయించడానికి ఈ రికార్డులు అవసరమయ్యేవి. ఈ రికార్డులు శిస్తు నిర్ధారణ సమయంలోనే కాక ఇతర అవసరాలలో కూడా యాజమాన్యపు హక్కుల వల్ల కలిగే ప్రయోజనాలను రైతాంగానికి సమకూర్చేవి. గ్రామ స్థాయి గణకుడు గ్రామ విస్తీర్ణానికి సంబంధించిన నక్షా (map), కమతాల, ఇతర భూముల వివరాలు తెలిపే పుస్తకం, మరియు గ్రామంలోని స్వంతదారుల, వారి కౌలుదార్ల జాబితాను కలిగి వుండే వాస్తవ హక్కుల రికార్డు (జమాబంది) తో పాటు, యాజమాన్యంలో మార్పులు చేర్పులను సూచించే రిజిస్టర్ కూడా నిర్వహించేవాడు. ఈ రికార్డులు వాయవ్య ప్రాంతాలలో, పంజాబ్‌లో దాదాపు ఒకే రకంగా నిర్వహించేవారు. జమాబంది వాయవ్య ప్రాంతాలలో, కౌలుదార్ల జాబితాను మాత్రమే తెలియజేసేది. స్వంతదారుల ఖేవాత్‌కు సంబంధించిన జాబితాను వేరే పుస్తకం ద్వారా నిర్వహించేవారు. శిస్తు మదింపుకు ఈ రెండు ప్రాంతాలు అనుసరించే పద్ధతులలోని తేడాకు అనుగుణంగా ఈ ఏర్పాటు ఉండేది. పంజాబ్‌లో రెవెన్యూ అధికారి గ్రామం మొత్తానికి రెవెన్యూ మదింపు చేసి, వాటాల పంపకం గ్రామస్థులకే వదిలేవారు. వాయువ్య ప్రాంతాల్లోని అధికారి భాటకం రేట్లతో పాటు శిస్తు రేట్లను కూడా నిర్ణయించేవాడు. దీనివల్ల కౌలుదార్లు స్వంతదార్లతో వేర్వేరుగా వ్యవహరించే అవకాశం ఉండేది. శిస్తు నిర్ధారణ చేసే క్రమంలో భాటకానికి, భూమి శిస్తుకు మధ్య వాస్తవమైన తేడాను గుర్తించగలగడం వల్లనే ఇది సాధ్యమయిందని భావించినప్పటికీ భాష పంజాబ్‌లో కూడా దాదాపు అవే నిబంధనలు అనుసరించినప్పటికి ఆచరణలో మాత్రం ఈ తేడాను చూపలేకపోయారు. కౌలుదార్లను ప్రత్యేకంగా గుర్తించడం ద్వారా పంజాబ్‌లో వారినుంచి 'భాటకాన్ని' వసూలుచేయటం కంటె వారు శిస్తు చెల్లింపు భారంలో కొంత భాగాన్ని భరించే పద్ధతి అమలులో వుండేది. రెవెన్యూ మదింపు చెల్లింపులకు అనుగుణంగానే హక్కుల రికార్డులు నిర్వహించబడేవి. ఇలాంటి రికార్డులను వేరే ప్రాంతాల్లో ప్రవేశపెట్టేందుకు తగిన ఆదరణ లభించ లేదు. పైగా రెవెన్యూ అధికారులు, రెవెన్యు చెల్లించే వారు ఇరువురూ అంతగా ఆసక్తి చూపలేదు. పైన వివరించిన రకరకాల రికార్డులు పడి ఉండేవి. ఈ పట్వారి ఉత్తర భారతంలో నిజమైన గ్రామ గణకుడుగా కొనసాగితే, బెంగాల్‌లో జమిందార్ల ప్రైవేట్ సేవకుడుగా, రైతువారీ పద్ధతిలో క్రింద స్థాయి రెవెన్యూ అధికారిగా వివిధ రూపాల్లో కొనసాగాడు.

బెంగాల్‌లో సమర్థుడైన, పాలనా దక్షత కల్గినవాడుగా గుర్తింపు పొందిన ఆంథోని మెక్‌డోనెల్ (Anthony Macdonnel) హక్కుల రికార్డులను క్రమ పద్ధతిలో రూపొందించి అమలు చేయడానికి సాహసోపేతమైన ప్రయత్నమే చేసాడు. 1885 కౌలుదారీ చట్టంలోని పదవ అధ్యాయంలో పొందుపరిచిన వివిధ అంశాలను అతను అవగాహన చేసుకున్నాడు. భూస్వామికి, కౌలుదారుకు మధ్య వివాదం చెలరేగినపుడు స్థానిక ప్రాంతాలలో భూమి

హక్కులకు సంబంధించిన రికార్డులు సిద్ధంగా ఉండాలని ఈ 'అధ్యాయంలో పొందుపరచడం జరిగింది. అయితే రెవెన్యూ అధికారి తయా రు చేసిన రికార్డులకు ఎప్పటికప్పుడు తాజాగా సవరణలను చేరుస్తూ సక్రమంగా నిర్వహించే యంత్రాంగం ఉన్నప్పుడే ఈ రికా ర్డులకు విలువ, గుర్తింపు ఉంటుందని కూడా గ్రహించాడు. దీని దృష్టిలో ఉంచుకునే శాసన సభ ద్వారా పట్వారిని ప్రభుత్వ అధికారిగా ఆతని గణన అధికారికగణనగా చేసేందుకు వీలుగా బిల్లు తెచ్చేందుకు ప్రయత్నించాడు. కౌలుదారీ చట్టం అమలులోకి వచ్చిన వెంటనే మెక్‌డొనెల్ ప్రవేశపెట్టిన ఈ బిల్లు భూస్వాముల నుండి తీవ్రవ్యతిరేకతను ఎదుర్కొన్నది. రాజ్య కార్యదర్శి వీటో అధికారాన్ని ఉపయోగించడంతో ఈ బిల్లుకై జరిగిన సుదీర్ఘ ప్రయత్నానికి తెరపడింది. కొన్ని సంవత్సరాల తర్వాత తాత్కాలిక లెఫ్టినెంట్ గవర్నరుగా బెంగాలుకు తిరిగి వచ్చిన మెక్‌డొనల్ అతి సాహసవంతమైన కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు. వ్యవసాయ సంబంధాలు చాలా దారుణమైన స్థితిలో ఉన్న బీహార్ అంతటిని స్థానిక ప్రాంతంగా ప్రకటిస్తూ కౌలుదారీ చట్టంలోని పదవ ఆధ్యాయంలో పొందుపరిచిన షరతులకు లోబడి రాష్ట్ర మంతటా భూమి రికార్డులు సిద్ధం చేయాలని ఆదేశించాడు. దీనికి అనుబంధంగా 1895లో భూమి రికార్డుల నిర్వాహణ చట్టాన్ని కూడా ఆమోదించడం జరిగింది. ఈ మొత్తం ప్రయత్నం వెనుక భూమి రికార్డులను నిరంతరాయంగా సక్రమంగా కొనసాగించడం, ఎప్పటికప్పుడు సవరణలు చేయడమే కీలకమైన అంశం ఉత్తర భారతదేశంలో కూడా ఇది ఒక నిరంతర సమస్యగానే మిగిలింది . యాజమాన్యపు హక్కులను నిర్ధారణ చేసే అధికారి (setlement officer) తయారు చేసిన ప్రాథమిక రికార్డులను ఆ అధికారి నిష్క్రమించిన తర్వాత తగు విధంగా నిర్వహించే గ్రామస్థాయి సిబ్బంది లేకపోవడంతో సమస్య యధా తధంగానే ఉండిపోయింది.పూర్వపు ఒప్పందాలను సమీక్షించేటప్పుడైనా రికార్డులను తాజాగా సిద్ధం చేయడానికి సమీక్షించడానికి ఆయా ప్రాంతాలకు వెళ్ళి పరిశీలించే అవసరాలు ఇంతకు ముందే ఉన్న రికార్డులను మరియు ధరల పెరుగుదల నిర్ణయించింది. ఈ విదానం వల్ల భూమి రికార్డులను తయారుచేయడంలో క్షేత్రపరమైన సర్వేతో ఎదురయ్యే ఇబ్బందులు తొలగిపోయాయి, రికార్డుల నిర్వహణకు, ప్రాధాన్యత పెరిగింది. 1887 'పంజాబ్ భూమి శిస్తు చట్టం' మొట్టమొదటిసారి హక్కుల రికార్డులను నిర్వహించటానికి సమగ్రమైన యంత్రాంగాన్ని అందించింది. ఇతర ప్రాంతాలలో రూపొందించిన శాసనాలకు ఇది ఒక నమూనాగా నిలిచింది. బొంబాయి భూమి హక్కుల రికార్డు చట్టం, 1903ను రూపొందించేటప్పుడు కూడా, ఈ చట్టంలోని కొన్ని ముఖ్యమైన అంశాలను ఇందులో చేర్చడం జరిగింది. రైత్వారీ పద్ధతినే దృష్టిలో వుంచుకొని జాగ్రత్తగా వ్యవహరించారు. బొంబాయి అధికారగణం రెవెన్యూ రికార్డులను నవీనీకరించి కొత్తగా

హక్కులను కల్పించే పద్ధతిని వ్యతిరేకించారు. గ్రామాలలో వుండే గణకులు నిర్వహించే ప్రత్యేక రికార్డులుగా మాత్రమే ఏర్పాటు చేయడానికి వీరు నిర్ణయించారు. ఈ రికార్డుల చట్టబద్ధతను గాని, వాటి ఆధారాన్ని గాని ప్రశ్నించే 'అవకాశం సివిల్ కోర్టుల చేతుల్లోకి పోకుండా జాగ్రత్త పడ్డారు. న్యాయ స్థానాల్లో కేసుల (వాజ్యాల) సందర్భంగా ఈ రికార్డులను సాక్షంగా చూపడంలో గల అధికారికత గురించి సుదీర్ఘ చర్చ జరిగింది. తాము రూపొందించిన రికార్డులకు సరియైన ఆధారాలున్నట్లు అంగీకరించేందుకు నిరాకరించారు. ఇలాంటి అధారాలను బహిర్గతం చేయడం ద్వారా రికార్డులను తయారు చేసే క్రమంలో తమ అధికారులు తీవ్ర సమస్యలు ఎదుర్కోవలసి వస్తుందని భావించారు. న్యాయస్థానాల్లో సవాలు చేయనంతవరకు రికార్డు పుస్తకాల్లో నమోదయిన సమాచారమంతా సరియైనదేనని అంగీకరించవలసి వచ్చేది. న్యాయ స్థానాల్లో కేసు నమోదు చేసే ప్రతి ఒక్కరు హక్కుల రికార్డు నకళ్ళు సమర్పిస్తారని, న్యాయ మూర్తులు ఈ సమాచారాన్ని తమ విచక్షణ ప్రకారం అన్వయించుకుంటారని, అందులో పొందుపరచిన అంశాలేవయినా సరియైనవి కావని న్యాయస్థానం నిర్ణయిస్తే, వాటిని సరిచేయాల్సిందిగా తగిన సమాచారాన్ని రెవెన్యూ అధికారులకు అందించే బాధ్యత వహిస్తుంది. ఈ రకంగా అందిన సమాచారం కార్యక్రమంలో ఈ రికార్డుల ఉపయోగితను, నాణ్యతను పెంచుతాయని భావించారు. అందుకు తగినట్లుగానే చట్టం ఆమోదింపబడిన 10 సంవత్సరాలలో ఆ చట్టానికి చేసిన సవరణ రికార్డులకు తగిన ముందస్తు సాక్ష్యాన్ని చేకూర్చింది. ప్రారంభంలో ఈ కార్యక్రమాన్ని గ్రామాల్లోని గణకులకు అప్పగించడానికి సందేహాలు వ్యక్తమయినా, ఈ పనులపై ఉన్నతస్థాయి అధికారుల సమర్థవంతమైన పర్యవేక్షణ ఉండాలని చట్టంలో పొందుపరచడం వలన ఈ భయాందోళనలు తొలగిపోయాయి. ఉత్తర భారతంలో ప్రారంభపు రికార్డులను సెటిల్‌మెంట్ అధికారులు తయారు చేయగా, గ్రామ సిబ్బందికి వాటి నిర్వహణ అప్పగించారని విమర్శకులు అభిప్రాయపడినారు. బొంబాయిలో రెవెన్యూ మదింపు పని కార్యాలయాలకే పరిమితమవడంతో ఇలాంటి అధికారుల అవసరమే లేకుండా పోయింది. గ్రామంలోని గణకులే ప్రాథమిక సమాచారాన్ని రికార్డులలో నమోదు చేయాల్సి వచ్చింది. కాల క్రమంగా 1913 బొంబాయి భూమి శిస్తు చట్టానికి జరిగిన సవరణలలో హక్కుల రికార్డు చేరింది.రైత్వారీ పద్ధతి పవిత్ర ప్రభోదాల సరసన ఈ విధానం ప్రతిష్ఠించబడింది. బొంబాయిలో అనుసరించే పద్ధతి ఇతరులకు ఎంత ఆకర్షణీయమైనదంటే 1926లో మైసూర్ రాష్ట్రం కూడా ఈ పద్ధతిని ఆచరణలో పెట్టింది. మద్రాస్ రాష్ట్రం మాత్రం ఈ మార్పులనన్నింటిని గమనిస్తూనే, అన్ని ప్రస్తావనలను, ఒక దాని వెంట మరొకటి వదిలివేస్తూ హక్కుల రికార్డు అంటూ ఏదీ లేకుండానే ముగిలిపోయింది. అనేక దశాబ్దాల పాటు జరిగిన ప్రయత్నాలవల్ల మద్రాస్ మినహా ఉత్తర

భారతదేశంతో సహా అన్ని ప్రాంతాలలో హక్కుల రికార్డులు విస్తరించాయి. అయితే, రికార్డుల నిబద్ధత వాటిని నిర్వహించే సిబ్బంది ఎంత సమర్ధవంతంగా పని చేస్తున్నారనే దానిపై ఆధారపడి వుంటుంది. విమర్శలకు, అనుమానాలకు తగినన్ని కారణాలు ఉండనే వున్నాయి. ఉత్తర భారతంలో కూడా పట్వారీలు తయారు చేసే సమాచారం యొక్క ఖచ్చితత్వంపై ఎన్నో ఫిర్యాదులను రెవెన్యూ అధికారులు ఎదుర్కోవలసి వచ్చింది. ఇందుకు కూడా కారణాలు లేకపోలేదు. నిరక్షరాస్యుడయిన రైతు ఎప్పుడూ నిలువెల్లా కపటి అయిన పట్వారీ దయాదాక్షిణ్యాల మీదనే ఆధారపడి వుండాల్సి వచ్చింది. అనుభవజ్ఞులైన పాలకులు, న్యాయమూర్తులు ఈ విధానంలోగల పరిమితులను గ్రహించటంవల్ల, దీనిపై అంతగా నమ్మకం ప్రకటించలేదు. అయినా ఇది ఎంతోకొంతమేలు కలుగజేస్తుందేమోనన్న సదాశయంతో ఆ మేరకు ఉపయోగించుకోవడానికి ప్రయత్నించారు.

సర్వేపనులు,హక్కుల రికార్డులు పూర్తవడంతో క్షేత్ర పరమైన శిస్తు నిర్ధారణ కార్యక్రమాల అవసరం తీరడంతోబాటు, రెవెన్యూ అధికారుల ప్రాబల్యం కూడా తగ్గింది. క్రింది స్థాయి అధికార యంత్రాంగం నిర్వహించే క్షేత్ర సంబంధ కార్య కలాపాలు రైతాంగాన్ని ఎన్నో విధాలుగా హింసించేవి. కొన్ని సందర్భాలలో అర్ధరహితంగా హెచ్చు రెవెన్యూ మదింపు జరిగేది. అయినా ఇది గ్రామీణ ప్రాంతాలలోని వాస్తవ పరిస్థితులతో ఈ అధికారులకు ఒక అవగాహన ఏర్పడేందుకు ఉపయోగపడేది. ఎప్పుడైతే రెవెన్యూ అధికారి కార్యాలయంలో కాగితాలకు మరియు రెవెన్యూ న్యాయస్థానాల్లో కేసులు చూసుకోవడానికి పరిమితమయ్యాడో ఈ వాస్తవికతకు దూరమయ్యాడు. శాసన నిర్మాతల ప్రాబల్యం మరియు పాలనా యంత్రాంగం యొక్క నియంత్రణల ఫలితంగా ఇతని కార్యనిర్వాహక విచక్షణ పరిధి మరింత పరిమితమయింది. రెవెన్యూ పరిపాలనలో పరిపూర్ణత్వం చివరకు అందుకు పశ్చాత్తాపం పొందే స్థాయికి చేరింది.

## రెవెన్యూ పరిపాలనలో మార్పులు

1860 నుండి 1935 సంవత్సరాల మధ్య బ్రిటిష్ ఇండియాలో రెవెన్యూ పాలన ప్రాథమికమైన మార్పులకు లోనయింది. ఈ భారీ మార్పుకు మూడు ముఖ్య కారణాలు పేర్కొనవచ్చు. ఇంతకు ముందే ప్రస్తావించినట్లు భూమి సర్వే, యాజమాన్య నిర్ధారణ పూర్తికావడం, వివిధ కౌలుదారీ చట్టాల వల్ల న్యాయ వ్యవహారాలు పెరగడం, చివరగా భూమి శిస్తు తగ్గిపోయి, రాజ్యాంగ పరమైన సంస్కరణలకు ప్రాధాన్యం పెరగడం ఈ కారణాలుగా చెప్పవచ్చు. రెండవ మరియు మూడవ కారణాలను గురించి ఇక్కడ ప్రధానంగా చర్చించడం జరిగింది.

రెవెన్యూ అధికారుల న్యాయ సంబంధమైన విధుల ప్రభావం ఆయా ప్రాంతాలలోని చట్టాలననుసరించి వేర్వేరుగా ఉండేది. ఇందుకు సంబంధించిన అధ్యాయాలలో ఈ వివరాలను గమనించవచ్చు. బెంగాల్ తరహా పద్ధతి అమలులో ఉన్నచోట సివిల్ కోర్టులు సంబంధిత బాధ్యతలను నిర్వర్తించేవి. చట్టపరమైన కౌలుదారీ విధానం అమలులో వుండి హక్కుల రికార్డులు తయారుచేయడం, భాటకాన్ని నిర్ణయించడం వంటివి రెవెన్యూ అధికారుల చేతుల్లో వుండటం, కౌలుదార్ల పరిరక్షణకు ప్రధాన ఆధారాలు ఐయినచోట అధికార్లు, వారి న్యాయస్థానాలు ఈ భారాన్ని మోయవలసి వచ్చేది. ప్రారంభ కాలంలో రెవెన్యూ వసూలుకు ప్రధాన బాధ్యత వహించేందుకు తగినట్లు కలెక్టర్‌గా వ్యవహరించబడే జిల్లా అధికారి రాను రాను న్యాయ పాలకునిగా తయారయ్యాడు. యాజమాన్య నిర్ధారణ, శిస్తు మదింపు, వసూలు వంటి అంతర్లీనంగా ఉన్న బాధ్యతలు క్రమంగా అంతరించిపోతున్న తరుణంలో కొత్త బాధ్యతలతో ముందుకు వచ్చిన జిల్లా అధికారి వల్ల రెవెన్యూ యంత్రాంగం సరికొత్తగా జీవం పోసుకున్నది. రెవెన్యూ న్యాయ స్థానాల, సివిల్ కోర్టుల మధ్య సంబంధం సమస్యాత్మకంగా వుండేది. ఈ రెండింటికి సంబంధించిన అధికార పరిధి సరిగా నిర్ధారింపబడక పోవటం వల్ల తెలివైన తగాదాగా న్యాయస్థానాలతో దోబూచులాడుతుంటే, నిరక్షరాస్యుడైన రైతు ఈ రెండింటి మధ్య చిక్కుకు పోయేవాడు. ప్రారంభంలో చాలా సులభమైన అధికార విభజన జరిగింది. బాధ్యతల అమలుకు సంబంధించిన సాధారణ నిబంధనలన్నింటిని రెవెన్యూ యంత్రాంగం తయారు చేసింది. రెవెన్యూ మదింపు, వసూళ్ళలో తమ ప్రయోజనాలకు అనుగుణంగానే గ్రామీణ సమాజాన్ని అంచెలు అంచెలుగా వర్గీకరించారు. అయితే, వ్యక్తిగతమైన ప్రత్యేక సమస్యలను న్యాయస్థానాలకు వదిలివేయడం జరిగింది. ఈ మొత్తం వ్యవహారంలో రెవెన్యూ యంత్రాంగం న్యాయస్థానాల పరిధి నుండి మినహాయించబడింది. వ్యక్తిగత ఆస్థి హక్కులకు సంబంధించినంత వరకు ఈ యంత్రాంగం అంతిమ తీర్పుకు కట్టుబడలేదు. రెవెన్యూ యంత్రాంగం వ్యవహారాలను యథాతథంగా నిర్వహించడానికే ప్రయత్నించింది. న్యాయమూర్తుల నిర్ణయాలలో తలదూర్చటానికి ఇష్టపడలేదు. ఈ రకమయిన శ్రమ విభజన ఫలితంగా రెవెన్యూ అధికారులు, న్యాయ వ్యవస్థ రెండూ ఒకే విధమైన ప్రయోజనాన్ని అందించాయి. శాసనాల రూపకల్పనను వీరు ఇష్టపడలేదు. శాసనాల వల్ల తమకున్న విచక్షణాయుత అధికారాలు పరిమితమవుతాయని ఆందోళనచెందారు. రెవెన్యూ యంత్రాంగం చాలా కాలం కొన్ని నియమాల ఆధారంగా పని చేసింది. తుదకు భూమి శిస్తు నియమావళిని శాసన సభ చట్టం రూపంలో ఆమోదించిన తర్వాత రెవెన్యూ అధికారులు చేసే శిస్తు మదింపు వంటి చర్యల ఖచ్చితమైన ప్రామాణికతను నిర్ధారించే ఎలాంటి విధానం ఇందులో

పొందుపరచలేదు. సాధారణ వ్యవహారానికి సంబంధించిన విషయాలను మాత్రమే ఇందులో చర్చించడం జరిగింది. న్యాయమూర్తులు శాసనాలను పూర్తిగా అయిష్టపడేవారు. ఈ శాసనాలు తమ న్యాయపరిధితో పోటీ పడతాయని భావించారు. అందుకే దాదాపు ప్రతి శాసనాన్ని న్యాయస్థానాల తీర్పులలోని ఏదో ఒక తదనుగుణమైన అంశాన్ని.ఆధారంగా చేసుకొని వాటిలోని లోపాలను ఎత్తి చూపడం ద్వారా ప్రతీకారాన్ని తీర్చుకోవడానికి ప్రయత్నించేవారు. బిల్లులను రూపొందించడంలో లోపభూయిష్టత, బిల్లులను సెలక్టు కమిటీలకు పంపించడం, వాటిని అనేక సార్లు పరిశీలించడం వంటివి న్యాయమూర్తులకు వృత్తి పరమైన ప్రతీకారం తీర్చుకునేందుకు అవకాశం దొరికింది.

రైతాంగం ఆందోళనా పథం చేపట్టడంతో రెవెన్యూ యంత్రాంగానికి, న్యాయ వ్యవస్థకు గతంతో అంతంత మాత్రంగా ఉన్న సంబంధం పూర్తిగా విచ్ఛిన్నమయింది. ఉన్నత స్థాయి పౌర అధికారులు, రెవెన్యూ యంత్రాంగానికి పూర్తి అండగా నిలిచి పరిష్కారం కోసం తీవ్ర కృషి చేసారు. మారిన పరిస్థితులలో రెవెన్యూ యంత్రాగానికున్న సాధారణ అధికారాలు సరిపోవని, యంత్రాంగానికి మరిన్ని అధికారాలు కల్పించే విధంగా శాసనాలను రూపొందించారు. శాసనాలు రూపకల్పన చేయడం ఇబ్బందికరమైన వ్యవహారమే. ఇవి పరిష్కారం చూపడానికి బదులుగా, సందేహాలకే తావిచ్చాయి. మద్రాస్ ప్రభుత్వం కొత్త శాసనంలోని సూచనలను అన్నింటిని వాడుకలోకి తేవటానికి కావాలనే అలస్యం చేసింది. శాశ్వత ఒడంబడిక ఆచరణలో వున్న బెంగాల్‌లో సంప్రదాయ రెవెన్యూ యంత్రాంగం జాడలు కన్పించవు. ఉత్తర భారతదేశం శాసనాల రూపకల్పనకు అధికారులే ముందుకు వచ్చారు. కేంద్ర ప్రభుత్వంలో వీరికి ప్రాబల్యం అధికంగా ఉండటంతో ఇతర ప్రాదేశిక ప్రాంతాల అధికారులు ఏం చేయాలో బోధించడానికి ఎంతో ఆసక్తి చూపేవారు. ఇతర ప్రాంతాల అధికారులు ఇందుకు సంబంధించి ఎన్నో రకాల ప్రశ్నలు గుప్పిస్తూ ఇబ్బందుల పాలు చేసేవారు. సంప్రదాయ రెవెన్యూ పద్ధతులను అనుసరించే ఈ అధికారులు సంతృప్తికరమైన సమాధానాలు ఇవ్వలేక నగుబాట్ల పాలయిన సందర్భాలు అనేకం. బొంబాయి ప్రభుత్వ యంత్రాంగం తమ రైతు రుణగ్రస్తత వల్ల జరిగిన భూమి బదిలీల స్థితికి సంబంధించిన పూర్తి సమాచారాన్ని కేంద్ర ప్రభుత్వానికి అందించలేకపోయింది. ఎందుకంటే వీరి రెవెన్యూ రికార్డులు ఇలాంటి మార్పులను నమోదు చేసేందుకు వీలుగా రూపకల్పన చేయబడలేదు. హక్కుల రికార్డుల సమస్యను చర్చించేటప్పుడే దీన్ని గమనించడం జరిగింది. ఒకప్పుడు రెవెన్యూ వ్యవహారాలపై ఉదారమైన నియంత్రణగా భావించిన ఈ శాసనాలు, అత్యంత లోపభూయిష్టంగా తయారయ్యాయి.

శాసనాల ద్వారా రెవెన్యూ అధికారుల విధులు, బాధ్యతల పరిధి విస్తృత పరచటానికి ప్రయత్నించిన పాలకులు తమ ముందు తరాల అవగాహనలోపం వల్ల చేసిన పొరపాట్ల ప్రభావం తమ అధికారుల కార్య సరళిపై ఏర్పరిచే పరిమితులను పరిగణలోకి తీసుకోవలసి వచ్చింది. ప్రారంభ దశలో జారీ చేసిన ఆస్తి హక్కులను ఒక్క కలం పోటుతో వెనక్కి తీసుకోవడం

సాధ్యమయ్యేది కాదు. బ్రిటిష్ వారి చట్టపరమైన, పాలనా సంబంధమైన సంప్రదాయ ఒప్పందాలు కుదుర్చుకోవడంలో స్వేచ్ఛ ప్రధాన సారాంశంగా భారతదేశంలో పని చేస్తుండటంవల్ల ఆత్రుతగా రూపొందించే సంస్కరణలతో ఈ పద్ధతులను కొంతమేర్కైనా పరిమితం చేయడం అంత సులభమైనదేం కాదు. గతంలో జరిగిన ఒప్పందాలను, అవి సృష్టించిన వాస్తవ పరిస్థితులను - గౌరవించాల్సిన అవసరం వున్నది. హెన్రిమెయిన్ పంజాబ్‌లో గత ఒప్పందాలను సమీక్షించటాన్ని తీవ్రంగా ఆక్షేపించాడు. ప్రతి పది, ఇరవై సంవత్సరాల కొకసారి ఓ యువ బృందం రంగంలోకి ప్రవేశించి పూర్వపు ఒప్పందాలలో లోపాలున్నాయని భావించి వాటిని సరిచేయడానికి ప్రయత్నించటం, సమాజానికి మౌలికంగా పునాదులుగా ఉన్న అన్ని ఆస్తి హక్కులను పునర్నిర్మాణం చేయటానికి పూనుకోవడంలో గల నిబద్ధతను అధిక్షేపించాడు. కమ్యూనిస్టులు సయితం ఇలాంటి ఊహలను తమకలలోకి ప్రవేశించటానికి కూడా ఇష్టపడక పోవచ్చునని వ్యాఖ్యానించాడు.

20వ శతాబ్దంలో పాతవాటికి తోడుగా నూతన ఒప్పందాలు చోటుచేసుకున్నాయి. రాజ్యాంగ సంస్కరణలు భూసంబంధిత శాసనాలు ప్రాదేశిక ప్రాంతాలకు సంబంధించిన విషయంగా మార్చాయి. శాసన మండలంలో చేరిన ప్రతినిధులు స్వీయ ప్రయోజనాల కోసం పాలనా యంత్రాంగం ప్రవేశ పెట్టిన బిల్లులను నిరోధించడమో, భారీగా మార్పులకు గురి చేసేందుకు ప్రయత్నించడమో 1868, పంజాబ్ కౌలుదారీ చట్టానికి, మెజారిటీ భూస్వాముల ప్రాబల్యంగల సంయుక్త ప్రాదేశిక ప్రాంతాల శాసన మండలి రూపొందించిన 1921, ఔధ్ భాటక చట్టం మధ్య తీవ్రమైన తేడాలున్నాయి. అన్ని ప్రధానమయిన కౌలుదారీ చట్టాలను 19వ శతాబ్దిలోనే చట్ట సభలలో భారత దేశ ప్రయోజనాలు అతి అరుదుగా ప్రతిబింబించబడిన రోజులలోనే ఆమోదింపజేసుకోవడం పాలనా యంత్రాంగానికి అంతులేని ఆనందాన్నిచ్చింది. 20వ శతాబ్దంలో ఆమోదించబడిన శాసనాలన్ని దాదాపు ప్రత్యేక సవరణలు మాత్రమే. అయినా కొన్ని సందర్భాలలో ఈ సవరణలు యంత్రాంగానికి తలనొప్పిగా పరిణమించక తప్పలేదు. రాజ్యాంగ సంస్కరణలు రెవెన్యూ నియమావళిని మరింత నిశిత సమీక్షకు గురిచేసాయి. 1920లలో రెవెన్యూ మదింపు సూత్రాలను చట్టపరమైన నిర్వచనం ఇవ్వాలని నిర్విరామంగా వాదన మొదలయింది. అప్పటి వరకు ఈ సూత్రాలకు ఎలాంటి చట్ట బద్ధత లేదు, కేవలం కార్యనిర్వాహకుల విచక్షణ ప్రకారమే జరిగాయని ప్రత్యేకంగా ప్రస్తావించనక్కరలేదు. నూతన శాసన మండలుల రెవెన్యూ అధికారులను వాస్తవాలను తమ ముందుంచాల్సిందిగా ఒత్తిడి చేసాయి. ఈ ఒత్తిడి ఫలితంగా సంబంధిత శాసనాలను అంగీకరించడమే కాక మదింపు రేట్లను కూడా తగ్గించారు. ఈ రకమైన వారి స్పందనకు, ఈ మధ్య కాలంలోనే ప్రభుత్వ బడ్జెట్‌లో భూమి శిస్తుకు గతంలో ఉన్న ప్రాధాన్యత బాగా తగ్గిపోవడం ఒక బ్రిటిష్ ఇండియా ప్రభుత్వానికి భూమి శిస్తే ఏకైక ప్రధాన ఆధారమని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవాలి.

నాలుగవ అధ్యాయం

# సంప్రదాయం - పోటీ

బ్రిటిష్‌పరిపాలకుల రెవెన్యూ మదింపు, విధాన నిర్ణయాలు ప్రధానంగా పోటీ తత్వాన్ని ఆధారం చేసుకొని ఉద్భవించినటు వంటివి. భాటకం పరపతి సంబంధమైన అంశాలను తమకు అనుగుణంగా మలచుకోవడంలో ఆర్థిక విధానపు సారమంతా 'పోటీ' చుట్టే పరిభ్రమించింది. ఏ హక్కులు లేని కౌలుదార్లను పోటీ మార్కెట్‌కు గురిచేసి, వారు చెల్లించే మార్కెట్‌రేట్ల ఆధారంగా భాటకమిచ్చే ఆస్తుల విలువ అంచనా వేయడానికి ఉత్సుకత చూపారు. బ్రిటన్‌కు చెందిన బ్యాంకర్లకు భిన్నమయిన రీతిలో భారతదేశపు వడ్డీ వ్యాపారులు అక్రమ విధానాలు అనుసరిస్తున్నా, వారందించే గ్రామీణ పరపతి, శిస్తు వసూళ్ళు సాఫీగా జరగటానికి తోడ్పడటంతో బ్రిటిష్‌పాలకులు చూసిచూడనట్లు వ్యవహరించడం, అవసరమయినప్పుడల్లా వడ్డీ వ్యాపారులకు సంపూర్ణ మద్దతునివ్వడం గమనించవచ్చు. ఒప్పందాలు కుదుర్చుకోవడంలో భూస్వామి, కౌలుదారు పూర్తి స్వేచ్ఛను అనుభవించగలిగేవారు . మార్కెట్ శక్తుల ప్రాబల్యం, ఇట్టి ఈ రకమయిన ఒప్పందాలు పరస్పర ప్రయోజనకారిగా వుండేలా చూసేందుకు సహకరించేవి. మార్కెట్ రేటు కంటె తన కౌలుదారు తక్కువ భాటకం చెల్లిస్తున్నాడని భావిస్తే, ఆ వెంటనే భూస్వామి భాటకం రేటును పెంచేవాడు. ఏరకంగా చూసినా ఇది భూస్వామి హక్కుగానే గుర్తించబడింది. మార్కెట్‌లో ద్రవ్యానికి వుండే డిమాండును బట్టి వడ్డీ వ్యాపారి తన వడ్డీ రేట్లను సవరించినట్లే, భూస్వామి భాటకం రేట్లను సర్దుబాటు చేసేవాడు. భూమి నుండి తొలగింపుకు సమన్లు జారీ చేయడం న్యాయస్థానాలనుండి డిక్రీ తేవడం భూస్వామి,వడ్డీ వ్యాపారుల ప్రధాన, శక్తివంతమైన ఆయుధాలుగా ఉపయోగించబడినవి. భూస్వామికి కౌలుదారుకు, కౌలుదారుకు వడ్డీవ్యాపారికి మధ్య ఏర్పడే ఒప్పందాలను పరిరక్షించేందుకు బ్రిటిష్‌న్యాయ వ్యవస్థ వీటిని సృష్టించింది. ఒప్పందంలో భాగస్వాములయిన ఇరు పక్షాలు, సంబంధిత పత్రాలలో నిర్దుష్టంగా పొందుపరచబడిన నియమ నిబంధనలను గౌరవించి, అంగీకరించి కట్టుబడివుండాలే తప్ప ఇతరత్రా ఆలోచనలకు, నిర్ణయాలకు ఎలాంటి అవకాశం లేదు. ఒక పక్షానికి అనుకూలంగా ఉండే ఇలాంటి నియమ నిబంధనల వల్ల పోటీతత్వం సంఘర్షణలకు నిలయంగా మారింది. ఇరుపక్షాలు ఏరకంగాను సమానులు కాకపోయినా, వారిని అలా చూపించడానికి ఒప్పందంలోని నిబంధనలద్వారా విఫల ప్రయత్నం చేయడం జరిగింది. ఆయా ఒప్పందాలలోని ప్రత్యేక అంశాలను ఇరు వర్గాలవారు అర్థం చేసుకోగలుగుతారని, తమ వ్యక్తిగత ప్రయోజనానికి ఏ మాత్రం విరుద్ధమైన, అలాంటి ఒప్పందాలకు దూరంగా వుండేందుకు కూడా ఇరువురికి సమాన అవకాశాలున్నాయనే భ్రమ

కల్పించడం జరిగింది. స్వేచ్ఛా మార్కెట్ వ్యవస్థకు ఆపాదింపజేయ బూనటం పూర్తిగా అసంగతమైనదని చెప్పవచ్చు. నిరక్షరాస్యుడు నిరుపేద కొద్దో గొప్పో అవకాశమున్న మేరకు భూమిని దున్నుకుంటూ, రెవెన్యూ అధికారి, భూస్వామి, వడ్డీ వ్యాపారుల షరతులకు తలవంచుతు, వారి ఆధి పత్యానికి లోబడి వుండాల్సిన పరిస్థితులను ఎదుర్కునే గ్రామీణ రైతుకు ఒప్పందాల ఏర్పాటులో, వాటి అమలులో ఏ మేరకు అవకాశం వుంటుందో గ్రహించడం అంత కష్టమయినదేమి కాదు.

కుదుర్చుకున్న ఒప్పందాలు, పోటీతత్త్వం వాటి యధార్థ రూపంలో పని చేయకపోగా, వాటిని అలా పని చేయించటానికి చేసిన బలవంతపు ప్రయత్నం వల్ల వాస్తవ పరిస్థితులలో అస్పష్టత చోటుచేసుకున్నది. ఈ మొత్తం వ్యవహారాన్ని మూల గ్రంధాన్ని ఒక భాషలో నుండి మరో భాషలోకి తప్పుడుగా అనువదిస్తూ, ఆ తప్పులకు మౌలిక స్వభావాన్ని అంటగట్టడం, వాటికి అర్థవంతమైన వ్యాఖ్యానాలు చేస్తూ మరింత అస్పష్టతకు గురిచేయ్యడంతో సరిపోల్చవచ్చు. భూస్వామికి రైతు చెల్లించే భాటకాన్ని పరిశీలించి, ఆ మొత్తం పెరిగినట్లుగా ఊహించుకొని, వాటినే మార్కెట్ భాటకం రేట్లుగా నిర్ధారిస్తూ లెక్కగడతాడు. కాస్త నిశితంగా పరిశీలిస్తే, రైతు చెల్లించే రేట్లలోగాని, వాటి పెంపుదలలోగాని ఎక్కడా సారూప్యత కనపడదు, ఇదంతా అసలు మార్కెట్ రేటు నిర్ధారణనే సవాలు చేస్తుంది. రైతుకు, వడ్డీ వ్యాపారికి మధ్య వ్యవహారాలలో కూడా రుణాలు తీసుకోవడం 'విచ్చలవిడి తనంగా' మారనంత వరకు దాన్ని ద్రవ్య వ్యవస్థ పనితీరులో ఒక భాగంగానే గుర్తిస్తారు. ఒక వేళ అలాంటిదే జరిగితే దాన్ని అజాగ్రత్త చర్యగా అభివర్ణించడం చూడవచ్చు.

గ్రామీణ భారతదేశంలోనికి బ్రిటిష్ విధానం క్రమంగా చొచ్చుకొనిపోవడం, దానికి రైతాంగం నుండి ప్రతిక్రియచాలా ఆలస్యంగా రావడాన్నిబట్టి, బ్రిటిష్ పాలన ప్రభావానికి వ్యతిరేకంగా తీవ్ర ప్రతిఘటన చెలరేగటానికి, సంఘర్షణలు తలెత్తడానికి దేశవ్యాప్తంగా అశాంతి ఆంధోళనలు వ్యాప్తి చెందడానికి దశాబ్దాలే దొర్లిపోయాయని స్పష్టమవుతుంది. అయితే, ఈ సంఘర్షణ బ్రిటిష్ వారు ఆశించిన తరహా రేట్లు పెంచడం, పరపతి సరఫరాను నియంత్రించటం వల్లనే ఈ ఘర్షణలు చోటు చేసుకున్నాయి. పూనా సమీపంలోని కొన్ని దక్కన్ జిల్లాలలో, బెంగాల్‌లోని పబ్నా జిల్లాలో తలెత్తిన రైతాంగ ఆంధోళన హింసాత్మక రూపంలోనికి మారినా, ఆయా ప్రాంతాలలోని దుర్భర పరిస్థితులను ప్రస్ఫుటం చేయలేకపోయాయి. రైతాంగంలో వెల్లుబికిన అసంతృప్తి బహిరంగ ఆంధోళనకు దారి తీసిన పరిస్థితులను తరువాత చర్చించటం జరిగింది. ఈ పరిస్థితులు కొన్ని సాధారణ లక్షణాలను కలిగివున్నాయి. ఆర్థిక దృక్పథంలో అనుకోని మార్పులు సంభవించడం, ఆయా వర్గాల మధ్య ఘర్షణలను ప్రేరేపించే ప్రభుత్వ చర్యలు, రైతాంగాన్ని ఆగ్రహానికి గురిచేసే ప్రభుత్వపు

నిర్దుష్ట విధానాలను ఈ లక్షణాలుగా పేర్కొనవచ్చు. రైతాంగ ఉద్యమాలు అక్కడక్కడ సంభవించటం వల్ల, వాటికి అవే ప్రత్యేక లక్షణాలను సంతరించుకోవడంవల్ల బ్రిటిష్ వారు తమను తాము కొంత రక్షించుకోగలిగారు. ఇవే ఉద్రిక్తతలు బ్రిటిష్ వారు ఊహించిన రీతిలో అంతర్జాతీయ పోటీ ఫలితంగా ఏర్పడినవయి ఉండినట్లయితే, వారి ప్రభుత్వ పునాదులు ఎన్నడో సమూలంగా పెకిలించబడేవి. భాటకం రేట్లను, పరపతి నిలుపుదలను రైతాంగం పూర్తి అసంగతమైన చర్యలుగా భావించి, అన్ని రకాల నిబంధనలను ఉల్లంఘించారు. కొన్ని ప్రాంతాలలో రైతాంగం భూస్వాములు విధించే హెచ్చు భాటకం రేట్లతో పాటు వడ్డీ వ్యాపారులు విధించే అక్రమ వడ్డీ విధింపుకు గురికావలసివచ్చేది. కొన్ని ప్రాంతాలలో భూస్వాములే వడ్డీ వ్యాపారులుగా వ్యవహరించారు. మరికొన్ని సందర్భాలలో భూస్వాములు లేదా అధిక సారవంతమైన కమతాలుగల వారు తక్కువ భాటకం రేటు విధించినప్పటికీ, తమ స్వలాభాపేక్షతో కౌలుదార్లను వాణిజ్య పంటలు పండించాల్సిందిగా నిర్బంధపెట్టేవారు. తమ నిబంధనను అమలులో పెట్టని వారిని భాటకం రేటుపెంపుదల పేరుతో లొంగదీసుకోనేవారు. వాణిజ్య పంటలు పండించాల్సిన ఒత్తిడి వల్ల అధిక పెట్టుబడుల కోసం వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలో చిక్కుకోవలసి వచ్చేది. ఉత్తర భారతదేశపు తరహా భూస్వాములు లేని రైతువారీ పద్ధతి ఆచరణలో వున్న దక్షిణాది ప్రాంతాలలో బ్రాహ్మణులు, ధనిక రైతులు వడ్డీ వ్యాపారుల పాత్రను పోషించారు. అక్కడక్కడ మార్వాడీలు తమదైన శైలిలో పరపతి సమకూర్చే యంత్రాంగాన్ని నెలకొల్పుకున్నారు. వీరు విధించే వడ్డీరేట్లు వేర్వేరుగా వుండేవి. వీళ్ళ ఉద్దేశ్యంలో వడ్డీరేటు అంటే రుణగ్రహీతల ఉత్పత్తి నుంచి క్రమం తప్పకుండా ఆదాయాన్ని సంపాదించుకోవడమే అని అర్థం. ఋతువులను బట్టి వడ్డీరేట్లు మారుతుండేవి. ధృఢతర రెవెన్యూ విధానం కంటే వడ్డీ వ్యాపారుల పరపతి మదింపు, వసూళ్ళు సరళంగా వుండేవి.

వ్యవసాయ మిగులు తమ హస్తగతం చేసుకోవడం కోసమే రెవెన్యూ అధికారులు మరియు వడ్డీ వ్యాపారుల మధ్య పోటీ ఉండేది. మొదట వడ్డీ వ్యాపారులను తమ పాలనా విధానానికి సమర్ధకులుగా, సహాయకులుగా భావించిన రెవెన్యూ యంత్రాంగం, క్రమంగా వడ్డీ వ్యాపారులు వ్యాపారాన్ని విస్తరింప జేసుకుంటూ తమ స్థానాన్ని మరింత పదిలపరచుకుంటుంటే, రెవెన్యూ మదింపును అదే స్థాయిలో పెంచుకోలేక పోవడంతో శత్రుత్వవైఖరిని ఏర్పరచుకున్నారు. భూమి శిస్తును అధికమొత్తంలో చెల్లించడానికి ఇష్టపడని భూస్వామి తన ఆదాయాన్ని మరింత పెంచుకోగలగడాన్ని గమనించి భూస్వామి పట్ల కూడా అదే రకమయిన శత్రుత్వ స్వభావాన్ని ప్రదర్శించారు. ఈ రకమయిన నిరసన, వ్యతిరేకత ముఖ్యంగా బెంగాల్‌లో ప్రబలంగా వుండేది. శాశ్వత ఒప్పందాలు గల భూస్వాముల నుండి ప్రభుత్వం అదనంగా ఆదాయాన్ని పొందలేకపోవడంతో, దాన్ని పెంచే మార్గం అంతుబట్టక పోవడంతో రెవెన్యూ అధికారులు

భూస్వాములకు శ్రద్ధ వహించారు. వడ్డీ వ్యాపారుల విషయంలో మాత్రం పాలనా యంత్రాంగం జాగరూకతతో వ్యవహరించేది. పరపతి సరఫరాపై నియంత్రణ మొత్తం రెవెన్యూ వ్యవస్థనే నష్టపరుస్తుందేమోనని సహజంగా భయపడేవారు.

వ్యక్తిగత రైతుపై భూమి శిస్తు, భాటకం మరియు పరపతి నియంత్రణ వంటి విధానాల ప్రభావం అయా స్థానిక పరిస్థితులను బట్టి జీవ సంబంధమైన నిర్ధారణలను బట్టి వేర్వేరుగా వుండేవి. రుణగ్రహీత వర్తమాన రుణ భారంతో పాటు వంశపారంపర్యంగా వచ్చిన రుణగ్రస్తతను కూడా భరించవలసి వచ్చేది. వ్యవస్థలో వివిధ వర్గాల మధ్య సరియైన పోటీగాని, సంఘర్షణకు సరియైన కారణంగాని కన్పించేవి కావు. పర్యావరణ సంబంధమైన, వ్యవస్థా పూర్వకమైన, ఆర్థిక సంబంధమైన తమ వ్యక్తి గత పరిస్థితులలో ఎన్ని వైరుధ్యాలున్నా వారు ఐక్యత సాధించటానికి ఆందోళనలు తలెత్తడానికి కారణభూతమయినాయి. భారత దేశరైతాంగ వ్యవసాయంలో తలెత్తిన ఇలాంటి సమస్యలు తమ వ్యక్తిగత పరిస్థితులలో ఎన్ని వైరుధ్యాలున్నా వారు సంఘటితమయ్యేందుకు దోహదం చేసాయి. ఇలాంటి ఆందోళనలు మళ్ళీ తలయెత్తకుండా పరిష్కార మార్గాలు చూపే విధంగా ఒక నిర్ణయానికి రావడం బ్రిటిష్ ప్రభుత్వం అనేక ధృక్కోణాలనుండి పరిశీలించింది. భారతదేశ ఆచార సాంప్రదాయాలు ప్రముఖంగా ముందుకు తీసుకవస్తూ తమ భవిష్యత్ విధానానికి వాటిని మార్గదర్శకంగా ఉపయోగించుకోవడం జరిగింది.

## 4.2 సాంప్రదాయంకోసం అన్వేషణ

నూతన పోటీ ప్రపంచంపట్ల భారత దేశ రైతు అసంతృప్తంగా వున్నట్లయితే, ఒప్పందాలు కుదుర్చుకోవడంలోవున్న స్వేచ్ఛ, సంఘర్షణలను న్యాయస్థానాల పరిధిని దాటని విధంగా అదుపు చేయలేకపోయినట్లయితే, భారత దేశపు ఆచారాల సాంప్రదాయాల విజ్ఞతను, పరస్పర విరుద్ధమైన ప్రయోజనాల మధ్య సమతూకం సాధించేందుకు, తద్వారా తమ ప్రభుత్వాన్ని స్థిర పరచుకొనేందుకు ఉపయోగించుకోవడం జరిగింది. గ్రామీణ వాతావరణంలో ప్రమాద సూచికలు పొడగట్టడంతో సాంప్రదాయాల పట్ల ప్రభుత్వం మొగ్గు చూపింది గతంలో కంటే ఇప్పుడు అలాంటి ఆచార, సాంప్రదాయాల పట్ల బ్రిటిష్ పాలకుల ఆలోచనలు, ఆసక్తి మరింత పెరిగాయి. 19వ శతాబ్దపు మొదటి అర్థ భాగంలో స్వేచ్ఛ ఉపయుక్తత విశ్వాసంతో కూడిన వీరి ఆలోచనా సరళి ఆ తర్వాతి కాలంలో పూర్తిగా సంప్రదాయ సిద్ధమైన ఆలోచనా ధోరణివైపు పయనించింది. ఇది భారతీయ సంప్రదాయం, ఆచార వ్యవహారాలను అధ్యయనం చేసే అవకాశాన్ని కల్పించింది.

భారతీయ సాహిత్యం, సాంప్రదాయక చట్టాలు, మతపరమయిన విశ్వాసాల పట్ల నిశితమైన ఆసక్తి చూపించిన వారిలో వారెన్ హేస్టింగ్స్, విలియమ్ జోన్స్‌లను ప్రముఖంగా పేర్కొనవచ్చు. యూరోపియనేతర సంస్కృతుల పట్ల జ్ఞాన సముపార్జన, అభివృద్ధికి ప్రయత్నిస్తున్న కాలంలో వారు స్పష్టమైన అవగాహనను నిష్కపటతను ప్రదర్శించారు. హిందూ చట్టాన్ని క్రోడీకరించటానికి జోన్స్ చేసిన కృషి ఈ దిశగా జరిగిన వికాసవంతమైన మరియు ఒక సంక్లిష్టమైన ప్రయత్నంగా చెప్పవచ్చు. ఈ ప్రయత్నంలో భారతీయ సాంప్రదాయాలను కొంత తప్పుగా అర్థం చేసుకోవడం కూడా జరిగింది. భారత దేశ ప్రజలకున్న అలిఖిత సాంప్రదాయాలను క్రోడీకరించి చట్టరూపేణా రూపొందించడం వల్ల స్థానిక ప్రమాణాల ద్వారా వారిని అంచనా వేయడం మంచిదని న్యాయమూర్తి జోన్స్ భావించినాడు. అయితే ఆయన గ్రహించని అంశం ఒకటుంది. అంతవరదాకా సజీవ ప్రక్రియగా మిగిలివున్న సాంప్రదాయ విచక్షణను ఒకేసారి క్రోడీకరణ పేరిట పాతిపెట్టినట్లయ్యింది. మెకాలే తరం వారికి ఎటువంటి ఇబ్బందులు ఎదురుకాలేదు. భారతీయ స్థానిక సాంప్రదాయాలపై తనకున్న అజ్ఞానాన్ని గుర్తించకుండానే పెద్ద యెత్తున్న అధునిక చట్టాల పరికల్పనకు మెకాలే పూనుకున్నాడు. ఈ పరికల్పనా ప్రయత్నంలో భారతీయ సాంప్రదాయపు ఊసు ప్రస్తావనకు కూడా లేదు.

19వ శతాబ్ద కాలంనాటి బుద్ధిజీవులైన అధికారులు పాలనా అనువర్తనలో సాంప్రదాయ అచారాల వైపు దృష్టిని సారించినారు. దేశీయంగా జరుగుతున్న బౌద్ధిక జీవన పరిణామంలో వచ్చిన మార్పులు ఒక కొత్త ధోరణికి వరవడిని తెచ్చిపెట్టినాయి. మాక్స్‌ముల్లర్ రాసిన ''తూర్పు దేశాల పవిత్ర గ్రంథాలు'', ప్రాచీన తత్త్వపు సాపేక్షిక ప్రయోజనాలు, హెన్రీమెయిన్ రాసిన ''ప్రాచీన న్యాయ చట్టాలు'' ఇతనే రాసిన'' తూర్పు - పశ్చిమ్మాల్లో గ్రామీణ సముదాయాలు'' వంటి గ్రంథాలు నూతన బౌద్ధిక వికాసానికి దర్పణాలు. నూతనంగా ఆవిర్భవించిన ఈ బౌద్ధిక వికాసం, పురామానవ శాస్త్రపు నూతన సమాజ శాస్త్ర అవగాహన బ్రిటిష్ పరిపాలనా ఉద్యోగులను పెద్ద యెత్తున ప్రభావమొనర్చింది. ఇంకా కొంతమంది పురాశాస్త్ర వేత్తలు, పాలనాధికారులు దేశంలో వున్న ఆదిమ జాతుల, కులాల గురించిన అధ్యయనాలు చేసినారు. ఆదిమజాతులు, కులాల గురించిన సమాచారం సేకరించే నేపథ్యంలో పొందిన అనుభవం విధాన రూపకల్పనా - ఆచరణ స్థాయిల్లో సానుకూలంగా పనిచేసేందుకు ఉపకరించింది. బ్రిటిష్ పాలనా పూర్వదశలో వున్న ప్రదేశాలను జీవన విధాన పోకడలను గుర్తించడానికి ఈ అధ్యయనాలు పనిచేసినాయి. బ్రిటిష్ వారి రాకతో భారతీయ సమాజ సంపర్కం పొందిన ఫలితంగా ఏ పరిణామాలు చోటుచేసుకున్నాయో ఈ అధ్యయనాలు అంతగా తెలియచెప్పలేదు. భారతదేశ అధికార పాలక శ్రేణులకు సంబంధించిన వారు కావడంతో ఈ రకమైన బౌద్ధిక దృక్పథాన్ని అలవరచుకొనేందుకు అవకాశాలు తక్కువే. అందువల్ల మేధోపరమైన వికాసం వల్ల

ఊహించినంత పరివర్తన పాలకుల్లో రాలేదు. కానీ వారు తమ తమ నిర్ణయాలను తీసుకొనే ముందు స్థానిక సాంప్రదాయాల, వాస్తవాలను విస్మరించలేని స్థాయికి దోహదపడిన మాట వాస్తవం. ఈ వాస్తవాల్లో వున్న వైవిధ్యం వల్లనే ఒకే అధికారి భిన్న ప్రాంతాల్లో పనిచేసినపుడు ఒకచోట సాంప్రదాయ భాటక సిద్ధాంతాన్ని మద్దతు చేయవచ్చు.. మరొకచోట దానికి భిన్నంగా అభిప్రాయాన్ని వ్యక్తం చేసిన దాఖలాలుకూడా వున్నాయి.

సాంప్రదాయ వ్యవసాయక సమాజ సంబంధాల సంప్రదాయ రీతులపై అవగాహనను పెంపొందించాలన్న నిజనిర్ధారణ కమిటీలు నిరుత్సాహంగా మెనుదిరిగి వచ్చిన సందర్భాలున్నాయి. బెంగాల్ కౌలుదారీ చట్టాన్ని రూపొందించే కాలంలో వివిధ పరగణాల్లో వున్న భాటక రేట్లపై విచారణ జరిగింది. బ్రిటిష్ పూర్వ రెవెన్యూ విధానపు చిహ్నాల జాడలు లభ్యమయ్యే అవకాశాలు లేకుండా పోయినాయి. నిర్ణయించిన భాటకపు రేట్లు వివిధంగానూ ఒక తర్కానికి లోబడినవికావు. అవి కేవలం భూస్వామి కౌలుదారుకు మధ్య వున్న వ్యక్తిగత సంబంధం మీద ఏక్కువగా ఆధారపడినాయి. ఔధ్ ప్రాంతంలో కౌలుదారుల స్థితిగతుల పై జరిపిన అధ్యయనంలో ఏ విధంగా భాటకం వస్తు రూపం నుండి నగదు రూపంలో చెల్లించడం జరిగిందో వెల్లడయింది. వాటికి ఉపకరించిన ప్రమాణాలు కొన్ని వున్నాయి. అవి ;

1. పంట పొలంలో రాబోయే పంట అంచనాల్లో విభాగించిన మొత్తం.

2. వేసిన అంచనాలను నగదు రూపంలో గణించడం.

3. నగదురూపేణా వార్షిక భాటకాన్ని నిర్ణయించడం, అవసరమైతే వస్తు రూపంలో భాటకాన్ని చెల్లించే వీలును ఏర్పాటుచేయడం. పంట రాబడులలో నిమిత్తం లేకుండా దీర్ఘకాలిక సమయాన్ని ప్రమాణిక కాలంగా తీసుకొని భాటకాన్ని నిర్ణయించడం. ఈ నాలుగు రకాల ప్రమాణికాల ఆధారంగా ఏకకాలంలో పన్ను చెల్లించే ఆనవాయితీలు ఉండటం వల్ల నిర్దుష్టమైన సూచనలను తయారుచేయడం ఇబ్బందికరమైన అంశంగా మారిందని ఆనాటి అధికారులు అభిప్రాయపడ్డారు. గ్రామీణ సమాజంలో స్థిరమైన వ్యవసాయ సంబంధాల స్థాపనకు అధికారులు చేపట్టిన క్షేత్ర ఆధారాల అన్వేషణ స్థానిక సాంప్రదాయాల క్రోడీకరణ ప్రయత్నాలు పునరావృతంగా నీరుకారిపోయినాయి.

రచయిత మెట్‌కాఫ్ తెలిపినట్లుగా స్వయం పోషకత్వం కలిగిన, స్వయం పాలిత గ్రామీణ గణతంత్రాల పునర్ నిర్మాణం ద్వారా రైతాంగ సమాజ స్థిరత్వాన్ని కల్పించడం నాటి అధినేతల ఎజెండాలో ప్రముఖంగా కనిపించిన అంశం. గ్రామీణుల జీవితంలో భిన్న భాగంగా మిగిలిపోయిన 'పంచాయత్' వ్యవస్థ తనకున్న 'సహజ స్థానిక వివేచన ద్వారా'' కౌలుదారున్ని రక్షించడం, వడ్డీవ్యాపారస్తున్ని నిరోధించడం సవ్యంగా జరిపేదన్న భావన ప్రబలంగా ఉండేది.

అయితే, ఇటువంటి 'అదర్శ గ్రామీణ గణతంత్రం' ఎక్కడ అంతగా ఉనికిలో లేదని బలవంతులుగా వుండే కొన్ని కుటుంబాలు మిగితా ప్రజా శ్రేణులను నియంత్రించడం వల్ల సమాజం 'స్థిరంగా' ఉందన్న భావన కలిగే అవకాశముందని నాటి విమర్శకులు కొంత మంది భావించినారు. కానీ బ్రిటిష్ పాలనవల్ల భారతీయ గ్రామ సమాజం అనైక్యపరచ బడిందన్న భావనతో వున్న వారు గ్రామ సమాజాన్ని సమిష్టి యూనిట్‌గా ఉంచేందుకు పంచాయితీ వ్యవస్థ ఎంతగానో ఉపకరిస్తుందని భావించినారు. బ్రిటిష్ చట్ట సాంప్రదాయం, న్యాయమూర్తుల దయార్ధ్ర స్వభావం పుటల మేరకే పరిమితమయినందువల్ల నిజమైన న్యాయం స్థానిక గ్రామీణ స్థాయిలో వుండే సముదాయక సంస్థలనుండే స్వీకరించాలన్న వాదన బాగా బలపడింది.

సాంప్రదాయ వ్యవసాయ సంబంధాల స్థిరత్వం, గ్రామీణ సముదాయాల సాధారణ వివేచనా జ్ఞానాన్ని వినియోగించుకోవడమనే అంశాలతో పాటుగా ఆనాడు సమానంగా దృష్టికేంద్రీకరించబడిన అంశం పరాయీకరించబడుతున్న పూర్వీకుల భూమి. బ్రిటిష్‌పాలనా విధానం ప్రవేశ పెట్టిన భూఅమ్మక చట్టపు ఫలితమిది. భారతదేశంలో బ్రిటిష్ వారి భూ అమ్మకచట్ట పరికల్పన జరుగక ముందున్న పరిస్థితివేరు. భూనియంత్రణలో మార్పులు భారతదేశ చరిత్రలో అనుగుణ్యంగా మారుతూ వచ్చాయి. యుద్ధాల పరంపరలో ఊళ్ళను వదిలి క్రొత్త గ్రామాలను ఏర్పరచుకొన్నారు. పీడిస్తున్న పాలకుల భారినుండి పారిపోయి వేరొక ప్రాంతంలో ప్రజలు తలదాచుకొన్నారు. కాలం కలిసిరాగానే మళ్లీ పాత ప్రాంతాలకు తిరిగివచ్చి వదిలివెళ్ళిన భూములను తిరిగి సాగుచేసుకొన్నారు. బ్రిటిష్ పాలనా ఏర్పాటు ఆరంభంతో ఇటువంటి స్వేచ్ఛాయుతంగా పునరాక్రమించుకొనే వసతికానీ, అభీష్టాను సారపు భూకమతాలసాగుకానీ కొనసాగడ ం కష్టమై పోయింది. దేశవ్యాప్తంగా నిరంతరంగా ఒక నిర్దుష్ట చట్ట ప్రభావానికి లోనవుతూవచ్చింది.

భారతీయ సమాజ సాంప్రదాయంలో విలువైన అంశాలను రైతాంగ సమాజపు స్థిరీకరణకు వినియోగించాలన్న అభిప్రాయం కలిగిన వారందరూ కూడా విభిన్న పరిష్కార మార్గాలను అన్వేషించడం మొదలుపెట్టినారు. పరిష్కార మార్గాల అన్వేషణ అంత సులభం కాలేదు. పరిష్కార మార్గాల అన్వేషణ లక్ష్యాలలో ఏకత్వం వున్నా అవలంభించే సాధనాలలో ఏకాభిప్రాయం కుదరని సందర్భాలున్నాయి. పరిష్కార మార్గాలను అవలంబించే సాధనాల పట్ల, పరిష్కారమార్గాల పట్ల తీవ్రమైన వాదోపవాదాలు, చర్చలు జరిగినాయి.

**లక్ష్యాలు : సాధనాలు :-** భారతీయ గ్రామీణ సమాజంలో కొనసాగిన సంప్రదాయ స్థిరత్వాన్ని పునరుద్ధరించడానికి అవలంబించ వలసిన మార్గాల పట్ల బ్రిటిష్ పాలకులలో భిన్నాభిప్రాయాలు వున్నాయి. నిర్దుష్ట పరచవలసిన లక్ష్యాలపైన, నియమానుసారంగా కొనసాగే

మార్గాలపైన తీవ్రమైన చర్చ జరిగింది. ప్రధానమైన బేదాభిప్రాయాలు రెండు అంశాలపైననే కొనసాగినాయి. ఋణగ్రస్తులైన రైతులకు పరిహారాన్ని ఇచ్చే పద్ధతుల ఏర్పాటు, భూస్వామి - కౌలుదారుల మధ్య ఉండవలసిన సంబంధాల స్వభావం ఎలా ఉండాలన్న అంశంపైననే ఎక్కువగా అధికారుల మధ్య బేదాభిప్రాయాలు ఉత్పన్నమైనాయి. ఈ సమస్యలపై నియమాత్మకంగా కార్య నిర్వాహణ పద్ధతులను అవలంభించవలసి వుంటుందా అన్న అంశంపై కూడా భిన్నాభిప్రాయాలు వ్యక్తమైనాయి. నియమాత్మకంగా రైతాంగ సమస్యలను ప్రస్తుత పాలనా యంత్రాంగం సమర్ధవంతంగా ఎదుర్కోగలుగుతుందా అనే సంశయం కూడా వ్యక్త పరచడం జరిగింది. రైతాంగపు సమస్యలను ఎదుర్కోవడానికి సమగ్ర శాసన ప్రతిపాదనను బలపరిచినవారిలో కూడా న్యాయ- కార్యనిర్వహణాధికారులను నిర్వచించే విషయంలో ఎవరి ప్రాధాన్యతలు వారి కున్నాయి. వారి అధికారుల అనంగీకార మంత కూడా శాశ్వత ప్రాతిపదికపై శాసన పరహోదా ఇవ్వడమా? లేక నియమప్రాతిపదికపైన చర్యలను చేపట్టడమా? అనే మీమాంసపైననే ఆధారపడివున్నటువంటిది.

అనంగీకారాల స్వభావం ఎలా వున్న ప్రతిపాదించే పరిష్కారాల స్వభావం బ్రిటిష్, భారత చట్ట సంస్థల కార్య పరిధిగానే కొనసాగాలన్న అంశంపై ఏకాభిప్రాయం మాత్రం ఎప్పుడూ వుండేది. భూమి రెవిన్యూ వసూలుకు, భద్రతకు ఆస్థి, ఇతరేతర పరపతి భద్రత ఏర్పాటు ఉండడమనేది అంగీకరింపబడిన సత్యం, న్యాయస్థానాలు అవలంబించే ఏకార్యచరణ సూత్రావళి అయినా బ్రిటిష్ సాంప్రదాయాల నుండే స్ఫూర్తిగా పొందవలసివుంటుంది. దీనిని కాదనే అవకాశం ఏ ప్రత్యమ్నాయ పరిష్కార ప్రతిపాదనలోనైనా వుండదు. అట్లాగే న్యాయస్థానాల నిర్ణయాలపై ఏకపక్ష కార్యాచరణ వుండదు. భిన్న పాలన మూలస్వభావానికి ఆటంకం కలిగించే విధంగా వుండే ఏ ఏర్పాటు సమ్మతమైనదిగా పరిగణింపబడదు. ఒకవైపు న్యాయ వ్యవస్థల కుండే ప్రమేయాన్ని గౌరవిస్తూనే మరొక వైపు రెవిన్యూ యంత్రాంగపు ఉనికిని గుర్తించగలిగే సమాంతర పాలనా వైదుష్యాన్ని బ్రిటిష్ పాలన రంగం పాటించింది. రెవిన్యూ - న్యాయవ్యవస్థల పరస్పర స్వతంత్ర్య విధినిర్వహణ పరిధిని తిరస్కరించ లేక పోయింది.

ఈ సమాంతర వాదానికి వెనుకగా వున్న నిజ స్వభావపు పోకడలు అంత త్వరగా స్పష్టం కావడం కష్టమయ్యేది. ప్రతి అధికారి కార్యనిర్వహణలో పరిహార చర్యను చేపట్టే క్రమంలో ఒక నిర్దుష్టమైన ఆదేశానికి గురయ్యే విధిని నిర్వర్తించేవాడు. అట్లాగే ప్రతి న్యాయమూర్తి ఆయా అంశాలపై ప్రకటించే తీర్పులకూ అమితమైనగౌరవం విలువ కూడా ఉండేది. అయితే కార్యనిర్వాహకయంత్రాంగం మాదిరిగా న్యాయ వ్యవస్థ ఆదేశాలకు లోబడి వర్తించేదిగా ఉండదు. న్యాయమూర్తులు ఏ అధికార ఆదేశాలకు లోబడికాక, స్వేచ్ఛాయుతరీతిలో తీర్పునిచ్చే వీలుంటుంది కనుక వారు కేవలం విస్పపం చేసుకొనే హక్కుకు మాత్రమే లోబడి నడవ వలసి

వుంటుంది. ఐరోపా సాంస్కృతిక పక్షపాత విలువతో ప్రభావితమైన న్యాయ వ్యవస్థ మొదటగా భారతదేశంలో నగరాల్లో వెళ్ళూనుకొన్నది. క్రమేపి గ్రామాలకు విస్తరించే ప్రయత్నం చేసింది. అయితే, భారతీయ గ్రామాలు పూర్తిగా ఈ న్యాయ వ్యవస్థ కార్యపరిధిని మినహాయించలేక పోయినవి. అట్లాగని పూర్తిగా న్యాయవ్యవస్థ ప్రభావంలోకి వచ్చినాయని చెప్పడమూ కష్టమే. అందువల్ల గ్రామ ప్రాంతాల్లో ప్రత్యేక శాసన ప్రయత్నాలను చేపట్టవలసి వచ్చింది. ప్రత్యేక చట్టాలను రూపొందించి నిర్దుష్టమైన భౌగోళిక ప్రాంతాల వైవిధ్యాన్ని గుర్తులో వుంచుకొని అమలుపరుచవలసి వచ్చింది. కొన్ని అంశాలపైన మొత్తం బ్రిటిష్ భారతదేశమంతా ఏకమై నినదించినా వాటిని నిరోధించడానికి రాజ్య కార్యదర్శి, ప్రీవీకౌన్సిల్ శక్తి వంతమైన అధికార నిర్మాణాలుగా కొనసాగేవి. రాజ్య కార్యదర్శి అనేక అంశాలపై తనకుండే అసాధారణ 'వీటో' హక్కును వినియోగించేవాడు. బ్రిటిష్ అధికార ప్రయోజనాలకు భంగం కలిగించే ఏ అంశమైనా ఈ 'వీటోకు' గురి అయ్యేది. ప్రీవీకౌన్సిల్ సుదూరప్రాంతంలో వున్న అత్యున్నత శాసనాధికారమైనప్పటికి కొన్ని సందర్భాల్లో ఉపయుక్తంగా వ్యవహరించింది. ఒక వేళ ప్రీవీకౌన్సిల్ ఏ అంశంపైన అధిక్షేపణీయమైన స్థితికి కారకమైతే దానికి అంతిమంగా రాజ్యకార్యదర్శి ఆమోదం తెలుపవలసి వుంటుంది. కనుక, ఈ అవకాశాన్ని ఒక అంతిమ ఆధారంగా కూడా పరిగణించేవారు. అందువల్ల సుదూర ప్రాంతాల్లో ఇంగ్లాండులో వున్న అధికార నిర్మాణాల అనుమతి లేకుండా భారతీయ గ్రామ సమాజ సంప్రదాయాలే వీటిని పునరుద్ధరించడమనేది సాధ్యమయ్యే విషయం కాదు.

1860,70వ దశకంలో వచ్చిన పరివర్తనాయుత మార్పులు బ్రిటిష్ భారత సమాజాన్ని మరింత సరళతరం చేసి సమస్యల నివృత్తికోసం చేపట్టబడే పరిహార మార్గాల క్రోడీకరణను కష్టసాధ్యం చేసింది. అయినప్పటికీ పరికల్పితమైన క్రోడీకరణ అంతాకూడా స్వల్పంగా లభ్యమయ్యే చిన్నా చితక శాసనాల స్మృతి రూపొందించడం ద్వారా కాదు. జరిగిన క్రోడీకరణ అంత పౌర నియమాలు, శిక్షా చట్టాల, సాక్ష్యాధారాల లభ్యత, ఆస్తి బదిలీ - ఒప్పందాల ఏర్పాటు నిర్దుష్ట చట్టాల ఆచరణ వంటి అంశాల ఆధారంగా జరిగిందే. రూపొందించబడిన శాసనాల విషయ సారాంశపు సంపన్నత మెచ్చుకోదగింది. ఎందుకంటే చట్టాలన్నీ సమస్యను కేవలం చట్టపరంగా చూసే కార్యనిర్వాహకులు తయారు చేసినవికావు. వాటిని సమృద్ధిగా అనుభవం కలిగి కొనసాగుతున్న ఆచరణ విధానాలను సవరించాలనే అభిప్రాయం కలిగివున్న అనుభవజ్ఞులైన న్యాయమూర్తులు రూపొందించినటువంటివి. ఇట్లా రూపొందించబడిన చట్టాలు ఎంతో ప్రయోజనకరంగా మిగిలి వాటిని బ్రిటిష్‌వారు తదనంతరం ఆఫ్రికా దేశాలలో అన్వయించినారు, కూడా ఆవిధంగా ఈ చట్ట ప్రయత్నాలు కేవలం ఒక భారతదేశానికే పరిమితంకాకుండా విశ్వవ్యాపితమైన అన్వయింపు సందర్భాన్ని పొందినాయి.

ఇంత పెద్దయెత్తున క్రోడీకరించబడిన న్యాయ జ్ఞానం అంతంత మాత్రపు పరిహార చర్యల ప్రతిపాదనకు ఒక రకంగా అడ్డంకిగానే మారింది. భారతదేశంలో బ్రిటిష్‌పాలన మొదటి సంవత్సరాల కాలంలో పరిహార చర్యలకు సులభమైన విధంగా అన్వయించే వీలుండేది. దేశీయ

సాంప్రదాయాలను ఒకవైపు గుర్తించుకుంటూ, బ్రిటిష్ న్యాయ సూత్రాలను పాటిస్తూ స్థానిక ప్రజలకనసరమయ్యే రీతిలో న్యాయపరమైన నిర్ణయాలను న్యాయమూర్తులు తీసుకొనేవారు. రెవెన్యూపాలన అంతాకూడా రెవెన్యూ యంత్రాంగం రూపొందించిన కార్య నిర్వాహక చట్టాలతో కొనసాగింపబడేది. ఈ కార్యనిర్వాహక చట్టాలు చట్ట నిపుణుల సునిశిత పరిశీలనా పరిధిలో వచ్చేవికావు. దీనిపై హెన్రీమెయిన్ వ్యాఖ్యానిస్తూ తను ఒక పాలనా పరమైన ఉత్తర్వును చదువుతున్నప్పుడు అవి నిజానికి ఒక ఆదేశవు లేక వ్యంగ్యవ్యాఖ్యానం అనే విషయం అర్థం చేసుకోలేక పోయానని తెలిపినాడు. ఈ విధమైన అస్పష్ట సారాంశాన్ని కలిగి వున్న చట్టాలను అటు సవరించడంకానీ, రద్దు చేయడంకానీ జరిగేది కాదు. వాటికి అనుభందంగా నూతన చట్టాల జోడింపు కొనసాగేది ఏవేని అంశాలు ఈ చట్టాల పరిధిలో ప్రస్తావించబడనట్లయితే వాటిని రాబోయే చట్టాల పరికల్పనకో, అధికారుల వివేచనకో వదలివేసేవారు. అనతికాలంలోనే పైవిధంగా అధికారుల వివేచనకో రాబోయే కాలంలో కాబోయే చట్టాల వునికిని ప్రస్తావించని సమస్యలను వదలి వేసే రోజులు గతించినాయి. ప్రతీ చట్టప్రతిపాదన, పరిహార అంశం ప్రాంతీయ శాసన మండలి గవర్నర్ జనరల్ చర్చించే పరిస్థితి మొదలైంది. చర్చించబడి ఆమోదించబడిన ఏ చట్టమైనా అసంఖ్యాక అంశాలతో కూడుకొని వున్న క్రోడీరించబడిన చట్టాన్ని తట్టుకోవలసివుంటుంది. పరిహారచర్యలను సూచించేవారికి క్రోడీకరించబడిన అంశాల నుండి వచ్చే ముప్పుతక్కువగా ఉండేది. కార్యాచరణలో సరళత్వం పరిహార చర్యల్లో భాగంగా ఉంటుంది. శాసనాత్మక ప్రయత్నాల్లో జరిగి క్రోడీకరించబడిన అంశాల నుండి న్యాయమూర్తి ఎత్తిచూపితే శాసనప్రతి పాలనాకర్తలు అనుకోని ఇబ్బందుల పాలయ్యేవారు. పాలనాధికారులు ఈ ప్రమాదాన్ని పసిగట్టి ప్రతి ముసాయిదా బిల్లును న్యాయమూర్తుల పరిశీలనకు పంపేవారు. అయితే న్యాయమూర్తుల అభిప్రాయాలనేవి ఆయా కేసుకు సంబంధించిన యోగ్యతలను బట్టి ప్రస్ఫుటమయ్యేటు వంటివి. కనుక ఇదమిద్ధమైన రీతిలో తర్వాత వస్తాయనే నమ్మకం తీర్పులు పాలనాధికారులకు లేకుండేడిది. శాసన ప్రతిపాదనను ఏవరైనాపాలనాధికారి చేపట్టే ప్రయత్నాలను మొదలుపెడితే అన్నిరకాలుగా వచ్చే న్యాయపరమైన అభిచర్యలను, ఎదురుపోట్లను సహించే మానసిక స్థితిని అలవర్చుకోవలసి వచ్చేది. ఒక్కొక్కసారి ఒకే అంశంపై ఒకే న్యాయమూర్తి కొన్ని దఫాలుగా ఇచ్చే పరిశీలనలో వ్యక్త పరిచే భిన్నత్వాన్ని కూడా చవిచూడడానికి సిద్ధపడవలసివచ్చేది.

భారతీయ గ్రామీణ సమాజ పునర్ నిర్మాణంలో బ్రిటిష్ పాలనాధికారులు నాటి సమాజంలో కొనసాగుతున్న బలహీన వర్గాల స్థితిగతుల్ని పట్టించుకోలేదు. పంజాబ్ జమిందారీ ప్రాంతాల్లోని రైతుల స్థితి గతులను, రెవిన్యూను చెల్లించే యాజమాన్య రైతును కౌలుదారుల స్థితిగతుల పట్ల ఎక్కువ దృష్టిని మరల్చింది. జమిందారీ ప్రాంతాలలోని అభీష్టానుసారపు

కౌలుదారులకు కాని రైత్వారీ ప్రాంతాల్లోని ఉపకౌలుదార్లకు గాని ప్రభుత్వ చర్యల వల్ల నిర్దుష్ట ప్రయోజనమేమి జరిగినట్లుగా కనిపించదు, ఈ పరిమితులు బహుశా అనేకానేక శాసనాత్మక సంక్లిష్టతల వల్ల, రాజకీయ పరమైన అంశల వల్ల , రెవిన్యూ యంత్రాంగపు పాలనా పరమైన కారణాల వల్లకానీ సంబవం కావచ్చు. కారణాలు ఏవైనా తర్కం మాత్రం ఒక్కటే. బ్రిటిష్ ప్రభుత్వ పాలనా విధానం నిరాటంకంగా కొనసాగడమే పాలనకున్న ఏకైక దృష్టి. రెవిన్యూ అధికారులు కూడా రైత్వారీ వ్యవస్థను దెబ్బతీయడాన్ని ఇష్టపడలేదు. సంప్రదాయ సంబంధాల కొనసాగింపు పట్ల, పరిహార చర్యల పరికల్పన పట్ల మక్కువగా ఉన్న అధికారులు కూడా రైతాంగ శ్రేణులలో అభీష్టానుసారపు కౌలుదారులు కొనసాగడాన్ని అభిలషించినారు. భూ భాటకపు విలువను గణించడానికి రక్షణ లేని కౌలుదారులు ఉండటం వల్ల మార్కెటులో నిజమైన భాటకపు రేటును ధృవీకరించడం సులభమౌతుంది. అందువల్ల రైత్వారీ వ్యవస్థను కొనసాగించడం ఒకందుకు మంచిదనే భావన అధికారుల్లో ఉండింది.

గ్రామీణ రైతాంగ శ్రేణులను భిన్న పరిస్థితుల్లో పరిరక్షించ గలగడానికి సోదాహరణంగా పనిచేసిన పంజాబ్, బెంగాల్ ప్రాంతాల అనుభవం విశాలంగా రెండు రకాలుగా వుంది. మొదటి ప్రాంతంలో వడ్డీ వ్యాపారస్తున్ని మెడలు వంచి ఋణగ్రస్తులను విముక్తి చేయడం, భూబదిలీని నిరోధించడం ముఖ్య అంశాలుగా వున్నాయి. రెండవ ప్రాంతంలో భాటకం పెంపు నుండి లేదా బలవంతపు తొలగింపు నుండి కౌలుదారుని రక్షించడం. ఈ రోజు అంశాలను వ్యక్తపరిచే శాసనాలు మౌలికంగా భిన్నమైన స్వభావంతో కూడుకొన్నది. అయితే వాటికి సాధారణమైన లక్ష్యమని కానీ, అంశమనేదికానీ ఒకటుంది. అదే 'భూబదలాయింపు ' ప్రక్రియ. ఈ అంశం అటు పరిహారచర్యల ప్రతిపాదనకు కానీ, ఇటు శాసనాత్మకరూపకల్పన మార్గానికి కానీ వెంటనే కావలసిందే. మొదటి ప్రాంతంలో భూపరాయీకరణను నిరోదించ వలసి వచ్చింది. రెండవ ప్రాంతంలో భూమిని బదిలీ చేసుకోవడం కౌలుదారుకు వుండే కొన్ని హక్కుల్లో ఒకటిగా గుర్తించబడింది. భూస్వామ్య విధానం నుండి రక్షింపబడే హక్కుగా దీనిని పరిగణించినారు. సహజంగానే ఒక ప్రాంతంలో అన్వయించిన పరిష్కార మార్గాల ప్రభావం ఇతర ప్రాంతాలపై వుంటుంది. అయితేరెండు ప్రాంతాల్లో ఏక కాలంలో ఆచరించిన భిన్న రైతాంగ సమాజసమస్య పరిష్కార ప్రతిపాదనలు ఒకదానినొకటి నీరుకార్చుకోలేదు. వాటి వాటి సందర్భాన్ని బయటి ప్రపంచానికి తెలియ చెప్పినాయి. అందుకనే తదనంతర అధ్యాయాల్లో మొదటగా ఋణగ్రస్తులకు పరిహారం కౌలుదార్ల రక్షణ అనే అంశాలపైన వివరమైన చర్చ అవసరమైంది.

ఐదవ అధ్యాయం

# ఋణగ్రస్థుల పునరావాసం

(The Relief of Debtors)

**పౌర విధాన హద్దుల,చట్ట ప్రత్యామ్నాయాలు :**

1857 తిరుగుబాటు నుండి మొదలుకొని నిర్దాక్షిణ్యంగా అమలు పరిచిన భూఅమ్మక చట్టం ఋణగ్రస్థులైవున్న భూయజమానులను బ్రిటిష్ పాలనకు విరోధులుగా మార్చింది. భూపరాయికరణను రెవెన్యూ అమ్మకంగా మాత్రమే గుర్తించి కట్టుదిట్టం చేయవలసిందిగా ప్రభుత్వం పేర్కొవడం జరిగింది. కాని ప్రైవేటు తాకట్టులను కోర్టుల ద్వారా గాని లేదా రెవెన్యూ అధికారుల అనుమతిపై కొనసాగే భూవిక్రయాలను నిరుత్సాహపరచాలనే దృష్టి ప్రభుత్వంలో వుంది. ఈ అంశాలపై ప్రభుత్వ వర్గాల్లో ఏకీభావంలేదు. సమస్య సమగ్ర పరిష్కారానికి ఇలాంటి నిర్బంధాలు తోడ్పడవని, గ్రామీణ విత్త సంస్థలకు రాజ్య మద్దతు ద్వారా దీనిని పరిష్కరించవచ్చని జాన్ స్ట్రాచీ పేర్కొన్నాడు. 1859లో పౌర విధాన స్మృతి (code of civil procedure) ప్రవేశపెట్టుట ద్వారా ప్రజలను ఇబ్బందులకు గురిచేసే భూపరాయికరణకు అధికారులు అనుమతించకపోవడం వల్ల కొంత కాలం వరకు ఈ మొత్తం సమస్యను వదిలివేయడం జరిగింది. పౌర విధాన స్మృతి వల్ల రెవెన్యూ అమ్మకాలను పౌర విధాన చట్టం ఆధారంగా నిషేధించడం సమ్మతమైనదేనా అన్న సందేహం పంజాబ్ రాష్ట్రంలో నున్న సెక్షన్‌ల ప్రకారణాలను 1870లో లేవనెత్తటం వల్ల ఈ చర్చ మళ్ళీ మొదలు కావడం జరిగింది. 1866 లో పౌరవిధాన చట్టం పంజాబ్‌లో ప్రవేశపెట్టారు. దీనికి అదనంగా ఒక క్లాజును చేర్చినారు. ఈ ప్రాంతంలో ఎలాంటి భూ పరాయికరణను కమీషనర్ అనుమతి లేనిది చేయకూడదనే ప్రత్యేక అంశాన్ని పౌర విధాన స్మృతికి అదనంగా చేర్చినటువంటి ప్రకరణం . వ్యక్తిగత సంపద లేదా ఉమ్మడి సంపదలను తాకట్టుకు ముందుగా అమ్మకంగాని, పరాయికరణ గాని ఆప్రాంత అత్యున్నత కోర్టు అనుమతి లేనిది జరగరాదని కూడా ఈ అదనపు క్లాజులో పేర్కొనడం జరగింది. భూ విక్రయాల పరాయికరణకు ముందు అనుమతి తప్పనిసరి అనే సరికి, ఏయేఅంశాలలో ప్రభుత్వం అనుమతి ఇవ్వవచ్చో, నిరాకరించవచ్చో అనే అంశాలతో కూడిన వివరమైన చట్ట నిర్మితి జరపాలని న్యాయమూర్తులు కోరడం జరిగింది. ఈ సందర్భంలో ప్రాంతీయ ప్రభుత్వాలను పౌర విధాన చట్టంలోని నిబంధనలు అధికారులను భూపరాయికరణకు అనుమతించకపోవడంలో ఏ విధంగా అన్వయించినారో తెలపమని భారత

ప్రభుత్వం ఉత్తర్వులను పంపినది. ప్రాంతీయ ప్రభుత్వాలు తిరుగు జవాబులో భారత దేశ చాలా భాగాల్లో ఈ నిబంధనలు స్థానిక పరిస్థితులకు పనికిరానివిగాను, ఇవి ఉత్తర భారత పరిస్థితులకనుగుణంగా రూపొందించబడ్డవని తెలియజేయడం జరిగింది. ఒక నిబంధన ప్రకారం, ఉదాహరణగా కోర్టులు, రెవెన్యూ అధికారులు ఋణగ్రస్థుని సంపదను నిర్వహించుట ద్వారా వచ్చే ఆదాయం ద్వారా అప్పు ఇచ్చిన వారికి తిరగి చెల్లించుట వల్ల భూపరాయికరణను నిరోధించవచ్చుని ఒక సూచన ఇవ్వడం జరిగింది. రైత్వారీ పద్ధతి గల ప్రాంతాలలో వారికున్న చిన్న భూకమతాల సంపద వల్ల ఈ సూచన పనికిరానిదిగా మారింది. ఒక వేళ ఈ చిన్న కమతాలు సంమృద్ధిగా ఉన్నప్పటికి సంబంధించి చాలా సంవత్సరాలుగా ప్రభుత్వాధికారులు ఈ సంపద నిర్వ హించబడినప్పటికి ఋణం తీర్చడం జరగదు. తర్వాత క్రమంలో ఇతర ప్రాంతాలలో పౌర విధాన స్మృతిని ప్రవేశపెట్టి, పంజాబ్‌లో వలె అదనపు నిబంధనలను జతచేసినప్పుడు చాలా సమర్థవంతంగా ఈ ప్రక్రియ అన్ని రకాల భూపరాయికరణను నిరసించుటకు ఉపయోగపడింది. కాబట్టి ఒక ప్రత్యేకమైన భూపరాయికరణ సమస్యను పరిష్కరించుటకు చాలా విధాలయిన పద్ధతులు అధికారులకు ఉపయోగపడినాయి. 1877లో పౌర విధాన స్మృతి పున: నిర్వచనం కోర్టులు లేదా రాజస్వరెవెన్యూ అధికారులచే కొన్ని అంశాలను ప్రవేశపెట్టి అమలు చేయడం జరిగింది. వ్యవసాయ పనిముట్లు, ఎడ్లు ఇతర ఉపయోగ జంతువులు, నిర్మాణ సామాగ్రి అప్పు ఇచ్చినవారు ఋణం వసూలు చేసే నెపంపై స్వాధీనం చేసుకొనే వీలులేదు, వీటి తప్పనిసరి అమ్మకము కోర్టు డిక్రీచే నమోదు చేసే ఉత్తర్వు ద్వారా జరగాలి. సంపద విలువ గూర్చి ముందుగా కొనుగోలు చేయు వ్యక్తికి పూర్తి సమాచారాన్ని అందించాలి. నిర్బంధపు అమ్మకాన్ని జరిపించే అధికారికి దానిని వాయిదా వేయుటకు అధికారం కలిగి వున్నాడు. వాయిదా నిర్ణయానికి సంబంధించి కారణాలను నమోదు చేయు అవసరం ఈ అధికారికి మాత్రమే వుంది. ఋణగ్రస్థుడు తన ఋణాన్ని ఇతర మార్గాల ద్వారా తీర్చుకుంటానని భావించినప్పుడు కోర్టుకు కూడా ఈ అమ్మకాన్ని వాయిదా వేసే అధికారం వుంది. ప్రాంతీయ ప్రభుత్వాల రెవెన్యూ అధికారులకు తప్పనిసరి అమ్మకపు ఆర్డినెన్సులను జారీ చేసి అప్పగించే అదికారం కూడా కలిగి వుంటుంది. కోర్టులు రెవెన్యూ అధికారులను ఇలాంటి అమ్మకాలను వాయిదా వేయమని అజ్ఞాపించవచ్చు. పౌర విధాన స్మృతి ప్రకారం ఆయా సాగుదార్లు భూపట్టా రక్షణలపై అసంపూర్ణమైన భద్రతను, యజమాన్యం నిర్ధారించడం వీలు కానపుడు ఆయా ప్రాంతాలలో అన్ని భూబదలాయింపులను నిలిపి వేయమనే అధికారాన్ని ప్రాంతీయ ప్రభుత్వాలు కలిగి వున్నాయి. ఈ నిబంధనలను బొంబాయి, మధ్య ప్రాంత ప్రభుత్వాలు వెంటనే వినియోగించినాయి. అంతేగాక, పున: నిర్వచింపబడిన పౌర విధాన

చట్ట స్మృతి ఆనాటి కాలంలో అన్వయించబడిన చట్ట చర్యల హద్దులను కూడా మరోక రకంగా సూచిస్తున్నాయి.

అయినప్పటికి ఈ సంవత్సరాల్లో ఒప్పందపు స్వేచ్ఛ, భూపరాయికరణల మొత్తంగా సుదీర్ఘమైన చర్చ జరిగింది. కాని ఆ సమయంలో చర్చవల్ల ఉద్భవించిన సలహాలు (Suggestions) మాత్రం వెంటనే చట్టాన్ని ఏర్పరచడానికి తోడ్పడలేదు. కానీ తదనంతర కాలంలో ఈ చర్చల ద్వారా ప్రత్యామ్నాయ చట్ట చర్యలు అవిర్భవించడానికి వేదికగా పనిచేసినాయి.

1872లో జస్టిస్ రేమండ్ వెస్ట్ ముద్రించిన ''భారత దేశంలో భూమి- చట్టం'' అనే ముఖ్యమైన కర పత్రం (pamplet) లో రైతాంగ ఋణగ్రస్థత, భూపరాయికరణకు సంబంధించిన మొత్తం సమస్యను విశ్లేషించడం [illegible]ింది. అతడు చట్ట చర్యల ప్రత్యామ్నాయములను చర్చించి భూపరాయికరణ నియంత్రణ విధానాలను ప్రవేశపెట్టడం సబబైనదిగా భావించినాడు. భారత సంప్రదాయం ప్రకారం భూమి పురాతన దేవతలచే రక్షించబడుతుందని, ఇది పరాయీకరింపబడనిదని, చాలా వరకు తాత్కాలిక బదలాయింపు తాకట్టులు మాత్రమే జరుగుతాయని వెస్ట్ పేర్కొవడం జరిగింది. ఒప్పందపు స్వేచ్ఛ భూ బదలాయింపులు బ్రిటిష్ ఆర్థిక సిద్ధాంతాలకు అనుగుణ్యమైనవి. భారతీయ సంప్రదాయానికి అన్యమైనటువంటి అంశం. ఈ సిద్ధాంతాలను ప్రవేశపెట్టడం ద్వారా పాత యాజమాన్య కులాలను, వర్గాలను వారి భూమి నుండి తొలగించి, వారి స్థానంలో వడ్డీ వ్యాపారస్థులను ప్రవేశపెట్టడం జరిగిందని, దాని వల్ల కులరీత్యాగానీ, వృత్తిరీత్యాగానీ చవకబారు పిరికితనాన్ని కలిగివున్న వడ్డీ వ్యాపార శక్తులు క్లిష్ట సమయంలో ప్రభుత్వానికి ఆధారపడే శక్తిగా మిగలలేదు. భారతీయ స్వాభావిక సమాజ లక్షణాలను, కులాన్ని కుదించి, రాబోయే అస్థిర సమతౌల్యతను తట్టుకొని నిలబడగలగడానికి బ్రిటిష్ ప్రభుత్వం నిశ్చయాత్మకముగా పనిచేయగలదాఅన్న విషయాన్ని వెస్ట్ ప్రస్తావించడు. సంప్రదాయ భారతీయ సమాజపు నీడలో ఎన్నడూ కూడా పొందని అసమాన అధికారాలను బ్రిటిష్‌పాలనా కాలంలో వడ్డీ వ్యాపారస్థులు అనుభవించినారు. ఇటువంటి వారిని మద్దతు చేయడం వల్ల కోర్టులు అపకీర్తి పాలవుతున్న వన్న విషయాన్ని వెస్ట్ హెచ్చరించినాడు. అయితే వెస్ట్ ప్రతి ఒప్పందాన్ని వాటి పూర్వాపరాల ఆధారంగా కోర్టులు పరిశీలించాలనే నిర్బంధపు బరువును ఉంచదలచక, నిర్దయాత్మకమైన ఋణదాతల నుండి అమాయకులైన ఋణగ్రహీతలకు రక్షణ కల్పించాలని వెస్ట్ పేర్కొన్నాడు. ప్రతి వివాదం కోర్టుపరమైతే దాని వల్ల జడ్జీలసామర్ధ్యంపై ఒత్తిడి పెరుగుతుంది. ఋణగ్రహీతలు మన్నింపుకై ఎదురుచూస్తునట్లు కూడా ఈ చర్య ప్రోత్సహిస్తుందని వెస్ట్ భావించాడు. 500రూ॥ల వరకు

ఋణము తీసుకొని 9% వడ్డీ కూడా ఎక్కువ కలిగివున్న కేసులలో ఆయా వడ్డీ శాతాన్ని తగ్గించుటకు కోర్టులకు అధికారం వుంది. భూపరాయీకరణ సమస్యకు పరిష్కారము పౌరవిధాన చట్ట సవరణలో కాకుండా సమస్యానుబంధ శాసనాన్ని ఏర్పరిస్తే బాగుంటుందని వెస్ట్ పేర్కొన్నాడు. ఈ అనుబంధ శాసనంలో వుండవలసిన అంశాలను వెస్ట్ సూచించాడు. రాజ్యము అత్యున్నత భూస్వామిగా అన్నిరకాల ప్రైవేట్ అమ్మకాలపై భూబదలాయింపులకు అధికార అనుమతితో జరగాలన్న విషయాన్ని స్పష్టం చేయాలి. ఋణగ్రహీతను నిర్బంధంగా జరిగే భూ అమ్మక నిషేధము తృప్తి చేయజాలదు. భూఅమ్మకం విధించిన నిర్బంధ నిషేధం మాత్రమే సమస్యను పూర్తిగా పరిష్కరించదు . ఋణదాత, గ్రహీత ఇరువురు విధించిన పరిమితులను దెబ్బతీయడానికి ప్రత్యామ్నాయ సాధనాలను ఎంచుకొంటారు. అందువల్ల, కౌలుకు సంబంధించిన తాకట్టులు, ఒప్పందాలు అన్నీ కూడా అధికార నియంత్రణ పరిధిలోకి తీసుకరాబడాలి. సాధారణ ఆర్థిక భూకమతంచెక్కు చెదరకుండా ఉండటానికి అనువైన రీతిలో కుటుంబ సంపద ఉప విభజన ఉండేటట్లుగా చూడాలి. కమతం మరింత చిన్నదిగా మారకుండా ఉండటానికి భూమిని వదిలిపెట్టడానికి సిద్ధంగా వున్న వారసునికి నష్టపరిహారాన్ని ఇచ్చే వీలును కల్పించాలి. పెద్ద భూస్వాముల ఆధీనంలో వున్న సంపద విభజింపబడి చిన్న కమతాలుగా చీలి పోకుండా వుండేందుకు ట్రస్టు రూపకల్పననైనా లేదా దానికనుగుణ్యమైన చట్ట ఏర్పాటునైనా ప్రతిపాదించాలని భావించబడింది. ఈ ప్రతిపాదనను సమర్థించడానికి నాటి పాలకుడైన వెస్ట్ భారతదేశంలో జరుగుతున్న కుటుంబ సంపద విచ్ఛిన్నాన్ని ఉదాహరణగా చూపినాడు. ఒకవేళ ప్రభుత్వం భూ పరాయికరణను పూర్తిగా నిషేధించడం ఇష్టం లేనట్లయితే దానిపై నిషేదాత్మక పన్ను విధానాన్ని ప్రవేశపెట్టాలని వెస్ట్ సూచించినాడు. బదలాయింపు జరుగుతున్న భూమిపైనున్న ప్రస్తుత రెవెన్యూ అంచనా సమంజసమైనది కాదని ప్రకటించి బదాలాయింపు జరుగుతున్న భూమిపై విధించే పన్ను శాతాన్ని ఎవరూ ఆశించని రీతిలో పెంచినట్లయితే పరోక్షంగా భూ బదలాయింపు నిరుత్సాహపరచవచ్చునని వెస్ట్ భావించినాడు. ఈ సూచనలన్నీ ఆనాటి రెవెన్యూ కౌలు విధానాలను సమీక్షిస్తున్న పాలకులందరూ ఆహ్వానించినారు. భారతదేశంలోనున్న మూలధనం వేరే రంగాల్లో వెచ్చించే అవకాశం లేనందువల్ల భూబేరసారాల్లో కేంద్రీకరింపబడుతుందని కూడా నాటి చాలా మంది బ్రిటిష్ పాలకులు భావించినారు. భూభేరసారాల, క్రమవిక్రయాల ధోరణులను నిరుత్సాహ పరచాలంటె భూపరాయికరణ క్రమాన్ని దుర్లభం చేయడమే మార్గమని కూడా విశ్వసించినారు. భూమిని మారకంగా ఒక భూస్వామి పాత్రను పోషించే విధంగా పరిస్థితిని కల్పించడం వల్ల కూడా భూబదలాయింపులను ప్రోత్సహించే కొత్త యజమానులు ఒక భూస్వామి పాత్రను

పోషించే విధంగా పరిస్థితిని కల్పించడం వల్ల కూడా భూబదలాయింపులకు కొంత తెరపడవచ్చునని కూడా భావించడం జరిగింది. ఈ నేపథ్యంలోనే వెస్ట్ సూచించిన ప్రస్తుత రెవెన్యూ అంచనా విధానపు తొలగింపు- అత్యధిక రెవెన్యూ విధింపు ప్రతిపాదనలు కూడా పరిగణనలోకి తీసుకరాబడినవి. అయితే, అనేక మంది బ్రిటిష పాలకులు వెస్ట్ సూచించిన మౌలిక ప్రతిపాదనల పట్ల, భూపరాయికరణను నిషేధించే అనుబంధ శాసన నిర్మాణం పట్ల పూర్తి సుముఖముగా లేరు. అంతగా అయితే, నియమపరమైన పరిహారాలకే ప్రాధాన్యతనిచ్చి విస్తృతపాలనా - న్యాయ వివేచనే ఈ సమస్యకు మార్గమని నమ్మినారు.

ఆ సమయంలో భారత ప్రభుత్వ చట్ట సభ్యుడు (Law member of the govt. of India) అయిన అర్థర్ హాబ్ హౌజ్ ఈ చట్ట పరికల్పనలకు వ్యతిరేకితను తెల్పినాడు. ఈ క్రొత్త విదానములతో పనిచేసే రెవెన్యూ అధికారి ప్రతి అంశాన్ని గననంలోకి తీసుకొని చూడలేడని వ్రాసినాడు. పౌర విధాన చట్ట పునర్ నిర్వచనం పట్ల దృష్టి సారించడం మంచిదని తెలుపుతూ, బ్రిటన్‌లో జడ్జీలకు సమానత్వ సూత్ర అభివృద్ధి ఆధారంగా ఇచ్చిన అధికారాలను భారత దేశంలో వున్న జడ్జీలకు కూడా ఇవ్వాలని పేర్కొన్నాడు. ఇంగ్లాండులో సమానత్వ సూత్ర వర్తింపు తీవ్రంగా భూసంపదను కొంత మంది ఆర్థిక పర ప్రయోజనాలకు బదలాయించడాన్ని నిరోధించి సమాజపు సాధారణ మార్పుకు తోడ్పడిందని హాబ్ హౌజ్ అభిప్రాయపడినాడు. అయినప్పటికి, సమానత్వం గొప్ప జడ్జీల ద్వారా బ్రిటన్‌లో నిర్ధారించబడిందన్న విషయం దృష్టిలో ఉంచుకోవాలని చెబుతూనే, భారత దేశంలో ఈ పనిని నిర్వర్తించేందుకు, సరిపోయినంత న్యాయ సిబ్బంది లేరని హబ్ హజ్ పేర్కొన్నాడు. జడ్జీలు అట్లే రెవెన్యూ అధికారుల భూపరాయికరణ నిర్ణయాలను వారి వివేచనకే వదిలేయాలని, ఒక వేళకొన్ని సూత్రాలు కావాలనుకుంటె వారి నివేదన రాజకీయ, ఆర్థిక సూత్రాల ఆధారంగానో లేక కరుణతో కూడిన నిర్ణయమొ తెలపాలని పేర్కొన్నాడు.

వెస్ట్ , హబ్‌హౌజ్‌లచే 1872 , 1874లో ఇవ్వబడిన ప్రధానమైన వివరణలు విధాన పునర్విచారణ లేదా వాస్తవ చట్ట నిర్మాణ ప్రయత్నాలు స్పష్టమైన ప్రత్యామ్నాయాలుగా ఆయా సంవత్సరాల్లో పునరావృతమయినాయి. కానీ హాబ్ హౌజ్, వెస్ట్‌లు ఇద్దరూ న్యాయపరవివేచన పరిధిని విస్తృతం చేయడం ద్వారా ఒప్పందపు స్వేచ్ఛను పరిమితించడంలో వున్న ఇబ్బందులను గుర్తించుటలో అంగీకారాన్ని కలిగివున్నారు. అయినప్పటికి, ఖచ్చితంగా ఈ ప్రయత్నాలు భూపరాయికరణ సమస్య రైతాంగ ఋణగ్రస్థతలను ఎదుర్కొవడంలో అవలంబించిన మొట్టమొదటి పెద్ద చట్ట నిర్మాణ ప్రయత్నంగా భావించవచ్చు సంక్షిప్తంగా ఈ ప్రయత్నాలు రెండు ప్రత్నామ్నాయాలను, భూపరాయీకరణ సమస్యను పరిష్కరించడంలో ముందుకు

తెచ్చినాయి. ఒకటి న్యాయమధ్య వర్తిత్వం, రెండవది భూ పరాయీకరణపై నిషేధం. వాటిని సవివరంగా ప్రస్తావిద్దాం.

## 5.2 మొదటి ప్రత్యామ్నాయము : న్యాయ మధ్య వర్తిత్వం

## (The first Alternative: Judicial Arbitration)

భూబదలాయింపుకు సంబంధించిన, నివారణోపాయములకు సంబంధించిన సైద్ధాంతిక చర్చ 1875లో జరిగిన రైతాంగ హింసాత్మక చర్యలవల్ల మరుగున పడినవి. పూనా దగ్గర దక్కన్(హైలాండ్) ఉన్నత ప్రదేశాల్లోని 20 గ్రామాల్లోని రైతులు చాలా వరకు ప్రాంతీయ ఆధిపత్య కులాల వారు. వారి పెద్ద మనిషి నాయకత్వంలో వడ్డీ వ్యాపారుల ఇండ్లపై దాడి చేసి, బాండులు , ఇతర పత్రాలు నాశనం చేసి, కొన్ని ఇండ్లను తగలబెట్టి, అడ్డం వచ్చిన వారందరిని కొట్టడం, చంపడం చేసినారు. ఒక ఆవేశ భరితమైన ఉద్రేక ఘటనగా ఇది మిగిలిపోయినా, తరువాతి కాలంలో క్రమేపి ఇది ఒక తీవ్రమైన విషయంగా మిగిలిపోయింది, ఈ సంఘటన ఒక అకస్మాత్తుగా జరిగినది కాదనే విషయం తేలిపోయింది. . చాలా వారాల పాటు ఈ దాడులు కొనసాగినాయి. ప్రజలు స్థానిక మార్కెట్ ప్రాంతాలలో చేరి , వ్యవస్థీకృత గుంపులుగా తయారయి వారి యొక్క లక్ష్యం యెడ ఖచ్చితమైన భావాలతో రాత్రి తిరిగి వెళ్ళి పోయేవారు. మనం ముందు చెప్పుకున్న వివరణలకు సామూహిక రైతాంగ అవసరాల చర్యలో భాగంగా ఉత్పన్నమైన ఒక అపూర్వమైన ఉదహరణ ఇది.

చిరకాల బాధలు, తక్షణ కారణాలు ఇలాంటి 'ఉల్లంఘన స్వేచ్ఛకు' దారి తీసిన కారణాలు. సుదూర ప్రాంతాల నుండి వచ్చిన ఈ వడ్డీ వ్యాపారులు ఈ ప్రాంతానికి కొత్తవారయి స్థానిక సంప్రదాయ సంబంధాలను ఏర్పరచుకొని ఆ ప్రాంతంలో ఋణసౌకర్యవ్యవస్థను (Credit network) ఏర్పరచి, బ్రిటిష్ చట్టం కల్పించిన నూతన పద్ధతుల వలన ప్రయోజనం పొందుతూ ఋణగ్రస్థులపై అంతులేని అదుపును కలిగి వున్నారు. రక్షణకై స్థానిక వడ్డీ వ్యాపారస్థుల కన్నా ఎక్కువ క్లిష్టంగా, మరింత క్రూరంగా వీరు వ్యవహరిస్తూ వుండే వారు. దక్కన్ అల్లర్లకు తక్షణ కారణం ఆనాటి కాలంలో రైతులపై వేసిన మితిమీరిన రెవెన్యూ అంచనాలకు దానికి తోడు మరోకవైపు రైతుల భూములను పన్నుకు రెవెన్యూ కట్టలేనట్లయితేబదులుగా భూములను స్వాధీనం చేసుకొనే పద్ధతిని మినహాయించింది. అంటే రైతులు తప్పనిసరిగా నగదు రూపేణా పన్నే కట్టాలి. విధి లేని స్థితిలో వడ్డీ వ్యాపారస్థుల వద్దకు వెళ్ళిన రైతులకు నిరాశే మిగిలింది. రెవెన్యూ అధికారుల దయాదాక్షిణ్యాలకు రైతులు గురి చేయబడ్డారు. కొత్త నిబంధనల ప్రకారము రైతాంగానికి సంబంధించిన ఇతర ఆస్తులను రెవెన్యూ ( బాకీ) వసూలుకు బదులుగా జప్తు చేయవచ్చనే అధికారం ఉండటం వల్ల అధికారులు

రైతులపై వత్తిడిని అధికం చేసేవారు. ఫలితంగా ఎటూ తోచని స్థితిలో రైతులు ముందు నుయ్యి వెనుక గొయ్యిల మధ్య చిక్కినట్లుగా భావించినారు. ఈ అనుభవం వల్ల అసంఖ్యాక ప్రజలు ఒకే విధంగా ఆశాభంగం చెంది సాధారణంగా వ్యక్తిగత స్థితిగతుల్లో తమ మధ్య గల వ్యతిరేకతలను వదిలి సంఘీభావాన్ని (solidarity) సాధించినారు. ఏదేమయినా ప్రభుత్వం. వడ్డీ వ్యాపారస్థులు సమానంగా ఈ దురవస్థకు బాధ్యులుగా మిగిలినారు. తట్టుకోలేనిస్థితిలో పెల్లుబికిన రైతాంగ ఆగ్రహం సహజంగా వారికి దగ్గరగా వుండే వడ్డీ వ్యాపారస్థులపైకి మళ్ళింది. ఇంతే కాకుండా కొంతకాలం క్రితం ప్రభుత్వం ఈ ప్రాంతంలో వడ్డీ వ్యాపారస్థులపై చేపట్టిన విచారణల వలన ప్రభుత్వం కూడా వడ్డీ వ్యాపారస్థులంటే ఇష్టపడడంలేదని రైతాంగం భావించింది. కానీ ప్రభుత్వం ఈ విధమైనరైతు అల్లర్లు శాంతి భద్రతలకు సవాలుగా భావించి వేగంగా బలగాలను ఉపయోగించుట ద్వారా ఈ అల్లర్లను అణచివేసింది.

ఈ అశాంతికి గల కారణాల పరిశీలనుకు నియమింపబడిన దక్కన్ అల్లర్ల కమీషన్ రిపోర్టు చాలా అంశాలను సేకరించి చక్కగా విశ్లేషించింది. కమీషన్‌చే వివరింపబడిన దుఃఖకర పరిస్థితులను బొంబాయి ప్రభుత్వం అంగీకరించి వాస్తవంగా, ప్రభుత్వం వాటి గూర్చి ఏమీ చేయజాలదని పేర్కొంది. ఈ రైతాంగ నిరసనను గూర్చిన భావన తదనంతర కాలంలో నూతనంగా ఎంపికయిన గవర్నరు రైతులపట్ల అవలంబించిన నిష్పక్షపాత ధోరణి వల్ల క్రమేపి వాతావరణం మారుతూ వచ్చింది. సర్ రిచర్డ్ టెంపుల్ మొదట మద్రాస్ క్షామ అంశాల ఇన్‌చార్జ్‌గా, కొంతకాలంగా బెంగాల్ ల్యేఫ్టినెంట్ గవర్నరుగా కౌలు చట్టాల అంశాలతో సంబంధం కలిగి వుండి 1877లో బొంబాయి చేరుకొని అధికార బాధ్యతలు స్వీకరించాడు. మొదట అతడు చేసిన పని తన అధికార్లకు బుద్ధి చెప్పడము, తద్వారా 1877 నాటి పౌరవిధాన చట్టం కొత్త నిబంధనలను పూర్తిగా వినియోగించడం. కాని టెంపుల్ అంతటితో ఆగకుండా నాలుగు దక్కన్ జిల్లాల్లోని అశాంతి దృష్ట్యా ప్రత్యేక చట్టాలను అమలు చేసినాడు. అతను ప్రత్యేకంగా కోర్టులను పురాతన ఋణాలకు సంబంధించి వడ్డీలను పునర్నిర్వచించాల్సిందిగాను దేశంలో వున్న సంప్రదాయ సూత్రమైన మొత్తం వడ్డీ అసలు తీసుకున్న ఋణం కంటే ఎక్కువ ఉండరాదన్న దండుపట్ (Dandupet) ను మళ్ళీ ప్రవేశపెట్టాలని తెలపినాడు. అంటేరైతులకు ఇచ్చిన అసలు ఋణం మొత్తం రెండింతలకన్నా ఎక్కువ ఏప్పుడు అడగరాదు. కొన్ని సంవత్సరాల ఉనంతరం అది కూడా చెల్లనేరదు. ఒక వేళ భూమి తప్పని సరిగా అమ్మవలసివస్తే రైతు స్పష్టంగా అధికారిక రికార్డులో ఒప్పందం గూర్చి పేర్కొని ఎలాంటి పునర్ ఋణ చెల్లింపులు లేకుండా బద్ధులను చేసి అమ్మాల్సివుంటుందని టెంపుల్ తెలపడం జరిగింది. భూపరాయికరణను పూర్తిగా నిరోధించడం అసంభవమని ఎందుకంటే ఇది రైత్వారి

ప్రాంతాల్లోని రెవెన్యూ సెటిల్‌మెంట్ మూల సూత్రాలతో పొసగనిదని భావించినాడు. కాని భూమి సంబంధ ఒప్పందాలకు బద్ధుడయ్యే విషయంలో రైతు జాగ్రత్తగా వుండాలని భావించినాడు. తాకట్టు నుండి పరాయికరణకు మారే క్రమం రైతుకు స్పష్టంగా తెలయక పోవడం వల్ల రైతు తన భూమిని ఏనాడైనా మళ్ళీ తనకు చెందుతుందని భ్రమలో ఉంటాడు. అసలు కంటే వడ్డీ భాగం ముదిరి కోర్టు ద్వారా రైతు భూమిపై డిక్రీ పొందే వడ్డీ వ్యాపారస్థులు స్వాధీనం చేసుకొనే అంశంపై టెంపుల్ ప్రతిపాదనలు రాబోయే శాసన ధోరణులను ముందుంచింది. 30 సం॥ క్రిందట బొంబాయి, సంస్థానపు రెవెన్యూ సెటిల్‌మెంట్ ప్రణాళికను తయారు చేసిన కెప్టెన్ విన్‌గేట్ పేర్కొన్న అంశాలలో టెంపుల్ ప్రతిపాదనలు సాన్నిహిత్యాన్ని కలిగి వున్నాయి. విన్‌గేట్ భూ అమ్మకాన్ని నిషేధించాలని శిఫారసుచేసినాడు. అప్పుడు వడ్డీకి వ్యతిరేకంగా చట్టం చేయడాన్ని సమర్థించినాడు. వడ్డీ శాతాలను పునః సమీక్షచేసే అధికారాన్ని కోర్టులు కలిగి వుండాలని విన్‌గేట్ భావించినాడు. అతడు పాత గ్రామీణ పంచాయితీలకు ప్రాణం పోసి 30రూ॥ల కన్నా తక్కువ గల కేసులను పరిష్కరించే అధికారం అప్పగించాలని వాదించినాడు. ఇదే కాకుండా ఋణగ్రస్తుడు దివాళు ఎత్తినట్లుగా ప్రకటించే శక్తి గలుగునట్లు చట్ట నిర్మాణం జరగాలని కోరినాడు. విన్ గేట్ వెలిబుచ్చిన అభిప్రాయాలు పూర్తిగ నిరాధరణకు గురయినాయి. ఈ కాలంలోనే వారు ప్రభలమైన ఆయా ఆర్థిక సిద్ధాంతాల యెడ నిర్దుష్ట అభిప్రాయాలను నాటిపాలకులు కలిగిలేరు. కానీ క్రమేపి చట్ట నిర్మాతలు ఆయా నిర్ణయాలు తీసుకోవడానికి సుముఖతను చూపినారు.

భారత రాజ్య కార్యదర్శి లార్డ్‌సాలిస్‌బరి 1876లో దక్కన్ అల్లర్లకమీషన్ రిపోర్టును పొంది పూర్తిగా ప్రభావితుడై రైతాంగ ఋణ భారంపై చట్ట పరమైన ప్రయత్నాలు చేయాలనె అంశాన్ని ప్రగాఢంగా మద్దతు చేసినాడు. ప్రభుత్వం నుంచి ఈ అంశంపై ఎటువంటి ప్రతిపాదనలు రాకపోవడంతో 1877 లండన్‌లో ఇండియన్ కౌన్సిల్ కమిటిని నిర్మించి ఒక ముసాయిదాను తయారు చేసి ఇమ్మని ఇతడు కోరినాడు. అయినప్పటికి, 1878 ఫిబ్రవరిలో చివరిగా బొంబాయి ప్రభుత్వం ఒక బిల్లు సమర్పించినది. దీని ప్రకారం కోర్టులకు ఒడంబడికలను మాత్రమే కాక ఋణాలను పొందిన - ఇచ్చినవారి ఒప్పందాలను ఈ బిల్లు గ్రామీణ ప్రాంతాలకు కూడ విస్తరింపబడింది దివాళ తీయడంపై చేసిన చట్టాలు బొంబాయి పట్టణంలోనే చెల్లుతాయి. అట్లే వ్రాత పూర్వక ఒప్పందంపై ఆధారపడి మాత్రమే నిర్బంధ అమ్మకాలకు అనుమతినివ్వడం జరుగుతుంది. ఈ బిల్లు గవర్నర్ జనరల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ప్రవేశపెట్టినాడు. కాని నాటి భారత ప్రభుత్వం ఈ తీవ్ర చట్టాన్ని రూపొందించడానికి సుముఖత చూపలేదు. చట్టం తన శక్తితో వడ్డీశాతం వెనుకటి ఋణాలకు సంబంధించిన

విధానాల్లో మాత్రమే ప్రమేయాన్ని కల్పించుకొవాలనే సూచన చేయబడింది. లార్డ్‌సాలిస్ బరీ తర్వాత వచ్చిన లార్డ్ క్రౌన్ బ్రూక్ అసంపూర్ణంగా వున్న ఋణ గ్రస్థ విషయ చట్టాన్ని అంగీకరించలేక పోయాడు. ఋణగ్రస్థ రైతాంగ ప్రయోజనాలను కాపాడే విధమైన సమగ్ర శాసనాన్ని రూపకల్పన చేయడం సముచితమని భావించినాడు. రైతు ఋణగ్రస్తతపై కోర్టులకు శాసనాత్మక వివేచనా పరిధి ఉండాలని విశ్వసించినాడు. అయితే దాని వల్ల న్యాయ వ్యవస్థ వ్యయం మరింతగా పెరిగే అవకాశమున్న దన్న వాదన ముందుకొచ్చింది. ఈ వాదనను త్రిప్పికొడుతూ బాంబే ప్రెసెడన్సీ ప్రాంతంలో నున్న 88 ఆధీన కోర్టులు నిజానికి తమ ఖర్చుకన్నా ప్రజల నుంచి మిలియన్ రూపాయల ఆదాయాన్ని రాజ్యానికి అంద చేస్తున్న విషయాన్ని క్రౌన్ బ్రూక్ స్పష్టీకరించినాడు. రైతునుంచే అట్టి డబ్బును రైతు న్యాయం కోసం వెచ్చించాలనే అభిప్రాయాన్ని బలంగా ప్రతిపాదించినాడు.

లార్డ్ క్రౌన్ బ్రూక్ ఫ్రెంచ్ న్యాయవ్యవస్థ వునికిని, విధానాన్ని బెంథామ్ ఆలోచనలను తన అభిప్రాయలకు మద్దతుగా ఊటంకించాడు. బెంతామ్ ప్రకారం, తగాదాపడినవారు జడ్జీల ముందుకు వచ్చి సమాధానపడి స్వాంతనపొంది అనవసరమైన తగాదాలను తగ్గించాలి. ఈరకమైన కోర్టులు సంగ్రహమైన న్యాయపరిధి కలిగి ఉండి కేసులపై ఇచ్చే తీర్పుపై ఏటువంటి ఫిర్యాదును స్వీకరించే వీలుండదు. కేసు విచారణలో న్యాయవాదుల పాత్రను మినహాయించి న్యాయస్థానం ఇచ్చే తీర్పుకు అప్పీలు అవకాశముండరాదు. భారత దేశ వ్యవహారాల్లో రాజ్య కార్యదర్శి నిశ్చయితాక్మంగా తీసుకున్న వైఖరికి నిదర్శనమే అతను రైతాంగ ఋణగ్రస్థతపై వ్యక్తీకరించిన ప్రతిపాదనలుగా చెప్పవచ్చు. దక్కన్ అల్లరులు లండన్ కేంద్ర కార్యాలయం దృష్టిని గట్టిగానే ఆకర్షించినవి. సమీపంలో వున్న వారికన్నా సుదూర బ్రిటిష్‌కేంద్ర పాలనపై ఈ అల్లర్ల ప్రభావం తీవ్రంగానే పడింది. రైతాంగ ఆగ్రహం బ్రిటిష్ ప్రభుత్వాన్ని ముంచి వేస్తూ దేశంలో ఉన్న రాజ్య కార్య దర్శిపై వెంటాడుతున్న నీడలాగ పని చేస్తుంది.

చివరగా భారత ప్రభుత్వ మదిలో సమస్య తీవ్రత ప్రవేశించి, 1879లో ఆయా సూచనల పై టెంపుల్, రాజ్య కార్యదర్శులు గవర్నర్ జనరల్ చట్ట సభలో ఒక బిల్లును ప్రవేశపెట్టినారు. ప్రవేశపెట్టిన బిల్లులోని ముఖ్యమైన నిబందనల పట్ల పూర్తిగా సంఘీభావాన్ని వ్యక్తీకరించినారు. గ్రామంలోని గౌరవనీయ వ్యక్తి ముందు ఋణగ్రస్థుడు ఋణగ్రహీతలు తమ సమస్యకు సమాధానపరచడం బిల్లులోని ముఖ్యాంశాల్లో ఒకటి ఈ ప్రయోజనార్థం పంచాయతీలను పునః ర్నిర్మించేందుకు ఎన్నో సూచనలు చేయబడినాయి. స్వాభావికంగా అల్లర్లకు గురయిన జిల్లాల్లో కొన్ని పంచాయితీలు పుట్టుకొచ్చినవి. నిజానికి, భారతీయ జడ్జీలు యం.జి రానెడే ఆధ్వర్యంలో ఈ విషయంపై ముసాయిదా బిల్లును సమర్పించినారు. వారు పంచాయితీల రాజ్యాంగాన్ని పూర్తిగా

స్థానిక స్థితికే వదలకుండా, స్థానిక అభిప్రాయాన్ని ప్రభుత్వ అధికారి సంప్రదించిన అనంతరం నియమించే సూచన చేయడం జరిగింది. ఈ పంచాయతీల సభ్యులు మధ్య వర్తులవలె వ్యవహరించ వలసి వుంటుంది. ఒకవేళ వారి తీర్పు అనంగీకరింపబడినప్పుడు వివాదంలోని వారు ఈ అంశాన్ని తన పర్యటనలో భాగంగా ఆ ప్రాంతానికి వచ్చే సబ్ జడ్జి ముందుకు మళ్ళీ తీసుకవచ్చే వీలుండదు . ఈ యోచన నాటి బొంబాయి ప్రభుత్వ సానుకూల ఆమోదాన్ని పొందలేక పోయింది. వివాద పరిష్కారుల కొరకు ప్రత్యేక మధ్య వర్తిత్వ అధికారుల నియమించడానికి ప్రభుత్వం ప్రాముఖ్యతను ఇచ్చింది. కాని వివాదం పూర్తిగా ఫలితం పొందని కేసులనే కోర్టులు విచారించాలి. అట్లే , తగాదాకు చెందిన వ్యక్తులు, రాజీ కుదిర్చే వ్యక్తి ద్వారా ధృవ పత్రాన్ని పొందవలసి ఉంటుంది. ఒప్పందం ఏ పరిస్థితులలో రూపొందించబడ్డదో న్యాయమూర్తులు విచారించి, ఆ వెనుక అంశాలను పరిశీలించడం జరుగుతుంది. ఈ పరిశీలన స్థాయిలో న్యాయవాదులను అనుమతించరు పైగా అప్పీలు సౌకర్యం కూడా ఉండదు. ఒక ప్రత్యేక జడ్జీ ద్వారా మాత్రమే పరిశీలన జరుగుతుంది. 100 రూ॥ల నుండి 500 రూ॥ల వరకు సంబందించిన కేసుల వరకే స్వీకరించే న్యాయపరిది నిర్ధారించబడ్డది - ఋణగ్రహీతలు కూడా వారి ఋణం చెల్లించనందువల్ల ఎక్కువ కాలం కారాగారవాసం విధించబడుతుంది. హోప్ ఈ బిల్లుకు మద్దతు తెలపుతూ, బ్రిటన్‌లో సయన్యాయ సూత్రపు సందర్భాన్ని తెలుపుతూ హబ్‌హౌజ్‌ను తప్పు పట్టాడు. హబ్‌హౌజ్ అవలంబించిన చర్యల వల్ల ఒక్క 1874 సంవత్సరంలోనే 15,000 అరెస్టు వారంట్లు జారీ చేయబడి ఏ ఒక్కరిని కూడా విచారించకుండా ఉండడం ఋణగ్రస్థులను భయపెట్టడానికి మాత్రమే ఇది ఉపయోగించడం జరిగిందని హోప్ బావించినాడు ఇవి మరింతగా డబ్బులు తీసుకొనుటకు, బలవంతంగా ఒప్పందాలు కుదర్చడానికి కూడా ఉపయోగపడ్డాయి. వేలం అమ్మకం వలన ఋణగ్రస్థునకు నష్టం సంభవిస్తే , బిల్లు ఏర్పర్చిన విధానం ప్రకారం ఋణగ్రస్తుని సంపదను స్వతంత్ర గణకునితో లెక్కించి, అందులోని భాగాన్ని తీసుకున్న ఋణానికి సరిపోయేంతగా ఋణదాతకు మళ్ళించాలి. ఇంత క్రితం పట్టణ ప్రాంతాలకే పరిమితమయి ఉన్న దివాళ ప్రకటన చట్టాన్ని దేశంలోని ఇతర ప్రాంతాలకు విస్తరింపజేసినారు. పట్టణ ప్రాంతంలో ఋణగ్రస్తునికి నోటీసు జారీ చేసిన పిదప దివాళ కోరుతనాన్ని ప్రకటించేదాకా జడ్జీ చూడవలసి ఉంటుంది. దీనికి భిన్నంగా గ్రామీణ ప్రాంతాల్లోని ఋణదారుల నుండి ఋణగ్రస్తులను రక్షించడానకి కావలసిన స్వరూపాన్ని బిల్లులో ఏర్పర్చినారు.

ఈ బిల్లును చాలా మంది చట్ట సభ్యులు విమర్శిస్తూ వ్యతిరేకించినారు. సయ్యద్

అహ్మద్‌ఖాన్ ఇరుపక్షాల మధ్య రాజీకుదిర్చే పద్ధతివల్ల ఋణాలను రాబట్టుకోవడంలో చాలా ఇబ్బందులను ఈ బిల్లు కల్పిస్తుందని పేర్కొన్నాడు. ఈ పద్ధతి బ్రిటిష్ చట్టంకు వ్యతిరేఖమైనదని కూడా అతడు పేర్కొన్నాడు. ప్రభుత్వంచే నిష్పక్షపాతిగా పరిగణింపబడి నియమింపబడిన జడ్జీలను ప్రతివ్యక్తి పిర్యాదు కాగలిగే అవకాశం కల్పిస్తుందని ఈ బిల్లు ద్వారా గ్రామాల్లో రాజీకుదిర్చే వ్యక్తులు నిష్పక్షికంగా ఉండడం సందేహమేనని పేర్కొన్నాడు. బ్రిటిష్ పాలనలోని జడ్జీలసేవలను గుర్తు చేస్తూ ఈ బిల్లు ద్వారా అమలు చేయబడిన ఒప్పంద స్వేచ్ఛాను నిరాకరించడం. తనవాదనను కొనసాగిస్తూ ఒప్పంద స్వేచ్ఛ ద్వారా కల్లజేసుకోవడం అంటే అర్థం, ఋణగ్రహీతనుండి ఋణం ఇచ్చిపుచ్చుకోవడాలకన్నా చట్ట వ్యతిరేకంగా ఎక్కువ మొత్తానికి బద్ధున్ని చేయడమేనని, దానివల్ల ఋణదాత ఎక్కువ అబద్రతకులోనై అధిక వడ్డీ కోరే అవకాశముందని కూడా అహ్మద్‌ఖాన్ భావించినాడు. చట్ట సభలోని ఇతర సభ్యులు బిల్లు విధానాల యెడ హెచ్చరిస్తూ ఒక అంగీకారం న్యాయసమ్మతిని పొంది, రాజీపరిచే వ్యక్తి ముందుకు పోయిన అనంతరం కోర్టు అజ్ఞల ద్వారా దృవపర్చబడినదైనప్పటికి నిజానికి వడ్డీవ్యాపారస్తులు ఋణ గ్రస్తున్ని దుర్భాషలాడి నయవంచన చేసి అన్ని రకాల వాగ్దానాలను రాజీపరిచే వ్యక్తి ముందు చేయించుకొని బలవంతంగా బద్ధులను చేసుకోవడం కూడా జరుగవచ్చు. ఈ చర్చల సమయంలోనే ఈ చట్టం నాలుగు దక్కన్ జిల్లాలకు పరిమితమయినదిగా చెప్పబడింది. భారతదేశంలోని ఇతర ప్రాంతాల్లోగల ఇవే సమస్యలకు ఖచ్చిత పరిష్కార పద్ధతులను ఈ చట్టం చూపించేటి వంటిది కాదని కూడా స్పష్టీకరించబడింది. శాసన మండలి నియమించిన కమిటి బిల్లులోని అనేక ప్రకటనలను తొలగించడంతో హూప్ దానిపై సంతకం పెట్టడానికి నిరాకరించినాడు. చట్ట సభల్లో బిల్లును చర్చించే సమయంలో సెలక్టు కమిటీ తీసివేసిన నిబంధనల గూర్చి హూప్ నిర్భయంగా వాదించినాడు. స్పెషల్‌జడ్జీ ద్వారా పరిశీలించు విధానానికి కమిటి ఆక్షేపణను తెలిపింది. మళ్ళీ సాధారణ అప్పీలు పద్ధతిని ప్రవేశపెట్టినది. కాని ఇప్పుడు హూప్ ఈ పద్ధతిని కాపాడు శక్తి గలిగి ఉండి ఈ గౌరవ సెక్షన్‌ను యధావిధిగా ఉంచుటకు కృషిచేశాడు.

జాన్ స్ట్రాచీ హూప్‌ను సమర్ధిస్తూ బ్రిటిష్- ఇండియా న్యాయ వ్యవస్థలోని మొత్తం అప్పీలు పద్ధతిపై గట్టిగా దాడి చేసినాడు. మరో ప్రక్క బెంధామ్, వెస్ట్ పేర్కొన్న ప్రకారం ఈ విషయంపైన తీవ్ర చర్చ చేసినాడు. బొంబాయి హైకోర్టు జడ్జీల యొక్క రెండు వైపుల భావాలను పరిశీలించి ఎవరు బిల్లుకు వ్యతిరేకంగా ఉన్నారో వారిని పునఃసలహాను అడగడం జరిగింది. ప్రధాన న్యాయమూర్తి రేమండ్ వెస్ట్ ఈ బిల్లును ఆక్షేపించినాడు. ఇది ఊహించినటువంటిదే కాని ఇతర జడ్జీలు కూడా అతని భావాలకు అనుకూల అభిప్రాయాలను వ్యక్తపరిచినారు.

సాధారణంగా అప్పీలు చేసుకొనే పద్ధతిని నిరసించడమే గాక, న్యాయ వ్యవహారాల్లో

న్యాయ వాదుల పాత్రను బిల్లు ద్వారా మినహాయించడాన్ని సభ తిరస్కరించింది. హోప్ కొంత సంయమనంగా వ్యవహరించినాడు అతడు ప్రాథమిక అంశాలలోనే కల్పజేసుకున్నాడు. ఉదాహరణకు ప్రస్తుత పద్ధతి న్యాయ అంచనా ద్వారా ఋణదాతకు ప్రత్యక్షంగా ఆస్తులు బదలాయింపు చేయడానికి సంబంధించినది. ఈ పద్ధతి స్థానంలో మళ్ళీ తప్పనిసరి వేలం అమ్మకాలను ప్రవేశపెట్టాలనే పిడివాదానికి హోప్ దిగలేదు. బొంబాయి ప్రభుత్వము ఇతన్ని ఈ అంశం యెడ ఒత్తిడి చేయవద్దని సూచించడం జరిగింది. రాజీ జరిపే పద్ధతి గూర్చి మాట్లాడుతున్నప్పుడు ఈ ప్రయోజనార్థం పంచాయతీలను పునర్‌స్థాపన జరపాలన్న సూచనలను ప్రస్తావించి, ఈ సూచనలను తిరస్కరిస్తూ వ్యక్తులకు సంబంధించి ఐదుగురు విశ్వసనీయ వ్యక్తులు ఒక గ్రామంలో రాజీపర్చుబోర్డుగా సేవ చేయడానికి లభించకపోవచ్చునని పేర్కొన్నాడు. మరోవైపు విశ్వసనీయంగా రాజీకుదిర్చే వ్యక్తి దొరకడం కష్టమని పేర్కొన్న వెస్ట్‌సంకుచిత భావాన్ని కూడా హోప్ తిరస్కరించినాడు. చట్టం జారీ అయిన తర్వాత ఇండియా కార్యాలయంలో పని చేస్తున్న ఫెడ్డర్‌కు లేఖ వ్రాసివాడు. ఫెడ్డర్ ప్రభుత్వంలో సేవ చేసిన వ్యక్తి హూప్‌కు, ఫెడ్డర్‌కు ఈ అంశంపై అంగీకారముంది. అంతేకాక బిల్లును కాపాడాల్సి వచ్చినప్పుడు హూప్ ఫెడ్డర్ భావాలను అడిగేవాడు. ఈ ఉత్తరంలో హూప్ వ్రాస్తూ బిల్లుపై కొట్లాడ్డం చాలా కష్టమైనప్పటికి ఈ చట్టం రూపకల్పన తప్పని సరిగా భూఅమ్మక సమస్య పరిష్కారం వైపు మొదటి అడుగుగా భావిస్తున్నట్లు పేర్కొన్నాడు.

ఆరంభ స్థాయిలో వున్న ఆటంకాలను కనుగొనే సరికి ఈ బిల్లు చట్టం పరిధిలో ఉండి పోయింది. దీనిలో 'సాగుదారు 'పదనిర్వచనం ఎట్లా ఇవ్వాలన్నదే చట్టం ఉత్తరవు ప్రకారం, ఒక వడ్డీ వ్యాపారస్తుడు కొంత స్వంత భూమి కలిగి ఉంటే వ్యవసాయదారునిగా నమోదు చేసుకుంటాడు. ఎప్పుడైతే ప్రభుత్వం ఈ నిర్వచనంపై చట్టం చేయడానికి ఉప క్రమించిందో విమర్శకుల గొంతులు విప్పలేదు. మరోవైపు రేమండ్ వెస్ట్ ఈ ప్రమాదం గూర్చి హెచ్చరిస్తూ ప్రభుత్వం వెంటనే తన అధికారాన్ని స్వేచ్ఛగా వినియోగించి ఎవరు వ్యవసాయదారుడో ఎవరు కారో తెలుపుతూ ఇష్టం వచ్చిన రీతిలో వ్యవహరిస్తుందని ఆనాడు ఈ అవకాశం ఆధారంగా చట్టం యొక్క పనితీరును విశ్లేషిస్తూ మొదటి సంవత్సర అమలుపై వెస్ట్ ఒక మెమోరాండాన్ని కూడా ప్రభుత్వానికి సమర్పించినాడు. కాని ఈ మెమోరాండాన్ని ప్రభుత్వానికే కాకుండా పత్రికలకు కూడా పంపించినాడు, దీనితో ప్రభుత్వం ఇతనికి వ్యతిరేకంగా రాజ్య సెక్రటరీకి పిర్యాదు పంపినది. ఈ కేసు ఆ ప్రాంత ప్రభుత్వానికి, దాని ఛీఫ్ జస్టిస్‌కు మధ్య సంబంధిత సమస్యలకు కారణమయింది. ఒక జడ్జీ చట్ట రక్షణకు సంబంధించి ఉండి అదే సమయంలో దాన్ని బాహటంగా విమర్శించరాదని బొంబాయి ప్రభుత్వం పేర్కొనడం

జరిగింది. అయినప్పటికి వెస్ట్ జవాబిస్తూ స్వతంత్ర్య అభిప్రాయం వెలిబుచ్చడం జడ్జీ ధర్మమని బావించాడు. ప్రభుత్వం తన చుట్టూ స్వయంకృతంగా పెట్టుకొన్న తెరను విడదీయడం ఒక జడ్జీగా, చట్ట సంరక్షకునిగా, అట్లే చట్ట విమర్షకునిగా కూడా తన పాత్ర ఉంటుందని పేర్కొన్నాడు.

రాజ్య సెక్రటరీ, రేమాండ్ వెస్ట్‌ను బాహాట విమర్షకునిగా గుర్తిస్తూ అతని విమర్శలకు జవాబు తెలుసుకోవడం తప్పనిసరిగా భావించి జిల్లా అధికారులకు వారి అభిప్రాయములను పంపాల్సిందిగా ప్రశ్నలను పంపించినాడు. తాను వాదించిన అంశాలను పరిగణలోకి తీసుకుంటే రూపొందించిన ఈ చట్ట విధానాల క్రింద ఋణదాతలు తమ ఋణాలను తిరిగి పొందడం చాలా వరకు అసాధ్యమని వెస్ట్ బావించినాడు. అందుకోసం వారు రైతులకు ఋణాలిచ్చుటకు ఇష్టంగా లేరని ఋణంలేనిదే వ్యవసాయం కొనసాగలేదని ఋణదాతలు ఋణ గ్రహీతలు ఇద్దరూ ఈ చట్టానికి తీవ్రంగా గురికాబడినారని కూడా ఈయన వాదించినాడు. ఎప్పుడైతే ఈ ప్రశ్నలకు జిల్లా అధికారులు జవాబులను లండన్‌కు పంపినారో అందులో 80% వడ్డీ వ్యాపారితో నిమిత్తం లేకుండా చెల్లించిన రెవెన్యూ ఖచ్చిత చెల్లింపులు చెల్లించిందని ఊటంకిస్తూ చట్టం ద్వారా రైతులలో పెరిగిన సౌభాగ్యానికి ప్రతీకగా తెలియపరుస్తూ ఫెడార్ రాజ్య సెక్రటరీకి లేఖను వ్రాసినాడు.

అయినప్పటికి వెస్ట్ ఆశ్చర్యపడి మళ్ళీ తన విమర్షను కొనసాగించినాడు. అతడు మధ్యవర్తిత్వ వడ్డీరేటు తగ్గింపులను దూషించినాడు. జడ్జీలు ఎందుకు వడ్డీరేట్లను నిర్ధారించాలో, ఎందుకు వస్తువుల ధరలు నిర్ణయించే అధికారం లేదా కౌలు అద్దెలను రెగ్యులేట్ చేయడం లేదా ఇన్స్‌రెన్స్ పాలసీ (భీమా) ప్రీమియమ్ (కిస్తీ) లను ఎందుకు నిర్ణయించకూడదని ప్రశ్నించినాడు. ఇతర ఏ ఆధారాలు లేకుండా సాధారణంగా జడ్జీలు వడ్డీని 50% శాతం వరకు తగ్గిస్తారని పేర్కొన్నారు. కొన్ని సంధర్భాల్లో కేసులను నిర్ణయించడం కష్టం. ఎక్కడయితే ఋణగ్రస్తుడు తన కొంత భూమిని ఋణదాతకు మళ్లించి వడ్డీని అనుభోగిక తాకట్టుగా చెల్లిస్తాడు. కొన్ని కేసుల్లో జడ్జీలు అన్ని రకాలయిన గణనల ఆధారాలకు బద్ధులై ఒక వేళ ఆదాయం ఆ పేర్కోన్న భూమి నుండే సమానమైన వడ్డీ రేటు పొందుతున్నాడో లేదో పరిశీలించాలి. తాకట్టుల స్థానంలోనే అమ్మకం చోటుచేసుకొంటె అప్పుతీరిన పిమ్మట భూమిని అప్పుతీసుకొన్న వ్యక్తి తాకట్టు పెట్టిన వ్యక్తికి అమ్మవచ్చు. ఈ చట్టం క్రింద కోర్టు ముందు రైతులు తమ తాకట్టులను విడిపించుకోవడం పట్ల ఉత్సహాన్ని చూపినారు. క్రమేపి సరియైన ఆధారాలు లేని కోర్టులు వెల్లువలా తరుచుగా ముంచెత్తబడినాయి. ఇటువంటి కేసులకు కోర్టు ఫీజులు లేక పోవడం వల్ల కొని సందర్భాల్లో వాజ్యాలను తమ వల్లనే భూ తాకట్టులు ఋణాలకు సమాన - భద్రతగా

కుదవ పెట్టుకొన్నారనే వాదనలో అన్ని సార్లు నిజం లేదు. ఋణగ్రహీతులను తమ భూమి అమ్మునట్లు ఒత్తిడి చేసి బలవంతం చేయుట ద్వారా కొనవచ్చు. వెస్ట్ ఒకానొకకేసును ఉదహరిస్తు, రైతులు తమ భూమిలో బావి త్రవ్వుకొవడానికి ఋణం తీసుకొని భూమిని అమ్మినవైనాన్ని పేర్కొన్నాడు. ఈ అభివృద్ధి మూలంగా రైతులు ఋణదాతల వద్ద కౌలుదార్లుగా మారినారు. ఫలితంగా వడ్డీ తీసుకొవడానికి లేదా మళ్ళి ఋణం తీర్చడానికి బదులుగా ఋణదాతలు ఇప్పుడు అద్దె వసూలు చేస్తారు . అద్దెచెల్లించ లేకపోవడంతో అధికారుల సహాయంతో వచ్చి వ్యాపారస్తులు రైతులను భూమి నుండి తొలగిస్తారు. ఈ విధంగా విధానాలు కూడా అసమర్థంగా వున్నాయి. చాల కొద్ది మంది దానితో ప్రయోజనం పొందినారు.ఎందుకంటే ఎవరైనా ఒకసారి దివాలు ఎత్తినట్లు ప్రకటిస్తే ఎన్నడు అప్పు పొందడానికి అవకాశముండదు. రాజీకుదిర్చే పద్ధతి గూర్చి వెస్ట్ పేర్కొంటూ, 50% కేసులలో మర్యాద పూర్వకంగా ధృవపత్రం పొంది సాదరణంగా కోర్టు ముందు వ్యక్తులు కనబడడానికే శక్తి కలగ జేయునదిగాను 17% కేసులో మాత్రం వ్యక్తులు నిజంగా రాజీకుదిర్చే వాని ముందు సెటిల్మెంట్ జరిగినట్లుగా తెలపినాడు. ఇది చాలా సందర్భాల్లో ఒప్పందపు న్యాయ విలువలను కలిగిదాని రిజిస్ట్రేషన్‌కు ఫీజు చెల్లించనవసరం లేని వాటి విషయంలోనే జరిగింది. ఆఖరిగా వెస్ట్ పేర్కొంటూ చట్ట మొదటి సంవత్సర అమలులో కొద్దో గోప్పో రైతుల మధ్యవర్తి ఋణాల తగ్గింపులు జరిగాయని కాని తర్వాత అమలు సంధర్భాలలో ఋణధాతలు చట్ట నిబంధనలను పాక్షికంగా వాడుకోవడం నేర్చుకోవడం వల్ల వారి స్వప్రయోజనాలకు వినియోగించడాన్ని అధికం చేసినారని తెలిపినాడు.

ఈ చట్టం క్రింద ప్రత్యేక జడ్జిలుగా నియమించబడిన మొదట డా॥ పోలేన్, యం.జి రానడే ఈ అభిప్రాయములతో పాలు పంచుకోలేదు. వారి సంవత్సర రిపోర్టులలో చట్టం యొక్క అనుకూల కారణాలను (effects) వివరించినారు. 1889లో ప్రత్యేక కమీషన్ మొదటి పది సంవత్సరాలలో చట్టం పనితీరుపై సమర్పించిన రిపోర్టు ఫలితాలు కూడా అనుకూల తీర్పులనే ఇచ్చాయి. కాని ఆ సమయంలో రేమండ్ వెస్ట్ బొంబాయి ప్రభుత్వ సభ్యునిగా వచ్చినాడు. అసమయంలో ఇద్దరు ఇతర సభ్యులు పదవి విరమణ చేసినారు. అట్లే గవర్నర్లు కూడా మారినారు ఈ కారణాలు వెస్ట్ ధైర్యంతో ముందడుగు వేయడానికి, ఋణగ్రస్తత విముక్త నిర్మూలించమని అడుగడానికి తోడ్పడినాయి. అయినప్పటికి ఈ విధంగా చేపట్టిన చట్టపరమైన సాహసదాడి మరొక కమిషన్ నియామకానికి దారి తీసి ఈ చట్టం పనితీరు పరిశీలనకే రాకుండా ఈ సూత్రాలు భారత ఇతర ప్రాంత ప్రభుత్వాలు అమలు చేయవచ్చో లేదో తెల్పమని పేర్కొనడానికి ఉపకరించినాయి.

భారత ప్రభుత్వం యెటుతోచని స్థితిలో పడి పోయింది. ఇదే సమయములో బొంబాయిలో వేస్ట్ ఈ చట్టానికై ప్రత్యేకంగా దాడిని కొనసాగిస్తున్నాడు. పంజాబ్ ప్రభుత్వం ఈ చట్ట సూత్రాల ఆధారంగా ఆ ప్రాంతంలోని రైతాంగ ఋణగ్రస్థ సమస్య ఎదుర్కోవడానికి కావలసిన చట్టాన్ని రూపొందించడానికి ఉత్సాహంగా ఉంది. భారత ప్రభుత్వ దేశ వ్యవహారాల సభ్యుడు (home member) పి.పి. హచిన్స్ ఈ విషయములలోనికి దృష్టి సారించినాడు. ఇతడు పౌరుద్యోగులలో ప్రభావిత చేయగలవాడయి, ఈ చట్టం యెడ అయిష్టత కలిగి వున్నాడు. నాలుగు జిల్లాలకు మాత్రమే ఈ చట్టాన్ని అన్వయించి వుండడంతో ఆమేరకు అంగీకరించినాడు అతడు ప్రత్యేక జడ్జిలు నిష్ప్రయోజనమని భావించాడు. అతడు జడ్జిగా వున్నప్పటికి సాధారణంగా అప్పీలు పద్ధతికి గట్టిగా సానుభూతిని వ్యక్తం చేసినాడు. మరో కమీషన్ ఈ చట్ట పరిశీలనకు నియమించబడానికి వ్యతిరేకంగా వుండి ఇదే సూత్రాలపై పంజాబ్‌లో చట్ట నిర్మాణాన్ని సిఫారసు చేయడానికి అయిష్టతను వ్యక్తి కరించాడు. సాక్ష్యచట్టం (Evidence-Act), ఒప్పందం చట్టం యొక్క కొన్ని నిబంధనలను వృద్ధి పరచుట ద్వారా జడ్జీలకు సమానత్వ సూత్రాన్ని ఉపయోగించే శక్తిని కలుగజేయాలని సూచించినాడు. వైస్‌రాయ్ లార్డ్‌లాన్స్‌డౌన్ ఇంకొక చట్ట సభ్యుడు ఇతని సూచనలతో అంగీకరించినారు. సాక్షచట్ట నిబంధనలు ఏవైతే హచిన్స్ ఒప్పందం విషయములో పరిశీలించాలని చెప్పాడో వాటి మధ్య సంబంధం కూడా పరస్పర విశ్వాసంతో కూడి వున్నటు వంటిదని గుర్తించుకోవాలి. ప్రత్యేకించి ఈ నిబంధన ప్రకారం నిజాయితీ ఋజువు చేసుకొనే బాధ్యత విశ్వాసంలేని పార్టీ పైనే వుంటుంది. అయితే కొన్ని సరిపోలిన అంశాలతో వడ్డీ వ్యాపారున్ని కూడా ఈ నిబంధనల పరిధిలో చేర్చడం జరిగింది. ఇదే దారిలో ఒప్పంద చట్టంలోని రైతును రక్షించడానికి ఉద్దేశించిన శాసన సూత్రాలను ప్రస్తావించడం జరిగింది. 1880లో దుర్భిక్షవ్యవహారాలపై నియుక్తమైన కమీషన్ రక్షణా పరమైన సలహాలనే రూపొందిచడం జరిగింది.

ఈ సూచనలే 1894 ప్రభుత్వ సర్క్యూలరులో అన్ని రాష్ట్రస్థాయి ప్రభుత్వాలకు మార్గ దర్శకంగా రూపొందించబడినవి. కాని ఈ సూచనకు అదనంగా 1891 సమానత్వ సూత్రంపై ఆధారపడిన ఆలోచన ప్రకారం భూపరా యికరణను కట్టు దిట్టం చేయడానికి ఖచ్చితమైన ప్రయత్నముతో కూడిన వాస్తవమైన చట్ట నిర్మాణం జరగాలని పేర్కొనడం జరిగింది. మరొక వైపు రెమండ్ వేస్ట్ ప్రతి పాదనలు ఉండనే వున్నవి. రెపూజ్ ఆలోచనతో ఏకాభిప్రాయం కల్గిన మరికొంతమంది బావసారూప్యత వున్న అధికారులు బయలు దేరినారు. ఆ సమయములో రోహతక్ జిల్లా కల్టెక్టరుగా ఉండిన డెంజిల్ ఇబ్బెటిసస్ భూబదలాయింపులు ఒకే గ్రామ సమాజ సభ్యుల మధ్య అనుమతించబడాలని అభిప్రయపడినాడు. పంజాబ్ హైకోర్టు జడ్జీ అయిన

బి.యం. బాడెన్ పోవెల్ కూడా భూ పరాయి కరణ నిరోధానికి పౌర విధాన చట్టంలో మార్పులు చేయడం శుద్ధదండుగ అని దీనివల్ల నిరోధం సాధ్యము కాదని భావించినాడు. భారత ప్రభుత్వ సెక్రటరీలలో ఒన్ క్రాస్త్ వేయిట్ భూపరాయికరణ నిరోధం పట్ల ఇష్టంతో వున్నారు. క్రాస్త్ వేయిట్ అనుభోగిక భూసంపదను ప్రభుత్వం కోనుగోలు చేసి పరాయి కరింపబడిన భూమిగా మళ్ళీ ప్రజలకు పంపకం చేయాలని కూడా సిఫారసు చేసినాడు.

ఇలాంటి పరస్పర విరుద్ధ బావాలను పరిశీలించె ప్రభుత్వం నూతనంగా వివిధ ప్రాంతాల న్యాయ పరిపాలనా అనుభవంగల అధికారులతో కూడిన ఒక కమీషన్‌ను నియమించింది. ఈ సమస్యపై మంచి సమతుల్య నివేదిక ఏర్పర్చడానికై మొత్తం బాధ్యతను వదిలి వేసింది. దక్కన్ వ్యవసాయ దారుల సహాయ చట్టంలోని ముఖ్యమైన అన్ని సూత్రాలను మద్ధతు చేస్తూ ఈ కమీషన్ 1892లో తన నివేదికను తయారుచేసింది. మొత్తం భారత దేశానికి అనువర్తించు ముసాయిదా బిల్లును ఇదే సూత్రాలపై ఆధారపడి కమీషన్ అందచేసినది. ఇదే కాకుండా ఈ నివేదిక ఆసక్తికరమైన అంశాలను కలిగి వున్నది. రెవెన్యూ వసూలులో పెద్ద మొత్తంలో వెసులు బాటు లక్షణాన్ని ప్రతిపాదించింది. కర్తృత్వ చట్టం వల్లే వారసత్వం అనుశృతంగా కలిగి భూకమతాల విభజన విషయంలో ఏదో ఒకటి చేయవలసి వుండెది. చాలవరకు విశ్వసనీయ పట్టా హక్కుల విధానం ఉండాలి సాగుదార్లకు పంచిన ప్రభుత్వ భూమి తిరిగి పరాయికరింపబడ కుండె విధంగా చట్ట సమీకరణం జరగాలి . ఉత్తర పశ్చిమ రాష్ట్రాల్లో అమలవుతున్న కౌలు చట్టం తీరులో ఋణగ్రస్థ రైతాంగం ఎవరయితే తమ భూమిలోనే కౌలుదార్లుగా కొనసాగింపబడుతున్నారో, రైతులు కుదవ పెట్టిన తాకట్టులు కేవలం అనుబొగికమైనవిగా మాత్రమే పంచబడిన స్థితిలో, శాశ్వత యాజమాన్య హక్కులు మాత్రం రైతులకే దాఖలు పర్చాలి. కమీషన్ ఖచ్చితమైన శిఫారసులు ఏమయినా అవి చాల పరిమితులను కలిగి వున్నాయి. అచ్చుట సరయిన పట్టా హక్కులకై డిమాండ్ వున్నది. పాతదండు పట్ సూత్ర పద్ధతి పరిగణనలేదు. తాకట్లపై న్యాయపరిది తగ్గింపుకు మద్ధతువుంది కోర్టులో తన సంపద యెడ నిర్ణయాలు జరుగుతున్నపుడు ప్రతివాదిని అనుమతించాలనే వేడుకోవడం వుంది. మరో మాటలో వ్యక్తులు లేకుండా తీర్పులు జారీ చేయరాదనే విషయం విస్పష్ట మౌతుంది.

ఈ శిఫారసులన్నీ దక్కన్ వ్యవసాయదారుల సహాయచట్టంలోని కొన్ని నియమాలు మాత్రమే కాని మొత్తం భారతదేశానికి సంబంధించి సాధారణ చట్టం గూర్చి ఫలితాలను తెలుపలేదు. చాల వరకు ఈ కమీషన్ శిఫారసులు శాసనపరంగా కన్నా కార్యనిర్వాహక చర్యరూపంలో అమలుకు వీలు ఎక్కువగా వున్నటువంటివి. ఈ విషయాన్ని కూడా భారతదేశంలో తన కాలాన్ని పూర్తి చేసి వెళ్ళి పోయే కాలంలో లార్డ్‌లాన్స్ డౌన్ తన సుదీర్ఘ

మెమోరండంలో పేర్కొవడం జరిగింది. మే నెలలో రాయల్ సొసైటీ సమావేశంలో డౌన్ ఒక ఉపన్యాసం ఇచ్చినాడు. ఇందులో మరోసారి దక్కన్ వ్యవసాయ దారుల సహాయ చట్టాన్ని కమీషన్ పేర్కొన్న ఆయా సెక్షన్‌ల పై పునర్విమర్శ జరగాలని పేర్కొన్నాడు. ఈ చర్చల సందర్భంలో దక్కన్ చట్టాల ఆధారంగా చట్ట నిర్మాణాన్ని పంజాబులో సిఫారసు చేసి కొద్దికాలం క్రితమే పంజాబ్ గవర్నర్‌లుగా కార్యలయాన్ని వదలి వెళ్ళిన పోలెస్ మరియు జేమ్స్‌లాయల్‌లు విబేధించడం జరిగింది. కాని తదనంతర సంవత్సరాలలో పంజాబ్‌లోని కొందరు అధికారులు లాయర్ల యొక్క అభాప్రాయములతో ఏకీభవించక వెస్ట్ అభిప్రాయములకు అనుకూలంగా స్పందించడం ద్వారా వీరి భవిష్యత్ ఘటనలను నిర్ణయాత్మకంగా ప్రభావితం చేసే భారత ప్రభుత్వ ఉన్నత స్థానాల్లోకి నియమించబడినారు.

ప్రభుత్వ దక్కన్ చట్టం యొక్క సంబంధిత ఉప యుక్త ఋణగ్రస్థ భూస్వాములకు సంబంధించి చర్చలు ఇంకా కొనసాగుతున్నాయి. 1875 అల్లర్లు, 1857 తిరుగుబాటు నుండి కొనసాగుతూ అపరిష్కృతంగా వున్న రైతాంగ సమస్యలను ఎత్తిచూపినాయి. ఇవి చాలా ప్రాంతాల్లో భూస్వాముల తిరుగుబాటుగా పరిణమించినవి. ఇక ముందు ఎలాంటి ఉపద్రవాల జాడలు లేకుండా వారిలో అసంతృప్తిని మిగిల్చింది. అయినప్పటికి నిన్న మొన్నటి నూతన రైతాంగ అశాంతి వరకు ఈ సమస్య పూర్తి వెలుగులోకి రాలేదు. దానితో పాటు ఋణగ్రస్థత పెరగడమనేదీ విపరీతంగా విరుచుకపడడంకన్న నెమ్మదిగా తోడవడం మొదలైంది. అయినప్పటికి వారి కేసులో పరిష్కారశాసనపు అవసరం ఎక్కువగా వుంది. దక్కన్ చట్టం సిఫారసు చేసిన ప్రాథమిక . సూత్రమైన న్యాయమధ్య వర్తిత్వం కూడా దానికవే సంకటంలో వున్న ఎస్టేట్‌ల జబ్బుకు దివ్యౌశదంగా పనిచేసింది. దివాళ తీసిన లేదా ఇబ్బందుల పాలైన జమీందారులకు విభక్తి ప్రదాయని వాటిమద్య శాఖలో భాగంగా పనిచేస్తున్న కోర్టు ఆఫ్ లార్డ్స్‌గా చెప్పాలి. జమిందారులకు యోగ్యమైన యజమానిగా మారి నిర్వహణ చేపట్టే వరకు ఈ ఏర్పాటు కొనసాగుతుంది. ప్రాదమికంగా భూస్వామి మైనారిటి తీరకుండా లేదా అశక్తుడై వున్నటువంటి కేసులకు దీనిని రూపొందించారు. కాని నిబంధనలు - అసమర్థ నిర్వహణ లోవున్నవాటికై సంకటంలో వున్న వారికి కూడా ఈ సూత్రాన్ని అన్వయింపు చేసినారు. క్రమేపి అనేక మంది ఆదమరిచిన భూస్వాములు కూడా ఈ పాలన క్రిందకు రావడం జరిగింది. యజమాని, కష్టంగా తను కోల్పోయిన వాటిని మళ్ళీ సంపాదించి, ఆస్తుల దుబారాను అరికట్టినప్పుడు ప్రభుత్వం ఆయా జమీందారుల నిర్వాహణ బాధ్యతలను మళ్ళీ అతనికి అప్పగించే ఏర్పాటు చేసింది. ప్రత్యేకమైన చట్ట నిర్మాణం వాటన్నింటికి అక్కరలేదు. బొంబాయి రాష్ట్రాల్లాంటి వానిలో కోర్టు సంరక్షణలు లేవు. ఎందుకంటే ఆ రాష్ట్రంలో చాలా

పెద్ద ఎస్టేట్లు ఎక్కువ మొత్తంలో ఉండి ఈ నిబంధనలకు న్యాయం చేకూరుస్తున్నవి. అయినప్పటికి ఈ రాష్ట్రంలో 1862 నుండి 1888 వరకు కొన్ని ప్రత్యేకంగా ప్రభుత్వాధీన ఎస్టేటులలో (Specific Encumbered Estates Act) చట్టాలను ప్రత్యేకంగా గుజరాత్, సింధ్ భూస్వామ్య వర్గాల ప్రయోజనాలకై జారీ చేసినారు. చాలా వరకు ఈ చట్టాలు ప్రైవేటు ఆర్జీదారునికి నిబంధనలలో ప్రవేశం కొరకై ప్రతిపాదించి వాటి దారిలోనే కోర్టు సంరక్షణ యంధు వీటి వ్యవహారాన్ని కొనసాగించినారు. అంటే, ప్రభుత్వం స్వయంగాతన వివేచనను ఉపయోగించి ప్రమేయాన్ని కల్గించుకోవడానికి వీలులేదని భావించవచ్చు. ఈ నిబంధనకు ఉత్తరపశ్చిమ రాష్ట్రాలలోని 1873 చట్టాన్ని ఉదహరణగా పేర్కొనవచ్చు. ఇది ప్రభుత్వం అసమర్ధ నిర్వహణగల ఎస్టేటులో చురుకుగా పాల్గొనే అవకాశాన్ని కల్పిస్తుంది. అయినప్పటికి, ఒక వేళ ప్రభుత్వం ఇలాంటి ఎస్టేటులను ఆధీన పర్చుకున్నప్పుడు, ప్రభుత్వానికి ఋణదాతలు సంపూర్ణమైన వాజ్యములను సమర్పించాలి. అయితే సమయజమాన్య హక్కును మాత్రం ఈ చట్టంలో రూపొందించలేదు.

ఉత్తర భారత దేశంలోని ఝాన్సీ జిల్లాలోని ఋణగ్రస్థ భూస్వాముల ప్రయోజనార్థం 1882లో ప్రభుత్వాధీనమైన ఝాన్సీ ఎస్టేటుల చట్టం జారీ చేసినప్పుడు ఇవన్నీ తీవ్ర మార్పులకు గురయినవి. ఈ చట్టం వ్యక్తిగతంగా ఎస్టేటులకు నిర్వహణ కల్పింపకుండా దక్కన్ వ్యవసాయ దారుల సహాయ చట్టం మార్గంలో కోర్టుల ద్వారా వడ్డీ రేటులను తగ్గించడానికై ఉద్దేశించినది. ఈ చట్టం క్రింద ప్రత్యేక న్యాయమూర్తి నియమింపబడి తక్కువ సమయంలో మొత్తం ఋణంను ఒక మిలియన్ రూపాయల నుండి 7,60,000 రూ॥ల వరకు తగ్గించు శక్తి గలిగి ఋణదాతకు సక్రమంగా చెల్లించునట్లు చూస్తాడు. ఈ చట్టం మరొక సెక్షన్‌ను కలిగివుంది. దీని ప్రకారం ఋణగ్రస్థ భూస్వామి ప్రభుత్వ సహాయంతో ఋణాన్ని చెల్లించి, ప్రభుత్వం నుండి పరాయీకరింపబడని విధంగా సాంప్రదాయ కౌలుదారుగా తిరిగి తన సంపదను పొందేందుకు అవకాశముంది. దానికి అనువైన రీతీలో అనుకూలమైన వడ్డీ రేట్లను చెల్లిస్తారు.

ఈ చట్టం జారీ అయిన దానికంటే ముందు, అనంతరం ప్రభుత్వ స్వాధీన ఎస్టేటులను కొనే శక్తి కలిగి, సాధారణంగా ముందే విక్రయించే హక్కు కలిగి ఉండి, కొత్తగా పరాయీకరింపబడిన టైటిల్‌తో యజమానులకు తిరిగి ఇవ్వడం గానీ లేదా సాగుదార్లకు రైత్వారీ పద్ధతి దారిలో పంపకం చేయాలని తరచూ శిఫారసు చేయబడింది.

ఈ సాహసం గల యత్నాలు నిజానికి బ్రిటిష్ వారు ఇండియాలో ప్రవేశపెట్టిన ఆస్తి హక్కును పూర్తిగా జప్తు చేయడమే అపురుంచని, ప్రభావం చూపించగల పౌర ఉద్యోగులు,

క్రాస్ వేయిట్ ఈ చర్యల యెడ చాలా ఇష్టాన్ని గలిగివున్నా కూడా ప్రభుత్వం అంగీకరించలేదు. దీనికి బదులుగా, భారత ప్రభుత్వం భూస్వాములు తమ సంపదను పరాయీకరింపబడని దానిగా ట్రస్టు రూపంలో గాని లేదా వంశపారంపర్య అనుభవహక్కుగల చట్టం రూపంలో గాని మార్చుకొనుటకు, వారికి వారే తమ అజాగ్రత్త నుండి రక్షణ పొందుటకు వీలయిన విభిన్న రీతిగల చట్ట నిర్మాణాన్ని గూర్చి పేర్కొన్నది. 1894లో ముసాయిదా బిల్లును రాజ్య సెక్రటరీకి పంపించినది. ఈ బిల్లు ప్రకారం వైస్‌రాయ్ ఎలాంటి సాంప్రదాయ, పట్టా, భూస్వామికిగాని ఇలాంటి ట్రస్టు ఏర్పాటు చేసుకొనే హక్కును ప్రసాదించవచ్చు. చాలా కారణాల వలన రాజ్య సెక్రటరీ ఈ బిల్లును నిరాకరించినాడు. స్వేచ్ఛగా సంపదను బదిలీ చేసుకోవడానికి చిక్కులు కల్గించే ఇలాంటి వాటిని చాలా నాగరిక దేశాలు గతంలో నిర్మూలించినాయి. కనుక భారత దేశంలో దీనిని పున: ప్రవేశపెట్టడానికి ఎలాంటి కారణం కనిపించడం లేదని అతను పేర్కొన్నాడు. ఇలాంటి కొన్ని చర్యలు కౌలుదార్లకు అన్యాయమైనవి గాను, భూస్వాములకు భవిష్యత్‌లో సంకటాలను కల్పించే విధానంగా భావించాడు. ఇదేకాకుండా, ఇలాంటి నిబంధనలు హిందూ, ముస్లిం కర్తృత్వ చట్టంతో విభేదిస్తాయి. కాని రాజ్య కార్యదర్శి ఈ బిల్లులో చేర్చిన సూత్రాలను వ్యతిరేకించి, భారత ప్రభుత్వం కార్య నిర్వాహక చర్య ద్వారా వీటన్నింటిని సరిదిద్దగలిగే శక్తికలిగి లేకపోవడాన్ని ఇతను ఆక్షేపించినాడు. ఇంత క్రితమే రెండు ప్రత్యేక చట్టాలు ఈ విషయాల్ని గూర్చి గతంలో ఏర్పడినాయి. ఈచట్టాల ద్వారా వారి ఆస్తులకు ఎవరు రక్షకులుగా శక్తికలిగి వుంటారు, భవిష్యత్‌లో ఇట్లాంటి సెటిల్‌మెంట్స్ ఒక ప్రత్యేకమైన చట్టం ద్వారా చేయాలని రాజ్యకార్యదర్శి అభిప్రాయపడినాడు. రాజ్యకార్యదర్శి వ్యతిరేక తీర్పు భారత ప్రభుత్వాన్ని అదే లక్ష్యాన్ని సాధించగల ఇతర పద్ధతుల అన్వేషణకు పురికొల్పింది.

సాంప్రదాయ భూఎస్టేటుల పరాయికరణ సమస్య భారత ప్రభుత్వానికి సంబంధించి మరో సంధర్భంలో చెడు అంశంగా మిగిలింది. విభజించబడిన ఎస్టేటుకు సంబంధించి భారతీయ కేసును ఒకదానిని ప్రీవీ కౌన్సిల్ 1888లో నిర్ణయం చేసింది. ఈ తీర్పులో ఆ ఎస్టేటు పరాయీకరింపబడనవసరం లేదని, ఎందుకంటే అధి విభజింపబడిలేదని పేర్కొన్నది. ఇంత వరదాకా భారత సంస్థానాధిపతి పెద్ద ఎస్టేటు ప్రాంతీయ వాస్తవికత ప్రకారం విభజింపబడిలేదు. పరాయీకరింపబడి కూడా లేదు. ప్రీవీ కౌన్సిల్ తీర్మానించి తప్పనిసరయితే మొత్తం ప్రాంతాన్ని అమ్మే స్వేచ్ఛను ఆయాసంస్థానాధిపతికి కల్పించింది. ప్రీవీకౌన్సిల్ ఇచ్చిన తీర్పు వల్ల సంస్థానాధిపతులు సంస్థానాలకు ఋణంకు బదులుగా అమ్మేవీలుందనే విషయం వెల్లడయింది. ఇట్లా నిజానికి మద్రాసు రాష్ట్రంలో జరిగినది. మద్రాసు హైకోర్టు ప్రీవీకౌన్సిల్

ఏర్పును పేర్కొంయూ. దాని ప్రకారమే అనేక కేసులను నిర్ణయించడం జరిగింది. ఆతర్వాత మద్రాసు ప్రభుత్వం ఈ బిల్లును నిరాకరించింది. ఎందుకంటే గతంలో రాజ్యకార్యదర్శి దీనికంటే అతి తక్కువ పరిధిలో కూర్చిన ఇటువంటి తరహా (సంస్థానాల అమ్మకం) భారత ప్రభుత్వ విజ్ఞప్తిని వ్యతిరేకించాడని పేర్కొంది. ఈ తిరుగుజవాబుతో మద్రాసు ప్రభుత్వం తృప్తిపడలేదు. కొన్ని సంవత్సరాల అనంతరం పాత మిలటిరీ కట్టుబడి యినాము దారు అయిన కార్వెట్‌నగర్ రాజా తన ఋణదాతలచే మొత్తం జప్తు చేయబడిన సందర్భంగా చట్టపరమైన చర్యల గూర్చి అర్థిస్తూ భారత ప్రభుత్వానికి ఆర్జీని పంపడం జరిగింది. తన వాదనను మద్రాసు ప్రభుత్వం పదేపదే సమర్థించుకుంటూ సుశిక్షితులైన పాత భారత ప్రభువులను రక్షించుకోవడం తప్పనిసరిగా రాజకీయ అవసరమని పేర్కొంది. కాని భారత ప్రభుత్వం మొత్తం వర్గానికి రక్షణ కల్పించుటకు బదులుగా ఒక మనిషికి సహాయం మొత్తం న్యాయ యంత్రాంగాన్ని కదిలించడం ఎందుకని బావించింది. మొత్తంగా సంస్థానాదీశవర్గాన్ని కూడ కాపాడాలన్న రాజకీయ పరమైన వాదనను కూడా అర్థంలేనిదిగా కొట్టివేసింది. ఈ చర్చలు ఎచ్చటయితే ఆగిపోయినాయో మళ్ళి అచ్చటనే మొదలయినాయి. భారత ప్రభుత్వం తిరుగు జవాబులో పేర్కొన్నట్లు సాదారణ చట్టాలేర్పాటే భూస్వామ్య వర్గ సమస్య పరిష్కారానికి తీసుకోబడే ఉపయుక్త చర్యగా తెలిపింది. కనుక, మద్రాసు ప్రభుత్వం కొన్ని సంవత్సరములు ముసాయిదా చట్ట నిర్మాణ ఆధారంగా పనిచేసి చివరగా విభజింపబడని ఎస్టేట్ల చట్టాన్ని జారిచేసింది.

మద్రాసు రాష్ట్రంలో కులీన భూస్వాములు మాత్రమే శాసన రక్షణ అవసరాన్ని కలిగిలేరు. ఔద్ తాలూకాదారులు కూడా అలాంటి సమస్యలనే కలిగివున్నారు. అయినప్పటికి ఈతాలూకాదారులు 1857 తిరుగుబాటు అనంతరం పేర్కొన్న దాన్ని ప్రకారం స్పష్టంగా స్వేచ్ఛా సంపద బదిలీ హక్కులను ఆసమయంలో కలిగివున్నారు. 1888లోని ప్రీవీకౌన్సిల్ తీర్పువారికి నేరుగా ఉపయోగపడింది. కాని నిజానికి ఈ బదిలీ స్వేచ్ఛ తాలూకాదార్లకు వారి ఆదీనంలో వున్న సంస్థలకు అను గ్రహం కన్నా చాలా బరువుగా మారింది. లక్నో బ్రిటిష్-ఇండియా సంఘంగా ఏర్పడిన ఈ తాలూకాదార్లు తమ సంపదను ట్రస్టులరూపంలోకి మార్చుకోవడానికి ఒక చట్టాన్ని ప్రవేశపెట్టమని ప్రభుత్వానికి మహజరు పంపినారు. రూపొందించవలసిన చట్టము వారసత్వ చట్టాలతో విభేదించ నందువల్ల తాలూకాదారులు జ్యేష్టత్వము ద్వారా దీనిని అనుసరించినారు. ఇచ్చట విషయం ఏంటంటే స్వేచ్ఛా బదిలి నియమము మద్రాసు కులీన భూస్వాముల కేసులోవలనే వుందని పేర్కొన్నారు. ఔథ్, మద్రాసులకు చెందిన రెండు ముసాయిదా బిల్లులను భారత ప్రభుత్వం అంగీకరించి రాజ్యకార్య

దర్శి అనుమతికై పంపినది. వైస్‌రాయ్ లార్డ్ విల్సన్ రాజ్య కార్యదర్శికి తాను ఈ బిల్లులను శిఫారసు చేస్తున్నట్లు ప్రైవేటు ఉత్తరం వ్రాసినాడు. విల్సన్ ఈ లేఖ వ్రాయడం ద్వారా తాను సుముఖంగా లేనట్లు స్పష్టంగా భావించి ఈ శిఫారసులు తనయొక్క రాజకీ యార్థిక భావాలకు సరికావని బ్రిటన్‌లో ఉన్న పరిస్థితులకన్నా భారతదేశానికి విభిన్న చర్యల అవసరం వుందని తన లేఖలో పేర్కొనడం జరిగింది. అయిష్టతతో కూడుకున్న వైస్‌రాయ్ దోరణి - తన పౌర ఉద్యోగుల ఒత్తిడి మూలంగా మారినటువంటిది. మరొక వైపు పౌర ఉద్యోగులకు బలమైన భూబదలాయింపు నిరోధ చట్టనిర్మాణంలో అభిలాషలు వుండడానికై ప్రచారం మొదలు పెట్టినారు. న్యాయ మధ్య వర్తిత్వ దృక్పథం దాని ఆకర్షణ క్రమేపి కొల్పోయింది. ఇది కొంత కాలం ప్రబలంగా వుండింది. దక్కన్ వ్యవసాయ దారుల సహాయ చట్టము , ఝాన్సి ఎస్టేటుల స్వాదీన చట్టం యొక్క అతిముఖ్యమైన సాదనాలుగా మిగిలినాయి. స్వాదీన ఎస్టేటుల రక్షణ చట్టం మాదిరిగా రూపొందించిన కొన్ని వివిద రాష్ట్రాలలో కోర్టు రక్షణ నిబంధనలు ఆచరణలో సరిపోయినవిధంగా పనిచేయలేదు. కాని సాదారణంగా ఈ చట్ట నిర్మాణం ఎస్టేటులను కాపాడటానికి కార్య నిర్వహణ చర్యలు తీసుకొనే అవకాశాన్ని కల్పించింది. ఝాన్సీలో జరిగినట్లు పెద్ద మొత్తంలో ఋణ న్యాయమధ్య వర్తిత్వాలు జరగలేదు.

ఋణగ్రస్థ రైతాంగ సహాయక చట్ట నిర్మాణం గూడా 20వ శతాబ్దంలో విభిన్నరీతిని సంతరించుకొంది. సాదారణ అంశాలయిన వడ్డీరేటుల పట్ల వున్న చట్టబద్ధ నియమాలు వడ్డీ వ్యాపారుల చర్యలను కట్టుదిట్టం చేయడం కన్నా న్యాయమధ్య వర్తిత్వంపైనే అతిముఖ్యంగా దృష్టి నిలిపినాయి. తన భావనను 1918 అన్యాయ వడ్డీ అప్పు చట్ట రూపకల్పనకు 1926లో ఈ అంశంపైన ప్రభుత్వం రూపొందించిన శాసనానికి ఉపయోగపడిన అంశం కూడ.

పెరుగుతున్న ధరలతో రైతాంగ ఋణగ్రస్థతను. ఆర్థిక మాంద్యం వచ్చే వరకు తక్కువ ఒత్తిడిగల సమస్యగా మార్చింది. ఈ అంశం ఋణదాతలు ఋణగ్రహీతల మధ్య తీవ్రమైన ఉద్రిక్తతలను సృష్టించింది. ఈ సమస్యను పరిష్కరించుటకు 1930 మొదటి భాగంలో పరంపరగా శాసనాలను జారిచేసినారు. హఠాత్తుగా పరిణిమించిన ఈ సమస్య పరిష్కారంలో ఉపయోగించిన ఒక పద్ధతి ఏంటంటే కొంత నిర్ధారిత నిదుల తాత్కాలిక నిలిపివేతను ఒక సమయం వరకు ప్రకటించడం. ఈ ఒక్క పద్ధతి రైతాంగం ఆపదనుండి తక్కువ సమయంలో గట్టెక్కడానికి సహాయపడదని నిర్ధారణయింది. సహాయచట్టాలు దీర్ఘకాలిక దృక్పథంలో ఈ సమస్యను పరిష్కారానికి జారీచేయబడి కొన్ని ఇతర నిబంధనల ఆధారంగా తయారుచేయబడ్డాయి. అవి ఋణగ్రహీతల అకౌంటులను చట్ట ఆధారంగా నిశ్చయించడం, తిరిగి చెల్లింపు వాయిదాలను పేర్కొనడం వంటివి. ఋణగ్రస్తుడు తన చెల్లింపులను కోర్టులో

జమ చేయుశక్తి కలిగివున్న వారిని గుర్తించడం, తిరిగి అనుబొగిక తాకట్టులకు సమయకాల హద్దులు ఏర్పర్చి సంగ్రహ నిభందనల ద్వారా ఋణగ్రస్తుడు తన తాకట్లును విడిపించుకొనునట్లు సౌకర్యం కల్పించడం వంటి కొన్ని చర్యలను ఉదాహరించవచ్చు. లావాదేవీలపట్ల అక్కౌంట్సు గూర్చిన ఒక చట్టం ఏర్పాటు తప్పు సమాచారాన్ని సమర్పించిన ఋణదాతలకు దండగలు వేయడాన్ని కూడ ఈ చట్టంలోనే నిర్దేశించబడింది. అయినప్పటికి ఈ విధమైన చట్టం 19వ శతాబ్దంలో ముందు పేర్కొన్న చట్టాలవలె న్యాయ మధ్య వర్తిత్వం వొడంబడికల ఆధారంగా కొనసాగబడలేదు. దక్కన్ చట్టంలో ప్రాముఖ్యతగలదయిన రాజీ సూత్రమువైపు దృష్టిసారిస్తే అనేక మార్లుగా ఇది ఒక మినహాయింపుగా మాత్రమే ఆచరించబడింది. వ్యవసాయ రంగంపై నియుక్తం అయిన రాయల్ కమీషన్ తన నివేదికలో బోర్డుల ఏర్పాటును సిఫారసు చేసింది. కాని ఆ సమయంలో ఎక్కువ అంశాలను చెప్పలేక పోయింది. కేంద్రీయ రాష్ట్రాలలోని చట్ట నిర్మాణ సభలో ప్రైవేటు సభ్యుల బిల్లుగా దీనిని ప్రవేశపెట్టిన కొన్ని సంవత్సరాల అనంతరం ఈ సూచనలను అనుసరించాలని అకస్మికంగా పేర్కొనడంతో ప్రాంతీయ ప్రభుత్వం ఈ బిల్లును వెనుకకు తీసుకుంది. ఈ బిల్లు స్వచ్ఛంధ రాజీ కాక నిర్బంధరాజీ సూత్రాన్ని పేర్కొని బోర్డుకు అపరిమిత అధికారాలను కల్పించింది. దీని ప్రకారం, ఋణాలను 50% వరకు తగ్గించవచ్చు. ఈ తీర్పులే అఖరివిగా పేర్కొని ఎలాంటి అప్పీల్లకు అవకాశం లేకుండా చేసింది. అక్కడక్కడ కనిపించిన అననుకూలతకు భిన్నంగా రాష్ట్ర ప్రాంతీయ ప్రభుత్వం 1933లో కేంద్ర రాష్ట్రాల ఋణ గ్రస్థ నివారణ రాజీ చట్టంకు కొన్ని మార్పులు చేయుట ద్వారా దీనిని జారీ చేసింది.

దక్కన్ చట్టం కల్పించిన ప్రాథమిక స్థాయి రాజీ అవకాశాలను తప్పనిసరి మధ్యవర్తిత్వ అంశాన్ని న్యాయమూర్తులకు వదలడం వంటి అంశాలకు భిన్నంగా ఋణగ్రస్తులకు మధ్య వర్తిత్వ విషయంలో చాలా తీవ్రమైన దృక్పథంగా పరిగణించబడింది. ఈ చట్టం ప్రత్యేక బోర్డులను సృష్టించి మధ్య వర్తిత్వ భావనను పునః నిర్వచించి పంచాయితీలకు అప్పగించి వాదులాటకు ఒకవైపు ఇస్తుండగానే మరొకవైపు దక్కన్ చట్టం ఇంకా చట్టపు దోసిటలోనే అవకాశం ఉంటూ వచ్చింది. 19వ శతాబ్దంలో ఈ అంశంపై వచ్చిన ప్రత్యామ్నాయాల పట్ల అంతగా దృష్టి సారించబడలేదు. అవాంఛనీయ రైతాంగ ఋణ గ్రస్థత వల్ల వచ్చు పరిస్థితులకు బదులుగా, భూపరాయీకరణను నిరోదించడం చాలా సమర్థవంతమైన పరిష్కారంగా దృష్టిని కేంద్రీకరించారు. ఈ పరిష్కారం ఋణగ్రస్తులకు సహాయం కల్పించలేక పోయింది. కాని ఋణంపై హద్దులు ఏర్పర్చటం ద్వారా ఋణగ్రస్థతను నిరుత్సాహపరచింది రేమండ్ వెస్ట్ పుంజుకొన్న పట్టుదలతో ఋణగ్రస్థ సమస్యకు ప్రత్యామ్నాయ దృక్పథంకై అంశాలను తయారు చేస్తున్నాడు. జరుగుతున్న భూపరాయికరణపైన విధించ వలసిన చట్ట బద్ధమైన నిషేదం పట్ల

రేమండ్ వెస్ట్ పతి పాదించిన బావనలకు ఉత్తర భారత దేశంలోని ఉద్యోగులనుండి ప్రబలమైన మద్దతు రానారంబించింది. నాయ మధ్య వర్తిత్వ సూత్రాన్ని ఋణగ్రస్తతకు సరియైన మార్గంగా వీరు భావించలేదు.

## రెండవ ప్రత్యామ్నాయం : భూపరాయీకరణ నిషేధం :-

దక్కన్ వ్యవసాయదారుల సహాయ చట్టంపై రిపోర్టు సమర్పించమని కమీషన్ ఏర్పాటు చేసినారు. ఆసమయంలో E.C ఖాన్ అనే అధికారి రెవెన్యూ వ్యవసాయ శాఖకు సెక్రటరీగా వున్నాడు. అతను కమీషన్ పరిధిలో ఉండగలిగే భూపరాయీకరణను కట్టు దిట్టం చేయ గల నియమాల గురించి అన్వేషణ చేసినాడు. కాని వైస్‌రాయ్ లార్డ్ లాన్స్‌డౌన్ ఇతర రాష్ట్రాలకు వివిధ పరిమితులుగల దక్కన్ చట్టం ఉపయుక్తంగా ఉండడం గురించే అన్ని విధాలుగా పరిశీలనలు చేయడం మొదలు పెట్టినాడు. అయినప్పటికి 1894లో లాన్స్‌డౌన్ భారతదేశాన్ని వదిలివెళ్లే సమయంలో భూపరాయీకరణ నిషేదంను తీసివేయడం ఇదమిద్దంగా అసాధ్యమని తనకుతానుగా పేర్కొన్నాడు. భారత ప్రభుత్వం 1894లో రెండు చట్ట ప్రత్యామ్నాయాల గూర్చి అన్ని రాష్ట్రాల్లో ఒకే సమయంలో ప్రాథమికంగా చర్చలు జరిగే విధంగా నిర్ణయం తీసుకుంది. దక్కన్ చట్టం ఆధారంగా కమీషన్ తయారు చేసిన ముసాయిదా బిల్లును అన్ని రాష్ట్రాలకు పంపేయడం జరిగింది. కాని చాలా ప్రాంతీయ ప్రభుత్వాలు దానిని గణనలోకి తీసుకోలేదు. బొంబాయి. మద్రాసు ప్రభుత్వాలు దీనికి వ్యతిరేకంగా వున్నాయి. కాని పంజాబ్‌లో లాయల్ అనంతరం వచ్చిన ఫిట్జ్‌పాట్రిక్ అనే అధికారి ఈ చట్టం సబార్డినేట్ కోర్టులకు అపరిమిత అధికారాలను కల్గిస్తుందని భావించిన కారణంగా కొంచెం ఇష్టాన్ని కనబరచినాడు. ఈ విధంగా మొదట ప్రత్యామ్నాయ ఆధారంగా ఆసమయంలో చట్టపర చర్యలు కొనసాగింపబడినాయి.

భారత ప్రభుత్వ రెవెన్యూ మరియు వ్యవసాయ శాఖ తీసుకోవాల్సిన చర్యల అంశాల గూర్చి విస్తృతంగా రూపొందించి అన్ని ప్రాంతీయ ప్రభుత్వాలకు రాజ్య కార్యదర్శికి పంపడం జరిగింది. ఈ విచారణలో భారతరైతాంగ ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడి వ్యవసాయ అభివృద్ధికి ఉపయోగించడం లేదు. కాని భూమిని సంపాదించుటకు మాత్రమే ఉపయోగిస్తున్నారని స్పష్టీకరించబడింది. ఈ దోరణి ఈ భూపరాయీకరణ నిషేధాన్ని ప్రతిఘటించుతుంది. ఇలాంటి దానిని విశ్వాస రాహిత్య చర్యగా కూడా పరిగణించవచ్చు. దీన్నే కౌలు చట విషయంలో కూడా చెప్పుకోవచ్చు. ఇటీవల జారీ చేసిన ద్రవ్య చట్టం కూడా భూపరాయి కరణ నిషేదాన్ని సూత్ర బద్ధంగా సమర్థించింది. భూపరాయి కరణ నిషేద చట్టం అనేక మంది పెద్ద భూ యజమానుల లాభాలను, సమాజంలోని ఇతర వర్గాల ప్రయోజనాలను తగ్గించే స్వభావం వున్నటువంటిది.

ఈ ముసాయిదాను తయారు చేసినవారు భూ పరాయీకరణ నిషేదం దేశంలోని వివిధ భాగల్లో దాని అమలు సమస్యల గూర్చి కూలంకశంగా వివరించారు. రైత్వారి పద్ధతిగల ప్రాంతాలలో భూబదలాయింపు నిషేదం అమలు చేయడం సమస్య కాదని వీరు భావించారు. కొన్ని ఈ చర్యలు ఉత్తర భారత దేశానికే సంబందించి గ్రామీణ యాజమాన్య సమాజంలోని కొన్ని సమాజ వర్గాల స్థాయిని తగ్గిస్తుందని అనుమానాలు వున్నాయి. అయినప్పటికి ఏకమొత్తంగా, భూపరాయీకరణ నిషేధం స్థానంలో భూబదలాయింపు నిషేదపు నిబంధన వ్యవసాయ కులీలను దృష్టిలో వుంచుకొని సూచించినారు. అయినప్పటికి, ఈ విషయంలో భూమికొన్న వారు ఎక్కువ మొత్తంలో భూమిని ఖరీదు చేసే విధంగా వుండరాదు. ఎందుకంటే వడ్డీ వ్యాపారస్థులు ఏదో ఒక రూపేణ చట్టాన్ని వక్రీకరించి ఈ కొనుగోలు అవకాశాన్ని ఉపయోగించుకొని మోసం చేయుశక్తి కలిగి వుంటారు. బహుశా ఈ సమస్య పరిష్కారంగా ఎవరైతే తన సమీపబంధువు భూయజమాని నుండి భూమి కొనుటకు సిద్ధంగా ఉన్నారో ఆ బదలాయింపు రెవెన్యూ అధికారి ఇచ్చే అనుజ్ఞపై ఆధారపడి జరగాలి. అమెరికా హామ్‌స్టెడ్ చట్టం ప్రకారం ప్రతివ్యవసాయ కుటుంబం పరాయీకరింపబడని కనీసకమతం కలిగి వుండాలి. దాంతో నిలకడ కలిగిన ఆధాయం కుటుంభానికి లభ్యమౌతుంది. ఈ భూబదలాయింపు నిషేదపు ముసాయిదాను ప్రతిపాదించినారు. విలియమ్ మ్యూర్ సూచనల వైపుకు దృష్టిమరల్చివారు. ఇతని అనుభవాలు భారతదేశంలోని ఉత్తర పశ్చిమ రాష్ట్రాలకు సంబంధించినవి. ఇతని ప్రకారం సాగు హక్కు మాత్రం పరాయీకరింపబడనిది. అదే విధంగా భూపట్టా మాత్రం బదలాయింపు కలిగి వుంటుంది. ఈ పద్ధతిలో రైతులు తమ స్వంత భూముల్లోనే కౌలుదార్లుగా మిగిలిపోతారు. ఒకనాటి యజమానిగా స్వాంతన పొందుతూ కౌలుదార్లుగా తమ భూమి అనుకూల అద్దెను కూడా పొందుతూ ఉంటారు. అంటే స్వేచ్ఛా బదలాయింపు హక్కు కొనసాగించబడిందన్న మాటకానీ బదలాయింపు లక్ష్యం మాత్రం పునర్నిర్వచించబడినది. అందుబాటులోకి వచ్చిన భూమి మిగులు విలువను ద్విగుణీకృతం చేయడమే ఈ చర్యల లక్ష్యం.

ప్రతిపాదించిన భూ పరాయీకరణ నిషేదపు మూసాయిదాపై వివిధ ప్రాంతీయ ప్రభుత్వాల ప్రతిస్పందనలు భారత ప్రభుత్వ లేఖలు స్పష్టమైన అభిప్రాయాలను కలిగివున్నాయి. బొంబాయి ప్రభుత్వం కరువు, ప్లేగులతో చుట్టబడి వుండటం మూలాన తిరుగుజవాబు పంపలేదు. కాని తన స్వంత పద్ధతిని సమస్య పరిష్కారదిశలో ఎంచుకున్నది దీనిని తర్వాత పరిశీలించవచ్చు. ముందే చెప్పుకున్న విధంగా బొంబాయి ప్రభుత్వానికి సంబంధిత రికార్డులు లేని కారణంగా భూబదలాయింపుల గూర్చి సమాచారాన్ని ఇవ్వలేక పాయిందన్నదే తక్షణ ప్రశ్న . మద్రాసు ప్రభుత్వం మొదటి సమస్య పట్ల , రెండవ ప్రత్యామ్నాయ చట్ట విధానాల

యెడ సాధారణంగా అయిష్టత కలిగివుంది. ఈ ప్రాంతీయ ప్రభుత్వం చాలా సంవత్సరాల వరకు ఈ సమస్యపట్ల ప్రతిస్పందించలేదు. కాని, పదునైన పదజాలంతో బదలాయింపు స్వేచ్ఛ అనేది ఏదో మినహాయింపుగా కాకుండా హక్కుగా అంగీకరించి శతాబ్దం దాటింది. ఈ హక్కును తగ్గించరాదు. ఒక వేళ తగ్గిస్తే రెవెన్యూ వసూలు అసాధ్యంగా పరిణమిస్తుంది. మద్రాసు రాష్ట్రంలో రెవెన్యూను వరి కోతలు అయిన అనంతరం వసూలు చేస్తారు. అందుచేత రెవెన్యూ మిగులు పంట సమయంలో జప్తుచేయడం అసాధ్యం భూమి అమ్మకం అనేది రెవెన్యూ తిరగి పొందడానికి గల మిగిలిన ఒక పద్ధతి మాత్రమే. ఇదే కాకుండా మద్రాస్‌లో వ్యవసాయదారుడు వడ్డీ వ్యాపారస్థుల మధ్య ఖచ్చితమైన వేర్పాటే లేదని పేర్కొన్నది. అందువల్ల ఒకరినుండి మరొకరికి జరుగు భూబదలాయింపును చట్టం ద్వారా నిబంధన చేయడం అంత తొందరగా సాధ్యమయ్యే విషయం కాదనేది స్పష్టంకాని, పెద్ద భూఎస్టేట్ల పరాయీకరణ మాత్రం సమస్యగా మిగిలిపోయింది. కాని దీనికి ప్రత్యేక విధమైన చట్టం అవసరం ఏర్పడుతుంది.

బెంగాల్ దాని కుండే భూయజమాన్య నిర్మాణ కారణంగా భూపరాయీకరణ సమస్యయెడ అంతగా సంబంధం కలిగిలేదు. ఉత్తర-పశ్చిమ రాష్ట్రాల్లో కౌలుచట్టం రెవెన్యూ చట్టం పెద్ద ఎస్టేట్ల రక్షణకై ఏర్పర్చబడిన చట్టాలు భూపరాయీకరణ సమస్యను ఒక ప్రక్క సమర్థంగా ఎదుర్కొంటున్నాయి. మరో ప్రక్క అచ్చట సాధారణ భూబదలాయింపు పట్ల ప్రత్యేక నిబంధనల అవసరంపట్ల ఆత్రుత చూపబడలేదు. కేంద్ర రాష్ట్రాలలో బదలాయింపు సయమం ఏకరీతిగా రూపొందాలని కౌలు చట్టంలోనే పేర్కొనబడివుంది. మిగిలిపోయిన ప్రాంతం ఒక్క పంజాబ్ మాత్రమే మొత్తం దృష్టి అంత ఆ ప్రాంతం పైనే కేంద్రీకరించబడివుంది.

ఇబ్బెట్‌సన్ పంజాబ్‌లో పనిచేసి ఆ ప్రాంత కులాలపైన గిరిజనులపై పుస్తకాన్ని రచించినాడు. ఈయన రెవెన్యూ వ్యవసాయశాఖ కార్యదర్శిగా క్రొత్తగా నియమింపడినాడు. ఈయన భూపరాయి కరణపై గొప్ప తీవ్ర చట్ట నిర్ణయాన్ని గూర్చి పేర్కొన్నాడు. డెంజిల్ ఇబ్బెట్‌సన్ అన్ని విషయాల పట్ల భూపరాయికరణ నిషేధంలో యుక్తంగా అతని ముందున్న ఇ.సి.బక్‌తో అంగీకారాన్ని కలిగివున్నాడు. ఒక విధంగా ఉత్తర పశ్చిమ మహారాష్ట్రలో సేవలు చేసిన ఇ.సి.బక్ లాంటి అధికారులకన్నా ఇబ్బెట్‌సన్ ఎక్కువగా నిషేధంపై ఇష్టాన్ని కలిగియున్నాడు. ఇబ్బెట్‌సన్ తీసుకొన్న వైఖరి - 1898లో మరింత బలోపేతమయింది. ఈ నాటికి పంజాబ్‌లో సేవలు చేసిన చార్లేస రివాజ్ భారత ప్రభుత్వంలో సభ్యుడయినాడు. రివాజ్, ఇబ్బెట్‌సన్‌లు సామర్థ్యంకలిగిన వేలం విధాన చట్టం పట్ల విశ్లేషణా పూర్వక ఇష్టాన్ని కలిగివున్నారు. అట్లే వైస్‌రాయ్‌లార్డ్ కర్జన్ వచ్చినారు. రివాజ్, ఇబ్బెట్‌సన్‌లకు మరింత మద్దతు వచ్చింది. ఎందుకంటే కర్జన్ కేంద్ర ప్రభుత్వ పరంగా అన్ని ప్రాంతాల ప్రభుత్వ పరిధులలోనికి చురుకుగా కలిగించుకుంటున్నాడు. నిర్దిష్ట అభిప్రాయములు కలిగిన కర్జన్ రాక ఎటువంటి

సందేహం లేకుండా భూపరాయికరణ నిషేధాన్ని మద్దతునిచ్చినాయి.

పంజాబ్ గత కొంతకాలంగా రైతాంగ ఋణగ్రస్థ భూపరాయికరణం అధికారిక చర్చలలో ప్రాధాన్యం కలిగి వున్నాయి. ఋణాల చెల్లింపులో తక్కువ కాల పరిమితి వాయిదాల హద్దులు అనుభోగిక తాకట్టును సాధారణంగా ప్రవేశపెట్టడం సమస్యను తలక్రిందులుగా చేసింది. చాల ఎక్కువ మొత్తంలో రైతాంగం వారి భూమిలోనే మారినారు. దాంతో వారు పూర్తిగా వడ్డీ వ్యాపారులపై అధారపడి మళ్ళీ తమ భూమి పొందుతామనే ఆశలను కోల్పోయినారు. 1875కు పూర్వమే పంజాబ్ న్యాయమూర్తుల చేపాలనావేత్తలచే ఈ సమస్య స్పష్టంగా చెప్పబడింది. కాని ఆసమయంలో భూబదలాయింపుల సంఖ్య తగినట్టుగా హెచ్చరిక స్థాయికి చేరలేదని బావించబడినది. పది సంవత్సరముల అనంతరం హెచ్చరిక కారణాలు స్పష్టంగాకః పడుతున్నాయి. యస్.యస్. థోర్‌బర్న్ ''పంజాబ్ ముస్లింలు, వడ్డీవ్యాపారులు'' అనే అసక్తికరమైన పుస్తకాన్ని ప్రచురించినాడు. అందులో అతను ముస్లిం రైతులకు, హిందూ వడ్డీవ్యారస్తుల మధ్య సంభవించే విరోధాల గూర్చి ప్రస్తావించి, ఈ విరోధాలను నివారించు చట్టం అవసరాన్ని పేర్కొన్నాడు. ఈ పుస్తకం రాజ్యకార్యదర్శి వద్దకు చేరింది. అతడు భారత ప్రభుత్వాన్ని అధిక సమాచారం కోసమై వెంటనే అబ్యర్థించినాడు. పంజాబ్ ప్రభుత్వం ఆ ప్రశ్నలకు బలవంతంగా బదులు చెప్పింది. థోర్‌బర్న్ సమస్యను విస్తరించి చెప్పినాడని, ఇచ్చట హెచ్చరిక స్థాయి కారణాలు ఏమీలేవని పేర్కొవడం జరిగింది. జేమ్స్‌లాయల్ క్రితంలో పేర్కొన్న అంశాన్ని గుర్తుచేస్తూ చిన్న స్థాయి ముస్లిం రైతులు బహుశా తమ హక్కులను కాపాడుకునే శక్తి కలిగి లేక బ్రిటిష్ పాలన దయపై ఆధారపడి వుంటారని తెలియచేసినారు. అందువల్ల వారి సామర్థ్యాల కనుగుణంగా వారి స్థాయిలు కుంగిపోయినాయని కూడా ప్రస్తావించినారు. ఈ ఘటన నుండి వారిని రక్షించే మార్గాలు చాలావరకు రెవెన్యూ వసూలులో కొన్ని సర్దుబాట్లు చేయుటద్వారా వారి ఆకస్మిక క్షీణతను, హోదాతగ్గిన బాధను తగ్గించవచ్చని పేర్కోవడం జరిగింది. దేరా ఇస్మాయిల్‌ఖాన్, జిల్లాలోని తన అనుభవ ఆధారంగా ఏర్పరుచు కొన్ని అభిప్రాయలు పంజాబ్ గవర్నరయిన అనంతరం కూడా మార్చుకో లేదు. అంతేగాక థోర్న్‌బర్న్ పుస్తకం ద్వారా వచ్చినవాదనలపట్ల కూడా ప్రభావితుడు కాలేదు. కాని రాజ్య సెక్రటరీ విన్నపము వలన విచారణ చేసి దానిపై సుదీర్ఘంగా పేర్కోవడం జరిగింది. మొట్ట మొదటగా థోర్న్‌బర్న్ యొక్క చాలా సూచనలు నిజానికి దక్కన్ వ్యవసాయ దారుల సహాయ చట్టం నుండి తీసుకోబడనివని లాయల్ అంగీకరించడానికి సిద్ధంగావుండి అతడు ఒక చట్టాన్ని అవసరమైన ఏజిల్లాలోనయినా ప్రభుత్వం అమలుచేయునట్లు రూపొందిస్తానని, కాని మొత్తం రాష్ట్రానికి ఉన్న దున్నట్లుగా అమలు చేయడం కష్టమని పేర్కొన్నాడు. ఇతడు భూపరాయీకరణ నిషేదానికి వ్యతిరేకి. ప్రభుత్వం భూబదలాయింపు స్వేచ్ఛను వెనకకు తీసుకోవడంపై భారత

ప్రభుత్వం యొక్క అస్పష్టమైన తికమక జవాబుతో లాయల్ తృప్తిపడక మరింత తన వ్యతిరేకతను చాటుకొన్నాడు. లాయల్‌ను సరైన సూచనలు ఇమ్మని కోరడం జరిగింది. లాయల్ పంజాబ్‌ను వదిలివెళ్ళేముందు దక్కన్ చట్టాన్ని ప్రవేశ పెట్టలేకపోయినాడు. కాని ఇతని అనంతరం వచ్చిన డెన్నిస్ ఫిట్జ్‌పాట్రిక్, మాక్‌వర్త్ యంగ్‌లు దీనిపట్ల ఇష్టాన్ని కలిగిలేక భూబదలాయింపు నిషేధానికి ప్రాముఖ్యతమిచ్చినారు. కాని ఇబ్బెట్‌సన్ దీనిపట్ల అయిష్టతతో వుండి, సాధారణ చట్టం పట్ల ఆతురత కలిగి, చట్ట అమలులో శక్తికలిగి వారియొక్క స్వంతవివేచన ద్వారా ఏస్థానిక ప్రాంతంలోనైనా సరియైన చర్యతీసుకోవాలని పేర్కొన్నారు. ప్రక్క-ప్రక్కనే వుండే ఈ చట్ట పద్ధతుల పట్ల వివాదాలకు మరొక రాజకీయ గమ్యానికి సంబంధించిన నిర్బంధమును పాలనావేత్తలు మనసులో వుంచుకోవాల్సివచ్చింది. మొత్తం బదలాయింపు నిషేధం యెడ ఎలాంటి భావన రూపుదాల్చలేదు. ఎందుకంటే వ్యవసాయదారులచే కొనబడని భూమి, దాన్ని మళ్ళీ మొత్తంగా వడ్డీ వ్యాపారస్తులనుండి తప్పనిసరి పొందడం కొరతగినది. కాని ఎవరిని వ్యవసాయదారులగా నిర్వహించాలన్న పాత సమస్య ఽ క్కన్ చట్ట నిర్మాతలచే గానీ దానిని అన్వయింపును మద్దతు చేసిన వారిచే గాని మళ్లీ ఒక వేళ భూమికొనే హక్కు గ్రామసమాజ సభ్యులచే నిర్బంధింపబడితే దాని పరిధి చాలా తక్కువగా ఉన్నట్లు భావించాలి. ఇది సమర్థంగా వడ్డీ వ్యాపారస గ్రామంలో భూస్వామి కాకుండా నిరోధించలేదు. దాంతో అతడు సమజంలో ఒక సభ్యునిగా మారుతాడు. నిజానికి ఈ నిర్బంధం వడ్డీ వ్యాపారికే అనుకూలం ఉంటుంది. అతడు పోటిలేని స్థాయిలో వుండి చివరగా మొత్తం గ్రామాన్నే కొనుగోలు చేస్తారు. మరో ప్రక్క వ్యవసాయదారులందరిని కలుపుకొని పరిధి విస్తరించినపుడు, వ్యవసాయదారు పదానికి ఖచ్చితమైన నిర్వచనం కనుగొనే సమస్య ఎదుర్కొన్నప్పుడు వ్యవసాయదారుల నుండి వ్యవసాయేతరులను స్పష్టంగా వేరుచేయవచ్చు. ఇదేకాకుండా ఇచ్చట మరొక ప్రమాదకరమైన విషయము వడ్డీ వ్యాపారస్తుడు తనముందు సేవచేయు ఇష్టంగల రైతు లభ్యమయినపుడే వడ్డీవ్యాపరం దెబ్బతీయ కుండా వుండే విధంగా గిరిజన లేదా కులంను ఒక యూనిట్‌గా తీసుకొని వారిలో వారికి స్వేచ్ఛాబదలీలు అనుమతించినపుడు ఇలాంటి ఇబ్బందులను అధిగమించవచ్చు. అయినప్పటికి ఈ సమస్యకు పరిష్కారాన్ని చర్చల చివరి దశలో చాలా ఆలస్యంగా అవలంభించటం జరిగింది. మొదటి స్థాయిలో ఈ పరిష్కారం చాలా గ్రామ సమాజ సముదాయ పరిధిలోనే అమ్మకాలకు జరుగాలనే అంశానికి అనుకూలించింది. గ్రామ సముదాయదశ దాటితే అదికేవలం పూర్వీకుల కుటుంబాలకు సంబంధిచిన వారికే అమ్మబడాలనే అంశానికి ఎక్కువగా మద్దతు లభించింది. భూమిని స్వాదీనపరిచే హక్కు ఆయా ప్రాంతాల సంప్రదాయ హక్కుతో వీలినమైన భాగాన్ని భూపరయీకరణ నిషేదంపై తెచ్చె శాసనంలో ప్రాథమికంగా గుర్తించి రూపకల్పన చేయవలసి

వచ్చింది. ఒకవేళ భూమిపైనా స్వాదీన పరుచుకొనే వారు లేనట్లయితే అట్టి భూముల విషయం జిల్లా రెవెన్యూ అధికారి వివేచనకే వదిలివేయడం జరిగింది. అయితే ఈ ప్రకరణాలన్నింటిని భారతీయ మండలిలోని రాజ్యకార్యదర్శి తిరస్కరించినాడు. అంతేకాక బ్రిటిష్ భారత ప్రభుత్వాన్ని ఇటువంటి సమస్యాత్మక విషయాన్ని శాసనరూపకంగా మల్చవద్దని భూస్వాదీన అంశాలపై ఒక ప్రత్యేక బిల్లును రూపకల్పన చేయ్యాలని రాజ్య కార్యదర్శి సూచించినాడు, భూమిని విక్రయించేందుకు ప్రభుత్వం సిద్ధపడ్డా ఎవరు కొనడానికి ముందుకు రానట్లుయితే రెవెన్యూ అధికారి తీసుకునే నిర్ణయానికి ఏ ఆధారాలను పాటించాలో ఈ అంశంపై ప్రతిపాదించిన బిల్లులు స్పష్ట పరుచలేదని రాజ్యకార్యదర్శి వివరించినాడు. రాజ్య కార్యదర్శి చూపించిన ఈ ఆక్షేపణల మూలంగా మొదటి స్థాయి చర్చలు నిలిపివేయడినాయి. విస్తృత పరిధిలో కొనుగోలుదారులు అవలంభించే సాధ్యా సాధ్యాల గూర్చి వివరించమని కూడా కోరినాడు. ఇది కూడా గవర్నర్ మాక్‌వర్‌యంగ్ అభిప్రాయముల కనుగుణంగా వుండే అతను కూడా చిన్న పరిధిలో కొనుగోలు దార్లపై విధించే ఆంక్షల పట్ల సముఖంగా లేడు.

గవర్నర్ జనరల్ కార్య నిర్వహణ కౌన్సిల్ సభలో హఠాత్తుగా ఆశ్చర్యకరమైన రాజీ ఉద్భవించినది. మాక్‌వర్‌యంగ్ కూడా ఆసభకు హజరయినాడు. భూపరాయికరణ నిషేద చట్టం పట్ల గతంలో అతను వ్యక్తికరించిన ఆక్షేపణలను ఆయన ఉపసంహరించుకున్నాడు. ఆయన భావాలకు ఆస్కారం కలిగించి చిన్న పరిధిలో కొనుగోలు దార్ల ఆంక్షలను మినహాయించడంతో ఈ సమస్యపై రాజీకుదిరిందీ. ఆ సమయంలో ఒక వేళ అచ్చట యూనిట్ లేకుంటే రాష్ట్రం కన్నా చిన్నదిగా గ్రామ సమాజంకన్నా పెద్దగాను ండే దానిని ఎదైనా ఒక యూనిట్‌ను సూచించమని కర్జన్ కోరినాడు. దానితో మరొక అధికారి రివాజ్, గిరిజన లేదా కులం అలాంటి ఒక యూనిట్‌గా పరిగణించవచ్చునని సూచించాడు మాక్‌వర్‌యంగ్ వెంటనే ఈ సూచనను. అంగీకరించి. భారత ప్రభుత్వం ఈ రాజీని స్థిరంగ రక్షిస్తుందని పేర్కొన్నాడు. లార్డుకర్జన్ నాటి రాజ్య కార్యదర్శి అయిన జార్జ్‌హమిల్టన్‌కు ఈ పరిష్కారాన్ని తెలియపరుస్తూ వ్యక్తిగత లేఖను వ్రాసినాడు.

ఇంత శ్రమతో కూడిన వ్యాజ్యానికి తెరవేస్తూ సాధారణ చట్టానికి బలాన్ని చేకూర్చింది. ఈ చట్టంకు మరింత బలాన్ని కలిగించడానికి భారత కౌన్సిల్‌లో ముందే ప్రవేశించిన ఫిట్జ్‌పాట్రిక్ దైర్యంగా తనపాత పారాటాన్ని కొనసాగిస్తున్నాడు. పంజాబ్‌గవర్నరయిన రివాజ్ బహుశా ఇంకా చట్ట ఉద్దేశ్యాల యెడ అనుమానాన్ని కలిగివుంటూ ఈ చట్టం క్రొత్తగా ఏర్పాటు చేయబడిన పంజాబ్ గవర్నర్ చట్ట సభలో కన్న గవర్నర్ జనరల్ చట్టసభ ద్వారా జారీకావాలని కోరుకుంటూ, ఇది రాజ్యకార్య దర్శికి అధికారికంగా పేర్కొన్నాడు కూడా. ఇతడు భూమిని ఆక్రమించు హక్కుకై ప్రత్యేక చట్టాన్ని ప్రవేశపెట్టడంపై రాజ్యకార్యదర్శి

సూచనలకై ఎదురుచూస్తున్నాడు. భూబదలాయింపు ఒకే తరహా గిరిజన లేదా కులం సభ్యుల మధ్య జరుగుతుందని వాటి పట్ల అవలంబించే పద్ధతి గురించి తెల్పినాడు. వేరే భూబదలాయింపులయితే వాటిపై ప్రభుత్వం విచారణ జరిపేందుకు అధికారం ఉండాలని రాజ్య కార్యదర్శి సూచించాడు. ప్రభుత్వం మీద గిరిజన తెగలను కులాలను ''వ్యవసాయ దారులు'' మరియు వ్యవసాయదారులు కానివారి'గా వర్గీకరించు చట్ట నిబంధనల చట్రాన్ని ఏర్పాటు చేయు అధికారాన్ని కలిగి వుందని పేర్కొన్నాడు సాధారణంగా అన్ని భూ బదలాయింపుకు రెవెన్యూ అధికారులచే అనుజ్ఞ ఇవ్వబడాలని పేర్కొనప్పటికి ఒకే తరహా గిరిజన లేదా కులం వారి మధ్య జరిగే బదలాయింపులు వాటికవే జరిగిపోతాయని, కాని ఒక కులం లేదా గిరిజనుల నుండి ఇతరులకు జరిగే బదలాయింపుల విషయంలో అధికారి పూర్తి వివరాల గూర్చిన సమాచరం సేకరించే అధికారాన్ని ప్రభుత్వం కలిగి వుంటుదని రాజ్యకార్యదర్శి పేర్కొనడం జరిగింది. కర్జన్ ఈ చట్ట యత్నములకు పూర్తిగా మద్దతునిస్తూ సమస్యను నాటికి శాసన రూపంలో రావడం ఇంకా ఆలస్యం చేయరాదని ఈ సమస్యను ఇప్పుడే ఎదుర్కోవాలని తెలుపుతూ, ఇంకా ఆలస్యం చేయడం వల్ల విషయాలు మరింత మరింత ఉపద్రవంగా మారే అవకాశం ఉందని పేర్కొన్నాడు. చట్టం జారీ ఆయిన తర్వాత ముందే అమ్మకొను హక్కు లేదా భూమార్పిడి చేసే హక్కు కులాల గురించి గిరిజనుల గురించి చేసే నిర్వచనాల పనిని తదనంతరం చేపట్టడం జరిగింది. భూమార్పిడి హక్కుకు సంబంధించిన వివరణలు భూపరాయికరణ నిశేషద చట్ట నిబంధనలకు అనుకూలంగా ఉండాలి. 1872లో భూమార్పిడి విక్రయహక్కుపైన ఒక ప్రాథమిక చట్టాన్ని కూర్చటం ద్వారా ఒక చట్టాన్ని జారీచేసినారు. వడ్డీ వ్యాపారస్తుల చేతుల్లో ఇది బలమైన ఆయుధంగా మారుతుందని దీంతో వీరు గ్రామంలో గొప్ప ప్రాభల్యాన్ని పెంపొందించుకుంటారాని ఆనాడు ఎవరు భావించలేదు. ఈ కొత్త చట్టం ద్వారా ఎప్పుడయితే వడ్డీ వ్యాపారులు ముందే భూ విక్రయహక్కును పొందుతారో రెవెన్యూ అధికారులు వెంటనే దానిని నిరాకరించే అధికారాన్ని కూడా కలిగివున్నారు అయినప్పటికి రెవెన్యూ అధికారుల కుండే అధికారం నేరుగా జరిగే అమ్మకాలకే వర్తిస్తుంది. తాకట్టులకు సంబంధించిన నిర్ణయాలు సివిల్ కోర్టులకే వదిలివేయబడ్డాయి. అంతే వడ్డీ వ్యాపారస్తులకంటే మౌలిక వ్యవహారాలన్ని గతంలోకి చట్ట ప్రయత్నాల వల్ల మౌలికంగా నిరోధించబడ లేదనీ అర్థం.

రెవెన్యూ అధికారులు అంచనావేసే అధికారాన్ని కలిగి వున్నారు. తప్పనిసరయితే చౌక భూములపై కృత్రిమంగా ధరలను అధికంగా చూపించే ప్రయత్నాలను అరికట్టే అధికారం రెవిన్యూ అధికారులకు వుంది. గిరిజనులకు సంబంధించి నిర్వచనం భూపరాయీకరణ చట్ట ప్రయోజనం కోసం నిర్వహించేకులాల, తెగల నిర్వచనం కార్య నిర్వాహకుల పరిధికి

వదిలి వేయడం కూడా కార్యనిర్వాహకులకే వదిలివేయడం జరిగింది. ఈ విషయంలో ప్రభుత్వం పెద్ద మొత్తంలో గణాంకాల సాక్ష్యాలను సేకరించింది. చివరగా జిల్లాలోని అన్ని వ్యవసాయిక గిరిజన తెగల కులాలు ఒక యూనిట్గా ఏర్పర్చి వారిలో వారు బదలాయింపులు చేసుకోవచ్చునని అనుజ్ఞ కూడా ఇచ్చింది.

భారత ప్రభుత్వం మొదట ఈ నిర్ణయంతో అంగీకరించలేదు. ఎందుకంటే ఈ నియమ ఉద్దేశ్యము ఒకే తరహా కులాల తెగల సభ్యుల మధ్య బదలాయంపులు జరగాలన్న అంశంపై లభించే అనుమతి మాట అటుంచి, తదనంతర కాలంలో ఈ చట్ట ఫలితాలను, పనితనాన్ని పంజాబ్ ప్రబుత్వం పరిశీలించడం పైన భారత ప్రభుత్వానికి అనుమానాలు వున్నాయి. భూపరయాకరణ చట్టం దేనికోసమైతే రూపొందించబడిందో ఆ ప్రయోజనాలను పూర్తిగా సాదించడంలో వైఫల్యాలను ఏదుర్కొన్నది. వ్యవసాయదారులు ఈ చట్టం ఇచ్చిన రక్షణల యెడ జాగ్రత్తకలిగి వుండి, వారు వారి గౌరవింపబడినట్లు కూడా ఆయాకులాలు, తెగలు భావించాయి. పండుగలు ఆచార కర్మల వినియమాలకోసం ఖర్చు చేయడం తగ్గింది. ప్రభుత్వ ఋణసదుపాయమునకు గిరాకి పెరిగింది. మరొకవైపు వడ్డీ వ్యాపారస్తులు ఈ చట్టం పట్ల అయిష్టతకలిగియున్నారు. ఎంతవరకయితే భూమి సంపాదించడానికి ఆవకాశం వుందో, అంతవరకు సంపాదించడానికి చట్టం అమలుకంటె ముందే వడ్డీ వ్యాపారస్తులు ప్రయత్నించడం మొదలుపెట్టారు. మొదటి సంవత్సరం నుండి చట్టం పనిచేయడం అరంభించినపుడు ఆ సంవత్సరం పంటలదిగుబడి మంచిగా రావడం వల్ల ఋణం సత్వరమే చెల్లింపు నియమం గూర్చి వ్యవసాయదారులు ఇబ్బంది పడలేదు. ఎవరైతే వడ్డీ వ్యాపారాలు గ్రామసమాజంలో భూమిని ఆక్రమించి గ్రామంలో లబ్ధి ప్రతిష్టలవ్వాలని వూహించారో, వీరు క్రమేపి గ్రామం నుండి భూమిని అమ్మికొన్నారు. కొన్ని ప్రాంతాల్లో వడ్డీ వ్యాపారులు ఋణం ఇవ్వడానికి నిరాకరించినారు. తాము చేపట్టిన ఇలాంటి చర్యల వల్ల ఈ చట్టానికి వ్యతిరేకంగా సాధారణ ఉద్యమనిర్వహణకు వ్యవసాయదారులు పూనుకుంటారని ఆశించినారు.

కాని త్వరలోనె ఒక క్రొత్త పద్ధతి ఉద్భవించింది. చట్టం జారీ కావడానికి ముందే ప్రచారంలోకి తేవడం వల్ల వడ్డీ వ్యాపారుల స్థానాన్నీ ధనికరైతులు ఆక్రమించి ఇతరులకు ఋణం ఇవ్వడం మొదలు పెట్టినారు. వృత్తి వడ్డీ వ్యాపారస్తులకన్నా వీరు ఎక్కువగా ఋణగ్రహీతల భూమి ఆక్రమించు కోవాలని దృష్టిని కలిగివున్నారు. అయినప్పటికి ప్రభుత్వం ఈ చట్టాన్ని రాజకీయ కారణాల వల్లనేగాని, లోకోపకార కారణాలకై జారిచేయలేదు. ఈ చట్టం మొత్తంగా ధనవంతమైన వ్యవసాయ దారులనుండి పేద వ్యవసాయదారులను రక్షించడానికి ఉద్దేశించినదికాదు. చట్టం రూపకల్పన చేయడం వెనుక రాజకీ కారణాలే బలీయం అన్న విషయం స్పష్టం.

ఆరవ అధ్యాయం

# కౌలుదారుల భద్రత

## భూస్వామి - కౌలుదారు సంబంధం

బ్రిటిష్ కాలంలో భారత రైతాంగం కౌలుదార్లుగా మారినారు. నిర్వచనరీత్యా రైత్వారీ ప్రాంతాలలో శిస్తు చెల్లించే వ్యక్తి ప్రభుత్వ కౌలుదారుగా పరిగణించబడ్డాడు. బ్రిటిష్ వలస పాలనా చట్టాల ప్రకారం పలు ప్రాంతాలలో సేద్యం చేస్తున్న రైతులు భూస్వాముల కౌలుదార్లు మాత్రమే. బ్రిటిష్ న్యాయ చట్టాల రీత్యా ఆనాటి ప్రభుత్వం రైతును కౌలుదారుగా పరిగణించింది. ఈ చట్టం సాధారణమైనదిగా ఉండి తెలివైన న్యాయవాదులకు ఒక చక్కని సంపాదన మార్గంగా ,పరిణమించింది. చట్టంలోని సంక్లిష్టమైన అంశాలను గురించి వివరిస్తూ ఒక ప్రముఖ రచయిత స్పష్టంగానే వ్యాఖ్యానించాడు. '' ఈ విధమైన కౌలుదారీ ఏర్పాటు నిర్హేతుకమైన గందరగోళ అంశాలతో నిండిన ఒక ఊహాత్మకమైన అంశాల సముదాయమని'' అన్నాడు. క్రామ్‌వెల్ (Cromwel) అనే అధికారి ఈ ఏర్పాటు '' కారుణ్య పరిభాషతో కూడుకున్న దైవికేతర గందరగోళమని'' పేర్కొన్నాడు. భారతదేశంలో బ్రిటిష్ వారు కౌలుదారీ రక్షణ నిమిత్తం ఆరంభించిన ఈ చర్యల నేపథ్యానికి తమ దేశంలో బ్రిటిష్ వారు గతంలో అవలంబించిన రైతాంగ విధానానికి సారూప్యతను కలిగి యున్నది. మధ్య యుగాల కాలంలో బ్రిటిష్ రాచ రిక న్యాయ స్థానాలు భూప్రభువుల హక్కుల విషయంలో జోక్యాన్ని ప్రారంభించినాయి.

కాలక్రమేణా కౌలుదారుల భద్రతా పరిధిని విస్తరిస్తూ వారికి యాజమాన్య హక్కులను, వారసత్వాన్ని సంక్రమింపజేస్తూ, భూస్వాములు తమ ఇష్టానుసారంగా వారిని తొలగించకుండా ఈ ప్రభుత్వ చర్యలు అడ్డుపడినవి. భూస్వామ్య పద్ధతి నుండి కౌలుదారీ పద్ధతికి రూపాంతరం చెంది కౌలుదారు తన ఆధీనంలో ఉన్న భూమిని బదిలీ చేయడానికి. గాని, వారసత్వంగా పొందడానికి కానీ వీలైన విధంగా చట్ట చర్యలు ఉపకరించినవి. స్వేచ్ఛా యాజమాన్యం నుండి భూమిని కౌలు యాజమాన్యంగా కలిగి వుండే పరిస్థితులను ఏర్పరిచినవి. భిన్న చారిత్రిక దశల్లో భూస్వామ్య యాజమాన్యం నుండి నవీన కౌలుదారీ విధానానికి దారితీసిన ఈ భూయాజమాన్య ఏర్పాటు సాంప్రదాయం - ఆధునిక భావనల మిశ్రమమే. మొదటి తరహా రక్షణ రూపం సాధారణ శిస్తు చెల్లించి భూమిని కౌలు చేసే వారికోసం ఉద్దేశించినటువంటిది. రెండవ తరహా రక్షణ ఏర్పాటులో కౌలుదార్లు రెండుగా విభజించబడ్డారు. ప్రభువుకు నిర్ణీతమైన రీతిలో సేవలు చేసేవారు ఒకరైతే, రెండవ తరహావారు,

నిర్ణీతమైన రోజుల్లో సేవలు అందించేవారు. వీరిద్దరి మధ్య కృత్రిమరేఖ ఒకటి గీయబడ్డది. ఈ దశలో చాలా కాలం వరకు రాయల్ న్యాయస్థానాలు తమ జోక్యాన్ని ఆపివేసి కౌలుదారులను భూస్వాముల వివేచనా పరిధికే వదిలిలేశాయి. అయితే, ఆధీన హోదాలో (unfree) ని కౌలుదారులు స్థానిక సాంప్రదాయాల ద్వారా మాత్రమే రక్షించబడినారు. రైతు అనుభవించే భూహక్కులు (record of rights) భూస్వామికి చెల్లించే అద్దెల రికార్డును బట్టి మాత్రమే నిర్ధారించబడేవి. అద్దె చెల్లించిన రికార్డు నకలును వారికి ఇచ్చే పద్ధతి ప్రారంభమైనప్పటి నుండి వారు కాపీ హోల్డర్‌లు (copy holders) గా పేర్కొనబడినారు. భూమిపై పూర్తి హక్కు యజమానులకేగాని, కౌలుదారులకు ఉండవని న్యాయస్థానాలు భావించినప్పటికీ, వారి సాంప్రదాయిక హక్కులను కొనసాగించడం లో ఈ రికార్డులు సంరక్షక పాత్రను నిర్వహించినవి. ఈ పద్ధతి క్రింద కౌలుదారులు సాంకేతిక ప్రక్రియరీత్యా భూయజమానులు కానప్పటి కీ, యాజమాన్యం భూస్వామ్య పరిధిలోనే వున్నప్పటికీ భూస్వామి నుండి సంక్రమించే సాంప్రదాయ రక్షణ హక్కులను రైతాంగానికి కాపీ హోల్డర్ పద్ధతి ద్వారా న్యాయస్థానాలు కలగజేసినవి. మిగతా బ్రిటిష్ తరహా రక్షిత కౌలుదారుల మాదిరిగానే కాపీ హోల్డర్‌లు కౌలు ప్రక్రియను పరిరక్షక హక్కుగా పొందడానికి కోర్టులు నిర్దేశించినాయి. భూయాజమాన్యంపై సాధారణ కాపీ హోల్డరు చట్టం ఏదీ రూపకల్పన చేయబడకుండానే సాంప్రదాయ రక్షణ భాగానికి మొత్తంగా భూస్వామి అధికార పరిధిని అంచెలంచెలుగా బ్రిటిష్ న్యాయ చట్టాలు, కోర్టులు కుదించి వేసినాయి. పెద్ద ఎత్తున శాసనాత్మకమైన ప్రయత్నాలు లేకుండానే సాధించబడిన ఈ భూస్వామ్య అధికారాల కుదింపుపై న్యాయమూర్తుల ఖండనలు, అనుచితమని చేసిన వ్యాఖ్యలు కేవలం నేపథ్యంలోనే మిగిలిపోయినవి.

భారతదేశంలో సమస్య మరో రకంగా ఉండేది. భూస్వామ్య పద్ధతి నుండి కౌలుదారీ పద్ధతికి జరిగిన మార్పు బ్రిటిష్ వ్యవసాయ సంబంధాల్లోని మార్పులు మాదిరిగా గోప్యంగా, నిగూఢంగా జరుగలేదు. భారతదేశ పద్ధతి ఇంగ్లాండ్ దృష్టాంతానికి అనుగుణంగా లేకపోవడం వల్ల గతంలోని బ్రిటిష్ చట్టం భారతదేశ స్వాభావిక పరిణామాల మేళవింపు వల్ల ఒక నూతనమైన మిశ్రమ నమూనా ఆవిర్భవించింది. పరాయి సాంప్రదాయాల ప్రతిఫలన వల్ల అనుచితత్వం బహుముఖాలుగా విస్తరించింది. భూస్వామ్య విధానం విశాలంగా ఒక వ్యవసాయ సంబంధంగా భారతదేశంలో ఉనికిని కలిగివున్నప్పటికీ ఇది బ్రిటిష్ ఫ్యూడల్ సమాజానికి భిన్నమైనటువంటిది. దాని చట్టబద్ధత విషయంలో బ్రిటన్‌తోనే సారూప్యత లేదు. భారత రైతాంగం ఎట్లా చూసినా బలీయమైన సాంప్రదాయక హక్కులను భూమిపైన కల్గివున్నటు వంటిది. భారత దేశంలో సాంప్రదాయిక కౌలుదారీ పద్ధతి వివిధ నావాలతో వ్యవహరించబడినప్పటికీ ప్రధానంగా రెండు రకాలుగా ఉండేది. ఒకానొక ప్రాచీన గుజరాత్

గ్రంథంలో ''కుల కుటుంబిక'', ''ఉద్వాస కుటుంబిక'' అనే రెండు పదాలు ఉపయోగించబడినవి (కుల = కుటుంబం). ఈ రెండు పద ప్రతిపాదనలు కుటుంబపరమైన వారసుడి హోదాను, కుటుంబం ఆవలిగా వున్న సంబంధీకుల హోదాను తెల్పే వారసత్వ హక్కులకు సంబంధించిన అంశాలు. ఇదే రకమైన పదజాలం భారతదేశం అన్ని ప్రాంతాలలో అన్ని కాలాల్లోను వున్నది. ఖుద్‌కస్త్ (khudkasht) పాహీకస్త్ (pahikasht) రూపేణా ఉత్తర భారతదేశంలో, దక్షిణ ద్రవిడ ప్రాంతాల్లో 'ఉల్కుడి' (ulkudi), 'పరాయికుడి' (paraikudi) అని, మరాఠా పాలనలోని దక్కన్ పీఠభూమి ప్రాంతంలో ''మీరాశీదారు'' మరియు ' ఉప్రి' అనే పదాలు ప్రాచుర్యం ఉండడం, ఇవన్నీ కూడా దాదాపుగా సముదాయ నివాసంలో వుండే వారసత్వ హోదాను, కౌలుదారుని సూచించేవి. బొంబాయి సమీపంలోని కొంకణ్ తీర ప్రాంతంలో ధేర్‌కారీ (dherekari), ఆర్ధే ఓ రూపాల్లో పై ఏర్పాటు వుండేది. ఉత్పత్తిలో వారు పంచుకొనే భాగస్వామ్యాన్ని బట్టి విశాలంగా వారి స్థితి ప్రతిబింబించబడేది. ఈ రెండు పద్ధతుల ఆచరణ వాటి మధ్య సర్దుబాటు ప్రధానంగా స్థానికుల అభిప్రాయానుసారంగా జరిగేది. వారి వారి అవసరాలకు అనుగుణంగా తమ భూములను సేద్యం చేయడానికి అనుకూలమైన వ్యక్తులను భూయాజమానులు నిర్ణయించే వారు. సాంప్రదాయక భూస్వామి ఈ ప్రక్రియలో ఎప్పుడో ఒకసారి మాత్రమే జోక్యం చేసుకొనేవాడు. ఎందుకంటే తనకు సంప్రదాయం లభించేవాటాను వసూలు చేసుకోవడం వరకే తన బాధ్యతగా భావించేవాడు. కొన్ని సార్లు సాగుదార్లను ఇతర ప్రాంతాల నుండి రప్పించే ప్రయత్నాలు చేసేవారు. అంతేకాని కొన్ని సందర్భాల్లో తన ఆధీనంలో వున్న భూమిని సాగుచేయడం కోసం జనాభా అవసరం అయితే వారిని సాధారణంగా రైతుల స్వాధీనం నుండి భూమిని స్వాధీన పర్చుకోవడానికి భూస్వామి ప్రయత్నించేవాడు కాదు. అవసరమయితే తన వాటాను వసూలు చేసుకోవడంలో ఒకింత జాప్యాన్ని కొనసాగించేవాడు. ఈ పద్ధతి మధ్యయుగాల్లో ప్రాచుర్యంలో ఉన్నటువంటిది.

ఆనాటి కాలంలో బ్రాహ్మణులకు ఇచ్చే భూధానాలతో ఈ సర్దుబాటును పోల్చవచ్చును. ఏ సరిహద్దుల దాపులలో ఎంత మేరకు భూమి దానమివ్వబడిందో ఈ ధానాలను ప్రకటించిన అధికారి స్పష్టీకరించేవాడు. ఇష్టానుసార కౌలుదార్లకు ఈ సమాచారం అవసరం ఉండక పోయేది. అయితే, ఇట్లా దానాలను స్వీకరించిన బ్రాహ్మణ గ్రహీతులను '' ఇనామ్ దార్ల'' తో పోల్చవచ్చు. ఇనామ్‌దారులకు దాదాపు భూస్వామి కోటా ఉన్నా, ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉండేది. ఇట్లా ఇనామ్‌లు పొందిన బ్రాహ్మణులు తమ భూ హక్కులను తామ్రపత్రాలపై నమోదు చేసుకోవడం వల్ల ఇటువంటి ఇనామ్ భూముల వివరాలు ఎప్పుడూ అందుబాటులో ఉండేవి. ఇతర బ్రాహ్మణేతర ప్రముఖులు మాత్రం తామ్ర పత్రాల మాదిరిగా కాక ఇతర రూపాల్లో వుండే ఏర్పాట్లతో సరిపుచ్చుకొనేవారు. అయినప్పటికి అందుబాటులో ఉన్న

సమాచారాన్ని బట్టి భారత భూస్వామ్య విధానానికి ఇట్లా సంక్రమించిన రైతాంగ హక్కులు, పునాది వంటి వని, ప్రభుత్వ అనుగుణ్య భూస్వామ్య రూపాలైన జాగిర్దారీ, జమీందారీ, ఇనాందారీ వంటి భూయాజమాన్య పద్ధతుల బారతీయ భూస్వామ్య ఉపరితల సౌదంగా పని చేసేటువంటివిగా తెలుపవచ్చు. కానీ ఇంగ్లాండ్ చట్టం ప్రారంభంలో యజమానుల హక్కులను పరిగణలోకి తీసుకొంది. దాని ఆరంభ ఆధారంగా ప్రాధమిక హక్కులను పొందే పరిధికి క్రమంగా అనేక పరిమితులను విధించింది. ఏ రకమైన బంధనాలు లేని భూస్వాముల అధికార పరిధిని క్రమేపి తగ్గించి వేసిన ఇంగ్లీషు చట్ట సాంప్రదాయం భారత పరిస్థితులకు సరిపోయేదిగా భావించబడలేదు. శతాబ్దాల తరబడి న్యాయశాస్త్ర తెరల చాటున గడిపిన ఇంగ్లాండ్ న్యాయమూర్తులు అంతిమ ఆచరణను భారతదేశంలో అన్వయించడం ఆరంభమైంది.

బ్రిటిష్ పాలకులు ప్రారంభంలో కౌలుదారుల పద్ధతి కన్న శిస్తూ చెల్లించే భూస్వామలను బలోపేతంగా పటిష్టం చేయడం పట్లనే ఆసక్తిని కనబర్చారు. మొత్తం కౌలుదారులందరికి అభీష్టానుసారపు కౌలుదారులుగా (Tenants at will) పరిగణించడం సులభంగా ఉండేది. ఆ విధంగా ఇంగ్లాండ్ న్యాయ పరిహారాలు ఇచ్ఛానుసారపు కౌలుదార్లకు లభించేవి కావు. తొలి బెంగాల్ భూనియమాలు నిబంధనలు ప్రకారం భూస్వాములు చట్టబద్ధంగా కౌలుదారులకు పట్టాలను ఇచ్చే షరతులు ఉండేవి. ఇంగ్లాండ్ కాపీ హోల్డర్‌కు యాజమాన్యాన్ని సంక్రమింపజేసే భూస్వామి భాటకం పట్టీని పోలి ఈ పట్టా ఉండేది. కాని చాలా మంది భూస్వాములు బ్రిటిష్ పాలకుల ఆదేశాలను విస్మరించి కౌలుదార్లకు పట్టాలిచ్చే షరతులను అమలుపర్చలేదు. రైత్వారీ ప్రాంతాలలో శిస్తు చెల్లించే ప్రభుత్వ కౌలుదారులు మాత్రమే సురక్షితమైన యాజమాన్యం కలిగిన కౌలుదారులుగా పరిగణించబడినారు. 1901 నాటి బొంబాయి భూమి శిస్తు సవరణ చట్టం ప్రకారం అవసరమైతే కౌలుదార్ల హక్కులను గణనీయంగా తగ్గించడానికి వీలు కల్పించింది. మరోవైపు చాలా మంది భూస్వాములే తాము ప్రభుత్వ కౌలుదార్లుగా వ్యవహరించి విస్తృత భూయాజమాన్య నియంత్రణలను కల్గిం ఉండేవారు. ఆ తరువాత దశల్లో తమ ఆధీనంలో వున్న భూములను సాగు చేయడానికి తాము తమ కిష్టమైన వ్యక్తులను కౌలుదార్లుగా నియమించుకొనేవారు. ఈ విధమైన కౌలుదారుల హక్కులకు ఏ రకమైన భద్రత లభించేదికాదు. బ్రిటిష్ పాలకులు ఇటువంటి వారి హక్కుల గురించి. పట్టించుకోలేదు దీనికి కారణం నాడు ప్రభుత్వం రైత్వారీ పద్ధతి ప్రకారం సేద్య యోగ్యమైన భూమిని ప్రభుత్వం నిర్దేశించిన శిస్తును చెల్లించడానికి ముందుకు వచ్చే వారెవ్వరికైనా ప్రభుత్వమే భూమిని కేటాయిస్తుంది. కనుక, ప్రభుత్వ కౌలుదార్ల నుండి భూమిని కౌలుకు తీసుకొనే వారిని విస్మరించడంలో ప్రభుత్వ భూస్వాములకు అనుగుణ్యంగా కౌలుదార్ల నుండి ప్రభుత్వమేమి తటపటాయించలేదు. స్థూలంగా, బ్రిటిష్ ప్రభుత్వం భూస్వాములకు

అనుగుణ్యంగా కౌలుదారులకు వ్యతిరేకంగా పాచికలను వేసింది. కాని కౌలుదారులతో వ్యవహరించేటప్పుడు బలప్రయోగం కన్నా చట్టపరమైన పద్ధతులనే అనుసరించమని భూస్వాములపై ఒత్తిడి చేసేది. తాము సాగుచేసే భూముల కౌలు లభ్యమయ్యే విషయంలో భారత రైతాంగానికి అంతగా ఆందోళనా చెందే స్థితి లేక పోయినా కౌలుదారు నుండి తన వాటాను వసూలు చేసుకోవడానికి మాత్రం తరుచుగా భూస్వాములు బలప్రయోగం జరిపేవారు. దీన్నికై అవసరమైన రీతిలో సాయుధ సేవకులతో కూడిన బృందాలను పోషించేవారు. ఆ రకమైన నిర్బంధ పద్ధతులకు బ్రిటిష్‌పాలనా విధానం (పాక్స్ బ్రిటానికా) స్వస్తి చెప్పే ప్రయత్నం చేసింది. పర్యవసానంగా భూస్వామి తన కౌలుదారుపై కోర్టు దావాను వేయడమో లేక చట్ట పద్ధతుల ద్వారా అతనిని తన భూమి నుండి తొలగించడమో జరిగేది. గతంలో మాదిరిగా జరిపి భూముల నుండి తొలగించే పద్ధతులకు బదులుగా కోర్టుల ద్వారా చట్టాల ద్వారా కౌలుదార్లను వదిలించుకోవడం మొదలైంది. సాధారణంగా కోర్టు దావాలతో భూస్వామియే నెగ్గేవాడు. ఎందుకనగా ఆ వ్యక్తి ధనికుడు కాబట్టి. బ్రిటన్ పద్ధతి ప్రకారం ఆశించిన విధంగా తీర్పు రావాలంటే న్యాయవాదులకు అధిక మొత్తాలను చెల్లించే శక్తిని కలిగి వున్నటువంటివారు. ఈ విధంగా భూస్వాములుగెలుపొందినప్పటికీ, కౌలుదారుల నుండి అద్దె వసూలు విషయంలో వివాదాలు తలెత్తినపుడు దానిని ఎంతో ఇబ్బందికర విషయంగా వీరు పరిగణించేవారు. ఈ విధంగా భూస్వాములు స్థానికంగా ఏర్పాటు చేయబడే రెవెన్యూ యంత్రాంగానికే ప్రాధాన్యత ఇచ్చేవారు. కానీ చాలా ప్రాంతాలలో ఈ రకమైన వ్యవస్థ అందుబాటులో లేకపోవడము వల్ల సివిల్‌కోర్టులపై ఎక్కువగా భూస్వాములు ఆధారపడవలసి వచ్చేది. అయినప్పటికీ అద్దె వసూలు విషయంలో న్యాయ స్థానాలు అందించే చర్యలు చాలా సందర్భాలలో (అంతంత మాత్రమే) నామ మాత్రంగానే వుండేవి. కాబట్టి దీనిపైన భూస్వాములు ఇతమిద్ధమైన చట్ట రూపకల్పనను కోరినారు. కౌలుదారీ రక్షణ చట్టాలు సాగుదార్ల నుంచి భూస్వాములకు రావలసిన భాటకాన్ని లేదా కౌలు అద్దెను నిరాటంకంగా రాబట్టుకొవటానికి వసతి కల్పించే వత్తిడిలో భాగంగా వచ్చినవన్న విషయం గుర్తుంచుకోవాలి. కౌలుదారుకు భద్రత లభించడం ఈ పర్యవసానం యొక్క తదనంతర ఫలితం. దీనిలో భాగమే ప్రసిద్ధిగాంచిన 1859 భాటక చట్టం దీని గురించి ముందు పేజీల్లో వివరంగా ప్రస్తావించవచ్చు. దీని అనుక్రమంగానే ఆ తర్వాత 1885లో వచ్చిన బెంగాల్ కౌలుదారీ చట్టం కూడా అద్దెకు సంబంధించిన లా కమీషన్ (Rent Law Commission) చే ఈ చట్టం రూపొందించబడింది. ఈ కమీషన్ ప్రయత్నాలన్నింటిని కలిపి కౌలుదారీ చట్టపరికల్పనగా భావించ వచ్చునా అనే అంశం ఎటూ తేలనటువంటిది. అయితే, 1865వ సంవత్సరం అద్దె వసూలు చట్టం ద్వారా మద్రాస్ అధికారులు కూడా ఈ అంశంలో చట్ట పర ప్రయత్నాలు ప్రారంభించినారు. ఇవే రకమైన ప్రయత్నాలు ఇతర

ప్రాంతాలలో కూడా కనిపిస్తాయి. అద్దె చట్టాలనుండి కౌలుదారీ చట్టాలకు జరిగిన ఈ మార్పుకు కారణాలు ప్రధానంగా అద్దె వసూలు చేయడంలోని ఎదురైన సమస్యలు, అద్దె మొత్తంలో పెరుగుదల. అద్దె (భాటకం) పెరుగుదల అనేది కౌలును రద్దు (Termination) పర్చడం ద్వారా మాత్రమే సులభంగా సాధించబడేది. మద్రాస్ అధికారుల అనుభవం ఈ విషయాన్ని చాలా బాగా వివరిస్తుంది. అద్దె వసూలు చట్టం - 1865 కౌలు రద్దు గురించి సరైన నిబంధనలను కలిగి లేకపోవడం వలన 1870లో మద్రాస్ హైకోర్టు తన రూలింగ్ ద్వారా ప్రతి రెవెన్యూ సంవత్సరం చివరన భూస్వాములు అన్ని కౌలులను రద్దు పరచ వచ్చునీ తెలుపుతూ ప్రభుత్వాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. అద్దె పెంపుదల సమస్య, అందు కొరకు భూమి నుండి వైదొలగమని ఇచ్చే వత్తిడిని పెంచే నోటీస్ వస్తురూపక అద్దె నుండి నగదు రూపక అద్దె పద్ధతికి మారిన తర్వాత మాత్రమే తలెత్తినది. సాంప్రదాయానుసారంగా చేతి కొచ్చిన పంటలో భూస్వామి తన వాటాను పొందినంత కాలం అద్దె పెంపుదలకన్నా అద్దె వసూలే సమస్యగా ఉండేది. అయినప్పటికీ భూస్వామి ఒకసారి కౌలుదారుతో రేటు ఒప్పందం కుదుర్చుకొన్న తర్వాత, ధరలు పెరిగినా కానీ, కౌలుదారు వాణిజ్య పంటల ద్వారా లాభాలనార్జించినా అతడు కౌలురేటు పెరుగుదలను కోరేవాడు. దీనికి కౌలుదారు అంగీకరించినట్లయితే, అతనికి అందుబాటులో ఉన్న ఏకైక మార్గం ఏకపక్ష ఉత్తర్వు (Exparte decree) ద్వారా కౌలును రద్దు పర్చడమే. ఈ అధికారాన్ని భూస్వామి చేతికి బ్రిటిష్ పాలకులే ఇచ్చినప్పటికీ దాని ప్రభావం గురించి నాటి ప్రభుత్వం మరొకవైపు ఆందోళన చెంది కౌలు హక్కుల పరిరక్షణ సరిగ్గా జరుగనట్లయితే రైతాంగానికి సంప్రదాయంగా లభించే హక్కులు దెబ్బతింటాయి. రైతాంగ అశాంతిని (Unrest) అరికట్టుటకు భారత రైతులకు సాంప్రదాయంగా లభించే సాగు హక్కును పరిరక్షించవలసిన అవసరముందని భావించినారు. భూస్వామికి ప్రభుత్వం తీసుకొనే శాసనాత్మక చర్యలు ఒక రకంగా భూస్వామి కౌలుదారు పరస్పరం ఒప్పందం కుదుర్చుకొనే స్వేచ్ఛలో జోక్యం చేసుకొన్నట్లు అవుతుంది. కాబట్టి ఆ స్వేచ్ఛను అలాగే కొనసాగనివ్వడం వల్ల భూస్వాములకు - కౌలుదార్లకు మధ్య ఒప్పందాలను సరిదిద్ద వలసి వచ్చినపుడు ప్రభుత్వానికి అనేక అవరోధాలు ఎదురు అయినాయి. కాబట్టి ఈ స్వేచ్ఛను పూర్తిగా తొలగించకుండా దానిని పరిమితం చేసే వివిధ చర్యలు పరిశీలించబడినవి. అదే విధంగా కౌలుదారులు సాగుచేస్తున్న భూమి నుండి తొలగించబడకుండా వారి హక్కును కూడా బ్రిటిష్ న్యాయ సూత్రాల కనుగుణంగా పునరుద్ధరించబడే పద్ధతులను ప్రతిపాదించవలసి వచ్చింది.

## కౌలుదారుల రక్షణకు అవలంబించిన పద్ధతులు

కౌలుదారు భద్రత మూడు ప్రధాన లంశాలపై ఆధారపడి ఉండి. ఆంగ్ల భాషలోని ( ఎఫ్) అక్షరంతో సంబంధం కలిగి వున్నవే ఇవి: (Fixed tenure, Free transfer, fair

rent) నిర్ణీత కాలపరిమితి, స్వేచ్ఛాయిత బదిలీ, సరసమైన భాటకం. ఇవన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నవి. భూస్వామికి నిషేధాత్మక భాటకం (prohibitive rent) నిర్ణయించే అధికారం ఉన్నట్లయితే, నిర్ణీత కాలపరిమితి అనేది అర్థరహితం. నిర్ణీత కాలపరిమితికి హామీ ఉన్నప్పుడు కౌలుదారు భూమిని మెరుగుపరుచుకొనే అవకాశాల గురించి ఆలోచిస్తాడు. ఈ మూడు విషయాలను అమలు పరిచి తద్వారా, భూస్వాములపై కొన్ని పరిమితులను విధించడానికి సంబంధిత అధికారులకు కొన్ని మార్గాలు కూడా అందుబాటులో ఉన్నాయి. ఈ మార్గాలలో ముఖ్యంగా నష్టపరిహారం చెల్లింపుకై భూస్వామికి ప్రభుత్వం ఆదేశాలు జారీ చేయడం మొట్టమొదటిది. కౌలుదార్లు అనుభవించే కౌలును భూస్వామి రద్దు చేసినపుడు చట్ట ప్రకారం నష్ట పరిహారం చెల్లించవలసి ఉంటుంది. అంతేకాకుండా కౌలుకు సంబంధించిన నిర్ణీత కాలపరిమితి నిర్ణయించబడి, ఆ వ్యక్తిని తొలగించకుండా ఉండే కొన్ని అనుపాదిత హక్కులు (prescriptive rights ) కూడా కౌలుదారుకు సంక్రమించినవి. కౌలుదార్ల హక్కుల పరిరక్షణ కొరకు భారీ నిషేధాత్మక నష్టపరిహారం కూడా మరొక మార్గంగా ఉపయోగపడింది. అయినప్పటికి ఈ చర్యలన్నీ కౌలుదారుకు సరసమైన భాటకం ( అద్దె) నిర్ధారించే విషయంలో సరైన హామీని ఇవ్వలేక పోయినవి. భాటక నిర్ధారణలో అవలంబించిన పద్ధతులు మూడు. 1. రెవెన్యూ అధికారులచే భాటకం నిర్ణయం. 2. న్యాయశాఖ మధ్య వర్తిత్వం 3. శాసన నిర్మాణశాఖ నియమ నిబంధనలు. ఇందులో ఏ పద్ధతులను అనుసరించినప్పటికీ ప్రమాణికమైన నిర్ణయం చేయగల సామర్థ్యం అవసరం. ఇందు కొరకు మళ్లీ మూడు ప్రత్యామ్నాయాలను సూచించవచ్చు. సరసమైన భాటకం అనేది ఆర్థిక పరమైన సూచీతో ముడిపడి ఉంది. (స్థూల నికర ఉత్పత్తిలో నిష్పత్తి, పెరుగుతున్న ధరలు మొదలైనవి కలుపుకొని) సరసమైన భాటకం ( అద్దె) ఒకేరకమైన పరిస్థితుల్లో ఒకే రకమైన భూమికి ఇతర కౌలుదార్లు చెల్లించే భాటకం ఆధారంగా నిర్ణయించబడాలి. అట్లాగే గత సంవత్సరపు చెల్లించిన నిర్దిష్ట భాటకంలో కొంత శాతాన్ని నిర్ణీత కాలానికి ఒకసారి పెంచడం కూడా ఒక ప్రత్యామ్నాయమే కాగలదు. మొదటి, రెండు ప్రత్యామ్నాయాలతో రైతాంగం విసిగివేసారి పోయిన స్థితిని, మూడవ ప్రత్యామ్నాయమే సమస్యకు పరిష్కారంగా మిగిలిపోయిన తీరును తరవాతి అధ్యాయాల్లో చూడవచ్చు. మూడవ ప్రత్యామ్నాయంలో పూర్తిగా న్యాయం చేకూరే విధంగా చెల్లింపుల ఆధారంగా భాటకపు మొత్తం సరసమైన రీతిలో నిర్ధారింప బడటం అనిశ్చితమే అయినా అందుబాటులో వున్న పద్ధతిగా ఈ ప్రత్యామ్నాయమే మిగిలింది. భారతదేశంలో కౌలుదార్ల భద్రతకు ఈ పద్ధతులన్నింటినీ అన్వయించే ముందు బ్రిటిష్ ప్రభుత్వం ఐర్లాండ్‌లో అనేక ప్రయోగాలను చేసి కొన్ని గుణపాఠాలను నేర్చుకొంది. ఆ గుణపాఠాల ద్వారా తమను తాము సరిదిద్దుకోక మళ్లీ కొన్ని తప్పులు చేసినారు. ఐర్లాండులో నేర్చుకున్న ఈ అనుభవం బ్రిటిష్‌వారు తదనంతర దశల్లో భారతదేశంలో చట్టరూపకల్పనకు

ఎంతగానో సహాయకారిగా పని చేసింది. ఐర్లాండ్‌కు బదిలీ అయిన ఇంగ్లాండ్ భూస్వామికత్వం (Landlordism) ఒక రకంగా నష్టదాయకంగా మారినటువంటిది. ఐర్లాండ్‌లో ప్రవేశపెట్టిన ఇంగ్లీష్ భూస్వామ్య విధానంలో భూస్వాములు ఆంగ్లేయులే. అయితే వీరంత నివాసేతర భూస్వాములుగా వుండేవారు. భాటక సిద్ధాంత (doctrine) ప్రతిపాదకులైన ఆనాటి ఉదారవాద రాజకీయ, అర్థ శాస్త్రవేత్తలకు (Liberal political economists) అతి కష్టమైన జీవితం గడుపుతున్న ఐరిష్ కౌలుదార్ల స్థితి కనపడలేదు. జాన్ స్టూవర్ట్ మిల్ ఈ కౌలుదార్ల స్థితిగతులను సంస్కరించాలన్న అంశానికి మద్దతునిచ్చాడు. 1870లో రూపొందించిన మొదటి ఐరిష్ కౌలుదారీ చట్టం ప్రధాన (original) బిల్లులోని ఒక ముఖ్యమైన క్లాజును 'హౌస్ ఆఫ్ లార్డ్స్' కొట్టివేయడం వల్ల పూర్తిగా విఫలమైంది. భూమిని సాగులోకి తెచ్చినందుకు, కౌలుదారులను తొలగించినందుకు నష్ట పరిహారాన్ని చెల్లించే వసతిని ఈ చట్టం కల్పించింది. నాటి బ్రిటీష్ ఎగువ సభ తొలగించినందుకు నష్ట పరిహారాన్ని చెల్లించే వసతిని ఈ చట్టం కల్పించింది. ముఖ్యంగా నాటి బ్రిటీష్ ఎగువ సభ తొలగించిన క్లాజ్ ప్రకారం కౌలుదార్లు భాటకం చెల్లింపు ఒక వేళ బకాయి పడ్డవారు నష్ట పరిహారం పొందే అవకాశముండేది. ఈ కీలకమైన అంశాన్ని కొట్టివేయడం వల్ల కౌలుదార్ల రక్షణ కష్టసాధ్యమైంది. భాటకం చెల్లించినంత కాలం కౌలుదారును తొలగించరాదనే అల్స్టర్ సాంప్రదాయాన్ని ఈ చట్టం గుర్తించింది. కానీ ఈ చట్టం బాటకం (భూమి అద్దె) పెరుగుదలపై ఏ విధమైన పరిమితులు విధించనందున ఈ సాంప్రదాయం అర్థరహితంగా మిగిలపోయింది.

1. వాస్తవానికి ఈ చట్టం వల్ల భూస్వాములు తప్పనిసరిగా భాటకాన్ని పెంచవలసి వచ్చింది. ఎందుకనగా తక్కువ భాటకం ఉంటే కౌలుదారీ పద్ధతికి ప్రాధాన్యత పెరిగి భూస్వామి భూమిని తిరిగి స్వాధీనం చేసుకోవాలను కున్నప్పుడు పెద్ద మొత్తంలో నష్టపరిహారం చెల్లించవలసి వచ్చేది. ఈ చట్ట వైఫల్యం ప్రభుత్వాన్ని మరింత ముందుకు తీసుకెళ్లి కౌలుదారుకు మూడు 'F' ల (నిర్ణీత కాలపరిమితి, స్వేచ్ఛాయుత బదిలీ, సరసమైన భాటకం) ప్రయోజనాలు **అందేటట్లుగా** 1881లో మరొక కౌలుదారీ చట్టాన్ని ఆమోదించినట్లు చేసింది. ఈ చట్ట ప్రకారం భూస్వామి కనుక ఒక వేళ భాటకాన్ని పెంచదల్చుకుంటే కౌలుదారుకు మూడు ప్రత్యామ్నాయాలు అందుబాటులోకి వచ్చినాయి. అవి 1. నూతన భాటకం రేటు తిరిగి 15 సంవత్సరాల వరకు పెంచరాదు.

ఐరిష్ ప్రాంతంలో అతి దుర్భరమైన కౌలు ఒప్పందాలకు లోనై పని చేస్తున్న కౌలుదార్లను 'కాటీర్స్' (Cottiers) అని అంటారు. వీరు దాదాపు ఒక అర ఎకరం పొలాన్ని కౌలుకు తీసుకొని ఐదు పౌండ్ల అద్దెను పంటకాలానికి యజమానికి చెల్లించవలసి వచ్చేది.

2. కౌలుదారు పెంచిన భాటక ప్రతిపాదనను తిరస్కరించి నష్టపరిహారాన్ని కోరవచ్చు.
3. చట్ట ప్రకారం ఏర్పాటు చేయబడిన కమీషన్‌కు నివేదించి న్యాయ పరిష్కారాన్ని కోరవచ్చును.
మూడవ ప్రత్యామ్నాయం అసాధారణ పరిస్థితుల్లో ఉపయోగించే భద్రత కవచంగా (Safety Valve) రూపొందించబడింది. కాని అన్ని అంచనాలకు మించి ఈ విధమైన అసాధారణ మినహాయింపే ఒక నియమంగా మారింది. పెరుగుతున్న భూమి ప్రామాణిక విలువకానీ, భాటకానికి సంబంధించిన న్యాయపరమైన పరిష్కారానికి పని చేసే మార్గదర్శక అంశాలుగా వుండేవి. భూస్వామి కౌలుదారు మధ్యలో పంపిణీ చేసుకొనే ధాన్యం మొత్తం కానీ ఇంగ్లాండ్ సాధారణ న్యాయ పద్ధతుల ప్రకారం ఇట్లా అవలంబించబడిన చర్యల సారాంశం. ఇంత వరకు తిరస్కరించబడిన సహ- యాజమాన్యాన్ని (Co-ownership ) గుర్తించడమే అవుతుంది.

ఐర్లాండులో మాదిరిగా భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం అంత వేగిరంగా వెళ్ళ దలుచుకోలేదు. ఐర్లాండ్ కౌలుదారీ చట్టంఒక గొప్ప రాజకీయవేత్త అయిన గ్లాడ్ స్టోన్, బలీయమైన రాజకీయ పార్టీ అయిన లిబరల్‌పార్టీచే ప్రతిపాదించబడింది. వీరు ఆనాడు కౌలు భద్రతను ప్రముఖ ప్రభుత్వ విధాన సమస్యగా పరిగణించినారు. భారతదేశంలో శాంతి భద్రతల నిర్వహణ గురించి పట్టించుకొన్న పాలకులు ఈ సమస్యను తక్షణ పరిధిలో పరిగణిస్తూ ఎదురయ్యే సమస్యను పరిష్కరించే దృష్టితో ఉండేవారు. అంటే, ఐర్లాండ్‌లో లాగా కౌలు భద్రత, ఒక ప్రభుత్వ విధాన సమస్య అయితే, భారతదేశంలో మాత్రం దానిని ఆ నేపథ్యంలో చూడలేదన్నది స్పష్టం. ఉదారవాది అయినవైస్రాయి 'లార్డ్ రిప్పన్' కౌలుదారీ చట్టాన్ని మద్దతు చేసినందుకు ఆయనను తప్పక ప్రశంసించాలి. దీర్ఘకాలిక ప్రభుత్వ విధానాలను రూపొందించే చట్ట సభల్లో 'గ్లాడ్ స్టోన్' ల మాదిరిగా రిప్పన్ పార్లమెంటేరియన్ కాదు. ఆయన కేవలం ఉద్యోగ స్వామ్యానికి అధిపతి మాత్రమే. అయినప్పటికి ఈ ఉద్యోగి స్వామ్యమే విభిన్న సాంప్రదాయాలు, అభిప్రాయాలు (Prejudices ) కలిగి ఈ స్వామ్యమే ప్రతిపాలనా అంశంపైన తనకంటు విలువల ప్రాధాన్యతను కలిగి ఉండేటువంటిది కూడా. వివిధ ప్రాంతీయ క్యాడర్లుగా విభజించబడి వున్నటువంటిది. కౌలు సమస్యపైన ఖచ్చితమైన విధానాన్ని అనుసరించవలసిన అవసరం గురించి ప్రాంతీయ ప్రభుత్వ (Provincial Governments ) భారత ప్రభుత్వం ఇదమిద్ధంగా ఒప్పించలేక పోయింది. కొన్ని సందర్భాలలో కేంద్ర ప్రభుత్వం వేర్వేరు ప్రాంతాలలో అవలంబించబడుతున్న కౌలు రక్షణ చర్యలను సమన్వయ పర్చలేక పోయింది. ఇందుకు సంబంధించి నిర్దుష్టమైన ఉదాహరణలు స్పష్టంగా వున్నాయి. ప్రత్యేకించి కేంద్రీయ ప్రాంతాల కౌలుదారీ చట్టం - 1883, బెంగాల్ కౌలుదారీ చట్టం - 1885 పరికల్పనలో స్పష్టంగా భిన్న స్వరాలే ఇందుకు తార్కాణాలు. ఈ రెండు చట్టాలు లార్డ్ రిప్పన్ వైస్రాయిగా ఉన్న కాలంలోనే రూపొందించబడినప్పటికీ బెంగాల్ చట్టం ఆమోదించబడక ముందే అతను భారతదేశం వదిలి

వెళ్లినాడు. ఈ రెండు చట్టాలలోని కొన్ని భద్రత చర్యలు ఈ పరస్పర విరుద్ధ స్వభావం వుండటం వల్ల నాటి సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఆశ్చర్యాన్ని కూడా వెలిబుచ్చినాడు. అయినా అతడు కానీ లార్డ్ రిప్పన్ కానీ దాని గురించి ఏమీ చేయలేక పోయినారు. ఒక వేళ తమ హోదాలో ఈ చట్టాలకు ఆమోద-నిరాకరణ జరుపడమంటే కొన్ని ''విపరిణామాలకు' దారితీసే అంశమే. మరొకవైపు సంబంధిత ప్రాంతీయ ప్రభుత్వం నూతన ప్రతిపాదనల విషయంలో తప్పించుకొనే వైఖరిని ప్రదర్శిస్తూ ఆమోదించబడిన సూత్రాలపై మాత్రమే ఒత్తిడి చేసింది. ఈ పరిస్థితి వివిధ రకాల శాసనాలకు, చట్ట స్వరూపాలకు తావునిచ్చింది. కాని కౌలుదారీ చట్టాలకు చేయబడిన వివిధ సవరణలు వీటిలో కొంత సామ్యాన్ని సాధించినప్పటికీ ఇవి మరికొన్ని ఇబ్బందులకు దారితీసినాయి. కౌలుదారు భద్రతకు 'నష్ట పరిహారం చక్కని సాధనం' అని ఒకగవర్నర్ భావిస్తే, భారతీయ సంప్రదాయానికి అది అనువైనదికాదని మరొకరు భావించారు. అనుపాదిత హక్కులు (Prescriptive Rights ) కొందరిచే పొగడబడినవి. మరి కొందరిచే అవి రద్దు చేయబడినవి. ఒక ప్రాంతీయ ప్రభుత్వం భాటకం పెంపుదలపై ఒప్పందం కుదుర్చుకొనే స్వేచ్ఛను అనుమతిస్తే మరొక ప్రభుత్వం న్యాయశాఖ మధ్య వర్తిత్వాన్ని ప్రతిపాదించింది. కౌలుదారులచే నిర్ణయించబడాలని సూచిస్తే మరొక ప్రభుత్వం న్యాయశాఖ మధ్య వర్తిత్వాన్ని ప్రతిపాదించింది. కౌలుదారుల భద్రతకు సంబందించిన అనువైన పద్ధతుల ప్రతిపాదన ఆయా ప్రాంతీయ ప్రభుత్వాల దృక్పథాలు, వారు కలిగి వున్న రెవెన్యూ పాలన స్వరూపంపై ఆధారపడి ఉండేది. రైత్వారీ ప్రాంతాలలో కొన్ని విషయాలలో తీవ్రమైన సూచనలు ఇచ్చినప్పటికి కొన్ని సందర్భాల్లో అతి జాగ్రత్తగా ప్రభుత్వాలు వ్యవహరించేవి. రైత్వారీ పద్ధతి అమలులో లేని ప్రాంతాలలో ప్రభుత్వం వ్యవహరించేటప్పుడు, అధికారులు మొట్టమొదట అక్కడ రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టి భూస్వాములకు నష్టపరిహారం చెల్లించే విషయాన్ని ఎక్కువగా ఆలోచించేవారు. మరో వైపు రైత్వారీ ప్రాంతాలలో కౌలుదారీ చట్టాల ద్వారా ఎటువంటి యజమాన్య విఘాతం (upset )కలగకుండ ప్రభుత్వం జాగ్రత్త పడేది. ఉత్తర, మధ్య భారత దేశంలోని ప్రాంతీయ ప్రభుత్వాల రెవెన్యూ అధికారులు ఆయా ప్రాంతాల భూస్వాములతో, కౌలుదార్లతో చర్చించి భాటకం ఒప్పందాన్ని కుదుర్చడం లేక నష్టపరిహారం నిర్ణయించడమో సరియైన కౌలుదారుల భద్రత చర్యగా భావించేవారు. శాశ్వత శిస్తు విధానం (permanent settlement ) ఉప భూస్వామీకరణ (subinfeundation ) కారణాల వల్ల బెంగాల్ ప్రభుత్వం రెవెన్యూ యంత్రాంగం ద్వారా కౌలుదారులకు భద్రత కల్పించలేమని భావించి సివిల్ కోర్టుల ద్వారా అమలు జరుపబడే కొన్ని చర్యలను చేపట్టింది. ఈ చర్యలలో ప్రధానమైనవి రెండు. అవి, అనుపాదిత హక్కులను (prescriptive rights ) సృష్టించడం, భాటకపు పెంపునకు సంబంధించిన మార్గదర్శక సూత్రాలను నిర్ధారించడం. ఈ రెండు చర్యలను

బెంగాల్ ప్రభుత్వం పాటించింది. కౌలుదారుల రక్షణ పద్ధతుల పట్ల వ్యక్తిగత ప్రాధాన్యతలు, ప్రాంతీయ ప్రభుత్వాల వ్యవస్థ నిర్మాణం ఇలా ఉండగానే కౌలుదారీ చట్టాల రూపకల్పనకు సంబంధించి మూడవ అంశం మరొకటి తోడైనది. ఈ అంశం ప్రత్యేకించి ఆయా ప్రాంతాలలోని సమస్యలపై ప్రభుత్వాలు చేపట్టిన చర్యల పట్ల వ్యక్తీకరించబడిన స్పందనల సమ్మేళనంగా చెప్పవచ్చు. కొన్ని ప్రాంతాలలో భాటకం వసూలు చట్టాలలో కౌలుదార్ల రక్షణ కోసం ఇముడ్చబడిన అంశాలే తర్వాత కాలంలో సమగ్ర కౌలుదారీ చట్టాల రూపకల్పనకు నాందీ ప్రస్తావన పలికేవిగా మారినాయి. ఇట్లా రూపొందించబడిన చట్టాల పనితీరుకు కొన్ని సందర్భాలలో కోర్టు తీర్పుల వల్ల అంతరాయం ఏర్పడింది. పంజాబ్‌లో కౌలుదారీ చట్ట నిర్మాణానికి ఒక ప్రత్యేక పునాదితో ప్రారంభమైంది. పంజాబ్‌లోని మొదటి చట్టంలో ఆస్తి హక్కుల పంపిణీలో ఎదురైన లోపాలను సవరించుటకు రూపొందించబడింది. దానిని కౌలుదారీ చట్టం అనే బదులు రైతాంగ యాజమాన్య ఇతర ప్రాంతాలలోని చట్టాల కన్నా ఇది మరిన్ని భద్రతా చర్యలను కలిగి ఉండి మిగతా వాటికన్నా ఒకింత అభ్యుదయమైనది కూడా. పంజాబ్ కాక వేరే ప్రాంతాలలో ప్రవేశపెట్టిన కౌలుదారీ చట్టాల పరికల్పన సందర్భం దీనికన్నా భిన్నమైంది. ఈ ప్రాంతాలలో భూస్వాములు దీర్ఘకాలికంగా కలిగి వున్న యజమాన్య హక్కుల గురించి ఆయా కౌలుదారీ చట్టాలు తమ దృష్టిని కేంద్రీకరించినాయి. మధ్య భారత లేదా కేంద్ర ప్రాంతాలు దాదాపు ఇదే అనుభవాన్ని కలిగి వున్నాయి. ఉన్నత వర్గాలకు అనుగుణంగా వ్యవహరించే పాలకులు, భూస్వాములకు అనుకూలంగా వ్యవహరిస్తూ ఈ ప్రాంతపు రెవెన్యూ వ్యవస్థను రూపొందించారు. దీనికి తోడుగా బెంగాల్ చట్టాన్ని ఇక్కడకు విస్తరించినారు కూడా. ఈ విధంగా పాటించిన మిశ్రమ కౌలుదారీ రక్షణ పద్ధతులు కొన్ని బెంగాల్ దృష్టాంతాలను ప్రతిఫలిస్తే మరికొన్ని పంజాబ్ చట్టంలోని రైతాంగ యాజమాన్య పునరుద్ధరణ చట్టాన్ని ప్రతిబింబించాయి. కౌలుకు సంబంధించిన భద్రతా చర్యలను ప్రభావితం చూపి వివిధ అంశాలు ప్రాంతీయ పాలనా పరిధిలోని శాసనాల్లోని మూలమైన యాజమాన్యపు స్వేచ్ఛా బదిలీ హక్కుకు సంబంధించిన వైవిధ్యాన్ని స్పష్టంగానే వివరిస్తాయి. భూమిని స్వేచ్ఛగా బదిలీ చేసే హక్కు పంజాబ్‌లో రూపొందించిన మొదటి చట్టం ద్వారానే ఇవ్వబడింది. రైతాంగ యాజమాన్యానికి సంబంధించిన ఈ అంశం విశిష్టమైనదిగా పరిగణించబడింది. బెంగాల్ శాసన కర్తలు కౌలుదారీ భద్రత అంశంలో ఇమిడివున్న భూ బదిలీ అంశంపై ఖచ్చితమైన నిబంధనలను రూపొందించలేక దానిని ఎక్కువగా స్థానిక ఆచారాలకే వదిలి వేశారు. ఈ అధ్యయనం అయ్యే నాటికి కౌలుదార్లకు శాసనాత్మక గుర్తింపు లభ్యమైంది. మరొక వైపు వ్యవసాయేతర వర్గాలకు భూమి బదిలీకి సంబంధించిన పెద్ద చర్య కొనసాగుతున్న సందర్భంలో కేంద్రీయ ప్రాంతాలలో సవరింపబడిన కౌలుదారీ చట్టం కౌలుదారు సాగు యాజమాన్య హక్కు (occupancy right) ఎట్టిస్థితిలోనూ పరాయికరించ వీలు లేనిదిగా గుర్తించింది.

కౌలుదారీ చట్టాలలోని సంక్లిష్టత, భద్రతకు సంబంధించిన వివిధ సాధనాలపై విభిన్న అభిప్రాయాలు వెలువడినప్పటికీ దీనివల్ల అటు భూస్వాములకు వ్యతిరేకంగా మరొకవైపు గ్రామీణ సమాజపు దిగువ వర్గాలకు ఆవలగా చట్టపరమైన హక్కులను పొందిన ఒక నూతన వర్గం రూపొందింది. ఎం.జి. రానాడే (M.G. Ranade) సూచించినట్లుగా, భూమిని సాగుచేస్తున్న కౌలుదారులందరినీ యాజమానులుగా ప్రకటించి, భూస్వాములకు నష్టపరిహారం చెల్లించాలన్న స్థాయికి ప్రభుత్వం పోలేదు. అంటే భూస్వాములకు నష్ట పరిహారం చెల్లించే ఇతమిద్ధమైన స్థాయిలో భూమిని కలిగివుండేటట్లు భూస్వాములను ఒప్పించే విధంగా బ్రిటిష్ పాలకులు ప్రయత్నించాలన్న సూచన వాస్తవరూపం దాల్చలేదు. ఈలాంటి సూచనలే స్వాతంత్ర్యానంతరం ప్రవేశపెట్టిన భూసంస్కరణలకు ప్రతిపాదిక పని చేసిందని తెలియజేయడంలో అతిశయోక్తిలేదు. విదేశీపాలకులైన బ్రిటిష్‌వారు భూస్వాములకు, కౌలుదారులకు మధ్య రాజకీయ సమతౌల్యాన్ని కాపాడడం పట్ల శ్రద్ధ వహించడం వల్ల తీవ్ర చర్యల జోలికి వెళ్ల లేదు. కానీ కౌలుదారీ శాసన చర్యల ద్వారా వారు ప్రవేశపెట్టిన రైతాంగ స్తరీకరణే(stratification) ఆ తర్వాతి సంస్కరణల స్వరూపాన్ని నిర్దేశించే అంశంగా మారింది.

## రైతాంగ స్తరీకరణ
(The Stratification of the peasantry)

రాజకీయంగా సమర్థవంతంగా ఉండటానికి వీలుగా రక్షణా చర్యలకు కనీస మరియు గరిష్ఠ పరిమితులు అవసరం. ప్రాంతీయ పరిస్థితులు, పరిసరాలలోని తేడాల వల్ల విధించబడిన ఈ పరిమితులలో వైవిధ్యం ఉండెను. కానీ 1885 బెంగాల్ కౌలుదారీ చట్టంలో భూమిపై హక్కులు కల్గివున్న యజమానికి కౌలుదారుకు మధ్య పేర్కొన్న విభజన రేఖ వల్ల ఒక అభిప్రాయం ఏర్పడుతుంది. బెంగాల్ చట్టం ప్రకారం కౌలుదారు 100 బీఘాలు కలిగి వుండి (దాదాపు 30 ఎకరాలు) చిన్న తరహా భూస్వామిని పోలి వుండే విధంగా నిర్వచింపబడినాడు. ఈ విధమైన ఏర్పాటును కలిగి ఉండటానికి దోహదపడిన కారణాలను తర్వాత తెలుసుకోవచ్చు. మనకు కావల్సిందల్లా ఒక కౌలుదారు సాగు చేయగలిగిన గరిష్ఠ పరిమితిలో ఎకరాల సంఖ్య గురించిన అంశమే. ప్రభుత్వ భూమిని సాగు చేసే రైత్వారీ ప్రాంత సంపన్న 'కౌలుదారు' కలిగివుండే ఎకరాల సంఖ్య దాదాపు ఇదే మొత్తంలో వుంటుంది. ఒక రకంగా కౌలుదారీ చట్టం గ్రామ సమాజంలో చోటుచేసుకున్న రైతాంగ స్తరీకరణకు (stratification) ఇంచుమించుగా అర్థం చేసుకోవడానికి, అంచనా వేయడానికి ప్రాతిపదికగా పనిచేసింది. రక్షిత కౌలుదారులు కాని వారు కలిగి వుండే సగటు భూకమతపు కనిష్ఠ పరిమితి గురించి శాసన సభ పట్టించుకోక పోవడంవల్ల, అస్పష్టమైన చట్ట పరిభాషను వీడడం వల్ల కౌలుదారుల సమస్యలను పరిష్కరించడంలో కోర్టులు తమ ఇష్టానుసారంగా వ్యవహరించినవి. కేంద్రీయ ప్రాంతాల

పాలకులు తమ చట్టపరమైన ప్రయత్నాలలో, కౌలుదారులకు ఆటంకాలు సృష్టించినట్లయితే నిషేధాత్మక నష్ట పరిహారం చెల్లించే అంశాన్ని చేర్చినారు. తద్వారా భూమి కౌలుపై పోటీ అరికట్టబడిందని కూడా నాటి పాలకులు చలించినారు. కానీ కొన్ని సంవత్సరాల తర్వాత ఆ చర్యలను వారు వెనకకు తీసుకున్నారు. అభీష్టానుసారపు కౌలుదారులు (Tenants - at - will) భాగస్వామ్యరైతు (share cropper) ఈ చట్ట విమేనా పరిధిలో నుండి ఉద్దేశ్యపూర్వకంగా వదిలివేయబడ్డారు. కారణాలను ప్రస్తావిస్తే మొదటగా, రెవెన్యూ అంచనా కు ఆధారమైన భాటకం విలువకు పోటీ సూత్రం మాత్రమే సూచిక (index) గా పనిచేస్తుందనే భావన బలంగా వుండటం. రెండవది, నిర్ణీత హద్దులు దాటిన తర్వాత రక్షణ అనేది పాలనా, న్యాయ యంత్రాంగాలపై మరింత భారాన్ని మోపుతుందనే విషయాన్ని గుర్తించడం చివరిది, భద్రత కలిగిన కౌలుదారులు కూడా దోపిడి చేయగలిగే శ్రేణులను ( రక్షణ లేని కౌలుదార్లు, భాగస్వామ్య రైతులు) అందుబాటులో వుంచే ఉద్దేశ్యం కూడా ఈ పై కారణాల్లో ఒకటి. రక్షణ అంటే కేవలం ఈ తరాల అక్రమణ నుండి కాపాడే ప్రత్యేక వసతే కాదు ఇతరులను వినియోగించుకోగలిగే స్వేచ్ఛకూడా అవుతుంది. ఈ అర్థంలో కౌలుదారీని ప్రవేశపెట్టిన నేపథ్యాన్ని గమనించాలి. ప్రభుత్వం తన ప్రయోజనాలను ఎప్పుడెప్పుడు ఏ పద్ధతుల్లో కాపాడుకోవాలో దానికనుగుణ్యమైన రీతిలో,'కౌలుదారీ' ప్రక్రియను ఒక్కొక్కసారి ప్రత్యేక వసతిగాను, మరొక్క సారి దోపిడీ రూపంగానూ అభివృద్ధించి వాడుకొన్నది.

భారత దేశంలోని కుహన అనుపాదిత రైతులుగా (so-called occupancy ryots) పేర్కొనబడుతున్న వారిని కూడా ప్రత్యేక తరగతి (priviliged) గా గుర్తించాలని బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించింది. బ్రిటిష్ ప్రభుత్వం నిర్వచనం ప్రకారం భూస్వామి నుండి లేక పెద్ద కౌలుదారు (substantial tenureholder) ల నుండి నేరుగా సాగు సంక్రమణ హక్కును కలిగివుండి భూమిని పొందిన వారినే ఈ కోవకు చెందినవారుగా పరిగణించింది. బ్రిటిష్ పాలనా మొదటి కాలంలో ఈ వర్గంపైననే ఆధారపడినట్లుగా గమనించాలి. ఒకప్పుడు ప్రత్యేక తరగతికి చెంది ఉండి, ఆ తర్వాత భూములను కోల్పోయి తమ భూములకే తాము కౌలుదారులుగా మారిన వారు కూడా ఈ కోవలో కలిసినారు. ఈ పరిస్థితి ఉత్తర భారతదేశంలోనే తలెత్తింది. ఈ సమస్య శాశ్వత సెటిల్మెంట్ ( భూధృవీకరణ) జరిగిన బెంగాల్‌లో లేదు. ఉత్తర భారతదేశంలో ఈ మాజీ పెద్ద భూస్వాములు 'పూర్వపు యాజమాన్య హక్కులు కలిగి ఉన్న కౌలుదారులు' (Ex-proprietary tenants) గా పేర్కొనబడి ప్రత్యేక రక్షణకు అర్హులైన వారిగా ప్రభుత్వం పరిగణించింది. గత కాలపు మహోన్నత అధికార స్మృతులు కలిగివుండి ప్రస్తుత అధికారం కోల్పోయిన భావంతో ఉన్న ఈ పూర్వ భూస్వామ్య వర్గం వల్ల అశాంతి ఎప్పుడైనా తలెత్తే అవకాశం వున్నందున్న విషయాన్ని

గ్రహించే, ఈ వర్గానికి ప్రత్యేక హోదాను ప్రభుత్వం కల్పించింది. ఉత్తర, మధ్య భారత దేశంలో శిస్తూ, భాటకం, రుణాల చెల్లింపు తదితర అంశాలు భూస్వామ్య కుటుంబాల ఆకస్మిక పతనానికి కారణం కావడం వలన ఈ రకమైన చర్యలు అవసరమైనవి. కానీ ఈ చర్యలు కూడా కొన్ని సమస్యలతో కూడుకొని వున్నటువంటివి. నీటిలో మునిగిపోనున్న వ్యక్తులను ముందే గ్రహించి రక్షించే స్వభావం కలిగిన చర్య ఇది. ప్రత్యేక రక్షణా సౌకర్యం కలిగిన పూర్వపు యాజమాన్య హక్కు కలిగిన కౌలుదారుల సంఖ్య వాస్తవానికి అతి స్వల్పమే. పూర్వ యాజమాన్య హక్కులతో కూడిన భూయాజమాన్యం మొత్తానికి ఒక ముఖ్యమైన రక్షణా చర్యగా మిగిలింది.

సాంప్రదాయక ఖుద్‌కష్ట రైతు (khudkasht) స్థానంలో అనుపాదిత రైతులు (occupancy ryots) చోటు చేసుకోవడమనేది వ్యవసాయిక సంబంధాలలో (agrarian relations) వచ్చిన ఒక గొప్ప మార్పు. ఈ మార్పుకలుగడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రయత్న పూర్వకంగా ఆశించినప్పటికీ అనుపాదిత రైతుల పట్ల తను చేపట్టిన రక్షణా చర్యలు ఈ మార్పుకు దోహద పడ్డాయి. పూర్వ యజమాన్య హక్కు గుర్తింపు వల్ల గతంలో ఒకరికి వున్న సామాజక హోదాను అంచనా వేయడానికి ఉపకరించిన అంశం. అయితే, రైతు హోదా నిర్ధారణ భూమికి రైతుకున్న సంబంధాన్ని బట్టి నిర్వచించబడితే, పూర్వ యాజమాన్య హక్కులకు సంబంధించి రైతు భూస్వామితో కలిగి వుండే సంబంధాలను మాత్రమే పరిగణనలోకి తీసుకోబడేవి. ఎప్పుడైతే రైతులను నిర్ణీత హక్కులు పొందకుండా భూస్వాములు వారిని ఒక క్షేత్రం నుండి మరొక క్షేత్రానికి మార్చి వారికి సాగు క్షేత్రంపై వుండే హక్కులను నిరాకరించే సందర్భంలో బ్రిటిష్ ప్రభుత్వం కౌలుదారుకుండే పూర్వ యాజమాన్య హక్కును గురించి నొక్కి చెప్పింది. ఒకే భూస్వామి ఆధీనంలో కౌలుదారు ఉన్నంత కాలం సాగు చేసే క్షేత్రంతో సంబంధం లేకుండా కౌలుదారుకు పూర్వ యాజమాన్య హక్కులు సంక్రమిస్తాయని శాసనసభా ప్రతినిధులు పేర్కొన్నారు. శాసన ప్రణాళిక రూపకల్పన చేసే ఒక దశలో పూర్వ యాజమాన్య హక్కు సాగుచేసే భూమికే అనుబంధం చేసి, ( భూస్వామి ప్రస్తావన లేకుండా) దానిని సేద్యం చేసిన వారికే ఆ హక్కును చెందునట్లు శాసనం రూపొందించాలని ఒక సూచన కూడా ప్రతిపాదించబడింది. కానీ తర్వాత అది కార్యరూపం దాల్చలేదు. ఈ పద్ధతి. కౌలుదారును కాకుండా వాస్తవిక సాగుదారుని (cultivator) కి రక్షణ కలిగించి ఎంతో మార్పుని తీసుకొని వచ్చేది. భూస్వామి నుండి రక్షణ పొందిన కౌలుదారు రూపంలో వుండి తదనంతరంగా భూమిని మరొకరికి ఉపకౌలుకిచ్చే వారిని ఇది నిరుత్సాహ పరిచేది.కూడా. ప్రారంభంలో ఆక్రమణకు సంబంధించిన ఈ రెండు నిర్వచనాలు ఎంతో తేడాను తీసుకు వచ్చేవి కావు. కానీ భూమి మార్కెట్ విస్తరించిన ఇచ్చే నిర్వచనం గ్రామీణ సమాజ స్తరీకరణకు

సంబంధించిన ఒక ముఖ్యమైన అంశంగా పరిణమించింది. బ్రిటిష్ పాలన తొలి రోజుల్లో, భారతదేశంలో భూమి మార్కెట్ ఉన్నట్లుగానే పరిగణించి ఆ తర్వాత ఎప్పుడైతే ఈ మార్కెట్ వాస్తవంగా పెంపొందినదో దానిని పరిమితించడానికి వారే శాసనాన్ని రూపొందించినారనే ఒక వాదన కూడా వుంది. కొంత వరకు ఇది వాస్తవమే. రుణగ్రస్తుల విముక్తికి రూపొందించిన శాసనానికి మాత్రమే ఇది వర్తిస్తుంది. కౌలుదారీ చట్టానికి మాత్రం వర్తించదు. భూమార్కెట్‌లో భూస్వామి వాటా గణనీయంగా కౌలుదారీ చట్టం ద్వారా తగ్గించబడింది. కానీ రక్షిత కౌలుదారులు తమకు సంక్రమించిన హక్కుల ద్వారా ప్రయోజనం పొందినారు. సాగు చేసుకొనే భూమితో వున్న సంబంధం కన్నా తాము భూస్వామితో కలిగివుండే సంబంధం ద్వారానే రైతుల హక్కులు నిర్వచింపబడినందువల్ల కాలక్రమంలో వారే నిజమైన భూస్వాములుగా మారినారు. భూమిపై వత్తిడి పెరుగుతున్న కొద్ది రక్షిత కౌలుదార్లు ఆర్థిక ఉనికి రీత్యా మెరుగుపడడంవల్ల చాలా ప్రాంతాలలో వీరి తరుపున భూమిని సేద్యం చేయడానికి ఇతర శ్రేణులు ముందుకు వచ్చినారు. అనుపాదిత హక్కు లేదా భూమిని సాగు చేసుకొనే హక్కును భూస్వామి సంబంధాల మీదుగా కాక సాగుచేయు భూమి ఆధారంగా చేసి అన్వయించినట్లయితే, ఉపకౌలు విధానాన్ని నిషేధించినట్లయితే గ్రామీణస్తరీకరణ (stratification) మరొక విధంగా ఉండేది. వ్యవసాయ రంగంలో భూమిపై ఆధారపడి బ్రతుకాలనుకొనే ప్రజాశ్రేణులను రక్షణలేని కౌలుదారులుగానే వ్యవసాయ కార్మికులుగా ఉండేవారు. ఒకవేళ ఉపకౌలును నిషేధించనట్లయితే కూడా గ్రామీణ స్తరీకరణ పద్ధతి కూడా మరొక విధంగా ఉండేది. నిజ సాగుదారు నుండి తప్పకుండా అద్దె పొందగలిగే ఉపకౌలు విధానాన్ని కొనసాగించే ఎవరైనా భూకౌలు యజమానిగానో. (Tenure holder) చిన్నపాటి భూస్వామి గానో వ్యవసాయ రైతాంగ వర్గీకరణలో భాగంగా ఉండేవాడు. పెరుగుతున్న ప్రజా సంఖ్య వత్తిడికిలోనై ఇది ఒక రకమైన ఉపభూస్వామీకరణను (subinfeudation) ఉత్పన్నం చేసే ప్రక్రియగా మారి వుండేది కూడా. అయితే, సాగుచేసే హక్కు విలువైనది కనుక సాగు చేసే ప్రక్రియలో ఇమిడి వుండే శ్రేణులన్నింటిని హక్కును కల్గి వుండే కౌలుదార్ల కన్నా వ్యవసాయ కూలీలుగా గుర్తించడం జరిగేది. విశాల భూకమతాలను కలిగివున్న కుటుంబాలు జీవసంబంధ నిర్ణాయకమైన కుటుంబ విస్తృత సూత్రం వల్ల వారసత్వ పరంగా భూకమతాలను విభజించుకొని తమ వంతు భూమిని స్వంతాన్ని అనుమతించే 'కౌలుదారీ హోదాను' అంగీకరించడానికి సుముఖతను చూపేవారు. బెంగాల్‌కౌలుదారీ చట్ట చర్చ కొనసాగుతున్న సందర్భంలో ఒకనొక దశలో ఈ అంశం ప్రస్తావించబడింది. ప్రతీ కౌలుదారు తన హోదాతో నిమిత్తం లేకుండా తనకు భూమికి సంక్రమింపచేసిన వ్యక్తి నుండి అపాదిత హక్కులను (occupancy rights) కలిగి వుండాలన్నదే పై అంశం సారాంశం. అపాదిత హక్కులను (occupancy rights) భూమికే చెందేటట్లు ఉంచే పద్ధతికి సమీపంగా ఈ చర్య మిగిలేది. ఉపకౌలు పద్ధతిని

నిరుత్సాహపరిచి భూ కౌలుదార్ల సంఖ్యను కుదించేదిగా ఉండేది. కౌలు రక్షణ వసతిని ప్రత్యేక సౌకర్యాలను ఎలా పొందాలో తెలుసుకొన్న కౌలుదారుల నుంచి వ్యతిరేకత ప్రస్ఫుటం కావడంతో ఈ ప్రతిపాదన మొదట్లోనే విరమింపబడింది.

పూర్వ యాజమాన్య హక్కులను పొందడాన్ని మినహాయించి వివిధ కౌలుదారీ వర్గాలను సృష్టించిన ప్రాంతాలలో వ్యవసాయ వర్గీకరణ భిన్నంగా వుంది. పంజాబ్, కేంద్ర ప్రాంత ప్రావిన్స్‌లలోని కౌలుదారీ చట్టాల చర్చపై అంశాన్ని విశదీకరిస్తుంది. చట్టబద్ధమైన వర్గీకరణ, భూకమతాల బదిలీపై నిషేధం, ఉప భూస్వామ్యీకరణను నిరోధించి వ్యవసాయేతరులు రక్షిత కౌలుదారుల హక్కులను హరించి వేయడాన్ని అరికట్టినాయి. ఈ ప్రాంతాలలోని ఉపకౌలుదారులచే దోపిడికి గురి అయినారు. వాయువ్య ప్రాంతాలలోని సాగు హక్కుల సంక్రమణ (North-West provinces) విధానం ఆగ్రా, ఔధ్ (Oudh) సంయుక్త ప్రాంతాలలోని ఆగ్రా ప్రాంతం, బెంగాల్‌తో పాటుగా పైన పేర్కొన్న ఇతర ప్రాంతాలకు మధ్యస్థ ఏర్పాటుగా ఉండేది. వాయవ్య ప్రాంతాల్లో భూమిపై యాజమాన్యం పూర్వ యాజమాన్య హక్కుల సంప్రాప్తి వల్ల లభించేది. ఇట్లా సంక్రమించిన భూమిని బదిలీ చేసే హక్కు వుండేదికాదు. బదిలీపై అంక్షల అర్థమేమనగా కౌలుదారుకు వారసులు లేనట్లయితే రక్షిత హక్కులు అనంతరమే అవి తిరిగి భూస్వామికే చెందుతాయి. వంశపారంపర్య బదిలీ కేవలం ప్రత్యక్ష వారసులకు మాత్రమే జరగాలన్న అంశమే ఈ ప్రాంతాల్లో అమలులో వున్న చట్టాల సాధారణ సారాంశం. ఆగ్రా ప్రాంతంలో అనుపాదిత సంక్రమణ హక్కులు ఇతరులకు చెందే స్థితి వుంటే, ప్రత్యక్ష వారసులు లభ్యంలో లేకుంటే ఆయా భూకమతాలన్నీ భూస్వాములకే తిరిగి చెందడంలో ఒకరకమైన సమతౌల్యం (equilibrium) ఏర్పడింది. పూర్వపు యాజమాన్య హక్కులు లేనటువంటి కేంద్ర ప్రాంతాలలో రక్షిత రైతుల (protected occupancy ryots) సంఖ్య సహజంగానే తగ్గింది. కానీ మరోవైపు సాధారణ కౌలుదారులుగా వ్యవహరించబడేవారు, ఇదే రకమైన చట్ట రక్షణను అనుభవించడం వల్ల పరిస్థితిలో తీవ్రమైన స్థితి గోచరించలేదు.

కౌలుదారీ చట్టాలలోని ప్రాంతీయ వైవిధ్యాలు, పరిసరాల పరిస్థితులు భారత దేశ వ్యాప్తంగా కౌలుదారీ పద్ధతికి సంబంధించిన కొలబద్దను రూపొందించడాన్ని కష్టతరం చేసినవి. అయినప్పటికీ విశాల మార్గదర్శక కొలబద్దలను సూచించడానికి ఆయా ప్రాంతాలలో వున్న విభిన్న స్వరూపాలను తెల్పడమే తదుపరి ఆధ్యాయాల్లో చేపట్టడమైంది. ఇట్లా విశాల రూపకల్పన చేసిన కొలబద్ద కేవలం ఒక సూత్ర ప్రాయమైనదే. ఈ కొలబద్ద అగ్రభాగాన వ్యవసాయ మిగులులో వాటా పొందాలనే ఉద్దేశ్యంతో హక్కులను పొందిన సాగుదారులు కాని వారి నుండి మొదలుకొని రైతు శ్రేణుల దాకా ఉంటారు. ఆయా రైతు కుండే శ్రేణుల హోదాను తెలుపడానికి వ్యక్తపరచిన ఎకరాలు, కమతాల సంఖ్య కూడా కేవలం ఒక ఇంచు మించు అంచనా

మాత్రమే. సాధారణంగా పరిసర కారకాలతో పాటుగా నీటి పారుదల సౌకర్యం కలిగిన మాగాణి భూమితో సమానంగా మెట్టభూమి విలువ మూడింట ఒక వంతుగా పరిగణించబడుతుంది. కనుక, ఈ కారకాల ఆధారత్వం కూడా రైతాంగ హోదాను నిర్ధారించ గలిగే అంశంగా గుర్తించాలి. ఈ విధమైన అంశాల ఆధారంగా దిగువ రైతాంగ వర్గీకరణను తెలుపవచ్చు.

1వ శ్రేణి : భూకమత దారు : రైత్వారీ ప్రాంతాలలో 30 ఎకరాల కన్నా ఎక్కువ భూమి కలిగిన పెద్ద రైతు . పూర్వ యాజమాన్య హక్కులు కలిగివున్న కౌలుదారు.

2వ శ్రేణి : అనుపాదిత సంక్రమణ హక్కులు కలిగివున్న రైత. 6 ఎకరాల కన్నా ఎక్కువ వుండి, 30 ఎకరాల కన్నా లోపు భూమి కలిగి వంశ పారంపర్య హక్కులు కలిగిన చట్ట కౌలుదారులు, రైత్వారీ ప్రాంతాలలో వుండే సాధారణ రైతులు.

3వ శ్రేణి : వంశ పారంపర్య హక్కులు లేకుండా, రెండవ శ్రేణి వారివలే భూమి కలిగిన సాధారణ కౌలుదార్లు, సంక్రమణ హక్కులు కలిగి వున్న కౌలుదార్లు.

4వ శ్రేణి : వ్యష్టి కుటుంబానికి సరిపడే 3 నుండి 6 ఎకరాల వరకు భూమిని కలిగివుండి, చట్ట భూమిని కలిగివుండి, చట్ట రక్షణ లేని అభీష్టానుసార కౌలుదారులు, రైతాంగ దిగువ స్థాయి సాగుదారులు.

5వ శ్రేణి : కొద్ది భూమి మాత్రమే ఉండటం వలన ఇతరుల భూములలో పని చేసే ఉపకౌలుదారులు (sub-tenants), భాగస్వామి సాగుదారులు లేదారైతులు.

ఈ స్తరీకరణ సరాసరి విషయాలనే వివరిస్తుంది. కానీ ఖచ్చితమైన వైయుక్తిక, ప్రాంతీయ వైవిధ్యాలను పరిగణనలోనికి తీసుకోలేదు. ఉదాహరణకు నాల్గవశ్రేణికి చెందిన ఒక రైతు పంటకాలం పూర్తి అయిన తర్వాత ఇతర ప్రాంతాలకు వెళ్ళి భాగస్వామ్య సాగుదారుగా పనిచేయ వచ్చును. కమతాల బహు విఘటన వలన (fragmentation of holdings) ఒక అనుపాదిత సంక్రమణ హక్కులు కలిగివున్న వ్యక్తి ఉప కౌలుదారుకన్నా చాలా తక్కువ భూమిని కలిగి వుండవచ్చు. మొదటి అధ్యాయంలో ఉదహరించినట్లే రైతు చట్ట హోదా, గుర్తింపు జరిగి వర్గీకరణలో స్థితి నిర్ధారింపబడే కారకంగా పనిచేసే అంశంగా వుంటుంది.

★★★

ఏడవ అధ్యాయం

# శాశ్విత నిర్ణయాలు - కౌలుదారీ విధానం[1]

## శాసనము - న్యాయ స్థానాలు

1793, శాశ్వత ఒడంబడిక క్రింద తూర్పు భారతదేశంలోని అత్యధిక ప్రాంతం, బెంగాల్, బీహార్, ఒరిస్సా, ఇంకా మద్రాస్ ప్రెసిడెన్సీలోని మూడవ వంతు చేర్చబడినాయి 1793లో జరిగిన రెవెన్యూ మదింపు ఆధారంగా వసూళ్ళు చేసుకోవడం బ్రిటిష్ వారికి ఇబ్బందికరంగా వున్న రోజుల్లో స్వప్రయోజనం కోసం భూస్వాములను శక్తి వంతం చేసి కౌలుదార్ల నుండి భాటకాన్ని అవసర మయితే వారి పంటలను స్వాధీనం చేసుకోవడం వంటి తీవ్ర చర్యల ద్వారానైనా రాబట్టుకొనేందుకు ప్రయత్నించారు. కాల క్రమంలో భాటకం ఇచ్చే ఆస్తులు పెరిగి ఉప భూస్వామికరణ వల్ల ప్రభుత్వానికి శిస్తు చెల్లించే భూస్వామికి, భూమి సాగుచేసే కౌలుదారుతో ప్రత్యక్ష సంబంధం తెగిపోయింది. అయినా బ్రిటిష్‌పాలకులు భాటకం వసూళ్ళ గురించి ఏ మాత్రం ఆంధోళన చెందలేదు. వ్యవసాయ సంబంధాలను అప్పటికే రకరకాల తగాదా కేసులతో సతమతమవుతున్న న్యాయస్థానాలకు అప్పగించడం జరిగింది. డిమాండు పెరిగిన కొద్దీ న్యాయ స్థానాల సంఖ్యను బహుముఖంగా పెంచడానికి బ్రిటిష్ వారు ఏ మాత్రం వెనుకాడ లేదు. కోర్టు ఫీజుల ద్వారా ప్రభుత్వానికి అధిక మొత్తంలో రాబడి సమకూరడమే ఇందుకు కారణం. శాశ్వత ఒప్పందాలతో భూమి శిస్తు పరిమితమయిన తర్వాత బ్రిటిష్ వారు న్యాయ స్థానాల దృష్టిలో ఇంకా పరిష్కారం కాని భూములపై పన్ను విధించడానికి ప్రయత్నించారు. సహజమైన రీతిలో వ్యాజ్యాలు వేసుకోవడం పెరిగి పోవడంతో చికాకులతో కూడుకున్న, దృఢతరమైన రెవెన్యూ మదింపు పద్ధతి కంటే ఈ ఏర్పాటు సులభం, సరళ తరం అని భావించారు. భాటక మిచ్చే ఆస్తులు ఎక్కువగా వున్న కొలది ఉపకౌలు విధానం, తద్వారా శక్తి యుక్తులుగల వ్యాజ్యగాండ్లకు అవకాశం దొరికింది. ఒక తరం తర్వాత మరొక తరంలో వరుసగా భూస్వాముల కుటుంబాలే విచ్ఛిన్నం అవడంతో, హక్కులు కూడా విభజింపబడినాయి. దీని వల్ల తగాదాలు అనివార్యమైనాయి. తరచుగా కౌలుదార్లు తాము చెల్లించే భాటకంలో చిన్న చిన్న మొత్తాలను వేరువేరు భూస్వామ్య కుటుంబాలకు చెందిన తాబేదార్లకు చెల్లించవలసి వచ్చేవి. ఎస్టేటు నిర్వాహకుల అసమర్థత , ఈ ప్రాంతాల శాశ్వత

---

[1] ఆంగ్లంలో పర్మినెంట్ సెటిల్‌మెంట్ అనే పదానికి శాశ్విత శిస్తు నిర్ధారణ సమీప అర్థం. దీనిలో భూహక్కుల ధృవీకరణ కూడా అభిన్నమైన భాగంగా గుర్తించాలి.

శిస్తు పద్ధతి లేకపోవడం వల్ల భూమిని సక్రమంగా సర్వే చేయడం అరుదే, చాలా మంది భూస్వాములకు తమ కౌలుదార్ల కార్యకలాపాల గురించి ఏ రకమయిన అవగాహన లేదు. కౌలుదార్లు భూస్వాములకు విశ్వసనీయ సమాచారం ఇవ్వలేదు. అందుకే భాటకాలు వ్యవసాయోత్పత్తి విలువను పరోక్షంగా మాత్రమే పరిగణించి నిర్ణయించటం గమనించవచ్చు. చాలా మంది భూస్వాములు భాటకపు రేట్లను లెక్కచేయలేదు. వీరు అక్రమంగా రైతాంగంపై సెస్సు విధించడానికి సిద్ధపడినారు. కౌలుదార్లను బెదిరిస్తే చాలు భూమిని మళ్ళీ కొలువవచ్చు దాంతో వారి నుండి జరిమాన రూపంలో కొంత సొమ్ము వసూలు చేయవచ్చు.

వ్యక్తుల ప్రాబల్యాన్ని బట్టి, వారి వ్యక్తిగత స్థితిగతులను బట్టి వ్యవసాయ సంబంధాలు మార్పుకు లోనయినాయి. సమర్థుడైన భూస్వామి, అవిభాజ్యమైన ఎస్టేట్‌ను వారసత్వంగా పొంది, దానిపై కొంతైనా శ్రద్ధ కనబరుస్తున్నట్లయితే కౌలుదార్లను ఒత్తిడి చేయగలిగేవాడు. అనువస్థితి భూస్వామ్య కుటుంబం, తగాదాలు పడే వాటాదార్లు ఉన్న చోట ఇది సాధ్యమయ్యేదికాదు. ఇది వరకే చర్చించిన. జీవ సంబంధమైన నిరాయకాలు రైతాంగాన్ని భూస్వాములను కూడా ప్రభావితం చేయడం చూడవచ్చు. ఈ ఇద్దరి జంట సంక్లిష్టమైన తరహాను సృష్టించింది. భూస్వామి, కౌలుదార్ల మధ్య సంబంధాలకు ఒకే విధమైన నిబంధనలు తయారుచేయాలనుకున్న వారందరిని ఈ పరిస్థితి నిరాశ పరిచింది. వ్యక్తిగత కేసులను వాటి సంబంధిత సుగుణాలను బట్టి పరిశీలించిన న్యాయస్థానాలు ఇట్లాంటి సమస్యలను పరిష్కరించగల స్థాయిలో ఉన్నాయని భావించడం జరిగింది. న్యాయస్థానాలు సయితం తమ నిర్ణయాలను సాధారణ నియమాల ప్రకారం వెల్లడించటానికి సహాసం చేసినప్పుడల్లా ఇబ్బందిపడవలసి వచ్చేది. గ్రామీణ ప్రాంతాలలోని వాస్తవ పరిస్థితులతో సంబంధం లేకుండా, ముందే నిర్ణయించుకున్న ఉద్దేశాల ప్రకారం నడిపిన బహుళ ప్రాచుర్య పొందిన కొన్ని కేసులు అక్కడే ఆగిపోయిన సంగతిని కూడా చూడవచ్చు. ఈ పరిస్థితి న్యాయవాదుల స్వర్గసీమను సృషించింది. న్యాయవాది సాధారణ నియమాలను ఖాతరు చేయాల్సిన పని లేదు. తన క్లయింటు (వ్యాజ్యగాడు) సమస్యలే కావాలి. దీని వల్ల కేసుకు అనుకూలంగా ఏ వాదన నయినా వినిపించ వచ్చుననే సంప్రదాయం బలపడింది.

ఇలాంటి పరిస్థితిలో సంబంధిత సమస్యపై శాసనాలు చేయడం కష్టమైనపనే చాలా కాలం పాటు ఈ ఆలోచన నుంచి తప్పించుకోవడం జరిగింది. 1859లో బెంగాల్ ఒక చట్టం రూపొందించింది. క్రమంగా ఇది శాశ్వత ఒప్పందాలు గల ప్రాంతాలను కూడా దాటి విస్తరించింది. భాటకం రాబట్టుకోవడంలో వున్న కొన్ని ముఖ్యమైన సమస్యలను క్రమబద్ధం చేసేందుకు, కౌలుదార్లకు రక్షణ కల్పించేందుకు కొన్ని మౌలిక సూత్రాలను ఈ చట్టంలో పొందు పరచడం జరిగింది. ఈ రకమయిన రక్షణ కోసం రూపొందించిన విధానంలో పన్నెండు

(12) సంవత్సరాలు భూమి స్వాధీనంలో ఉన్న తర్వాత జిరాయితీ హక్కులు పొందే వ్రాత పూర్వకమైన రక్షణకు వీలుకల్పించారు. ఈ చట్టంలో సహజంగా తీవ్రమైన లొసుగులు ఉండటం వల్ల న్యాయస్థానాలు చాలా తొందరగానే వీటిని గుర్తించాయి. భూస్వాములు కౌలుదార్లను ఒక కమతం నుండి మరొక దానికి మార్చడం ద్వారా వారికి కలిగే వాస్తవమైన 'స్వాధీనపు హక్కుల' అవకాశాన్ని దూరం చేయడాన్ని ఈ చట్టం నిరోధించలేకపోయింది. భాటకం పెంపుదలకు సంబంధించి నిర్దుష్టమైన నిబంధనలను కూడా ఈ చట్టం రూపొందించలేదు. గ్రామీణ భారతంలో పరిస్థితులపై ఏ కొంత అవగాహన ఉన్న వారికయినా ఇక్కడ నిబంధనలు పని చేయవనే నిజం తెలిసినదే. ఒక వేళ చట్టం ఈ పని చేయగలిగితే అది ఒక అద్భుతమే అయ్యేది. అందువల్లనే ప్రధాన న్యాయమూర్తి సర్ బార్నెస్ పీకా . 1862లో తన ప్రఖ్యాత తీర్పుద్వారా ఈ చట్టానికి చరమగీతం పాడాడు. చట్టంలో భూస్వామి భాటకాన్ని పూర్తి మార్కెట్ విలువ స్థాయికి పెంచుకుంటూ పోవటాన్ని ఆపేందుకు ఎటాంటి ఏర్పాటు లేదని అభిప్రాయపడినాడు . మార్కెట్ విలువను మదింపు చేసేందుకు ఒక ప్రామాణికత లేనందువల్ల, భూస్వామి తన ఇష్టాను సారంగా భాటకాన్ని నిర్ణయించగలడు. కౌలుదార్లు ఆమేరకు చెల్లించడమో లేదా భూమిని వదులుకోవడమో తేల్చుకోవాలి అనేదే ఈ అభిప్రాయంలోని అంతర్లీనమైన విషయం. ఈ పరిస్థితిలో మార్కెట్ విలువ గురించి మాట్లాడటం ప్రమాదకరమై హాస్యోక్తిగా మారింది. బ్రిటన్‌కు చెందిన ఇండి తోటల యజమానులు భాటకం తక్కువగా తసూలు చేస్తు, ఇండిగో ఉత్పత్తిని తక్కువ ధరలకే తమకు విక్రయించాలని ఒప్పందాలు కుదుర్చుకోడానికి, న్యాయస్థానాలకు అంతు చిక్కని యుక్తిని ప్రదర్శించడం చూడవచ్చు. ఇలాంటి యజమానులకు పీకాక్ (peacock) అభిప్రాయం తమకు ప్రయోజనం చేకూర్చే విధానాలను ఆచరణలో పెట్టటానికి నిర్బంధమైన పద్ధతులనైనా అనుసరించటానికి అవకాశాన్నిచ్చింది. 1865లో కలకత్తా హైకోర్టుకు చెందిన 15 మంది న్యాయమూర్తుల పూర్తి ధర్మాసనం పీకాక్ తీర్పును మార్చటానికి ప్రయత్నించడం ప్రభుత్వానికి మింగుడుపడలేదు. వీరిలో ఒకడయిన జార్జికాంప్‌బెల్ కలకత్తాకు లెఫ్టినెంట్ గవర్నర్‌గా వచ్చిన తరువాత వారు గతంలో అనుకున్న పనిని అమలులో పెట్టాడు. భాటకం పెంపుదలకు సంబంధించి మరొక నిబంధనను ముందుకు తీసుకవచ్చాడు. స్థూల ఉత్పత్తి ఆధారంగా భాటకం నిర్ణయించాలని ఈ నిబంధనలో చేర్చారు. ఇది కూడా పని చేయలేకపోయినా కనీసం మార్కెట్ విలువ నిబంధనను తొలగించడానికి, పరిస్థితులు తిరిగి 1862కి ముందున్న స్థితికి చేరడానికి తోడ్పడింది. మరోసారి వ్యవసాయ సంబంధాలు మార్పుల వెలుగును చూడలేకపోయాయి.

స్థూల ఉత్పత్తి నిబంధన ప్రకారం కొంత కాల వ్యవధిలో వ్యవసాయోత్పత్తి విలువలో పెరుగుదల అనుపాతానికి, భాటకం పెంపుదలకు సంబంధం ఉండాలని తెల్పింది. భాటకం పెంచడానికి సంబందించి ఈ రూపంలో హేతుబద్ధమైన ప్రమాణాన్ని కనుగొనడానికి చేసిన ప్రయత్నం,. మార్కెట్ విలువ నిబంధన వలెనే గ్రామీణ వాస్తవ పరిస్థితుల 'దృష్ట్యా' నిష్ఫలమయింది. విలువ నిర్ధారణ సాపేక్షమయినది కనుక, నిబంధనలలో సరళత్వం ఉండాలని భావించడం జరిగింది. అయితే సరళత్వం దీనిని నిరుపయోగంగా మార్చింది. ఎందుకంటే ఈ సాపేక్ష అంచనాలకు అనుగుణంగా తమ ఏర్పాట్లను మార్చుకోవడానికి భూస్వామి, కౌలుదారు ఇద్దరూ అంగీకరించక పోవచ్చు. ఇలాంటి ఆలోచనలను రెవెన్యూ దృక్పథం గల ఉత్తర భారత దేశం పాలకుల ముందుంచడం జరిగింది. కలకత్తాలో న్యాయవాదిగా పని చేయటానికి ముందే కాంప్ బెల్ ఉత్తర భారత దేశంలో భాటకం, తత్సంబంధమైన వ్యవసాయ సంబంధాలలో మెరుగుదలకు ప్రయత్నించిన నిబంధనలను అమలుపరచి, భూస్వామి, కౌలుదార్లు దానికి అనుగుణంగా నడచుకునేట్లు చూడవలసిన రెవెన్యూ అధికారులు లేకపోవడంతో ఈ ప్రయత్నం అర్థ రహితంగా మారింది 1859 చట్టానికి 1869లో జరిగిన సవరణ భాటక సంబంధమైన కేసుల పరిధిని రెవెన్యూ అధికారుల నుండి సివిల్ కోర్టులకు బదలాయించటంతో ఇది మరింత ప్రస్ఫుటమయింది. రెవెన్యూ అధికారులు బెంగాల్‌లో భాటక ఒప్పందాలు నిర్వహించకపోయినా, తమ వద్దకు వచ్చే కేసులను ఏక మొత్తంగా పరిష్కరించటానికి, ఇందుకోసం స్థూల ఉత్పత్తి నిబంధన ఏ సివిల్ కోర్టులో సమీక్ష కోసం దాఖలా చేసుకోనంతవరకు, తిరుగు లేనిదిగా పనిచేసేది. సివిల్ కోర్టులు ఇలాంటి కేసులను వెంట వెంట పట్టించుకోవటం భూస్వాములకు కంటక ప్రాయమయింది. గతంలో రెవెన్యూ అధికారుల ముందు అనేక కేసులను ఒకేసారి ఏకమొత్తంగా పరిష్కరించుకోగలిగిన వీరు న్యాయస్థానాల ఎదుట ప్రతి ఒక్క కౌలు దారును వ్యక్తిగతంగా సవాలు చేయవలసి వచ్చింది. భూస్వాములు కొత్త చట్టం కోసం ఎదురుచూడడంలో ఆశ్చర్యం లేదు. ప్రభుత్వం వారి సమస్యపట్ల ఆసక్తి చూపకపోవడంతో అలాంటి చట్టమేది బయటకు రాలేదు.

ఇదే సమయంలో ప్రాదేశిక ప్రభుత్వాల అధికారిగా కాంప్‌బెల్ బెంగాల్‌కు తిరిగి వచ్చాడు. ఐర్లాండులో వ్యవసాయ సంబంధాలను అధ్యయనం చేసి పుస్తకాన్ని ప్రచురించిన ఇతను కౌలుదారీ రక్షణకు సంబందించి అనేక మార్గాలను సూచించడం అనంతర కాలంలో చట్ట సభలు వీటిని పరిశీలనకు తీసుకున్నాయి. గ్లాడ్‌స్టోన్ తన విధానాలకు సమర్ధనగా కాంప్‌బెల్ ఆలోచనలను ఉదహరించాడు. కౌలుదారీ రక్షణ విషయాలలో మంచి నిపుణుడయిన కాంప్ బెల్ సేవలను బెంగాల్ పొందగలగడం, కలకత్తాలో న్యాయవాదిగా స్థూల ఉత్పత్తి నిబంధన రూపకల్పనలో బెంగాల్ పాత్ర తెల్పినవాడవటం ప్రత్యేకతను కలుగ జేసింది. ఇతని పరిపాలనా

అనుభవం ఉత్తర భారత దేశంతో ముడిపడి ఉండటం వల్ల బెంగాల్ పాలనా యంత్రాంగపు అతి జాగు (జాప్యం) వ్యవహారాలను సహించలేకపోయాడు. సంస్కరణల అభిలాషతో తన కార్యక్రమాన్ని చేపట్టిన కాంప్‌బెల్ శాసనాలలో మార్పు చేర్పులకు ప్రయత్నించలేదు. భూస్వాములు కోరుకునే భాటక చట్టం ఎలాంటిదో తెలిసినా దాన్ని రూపొందించడానికి అతను అంగీకరించలేదు. శాసనాల ద్వారా కౌలుదార్లను రక్షించాల్సినంత తీవ్రమైన చర్యలకు అనువయిన సమయం ఇంకా రాలేదని అభిప్రాయ పడినాడు. దానికి బదులు భాటక వివరాలను అధికారంగా భూస్వాములపై రవాణా సుంకం విధించే తెలివైన విధానాన్ని అమలుపరిచాడు. దీనితో భూస్వాములు భాటక వివరాలను అధికారుల సమీక్షకు సిద్ధం చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. వారు కౌలుదార్లపై విధించిన రకరకాల అక్రమ విధింపులను క్రమబద్ధం చేసి ఒకే విధమయిన మరియు తాజా భాటకం రేటును చూపించడానికి ప్రయత్నించారు. భవిష్యత్తులో తమ హక్కులకు ఈ అంశాలనే ఆధారంగా తీసుకుంటారేమోననే భయంతో జాగ్రత్తపడినారు. ఈ పరిణామల సమాహారం, దక్కన్‌లో అలజడులకు దారి తీసిన పరిస్థితులను పోలి వున్నది. ప్రభుత్వం అనుసరించిన ఒక చర్య ఘర్షణకు తద్వారా రైతాంగం సంఘటిత మవడానికి దారి తీసింది. (patna) పాట్నా జిల్లాలో నూతన మార్పులకు భూస్వాములుపెల్లుబికిన అసంతృప్తి హింసాయుత సంఘటనలకు కారణమయింది. భూస్వాములతో జరుగుతున్న తమ పోరును సమర్థిస్తూ తోడు రాని రైతులపై తరచుగా ఈ హింసాత్మక దాడులు జరగడం ఆశ్చర్యం అన్పించక మానదు. రైతాంగ వ్యవసాయ పునాదులు గల గ్రామీణ ప్రాంతాలలో రైతులను సంఘటిత పరచడం, ఈ స్థితిని కొనసాగించడం కష్టతరమయినదే. బహుశా దీన్నంతా ముందే ఊహించినందు వల్లనేమో. కాంప్ బెల్ సమయస్ఫూర్తితో ఎలాంటి ప్రతి చర్యకు పూనుకోలేదు. రైతాంగం సంఘటితమవ్వడం, ఉద్యమించడం భూస్వాములకు గుణపాఠం నేర్పగలవని ఈయన భావించాడు. ఇతని తరువాత వచ్చిన రిచర్డ్ టెంపుల్ (Richard Temple) కూడా ఉత్తర భారత దేశంలోని పరిస్థితులతో సన్నిహిత సంబంధంగల అధికారి కావడంతో, టెంపుల్, కాంప్ బెల్ వలెనే బెంగాల్‌సంప్రదాయాన్ని వ్యతిరేకించాడు. భాటక చట్టాన్ని, కౌలుదారీ రక్షణను కలుపుతూ ఒక చట్టాన్ని తీసుకరావడానికి టెంపుల్ ప్రయత్నించాడు. ఇతని సూచన ప్రకారం రక్షిత కౌలుదార్లు, రక్షణ కౌలుదార్ల కంటే అనుకూలమయిన భాటకం చెల్లించాలి. అందుకే స్థూల ఉత్పత్తిలో రక్షిత కౌలుదార్లు, రక్షణ లేని కౌలుదార్లకంటె ఎక్కువ భాటకం చెల్లించాలి. అందుకే స్థూల ఉత్పత్తిలో రక్షిత కౌలుదార్లు 15 శాతం, ఇతరులు 20 శాతం భాటకంగా చెల్లించాలని నిర్ణయించాడు. ఇది కూడా ఉత్తర భారతంలోని భాటక నిర్ధారణ తరహాను పోలిఉన్నదని చెప్పవచ్చు. ఈ ప్రక్రియను బెంగాలులో పని చేయించడానికి ప్రయత్నిస్తుండగానే టెంపుల్ బెంగాల్ నుండి బొంబాయికి బదిలీ అయ్యాడు. అయినప్పటికి, కౌలుదారీ చట్టం

రూపకల్పన దిశగా ఇతని ఆలోచనలు ఒక ముందడుగుగా పేర్కొనవచ్చు. ప్రభుత్వం ఏర్పాటు చేసిన కమిషన్ భాటక చట్టానికి సంబంధించి మొత్తం సమస్యను కూలంకషంగా పరిశీలించి నివేదిక సమర్పించటానికి, నమూనా బిల్లును తయారుచేయడానికి సంసిద్ధతను తెల్పింది.

## 1885 బెంగాల్ కౌలుదారీ చట్టం పరిణామక్రమం

భాటకచట్టాన్ని సమీక్షించేందుకు నియమించిన కమిషన్ తన నివేదికను 1880లో సమర్పించింది. 5 సంవత్సరాల తర్వాత రూపొందిన కౌలుదారీ చట్టం కమిషన్ సూచించిన తరహా చట్టానికి పూర్తి భిన్నంగా ఉంటుంది. తదనంతరం చర్చపై కమిషన్ సూచనలు ఎంతో ప్రభావాన్ని చూపాయి. భూస్వామికి, భూమి స్వాధీనంలో ఉన్న రైతుకు మధ్యస్తంగా ఉన్నవానిని కౌలుదారుగా నిర్వచనం ఇవ్వడం కమిషన్ అభిప్రాయాలలో ప్రధానమైనదిగా చెప్పవచ్చు. ఉప-భూస్వామ్య పరిస్థితులు బెంగాల్ లో విస్తరించడం వల్ల రెవెన్యూ చెల్లించే భూస్వాముల తరువాతి స్థానంలో ఉన్న రక్షణ వాస్తవంగా భూమిని స్వాధీనంలో ఉంచుకున్న కౌలుదార్లకు మాత్రమే కల్పించే రక్షణ వాస్తవంగా భూమిని సాగు చేసే రైతుకు చేరడం సాధ్యమయ్యేది కాదు. భూమిని జిరాయితీ హక్కు క్రింద పొందిన రైతులు కూడా స్వయంగా సాగుచేయక ఉప-కౌలుకు ఇచ్చే పద్ధతి కూడా బెంగాల్‌లో కన్పించేది. ఉప కౌలుకిచ్చే సంప్రదాయాన్ని నిరోధించేందుకు కమిషన్ భూమి సాగు చేసే రైతుకు భాటకం చెల్లించిన తర్వాత లాభం అంటూ ఏదీ మిగలకుండా గరిష్ఠ భాటకం రేటును ప్రవేశపెట్టింది. భాటకం రేట్ల నిర్ధారణకు సంబంధించి కమిషన్ న్యాయమూర్తి ఫీల్డ్ (Field) రూపకల్పన చేసిన సిద్ధాంతీకరణను ఆధారంగా తీసుకున్నది. కమిషన్‌లో ప్రముఖ సభ్యుడయిన ఫీల్డ్, రికార్డో భాటక సిద్ధాంతాన్ని ఇందుకు అనుగుణంగా సులభతరం చేసాడు. ఇందులో మూలధనం మరియు వేతనాలకు సంబంధించిన ఆలోచనలు, భారతదేశ పరిస్థితులకు అనువైనవి కావని మొదట వాటిని తొలగించి, దీన్ని ధరలకు, భాటకానికి మధ్య సంబంధానికి పరిమితం చేసాడు. తరువాత భాటకం ధరలను ప్రభావితం చేయజాలదని, ధరల వల్లే భాటకం ప్రభావితమవుతుందని అందువల్ల భాటకాన్ని ధరల సూచీతో ముడి పెట్టాలని సూచించాడు.

భాటకచట్టాన్ని సమీక్షించటానికి ఏర్పాటయినపై కమిషన్ సూచనలు భూస్వాములకు ఏ మాత్రం సంతోషం కలిగించలేదు. ఈ కమీషన్ భాటకాన్ని రాబట్టుకొనే అంశంకంటే కౌలుదారీ రక్షణ పై శ్రద్ధ చూపడమే ఇందుకు కారణమని చెప్పవచ్చు. బెంగాల్ కొత్త లెఫ్టినెంట్ గవర్నరుగా వచ్చిన Ashley Eden కొత్త బిల్లును రూపొందించి, దానిలో భూస్వాములు, గతంలో వ్యక్తం చేసిన అభ్యంతరాలపైన దృష్టి సారిస్తాడని భావిస్తే, ఏకంగా కొంత విప్లవాత్మకమైన ప్రతిపాదనలే చేసాడు. అనేక రకాలుగా ఉన్న కౌలుదార్ల మధ్య తేడాను

గుర్తించటాన్ని వదిలివేసాడు. అందరిని స్వాదీన (జిరాయితీ)పు హక్కులను కౌలుదార్లుగా మాత్రమే నిర్ణయించదలిచాడు. కౌలుదార్ల నందరిని బదిలీ చేసే స్వేచ్ఛను మంజూరి చేసేందుకు నిర్ణయించాడు. ఇది భూస్వాములు భాటకం బకాయిలను నిర్బంధమైన అమ్మకాల ద్వారానైనా రాబట్టుకొనే అవకాశాన్నిస్తుంద. 'భాటక నిర్ధారణకు సంబంధించినంతవరకు మనస్ఫూర్తిగా గరిష్ఠ భాటకం పధకాన్ని అనుసరించాడు. ఈ పథకాన్ని సమర్థవంతంగా అమలు చేసేందుకు వీలుగా రెవెన్యూ అధికారులు ప్రతి జిల్లాకు సంబందించిన భాటకం రేట్ల పట్టికలను ప్రచురించాలని, ఎప్పటికప్పుడు ధరలతో ఏర్పడే పెరుగుదల బట్టి వీటిని మార్పుచేయాలని సూచించాడు.

ఎడన్ సూచించిన పథకం ప్రభుత్వం మరికొంత సాహసవంతమయిన ప్రతిపాదన చేయడానికి పురికొల్పింది. ఈ ప్రతిపాదన ఎడన్ ఆలోచనల సారాంశమేనని చెప్పవచ్చు. కౌలుదార్లందరిని జిరాయితీ (స్వాధీన) హక్కులున్న వారిగా గుర్తించినప్పుడు, ఈ హక్కు భూసంబంధ మైనదిగా చేసినట్లయితే భాటకం రేట్ల పట్టికలను తయారుచేసే రెవెన్యూ అధికారులే ఉత్తర భారత దేశం తరహాలో క్రమమైన ఒప్పందాలు ఏర్పరచగలుగుతారు. లార్డ్ రిప్పన్ ఈ ప్రతిపాదనను బలపరిచినప్పటికి, రాజ్య కార్యదర్శి (sec-of state) వ్యతిరేకించాడు. భారత కార్యదర్శుల మండలి సభ్యుడయిన తరువాత ఎడన్ కూడా తన ఆలోచనలపై ఆధారపడి రూపొందిన విప్లవాత్మక నిర్ణయాలను వ్యతిరేకించాడు. భారతీయ మండలిలో మరో సభ్యుడయిన హెన్రీమోయిన్ (Henry Maine) లిఖిత పూర్వకమైన హక్కుల గురించి ఆసక్తి కనబరచి ప్రభుత్వ పథాకానికి ఏరకంగానూ అనుకూలంగా స్పందించ లేదు. రిప్పన్ పథకం ఓటమి పాలయింది. శాసనపరమయిన ప్రతిపాదనల రంగుల రాట్నం మళ్ళీ కదలడం మొదలయింది.

ఈ ప్రతిపాదన వీడి పోవటం బెంగాల్‌కు చెందిన భూస్వాములకు సంతోషకరమైన విషయమయింది. తమ స్వంత ఆధీనంలో వున్న, కౌలుదార్ల కిచ్చిన భూమిని వేరు వేరుగా గుర్తించడం కష్టమని వీరి ఉద్దేశ్యం. ఉత్తర భారత దేశంలో భాటకం రేట్లు భూస్వాములకు అనుకూలంగా మదింపు చేయటం వల్ల, రెవెన్యూ అధికారులు ఆ వివరాలను నమోదు చేయగలిగారు. ఫలితంగా స్వంత దారు మరియు కౌలుదారు మధ్య గల కమతపు పరిధి తేలికగా గుర్తించగలిగారు. బెంగాల్‌లో ఈ రకమయిన విభజన అవసరమేలేదు. ఎందుకంటే ఇక్కడ మొత్తం భూమి అంతా కౌలుదార్ల అనుభవంలోనే ఉండటం చూడవచ్చు. ప్రభుత్వం తప్పని సరి పరిస్థితులలో పన్నెండు సంవత్సరాలు భూమి స్వాధీనంలో ఉన్నప్పుడే నిబంధనను మరోసారి తలకెత్తుకున్నది. అయితే జిరాయితీ హక్కులు కేవలం కౌలుదారు పరంగా కంటే భూమి సంబంధంగా నిర్ణయించే ప్రతి స్పందనను మాత్రమే కొనసాగించింది. కొత్త బిల్లు

భూస్వామి, స్వాధీనపు హక్కులు గల కౌలుదారు నుండి భూమిని కొనగలిగే అవకాశాన్ని కల్పించింది. అయితే మళ్ళీ భూమిని ఏ కౌలుదారు కిచ్చినా స్వాధీనపు హక్కులు వాటంతట అవే అమలులోకి వస్తాయి. కొత్త కౌలుదారు వెంటనే ఈ ఫలితాన్ని పొందగలుగుతాడు. ఈ విధంగా నూతన జిరాయితీ స్వాధీనపు హక్కులు భూమికి సంక్రమింప జేయబడినాయి.

1883లో గవర్నర్ జనరల్ యొక్క శాసన మండలిలో మొత్తం మీద బిల్లు ప్రవేశపెట్టబడింది. ఆఖరుకు రంగులరాట్నం నిలిచిపోయినట్లుగా కన్పించింది. బిల్లులో ఏదో ఒక దశలో చేరిన వివిధ ప్రతిపాదనలలో కొన్నింటిని వదిలివేసి చాలా వాటిని కొనసాగించారు. పన్నెండు సంవత్సరాల నిబంధన, నూతన స్వాధీన హక్కు, గరిష్ఠ భాటకం రేటు మరియు ఈ రేట్లను ప్రమురించడం (జిరాయితి) వంటి ప్రధాన అంశాలన్ని ఈ బిల్లులో చోటుచేసుకున్నాయి. ప్రభుత్వం భూస్వామి ఎస్టేటుకు భాటక నిర్ధారణకు రెవెన్యూ యంత్రాంగానికి అధికారం ఇచ్చే విషయాన్ని బిల్లులో చేర్చింది. తుది చట్టం పదవ అధ్యాయంలో చేర్చబడిన ఈ అంశం మొత్తం బిల్లుకే ప్రాధాన్యతను తెచ్చి పెట్టింది. ప్రవేశపెట్టిన ఈ బిల్లును దురదృష్టం వెంటాడింది. ఈ బిల్లుకు మూలస్తంభాలయిన అంశాలలో రెండింటిని పోగొట్టుకోవడం జరిగింది. భాటకం రేట్ల పట్టికలను తయారు చేయడానికి గల అవకాశాలను పరిశీలించటానికి నియమించబడిన నిజ నిర్ధారణ కమిటీ పూర్తిగా ప్రతికూలమయిన నిర్ణయంతో వెనక్కి వచ్చింది. మరోవైపు కార్యదర్శి నూతన జిరాయితీ హక్కుల ప్రతిపాదనను వ్యతిరేకించాడు. ఈ బిల్లును సమీక్షించేందుకు మరోకమిటి ఏర్పాటయింది. ఈ కమిటీ నూతన జిరాయితి హక్కును వదిలివేసింది. భాటకం రేట్ల పట్టికలను మరో అధ్యాయానికి బదలాయించింది, ఆ తరువాత జరిగిన చర్చల్లో ఈ ప్రతిపాదనను కూడా వదిలించుకున్నారు. రేట్ల పట్టికలను తయారు చేయడం వదిలివేయడంతో గరిష్ఠ భాటకం రేటు నిర్ధారణకు కూడా కమిటీ మొత్తంగా తిలోదకాలిచ్చింది. ఉప-కౌలు విధానాన్ని నిరోధించేందుకు రూపొందించిన గరిష్ఠ భాటకం రేటును రద్దు పరచడంతో ప్రత్యామ్నాయ పద్ధతులను గురించి ఆలోచించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఒక కౌలుదారు తన దగ్గర ఉన్న భూమిలో సగానికి పైగా ఉపకౌలుకు ఇచ్చినట్లయితే అలాంటి ఉప కౌలుదార్లు కూడా జిరాయితీ హక్కులు పొందే వీలు కల్పించడం ద్వారా ఉపకౌలు విధానాన్ని నిరోధించవచ్చుననే అభిప్రాయం ఏర్పడింది. ఉత్తర భారతదేశంలో అనుసరించే కొన్ని లక్షణాలకు సంబంధించి ఇది వరలో చేసిన ప్రతిపాదనలయిన రెవెన్యూ అధికారులు భాటకాన్ని నిర్దేశించడం, తగాదాలను పరిష్కరించాల్సి ఏ సందర్భంలోనయినా, ఎక్కడయినా హక్కుల రికార్డులు తయారుగా వుండడం వంటివి సంక్షిప్తీకరిస్తూ పదవ అధ్యాయాన్ని ఆ కమిటీ సృష్టించింది. ఈ అధ్యాయం, తదనంతర చర్చలతో వదిలివేసిన భాటకపు రేట్లను గురించి ప్రస్తావించిన పదకొండవ అధ్యాయం కంటె ప్రాముఖ్యతను సంతరించుకున్నది.

బిల్లులో పొందుపరిచిన భాటకం రేట్ల నిర్ధారణకు ఒక ప్రమాణం అంటూ ఏదీ లేదనే విషయాన్ని నిశిత పరిశీలన తెల్పుతుంది. గరిష్ఠ రేటు విధించి ఆలోచనను వదులుకున్నప్పటికీ భాటకం రేట్ల పట్టికలను అప్పటికింకా బిల్లులోనే ఉంచినందువల్ల ఈ వాస్తవాన్ని కమిటీ సభ్యులు గుర్తించలేదు. భాటకం నిర్ధారణ క్రమాన్ని గురించి నొక్కి చెబుతూనే, ఆచరణలో మాత్రం ఇందుకు సంబంధించి ఒక నిర్దుష్ట ప్రమాణాన్ని ఏర్పరచడాన్ని వదిలిపెట్టారు. ఇష్టాను సారంగా భాటకాన్ని నిర్ణయించేందుకు వీలుగా, ఒక ఆ చరణాత్మకమైన విధానాన్ని వదిలించుకునేందుకు మార్పులు ఉద్దేశించబడినాయని గుర్తించడం అసాధ్యమేం కాదు. 1865 లో హైకోర్టు నిర్ణయించినప్పటి నుండి భాటకం నిర్ధారణలో ప్రముఖ పాత్ర పోషించిన స్థూల ఉత్పత్తి నిబంధనను బాహాటంగా వ్యతిరేకించడం ఇందుకు ప్రబల నిదర్శనం ముందు నిర్ణయించబడిన భాటకం రేట్లు ఎక్కువగా ఉన్నాయా, తక్కువగా ఉన్నాయా ? ఏదైనా ఒక పద్ధతిని లేదా భూమికి డిమాండును బట్టి ఆచరించారా అనే అంశాన్ని పరిగణించకుండా ఒకే రకమయిన శాతంలో భాటకాన్ని నిర్ణయించి కొంత కాల వ్యవధిని నిశ్చయపరచి, ఆ కాలంలో ఒక్కసారి మాత్రమే భాటకం రేటును పెంచేందుకు వీలు కల్పిస్తూ భాటకాన్ని ఎప్పటికప్పుడు ఇష్టాను సారంగా పెంచే ప్రక్రియను పరిమితం చేయాలనేది చట్టచివ రి సంకల్పం. ఈ పద్ధతిని తక్కువ స్థాయిలో ఉన్న భూస్వాముల క్రింద వున్న కౌలుదార్లు ఇప్పటికి అత్యధిక రేటుతో భాటకాన్ని చెల్లిస్తున్నా, భూస్వాములు దానిని ఇంకా పెంచినా నిరోధించే యంత్రాంగం లేకపోగా, దీన్ని సమర్థించే వర్గం కూడా ఉండడం ఆశ్చర్యకరమే కాక, ఆందోళనకరమైనది కూడా. ఈ అస్తవ్యస్త పద్ధతుల మంచి చెడులపై విజ్ఞులు ఎంతో కాలంగా చర్చించిన, ఈ చర్చల నుండి ఆచరణాత్మకమైన ఫలితం వెలువడలేదు. భాటకం విలువ నిర్ణయించడానికి ఒక ప్రమాణాన్ని ఎంపిక చేయడంలో ఈ తర్జన భర్జనలు అసంపూర్తిగా మిగిలిపోయాయి.

బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్,. రివర్స్ థాంప్సన్ (Rivers Thompson) ఈ పరిణామాలపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేసాడు. ఆధునిక బ్రిటిష్ ఆర్థిక వేత్తల రచనల ఆధారంగా పైన చర్చించిన బిల్లును ప్రతిఘటించాడు. రికార్డో భాటక సిద్ధాంతాన్ని విమర్శిస్తూ బెంగాల్‌లో వున్న పరిస్థితులలో, భాటకం ఉత్పత్తి వ్యయాన్ని ప్రభావితం చేస్తుందని నిశ్చయంగా తెల్పాడు. స్థూల ఉత్పత్తి నిబంధనను, భాటకం రేట్ల పట్టికలతో చేయాలని సంకల్పించాడు. జిరాయితీ హక్కులు ఇవ్వకుండ కౌలుదార్లనందర్ని నిర్లక్ష్యం చేయడం పట్ల కూడా అయిష్టతను ప్రకటించాడు. కౌలుదార్లును భూమి నుండి కదిలించినట్లయితే వారికి నష్టపరిహారాన్ని ఇచ్చే పద్ధతిని పునరుద్ధరించాలని తెల్పాడు. ఇతని సూచన లేవి ఆమోదించబడలేదు. ఇతని ప్రతిఘటన కొనసాగుతుండగానే చట్టం బయటకి వచ్చింది. తుది ముసాయిదాని తయారు

చేసిన కమిటీ రేట్ల పట్టికలను తొలగించి భాటకాన్ని పెంచుకోడానికి అనుమతించే శాతాన్ని 12 1/2 % గా స్థిరపరిచింది. 15 సంవత్సరాల కాల వ్యవధిలో మళ్ళీ పెంపుదల జరగకూడదని నిర్ణయించింది. ఈ ప్రతిపాదన ఐరిష్ చట్టాన్ని పోలివున్నదని చెప్పవచ్చు. శాసనకర్తలకు భూమి స్వాధీనంలో గల రైతులకు రక్షణ కల్పించడం ప్రధాన లక్ష్యంగా మిగిలింది. ఇప్పుడు అతనిని 12 సంవత్సరాల అనంతరం ఒకే భూస్వామి వద్ద ఎంతకాలం ఉన్నా జిరాయితీ హక్కులు కొనసాగే విధంగా 'రక్షణ గల రైతుగా' గుర్తించారు. ఒక కమతం నుండి మరొక కమతానికి మార్చడం ద్వారా భూస్వామి కౌలుదారుకు వుండే హక్కును కాదనే అవకాశం లేదు. బదిలీ హక్కు-స్థానిక సంప్రదాయానికి వదిలి వేయడం జరిగింది. కమతాన్ని తమ స్వాధీనంలో వుంచుకునే 'మధ్యవర్తి' వద్ద పని చేసే కౌలుదార్లకు జిరాయితీ హక్కులు అట్లాగే కొనసాగించబడినాయి. ఇలాంటి మధ్యవర్తులకు కూడా తగిన ప్రాధాన్యత కల్పించబడింది. శాశ్వత హక్కులుగల రైతుల క్రింద భూమి సాగు చేసే కౌలుదార్లు ఏ హక్కులు లేని కౌలుదార్లు **(tenants-at-will)** గా మిగిలారు. ఈ విధంగా రైతాంగాన్ని ఒక పద్ధతి ప్రకారం వర్గీకరించడం జరిగింది. ఈ చట్టం అమలులోకి వచ్చిన పన్నెండు సంవత్సరాల కాలంలోనైనా భూమిపై స్థిరపడిన రైతులు తమ పరిస్థితిని పదిలపరచుకోని యుండవచ్చు. జనాభా పెరుగుదల వల్ల భూమిపై ఏర్పడే ఒత్తిడి వీరి భూముల విలువను మరింత పెంచుతుంది, కౌలుదార్లుగా, పంట భూస్వాములుగా లేదా వ్యవసాయకూలీలుగా తమ వద్దకు వచ్చే వారిని దోపిడి చేయగల అవకాశాలు కూడా పెరుగుతాయి. వడ్డీ వ్యాపారుల చేతుల్లోకి పోని ఈ రైతులకు మాంద్య పరిస్థితులు ఏర్పడే వరకు దాదాపు నిరంతరాయంగా పెరుగుతున్న ధరల వల్ల లబ్ధి చేకూరగల అవకాశ ఉన్నాయి. భూస్వాములు ప్రతి సవత్సరం ఒక శాతం కంటె తక్కువగా భాటకం పెంచుతారు కనుక ఈ అవకాశం లభిస్తుంది. 1885 లోని ఎం తక్కువ భాటకం రేటుతో ప్రారంభమయినట్లయితే ఈ పెరుగుదల ధరల పెరుగుదల ముందు అసలు లెక్కలోనిదే కాదు. చట్టం వల్ల కలిగే ఈ ప్రభావాన్ని ముందుగానే **(justice field)** ఫీల్డ్ ఊహించాడు. అందువల్లనే చట్టం ఉప-కౌలుదార్లకు ఎలాంటి రక్షణ కల్పించలేకపోతున్నదని, వాస్తవంగా భూమిని సాగుచేసే వానికి సహాయపడటానికి బదులుగా సర్వాధికారంగల మధ్యవర్తులనే ఒక దానిని సృష్టించిందని తీవ్రంగా విమర్శించాడు. అయితే ఈ చట్టాన్ని సమర్థించేవారు మాత్రం ఈ స్థాయి రక్షణ చాలునని, క్రింది స్థాయిలో వుండే వారి కిచ్చే రక్షణను తరువాతి తరం చూసుకుంటుందని వాదించారు.

ఈ చట్టం అమలులోకి వచ్చిన తరువాత సంవత్సరాలు భారత దేశ వ్యవసాయ రంగానికి మంచి రోజులనే చెప్పవచ్చు. విమర్శకుల అంచనాలకు విరుద్ధంగా ఎలాంటి చట్టపరమైన తగాదాలు గాని ఆందోళనలుగాని చెలరేగ లేదు. క్రమంగా ఈ చట్టం ఆదర్శ ప్రాయమైనదిగా

గుర్తించబడ్డింది, ఇతర ప్రాదేశిక ప్రాంతాలు తమ శాసనపరమయిన చర్యలకు దీనిని ఆధారంగా తీసుకున్నారు. ఈ చట్టం రావడంతో బెంగాల్‌లో ప్రధాన రాజకీయ పక్షాలయిన భూస్వాముల పక్షం వహించే బ్రిటిష్ ఇండియా సంఘానికి రైతాంగం జిరాయితీ హక్కుల కోసం విప్లవించే భారతీయ సంఘాని (association) కి మధ్యగల తీవ్రవైరుధ్యం కొంత సమసిపోయింది. మధ్య తరగతికి చెందిన చాలా మంది జాతీయవాదులు, జిరాయితీ హక్కుగల రైతాంగ వర్గానికి చెందిన వారే వీరంతా కావడం యాదృచ్ఛికమేం కాదు. అయితే ఈ చట్టం ఇరువర్గాలను సంతృప్తి పరచలేకపోయింది. వీరు పరస్పరం చేతులు కలుపుకోవడం అంటే కలిసి పనిచేయడం చాలా స్పష్టంగా చూడవచ్చు. 1886లో జాతీయ కాంగ్రెస్ ఏర్పాటుకు ఇండియన్ అసోసియేషన్ నిర్వర్తించిన ప్రాథమిక వ్యవహారాలన్ని బ్రిటిష్ ఇండియా అసోషియేషన్ కార్యాలయంలోనే జరగడం, ధనవంతులయిన ఈ అసోసియేషన్ సభ్యులు ఉదారంగా కాంగ్రెస్‌కు నిధులందించడం ఇందుకు ప్రబల సాక్ష్యాలు కౌలుదారీ చట్టం రూపకల్పనలో తలెత్తిన సమస్యల సందర్భంలో పుట్టుకొచ్చి, లండన్‌లో స్వేచ్ఛ మరియు ఆస్తుల పరిరక్షణ గురించి తీవ్రంగా ప్రచారం చేసిన భారతీయ సంఘం పరిస్థితులు చల్లబడగానే తెరమరుగయింది. ఆశ్చర్యకరంగా న్యాయవాదుల ప్రతీకారం చట్టాన్ని ప్రభావితం చేయలేకపోయింది. హౌస్ ఆఫ్ కామన్స్‌లో పార్లమెంటు సభ్యుడయిన జార్జి కాంప్‌బెల్, ప్రధాన న్యాయమూర్తి రిచర్డ్‌గాత్ తీక్షణమైన దాడిని ప్రశ్నించడం కూడా గమనించవచ్చు. ఈ చట్టం కొంత కాలం పాటు సాఫీగా పని చేయడంలో హైకోర్టు నిర్ణయాలు ఏరకంగాను ఆటంకం కలిగించ లేకపోయాయి.

చట్టం ఏ అడ్డంకు లేకుండా ప్రశాంతంగా క్రమంగా కొనసాగటానికి, ఇందులో పొందుపరచిన నిర్హేతుకమయిన నిబంధనలు, ఇతరులకు ఆధారం కావడం ఒక కారణంగా చెప్పవచ్చు. చట్టం యొక్క ఆశయాలను బలపరిచే పాలన పరమైన చర్యలు తీసుకోవడానికి అవసరమైన సాధనాలను ప్రభుత్వానికి కలుగజేసినా, వీటిని, ఉద్దేశ పూర్వకంగానే నిర్లక్ష్యం చేయడం జరిగింది. చట్టంలోని పదవ అధ్యాయంలో పొందుపరచబడిన రెవెన్యూ అధికారుల ద్వారా భాటక నిర్ధారణ జరగాలని తెల్పిన ప్రతిపాదనలు యంత్రాంగం పాలనా పరమయిన చర్యలు చేపట్టడానికి తగిన గొప్ప అవకాశం కల్పించాయి అయినా ఈ ప్రతిపాదనలు భూస్వామి మరియు కౌలుదారు మధ్య జోక్యం చేసుకొనేందుకు అంగీకరించలేదు. పైగా ఈ ఏర్పాటు తగాదాలను ఉద్దేశించబడినవి మాత్రమే, రెవెన్యూ అధికారులు తయారుచేసిన హక్కుల నమోదు పత్రాలు ( రికార్డులు) నిరంతరాయంగా నిర్వహించేందుకు తద్వారా భాటక నిర్ధారణ చేసేందుకు, భూస్వాముల ప్రైవేటు సేవకులుగా మారిన గ్రామస్థాయి అధికారుల స్థానాన్ని పునః ప్రతిష్టించవలసిన అవసరం ఏర్పడింది. అందువల్లనే, ఆంథోనీ మక్‌డోనెల్ (Macdonnel) పట్వారీల మరియు కొనుగోలు బిల్లును కౌలుదారీ చట్టానికి అనుబంధ

ప్రక్రియగా ప్రతిపాదించాడు. ఆంథోని చౌరవ కార్యదర్శి వీటో చేయడంతో అర్ధాంతరంగా ఆగిపోవల్సివచ్చింది. కౌలుదారీ చట్టం వల్ల ఎదురయిన కఠిన పరిస్థితులను దిగమింగుకొని ఇప్పుడిప్పుడే అలవాటుపడుతున్న భూస్వాములు భాటకం రేట్ల రికార్డులను బహిర్గతం చేసేందుకు ఒత్తిడి చేయడమేగాక గ్రామస్థాయి అధికారులను పోషించాల్సిన అదనపు భారం కూడా పడవేసే ఈ చర్య వల్ల ఎంతగా వ్యతిరేకతను ప్రదర్శిస్తారోనని భయాందోళనలు వ్యక్తం చేసాడు. మక్‌డోనెల్ ప్రతిపాదన వీగిపోవడంతో పాటు, ఆ తరువాత కాలంలో అన్ని జిల్లాలో భూమి సర్వేకు, భాటక నిర్ధారణకు ప్రధాన ఆధారంగా నిలచిన పదవ అధ్యాయాన్ని, చట్టం ఆమోదించబడిన అనంతర మొదటి పది సంవత్సరాల కాలంలో అతి అరుదుగా ఆచరణలో పెట్టడం గమనించదగిన అంశం. చట్టం ఎప్పుడైతే వాస్తవ ఆచరణలోకి వచ్చిందో దీనిలో తీవ్రమైన లొసుగులు వున్నట్లుగా వెల్లడయింది. ఇందులో ఉన్న ప్రతిపాదనలలో భాటకం నిర్ధారణ చేసే రెవెన్యూ అధికారి సంబంధిత వ్యక్తులనుంచి ఎలాంటి ఆక్షేపణ ఎదురుకానంత వరకు తన సహజ రీతిలో ఈ నిర్ధారణ ఏక మొత్తంగా చేయవచ్చునని అట్లాంటి పరిస్థితి ఎదురయినపుడు మాత్రం ప్రతి వ్యక్తిగత సమస్యను ప్రత్యేకంగా ఒక న్యాయ వాదిలాగా విచారించాల్సి వుంటుందని వీటిని (pc continual procedure code) ఆధారం చేసుకొని పరిష్కరించాలని సూచించడం జరిగింది. అధికారులు విధినిర్వాహణలో పౌర చట్టాలలోని నిబంధనలను ఖచ్చితంగా పాటించకపోయినా ప్రభుత్వం ఎంత మాత్రం పట్టించుకోవటం లేదని భూస్వాములు తరచుగా చేసే ఫిర్యాదులకు ఈరాయితీ ఒక 'నజరాన' గా భావించవచ్చు. ఈ రాయితీ ప్రమాదకరమైందని ఆ తరువాత నిరూపించబడింది. రెవెన్యూ అధికారి ఏకమొత్తంగా చేసే వ్యవహారానికి ఇది అడ్డుపడటమే గాక,రెవెన్యూ అధికార యంత్రాంగం తో గల సాధారణ సంబంధం ద్వారా పరిస్థితులను శాసించగల అవకాశానికి కూడా అవరోధంగా నిలిచింది. న్యాయపరయిన హోద్దాను ఉపయోగించేటప్పుడు ఈ అధికారి ఏ ఆదేశాలకు లోబడాల్సిన పనిలేదు. అయితే ఇతని న్యాయసంబంధమయిన నిర్ణయాలను సివిల్ కోర్టులు ఎంతవరకు గౌరవింపబడతాయో చెప్పడం కష్టం. ఇలాంటి కేసులను సరియైన రీతిలో చేసిన అభ్యర్థన గా స్వీకరిస్తాయో లేక రెవెన్యూ అధికారి నిర్ణయాలను ఏమాత్రం ఖాతరు చేయకుండా కేసును తిరగదోడుతాయో చెప్పలేం. చట్టంలో పదవ అధ్యాయం బెంగాల్ ప్రెసిడెన్సీలో శాశ్వత ఒప్పందాలు జరగని ప్రాంతాలకు కూడా రెవెన్యూ వ్యవహారాలలో ఉపయోగపడుతుందని, తద్వారా ఈ వ్యవహారాలు సివిల్ కోర్టుల అంతిమ పరిధిలోకి వస్తాయనే అంశాన్ని శాసన కర్తలు విస్మరించడంతో పరిస్థితులు దారుణంగా తయారయ్యాయి. న్యాయస్థానాల వినాశకరమైన నిర్ణయాలు పదవ అధ్యాయాన్ని తొందరగానే ఆచరణకు పనికి రాకుండా నిర్వీర్యం చేసాయి. రెవెన్యూ అధికారి భూస్వామి, కౌలుదారు మధ్య ఏర్పడే తగాదాలను పరిష్కరించాలే తప్ప

'భూస్వాముల మధ్య' లేదా 'కౌలు దార్లమధ్య' ఉత్పన్న మయ్యే సమస్యతోగాని, భాటకం చెల్లించనవసరం లేని కౌలుదార్లతో గాని ఇతనికి ఎలాంటి సంబంధంలేదని న్యాయస్థానం విశదపరిచింది. ఈ పరిస్థితిని సర్దుబాటు చేయటానికి ల్ఫ్టినెంట్ గవర్నర్లు ఈలియట్ (Charles Elliott) మరియు 'మెకెంజీ' (Alexander Mackenzie) చట్టానికి సవరణలను ప్రతిపాదించాల్సి వచ్చింది. 1896లో చేసిన ఈ సవరణ మరోసారి రెవెన్యూ అధికారిని CP సంకెళ్ళ నుండి విముక్తం చేసింది. ఇతను తయారు చేసే హక్కుల రికార్డులు ముందస్తు సమాచారాన్ని ఇచ్చేవే తప్ప అంతిమ నిర్ణయానికి తోడ్పడే సాక్ష్యాలు కానందువల్ల, వీటిని సంక్షిప్త వ్యవహారం ద్వారా క్లుప్తంగా మరియు పూర్తిగా పాలనా సంబంధమైన చర్యగా తయారుచేసేవాడు. ఇతను తయారుచేసిన హక్కుల రికార్డులను సివిల్ కోర్టులలో సవాలు చేయగలిగినప్పటికీ, భాటకం మదింపు గురించి చేసే నిర్ణయాలు మాత్రం వీటి పరిధిలోకి తేవడానికి వీలులేదు. 1885 చట్టంలో భాటకాన్ని పెంచటానికి అనుసరించాల్సిన పద్ధతిలో ఉన్న సందిగ్ధ నుపై సవరణ ద్వారా రెవెన్యూ అధికారుల అధికారాన్ని పునరుద్ధరించడం భూస్వాములకు వెసులు బాటు నిచ్చింది. భూస్వామికి తెలిసినదానికంటె ఎక్కువ భూమి కలిగి ఉండే కౌలుదారుపై హెచ్చు భాటకం విధించే సరళిని సులభతరం చేయడం జరిగింది. అమలులో వున్న భాటకం రేటును ఆ గ్రామంలో, పొరుగు గ్రామాల్లో అత్యధిక ఎకరాలకు చెల్లించే అతి ఎక్కువ రేటును బట్టి నిర్ణయించాలని నిశ్చయించారు. దీని వలన భాటకం సంబంధిత కేసులకు విచారించే న్యాయ మూర్తులు ఒక ప్రమాణ పూర్వకమైన తీర్పును ఇవ్వడానికి అవకాశం ఏర్పడింది.

ఆ తరువాత సంవత్సరాలలో జిరాయితీ హక్కులు గల కమతాలను బదిలీ చేసుకొనే హక్కును గుర్తించడం ప్రధాన సమస్య అయింది. సంబంధిత అధికారులను ఇబ్బంది పాలు జేసింది. ప్రతిదాన్ని అప్పుడున్న ఆచారాలు, సంప్రదాయాలకు వదిలివేయడం వల్ల చట్టం ఇందుకు సంబంధించిన తగు అంశాలను పొందుపరచలేదు. భూస్వామి చెల్లించాల్సిన రుసుము క్రింద భారీ మొత్తంలో డబ్బు ( ద్రవ్యాన్ని) ను రిజిస్ట్రేషన్ అధికారులకు చెల్లించవలసి వచ్చింది. చాలా మంది భూస్వాములు ఈ వ్యవహారాన్ని అంగీకరించలేదు. ఈ స్థితిని ఎదుర్కోవడం కోసం ఉపయుక్తమైన సవరణను ఒకదానిని తీసుకవచ్చారు. కౌలుదారీ చట్టంలోని పదవ అధ్యాయం లోని అంశాల అధారంగా నిర్వహించిన ఒప్పందం వ్యవహారాల ద్వారా వచ్చిన సరికొత్త సమాచారాన్ని బట్టి కొద్ది సంవత్సరాలలో మరికొంత విస్పష్టమైన సవరణ చేయవలసి వచ్చింది.

జమిందారీ పద్ధతి అమలులో వున్న ప్రాంతాలలో సర్వే మరియు ఒప్పందపు వ్యవహారాలు నిర్వహించడం బెంగాల్ అధికారగణానికి కొత్త అనుభవాలను నేర్పింది. ముఖ్యంగా బీహార్‌లో వీటిపై అధికారులు తమ సమయాన్ని కృషిని అధికంగానే వెచ్చించడం జరిగింది. 1905 నాటికల్లా బీహార్‌లోని చాలా జిల్లాల్లో ఈ కార్యక్రమాలను పూర్తి చేయడం జరిగింది.

ఈ కృషి ఫలితాల భవిష్యత్తు అంతుచిక్కక పోవడం ఆందోళన కలిగించింది. సివిల్ కోర్టులు హక్కుల రికార్డులను పరిగణలోకి తీసుకోలేదు. ఒప్పందపు వ్యవహారాలను నిర్దేశించే నిబంధనలలో పొందుపరచబడిన నివారణ సూచనలను ఉపయోగించుకోకుండా భూస్వాములు రెవెన్యూ అధికారి తన పనిని పూర్తి చేయగానే, భాటకం బకాయిలను బూటకంగా సృష్టించటం ద్వారా కౌలుదార్లపై దావా వేయడానికి సివిల్ కోర్టులకు పరుగెత్తడం తరచుగా జరిగాయి. అన్నిరకాలుగా అవకాశాలున్న భూస్వాములు న్యాయస్థానాలకు నమ్మకం కల్గించాల్సి నప్పుడల్లా ఈ పద్ధతిని విజయవంతంగా ఉపయోగించేవారు. రెవెన్యూ అధికారిని అసమర్థునిగా నిరూపించగలిగేవారు. తనకు అనుకూలంగా భాటకం రేట్లను నమోదు చేసినంతకాలమే వీరు రెవెన్యూ అధికారి సేవలను ఉపయోగించుకునేవారు. ఏమాత్రం తేడా వచ్చినా న్యాయస్థానాలను ఆశ్రయించేవారు. న్యాయస్థానాలు రెవెన్యూ అధికారి సుదీర్ఘ కృషిని ఎంత మాత్రం గుర్తించేవి కావు. అర్హులైన అధికారుల ముందు ఇరువర్గాలు ఒక అంగీకారానికి రావడం ద్వారా భాటకాన్ని పెంచేందుకు ఉద్దేశించబడిన నిర్ణీత పద్ధతిని కూడా మార్చుకొనే అవకాశం రెవెన్యూ అధికారిని మరింత వ్యథకు గురిచేసింది. భయాందోళనలకు గురయిన కౌలుదారు, శక్తివంతుడయిన భూస్వామితో కుదుర్చుకునే 'అవగాహన' (Compromise) చట్ట విరుద్ధమైన ఏదయినా రికార్డు (నమోదు) చేయవలసి వచ్చేది. రెవెన్యూ అధికారులు ఇబ్బందులకు గురి అవుతున్న తరుణంలోనే భాటకాన్ని రాబట్టుకోవడానికి భూస్వాముల సరికొత్త నివేదనలు చోటుచేసుకున్నాయి. దీనితో భూస్వాములకు రాయితీలు, కౌలుదార్లకు మరింత సమర్థవంతమైన రక్షణకు ప్రతి పాదనలను జత చేస్తూ సవరణ బిల్లు తేవడానికి మంచి అవకాశాన్ని యిచ్చింది. 1906లో వెలువడిన ఈ బిల్లు భాటక సంబంధమైన తగాదాలలో హక్కుల రికార్డులను తప్పనిసరిగా న్యాయ స్థానాలలో దాఖలు పరచాలని, కౌలుదారీ చట్టానికి విరుద్ధంగా కుదిరిన ఒప్పందాలను న్యాయ స్థానాలుగాని, రెవెన్యూ అధికారులుగాని గుర్తించవద్దని స్పష్టం చేసింది. పైగా, భాటకం వసూళ్ళకు సంబంధించిన రశీదులను సక్రమంగా జారీ చేయని భూస్వాములపై జరిమాన విధించే అధికారాన్ని జిల్లా కలెక్టర్లకు అప్పగించడం కూడా జరిగింది. ఇదంతా రెవెన్యూ యంత్రాంగం అధికారాలను పెంచడానికి ఉద్దేశించబడినప్పటికీ, అదే యంత్రాంగం భూస్వాములకు పరిహారంగా ప్రత్యేక వరాలను కూడా ప్రసాదించింది. హక్కుల రికార్డుల్లో ఏ భూస్వామికి చెందిన భాటకపు రేట్లయితే సక్రమంగా నమోదు చేయబడతాయో అతడు తనకు రావలసిన బకాయిలను, ప్రభుత్వానికి మాత్రమే అందుబాటులో ఉండే (public demands recovery) చట్టం క్రింద రాబట్టు కునే ప్రత్యేక అవకాశం ఇవ్వబడింది. అయితే భూస్వాముల ప్రవర్తన సరళిలోని తేడాలను బట్టి అధికారులు విచక్షణా పూర్వకంగానే దీనిని అమలు చేసేవారు. చురుకైన బెంగాలీ రాజకీయ

నాయకులు అప్రమత్తం అయ్యారు. అధికారుల విచక్షణాయుత చర్యలు సహేతుకమయిన నిబంధనలకు లోబడి ఉండక పోవడం వల్ల వీటి ఆధారంగా భూస్వాములు జాతీయవాద రాజకీయాల్లో పాల్గొన కుండ ప్రభుత్వం నిరోధిస్తుందేమోనని ఆందోళన చెందారు. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఉద్యమం జరిగిన రోజుల్లో అధిక సంఖ్యల్లో భూస్వాములు పాల్గొనడంతో ఈ భయంలో సమంజసత కన్పించింది. ఇలాంటి అనుమానాల నేపథ్యంలోనే బిల్లు అమోదం పొందింది. తూర్పుబెంగాల్, అస్సాం వంటి కొత్త ప్రాదేశిక ప్రాంతాలలో స్వల్ప మార్పులతో చట్ట పరమయిన రూపుదాల్చింది. ఈ శాసనం 1885వ చట్టంలోని పదవ అధ్యాయం అందించిన సారాన్ని ప్రోది చేసుకున్నది. ఇది వరకు ప్రస్తావించినట్లుగా ఈ అధ్యాయంలో సర్వే, ఒప్పందాలు మరియు హక్కుల రికార్డు ప్రతిపాదనల ప్రస్తావన యధాతథంగా ఉన్నాయి. ఉత్తర భారత దేశంలో అనుసరించే ఒప్పందపు వ్యవహారాలను బెంగాల్‌లో ప్రవేశ పెట్టడానికి చట్టంలో నుండి వాడుకున్న కొన్ని భాగాలకు ఇవి ప్రత్యామ్నాయాలుగా పేర్కొనడం జరిగింది. అయితే కౌలుదారీ చట్టంలోని ఈ అధ్యాయాన్ని అత్యవసర పరిస్థితులలో మాత్రమే సాధనంగా వాడుకోవాలని ముందుగానే నిర్ణయించబడినందువల్ల, చట్టంలోని ఇతర భాగాలతో దీనికి సంబంధం లేకుండా పోయింది. అధికార యంత్రాంగం ఏదో ఒక ఎస్టేట్‌లోని ఈ సంబంధమైన వ్యవహారాలకు మాత్రమే ఇది పరిమితం కాకుండా జిల్లా వ్యాప్తంగా ఒడంబడిక వ్యవహారాలను నిర్వహించిన తర్వాతనే పదవ అధ్యానికి అనుగుణంగా కౌలుదారీ శాసనాన్ని విస్తరించ వలసిన అవశ్యకతను గుర్తించారు. ఇప్పుడది చట్టంలో ఒక అంతర్భాగమయింది. భూస్వామికి, కౌలుదారుకు మధ్య సమతూకాన్ని నిలబెట్టటానికి ఇది ప్రధాన వ్యూహంగా మారింది.

మరోసారి నూతన శాసనాలు వెల్వడటానికి మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన అనంతరం, సంస్కరింపబడిన శాసన మండలులు ఏర్పాటయేంత వరకు వేచి వుండాల్సి వచ్చింది. 1885లో గ్రామీణ సమాజంలో అట్టడుగు స్థాయిలో ఉన్నవారికి రక్షణ కల్పించే బాధ్యత తరువాతి తరానిది అని తేల్చి చెప్పనివారు, 1920లలో కౌలుదారీ శాసనాలు ఆస్థాయికి అభివృద్ధి చెందగలవని అంచనావేసారు. ఈ కాలంలో ప్రధాన సమస్యకూడా ఇదే కావడం కూడా దీనికి కారణమనవచ్చు. కొత్తగా ఏర్పాటయిన శాసన మండలులలో పాత తరంవారి ప్రయోజనాలను పరిరక్షించే ప్రాతినిధ్యం ఉండటంవల్ల, బ్రిటిష్, అధికారులు ఈ మార్గంలో శాసనాలు రూపొందించడంలో అడ్డంకులను ఎదుర్కోవలసి వచ్చింది. భూస్వామికి కౌలుదారుకు మధ్య సమతూకం సాధించటానికి అనుసరించిన పాత వ్యూహం మరింత సంక్లిష్టంగా తయారయింది. వీరి మధ్య రాజీ (compromise) కుదర్చడం పాలనా యంత్రాంగం పరిధి నుంచి విశాలమైన రాజకీయ రంగస్థలికి చేరింది. రాజకీయ దృక్పథాలు శాసనాల పరిధిని నిర్దేశించాయి. బ్రిటిష్ అధికారులు సందిగ్ధభరితమయిన సమస్యలో

చిక్కుకున్నారు. జాతీయ వాదులు ఇక ఎంతమాత్రం బ్రిటిష్ వారి పాలనను అంగీకరించదలచుకోలేదు. మరో వైపు రాజ్యాంగం ప్రసాదించిన అవకాశాలను ఉపయోగించుకొని గ్రామీణ ప్రాంతాలలోని క్రింది స్థాయి వారితో బ్రిటిష్ పాలకులు సంబంధాలు పెట్టుకోవడాన్ని అడ్డుకోవడానికి ప్రయత్నించారు. ఇంతకుముందు తరంవారి రక్షిత ప్రయోజనాలు, పూర్వ కాల ఆలోచనలకు దరిదాపుల్లో వుండేవి. బ్రిటిష్ వారు కల్పించే రక్షణ క్రింది స్థాయికి విస్తరించడానికి వీరు ఇష్టపడలేదు. పైగా తమ ప్రయోజనాలు పొందేందుకు బ్రిటిష్ వారితో బేరమాడేందుకు సిద్ధపడటానికి వెనుకాడలేదు. బెంగాల్ కౌలుదారీ చట్టాన్ని బెంగాల్‌లోనూ, 1911లో బెంగాలు నుండి విడిపోయిన బీహార్‌లోనూ సవరించడానికి చేసిన కుటిల ప్రక్రియయే దీనిని ఒక స్థాయి నిరూపించింది.

1920లలో బెంగాల్‌లో క్రింది స్థాయి రైతులకు, పంట భాగస్వాములకు (bargadars) రక్షణ కల్పించడం ప్రధాన సమస్యగా ఉండేది. బెంగాల్ శాసన మండలిలో జమిందార్లు మరియు జిరాయితీ హక్కులుగల రైతు ప్రతినిధులు చేరారు. కాని ఏ ఒక్కరూ క్రింది స్థాయి రైతుల లేదా పంట భాగస్వాముల (బాగిర్దారులు) గురించి అనుకూలంగా మాట్లాడలేదు. తమతో ప్రత్యక్షసంబంధంలేని బాగిర్దార్ల గురించి మొసలి కన్నీరు కార్చడానికా అన్నట్లు వారి సమస్య పట్ల ఎంతో ఆసక్తి ఉన్నట్లు భూస్వాములు నటించారు. ఇదే సమయంలో జిరాయితీ హక్కులు గల రైతుల నుండి ఎంతోకొంత అధికమొత్తాలను రాబట్టడానికి బేరమాడే ప్రయత్నంపై ఆసక్తి చూపారు. బాగర్దార్ల పట్ల సానుకూలతను ప్రదర్శించడం వారి రాజకీయ ఎత్తుగడలో ఒక భాగమే. 1885 చట్టం స్థానిక సాంప్రదాయానికి వదిలివేసిన జిరాయితీ హక్కుగల కమతాలు స్వేచ్ఛగా బదిలీ చేసే హక్కు విషయమై జరిగే బేరసారాలలో ఈ సంబంధాలు ఎంతగానో ఉపయోగపడగలవని భూస్వాములు భావించారు. సాధారణ క్రమంలో బదిలీలు జరిగినా, బదిలీగా భూమిని పొందినవానికి సంక్రమించే హక్కుగురించి ఎప్పుడూ సందేహం ఉండేది. ముఖ్యంగా భూమిని అదనంగా సాగుచేయడానికి భూస్వామి నుండి ఆమోదం పొందడం ( ఇక్కడ తప్పని సరిగా అవసరం) చాలా ఇబ్బందిగా వుండేది. ఈ సమస్యలతో సతమతమయిన న్యాయమూర్తులు మొదటి ప్రపంచ యుద్ధం కంటె ముందే ఒక శాసనం ద్వారా పరిష్కారం కనుగొనాల్సిందిగా ప్రభుత్వాన్ని కోరారు. యుద్ధానంతరమే పరిష్కారం కోసం చర్యలు ప్రారంభించినా ఆయా వర్గాల ప్రయోజనాల మధ్య భేదం వల్ల జాప్యం జరిగింది. వాటి ధ్యేయాన్నే భంగపరిచారు. సవరించిన చట్టం 1928లో మాత్రమే ఆమోదం పొందింది. 1921 నుండి 1928 వరకు దీర్ఘకాలంలో తయారయిన నివేదికలు, నమూనా బిల్లులు, సెలెక్ట్ కమిటీలు 1885 చట్టం తయారీలో చోటు చేసుకున్న సుదీర్ఘ చర్చలను తలపింపజేసాయి. ప్రభుత్వం తాను సృష్టించిన రెండు వర్గాలతో సంబంధాలు కొనసాగించడంపై ఆసక్తి చూపించింది. ఇందులో ఒకరయిన జిరాయితీ హక్కులు గల రైతులు భూస్వాముల కంటే రాజకీయంగా శక్తివంతం అయ్యారు.

మళ్ళీ ప్రారంభమయిన శాసనాలు సృష్టించే నాటకానికి జాన్ కేస్ (John Kess) ఆధ్వర్యాన రూపొందిన నివేదిక మొదటి అంకమయింది. 1921లో నియమించబడిన ఈ కమిటి 1923 జనవరిలో తన నివేదిక సమర్పించింది. ఈ కమిటీ తయారు చేసిన నమూనా బిల్లులో ప్రభుత్వ ప్రయోజనాలను ప్రతిబింబించే ఉపయోగకరమైన అనేక ప్రతిపాదనలు చోటు చేసుకున్నాయి. ఈ సారి వీటిని పెద్ద భూస్వాములు బలపరిచారు. భూమిని ఉప కౌలుకు ఇచ్చే అలవాటు పెరుగుతుండటం పట్ల, బెంగాల్ వ్యవసాయంలో భాగస్వాములు బలపరిచారు. భూమిని ఉప కౌలుకు ఇచ్చే అలవాటు పెరుగుతుండటంపట్ల, బెంగాల్ వ్యవసాయంలో భాగస్వామ్య పంటల విధానానికి ప్రాధాన్యత అధికమవుతుండటం పట్లా ప్రభుత్వం ఆందోళన కనబరచింది. అనుభవజ్ఞుడయిన ఒక రెవెన్యూ అధికారి, తదనంతర చర్చలో, ఏ పరిశీలకుడయినా ఒక్క చూపుతో ఏ భూములు రైతుల చేత సాగుచేయబడుతున్నాయో, ఏ భూములను బర్గదార్‌లు సాగుచేస్తున్నారో సులభంగా తెలుసుకోవచ్చునని తెల్పాడు. ఈ రకమయిన కౌలు విధానం వల్ల వ్యవసాయం దెబ్బతింటున్నదనడంలో ఎలాంటి సందేహానికి తావులేదు. ఉప-భూస్వామ్య పద్ధతి దాని బంధపు అంచులకు చేరుకున్నది. భూమిని సాగుచేసే రైతాంగం కోసం ఉద్దేశించబడిన కౌలుదారీ రక్షణ వాస్తవంగా పెద్ద సంఖ్యలో మధ్య వర్తులు (దళారీలు) అవతరించడానికి సహకరించింది. నిజంగా భూమిని దున్నేవాడు దుర్భరమైన పరిస్థితులలో పనిచేయవలసి వచ్చేది. తాను నిలదొక్కుకునే అవకాశం లేకపోయినా, తన వెనుక ఉన్న పై స్థాయి యంత్రాంగం మొత్తానికి ఆధారంగా నిలువ వలసిన పరిస్థితులు ఏర్పడినాయి. అందువల్లనే ఈ కమిటీ ప్రతి కౌలుదారుకు అతని తక్షణ బూస్వామి నుండి జిరాయితీ హక్కులు కల్పించాలని, ప్రతి బార్గదార్ (bargadar) ను కౌలుదారుగా చూడాలని చాలా సాహసవంతమైన ప్రతిపాదనలు చేసింది. తమ అభ్యంతరాన్ని తెల్పిన కమిటీ సభ్యులు, బార్గదార్ కేవలం ఒక వ్యవసాయ కూలీ అని, ఇతని విషయంలో కల్పించే రక్షణ స్వీయ - ఓటమికి దారి తీస్తుందని పేర్కొన్నారు. బార్గదార్ చేయి తగిలితేనే భూమి తమది కాకుండా పోతుందేమోననే భయంతో భూమి యజమానులు తమ భూమిని ఇతను సాగుచేయడానికి అనుమతించరు ప్రభుత్వం ఈ రకమయిన ప్రతి చర్యను గమనించినందువల్లనేమో చట్టం ముందుచూపుతో సమర్ధవంతంగా రూపొందాలని, ఫలితంగా బార్గదార్‌లు రోజు కూలి స్థాయికి దిగజారకుండా చూడాలని అభిప్రాయపడింది. కొంతమంది పంట భాగస్వాము (బార్గదారులు)లు కొత్త హక్కుల రికార్డులలో నమోదు చేయించుకోగలిగారు. ఆసరికే ప్రాదేశిక ప్రాంతలలో మూడవ వంతు భూ భాగంలో వీటిని తయారు చేయడం పూర్తయింది. ఇట్లాంటి వారు తమ హోదా (స్థాయి)ను నిరూపించుకోగలిగారు. అమలులోకి తేవాలనుకున్న శాసనం వనంతర ప్రభావాల మీదనే దీనికి వ్యతిరేకుల విమర్శ ప్రధానంగా కేంద్రీకృతమయింది.

భూస్వాముల జీవనాధారాన్ని దృష్టిలో వుంచుకొని కొన్ని చోట్ల మినహా ఉత్పత్తి రూపంలో వున్న భాటకాన్ని, నగదు రూపమైన భాటకంగా మార్చాలని కూడా కోరింది. ఈ రకమైన ప్రతిపాదనకు వ్యతిరేకులు, బర్గదార్లు నగదు రూపంలో భాటకాన్ని చెల్లించ లేదు కనుక వీరిని కౌలుదార్లుగా గుర్తించరాదని చేసిన వాదనను దృష్టిలో వుంచుకొని ఈ కమిటీ ఉత్పత్తి రూపంలో భాటకాన్ని చెల్లించే పద్ధతిని కౌలుదారుకు వ్యతిరేకంగా ఉపయోగించరాదని స్పష్ట చేసింది.

జిరాయితీ హక్కుగల కమతాలను బదిలీ చేయడంలో స్వేచ్ఛకు సంబంధించిన అంశాన్ని గురించి కూడా కమిటీ పరిశీలించింది. ప్రస్తుత పరిస్థితి గురించి తెల్పుతూ సహజంగా భూమి బదిలీ అయిన తర్వాతనే సంబందిత ఫీజు పొందగలిగే భూస్వామి ఆమోదం లేకుండానే బదిలీలు స్వేచ్ఛగా జరుగుతున్నాయని అభిప్రాయం వ్యక్తం చేసింది భూస్వామి కౌలుదారును బదిలీకి ముందే భూమి నుండి ఖాళీ చేయగల హక్కు, బదిలీ తర్వాత ఏర్పడగల హక్కుగా మార్చుకోవచ్చునని కమిటీ సూచించింది. దీనివలన తనకు అనవసరమనిపించిన బదిలీ అయిన వానిని అదనంగా 10 శాతం నష్టపరిహారం చెల్లించడం ద్వారా తగిన సమయంలో కొనే అవకాశం భూస్వామికి లభిస్తుంది. భూస్వామికి చెల్లించే బదిలీ రుసుము (fee) అమ్మకం సమయంలో భూమి విలువలో 25 శాతం ఉండాలి. ఈ సూచన భూస్వాములకు చాలా ముఖ్యమైన రాయితీ. భూమికి సంబంధించి వర్తకం చాలా వేగంగా పెరుగుతున్న తరుణంలో దీని ఆధారంగా భూస్వామి మంచి ఫలితాలు పొందే అవకాశం వచ్చింది. 1885 చట్టం ఆమోదం పొందే నాటికి సంవత్సరానికి 50,000 కూడా లేని బదిలీలు తరువాత 30 సంవత్సరాల లోపుగానే ఐదు రెట్లు పెరిగాయి.

జిరాయితీ హక్కులుగల రైతులు ఈ నివేదికను గురించి ఆందోళన చెందటానికి తగిన కారణాలే వున్నాయి. సి. ఆర్.దాస్ నాయకత్వం లోని స్వరాజ్ పార్టీ ఈ ఎత్తుగడకు వ్యతిరేకంగా తీవ్ర నిరసన తెల్పింది. ఈ పార్టీ జిరాయితీ హక్కు ఉన్న రైతాంగం నేపథ్యం గల విద్యావంతులయిన బెంగాలీ మధ్య తరగతి వర్గానికి ప్రాతినిధ్యం వహించిందనేది ఇక్కడ గమనార్హం. జిరాయితీ హక్కుగల రైతుల వద్ద ఉండే కౌలుదార్లు కూడా ఇలాంటి హక్కులు అనుభవిస్తూ ఉన్నట్లయితే, భూస్వామి అంత పెద్దమొత్తంలో బదిలీ ఫీజు (రుసుము) కావాలని కోరినట్లయితే, బదిలీ స్వేచ్ఛ మిధ్య (myth) అవుతుంది. బార్గదార్‌కు రక్షణ కల్పించడం, అతనిని దోపిడీ చేస్తూ బ్రతికే మధ్య తరగతి వారికి ప్రమాదకరమయిన పరిణామమే అవుతుంది. బదిలీకి సంబంధించిన సమస్యలను పరిష్కరించడంతో పాటు, గ్రామీణ సమాజంలోని అట్టడుగు స్థాయి వారికి రక్షణ కల్పించేందుకు ఉద్దేశించబడిన ఈ యోచన ఆయన వర్గాల మధ్యరాజీ (అవగాహన) కుదుర్చుకొనేందుకు తగు మార్గాన్ని కూడా సూచించింది. దీని ప్రకారం భూస్వాములు పంట భాగస్వాములు లేదా బార్గదార్‌లను గురించి మరిచి పోతారు.

స్వాధీన హక్కు గల రైతులు వీరికి ( భూస్వాములకు) భారీగా బదిలీ ఫీజులను చెల్లించేందుకు సిద్ధపడాలి. నివేదిక బయటకు రాగానే అందిన ఫలితం దాన్ని నిలిపివేయడం, ప్రభుత్వానికి సంబంధించినంతవరకు కనీసం ముఖం కూడా చూపించ లేని పరిస్థితి ఏర్పడడంగా చెప్పవచ్చు. ఎందుకంటే, నివేదిక ముద్రింపబడిన కొన్ని నెలల తరువాత, ఈ నివేదిక బార్గదార్‌లను రక్షించ బోవడం లేదని బహిరంగంగా ప్రకటించవలసి ఉంది. ఈ ప్రకటనతో స్వాధీనపు హక్కులు గల రైతాంగం సంతృప్తి పడలేదు. బార్గదార్‌లు కౌలుదార్లు కారని ఒక నిర్దుష్టమైన ప్రకటన వేయవలసిందిగా ప్రభుత్వంపై ఒత్తిడి తీవ్రమయింది. దీని వల్ల బార్గదార్‌లను శాశ్వతంగా కౌలుదారీ శాసనాల పరిధినుండి తొలగించవచ్చునని వీరి ఉద్దేశ్యం. ఈ పరిస్థితులలో సంబందిత వర్గాలన్నీ శాసనాలు రూపొందించే ఆటలో మరో దశకు చేరుకున్నాయి.

రెండవ దశలో తర్జన భర్జనల తరువాత బయటకు వచ్చిన 1925, ముసాయిదా బిల్లు ప్రభుత్వానికి ఎంత మాత్రం అంగీకార యోగ్యంగా లేదు. ఇది పాత ప్రతిపాదనలకు మరో 'నకలు' కావడమే దీనికి కారణం. క్రిందిస్థాయి రైతులకు రక్షణ కల్పించే తగిన ప్రతిపాదన లేవి లేవు. బార్గదార్‌ల సమస్యలను, నగదు రూపంలో భాటకం చెల్లించని ఏ వ్యక్తయినా కౌలుదారుగా గుర్తించబడనే ఒక వాక్యం చేర్చడం ద్వారా పరిష్కరించబడింది. కౌలుదారీ రక్షణకు సంబంధించి మరో ముందడుగు వేయాలని ప్రభుత్వం చాలా పట్టుదలగా వున్నది. గతంలో చేసిన రక్షణకు సంబంధించిన ప్రతి పాదనల పట్ల చూపిన తిరుగుబాటుధోరణి, రక్షణ కల్పించే విషయాలను దాటి తన అధికారానికి సరికొత్త సామాజిక ప్రాతిపదిక ఏర్పరచుకోవడానికి ప్రభుత్వాన్ని పురి కొల్పింది. రాజ్యాంగ సంస్కరణల క్రమంతో పాటు నెమ్మదిగా పౌర అధికారాన్ని విస్తరింపజేయడం ఇందుకు సంబంధించినవే. విషయాన్ని ఇక్కడితోనే వదిలివేయకుండా ప్రభుత్వం ప్రముఖ భారతీయ న్యాయ మూర్తి నళిని రంజన్ ఛటర్జీ అధ్యక్షతన మరో కమిటీని నియమించింది. భిన్నమైన ప్రయోజనాలతో పని చేసే వర్గాల మధ్య సఖ్యత కుదర్చడం కోసమే ఈ కమిటీ ఉద్దేశించబడింది. కెర్ కమిటీ మొత్తంగా బార్గదార్‌ల సమస్యను ప్రస్తావించకుండా వుండాల్సిందని ఛటర్జీ అభిప్రాయపడినాడు. ప్రస్తుతమున్న చట్టం క్రింద బార్గదార్ కౌలుదారుగా గుర్తింపబడి వుండే వాడని, కనీసం న్యాయస్థానాలయినా ఇతన్ని ఆకాశాన్నంటే భాటకం నుండి కాపాడగలిగేవని భావించాడు. పంట భాగ స్వాములు లేదా బార్గదార్‌ల పై ఒక నూతన అధ్యాయాన్ని చట్టంలో జొప్పించడం ద్వారా ఈ సమస్య పరిష్కారానికి కొత్త తరహా ప్రయత్నం మొదలయింది. వీరికి ఎలాంటి ప్రత్యేక రక్షణ ఇవ్వకుండా ఏ హక్కులు లేని కౌలుదార్లుగా అవుతారని ప్రకటించడం జరిగింది. ఈ ప్రయత్నాన్ని కూడా స్వాధీనపు హక్కుగల రైతులు వమ్ము చేసారు. 'బార్గదార్‌ను' అతని యజమాని ( భూస్వామి) అంగీకరించనంత వరకు. లేదా పౌర న్యాయస్థానం అలాంటిది

గుర్తించనంత వరకు అతడు కౌలుదారుగా వ్యవహరింపబడడు అనే అంశం బిల్లులో వుండడాన్ని వీరు ఒక సాకుగా చూపారు.

స్వాధీనపు (జిరాయితీ) హక్కుగల రైతులు క్రింది స్థాయి రైతుల హక్కులకు పరిమితమైన రక్షణ కల్పించడానికి మాత్రమే కొంత వెసులుబాటు ఇచ్చారు. సాధారణ కాలపరిమితి ముగిసిన తర్వాత క్రింది స్థాయి రైతులు కూడా జిరాయితి హక్కులు పొందే అవకాశం వచ్చింది. అయితే వీరి భూములు సంబంధిత భూస్వామి తన ఆమోదాన్ని బహిర్గతం చేయనంత వరకు బదిలీ చేసుకునేందుకు వీలుకల్పించలేదు. ఒక సారి పెంచిన భాటకాన్ని 15 సంవత్సరాల లోపు మళ్ళీ పెంచటానికి వీలులేదు. ఇలాంటి ప్రయత్నాన్ని నియంత్రించటానికి పూర్వపు పద్ధతి అయిన స్థూల ఉత్పత్తి నిబంధనను చేర్చడం జరిగింది. ఉత్పత్తి యొక్క (20) ఇరువయి సంవత్సరాల సగటు విలువలో నగదు [illegible]యితే మూడవ వంతుకు వస్తు రూప భాటకమయితే సగానికి మించడానికి వీలు లేదు. స్వాదీనపు హక్కుగల రైతు తన క్రింది స్థాయి రైతును స్వంత సేద్యానికి పూనుకోదలచుకున్నట్లయితే భూమి నుండి తొలగించటానికి వీలు కల్పించారు. కాని, ఒక వేళ నాలుగు సంవత్సరాలకు ముందే మరొకరికి కౌలుకు ఇచ్చినట్లయితే, భూమిని తిరిగి పొందటానికి కౌలుదారు యజమానిపై దావా (వ్యాజ్యం) వేయవచ్చు. క్రింది స్థాయి గ్రామీణ వర్గానికి రక్షణ కల్పించే చట్టానికి ఇది ముందస్తు చర్య మాత్రమేనని చెప్పడం జరిగింది. అయితే ఈ చట్టాన్ని వ్యతిరేకించేవారు, ఇది మరో ఉప-కౌలుకిచ్చే మధ్యవర్తుల సమూహాన్ని మాత్రమే సృష్టించగలదని విమర్శించారు. ఈ విమర్శలో కొంత వాస్తవికత లేకపోలేదు. ముఖ్యంగా చట్టం బర్గదార్‌లను రక్షించలేదు కనుక క్రింది స్థాయి రైతులతో పాటు స్వాదీనపు హక్కుగల రైతులు కూడా అతనిని దోపిడీ చేసేందుకు వీలున్నదనే సత్యాన్ని గుర్తించినపుడు ఇది మరింత స్పష్టంగా ద్యోతకమవుతుంది.

కమతాల బదిలీలో స్వేచ్ఛకు సంబంధించి జమిందార్లు, జిరాయితీ హక్కుగల రైతులు ఇరువురికి ఉపయోగపడే ఒక అవగాహనకు వచ్చారు. బదిలీక్రమాన్ని నమోదు (రిజిస్టర్) చేసుకొనే అధికారుల ద్వారా బదిలీ రుసుము (ఫీజు) భూస్వామికి విధిగా చెల్లించాలని, దీన్ని గతంలో వున్న 25 శాతం నుంచి 20 శాతానికి తగ్గించాలని అంగీకరించారు. బదిలీ అయినవారిని కమతం నుండి ఖాళీ చేయించే హక్కు భూస్వాముల వద్దనే వున్నది ఈ రకమయిన బేర సారం జమిందార్లకు నష్టదాయకమైనదేమి కాదు. ఈసారికి బదిలీల మొత్తం విలువ 20 (ఇరువయి) మిలియన్ రూపాయలకు చేరింది, అంటే వీరు 4 (నాలుగు) మిలియన్ రూపాయల ఫీజు పొందుతున్నమాట బార్గదార్‌లను రైతుల దయాదాక్షిణ్యాలకు వదిలివేసినందుకు వీరికి మంచి ఫలితమే ముట్టింది.

బెంగాల్ శాసన మండలిలో చట్టాన్ని గూర్చిన తుది చర్చలలో రాజీకి సంబంధించిన అంశం ప్రాధాన్యం పొందింది. జమిందార్లు స్వాదీనపు హక్కులుగల రైతులు అధికార సభ్యులు ప్రతి ఒక్కరు తమ విషయాలపై వాదన వినిపించారు, చర్చలలో తమ వంతు పాత్ర పోషించారు. చట్ట సభలో సవరణ ప్రతిపాదనలపై ఓటింగ్ జరిగినపుడు, బిల్లులోని అంశాలకు బలమైన మెజారిటీ లభించింది. ఎలాంటి మార్పులనయినా వ్యతిరేకించారు. ఫిజులుల్ హక్, కొంతమంది అతని అనుచరులు చివరి ప్రయత్నం చేసారు. బార్గదార్‌కు సంబంధించిన 'క్లాజును(' రద్దు చేయాలని కోరారు. తుది చర్చలలో పాల్గొనే ముందే పూర్తి సంసిద్ధంగా, ఒక వ్యూహంతో వచ్చిన బర్గదార్‌ల అనుకూల వర్గం ముందు వీరి ఆటలు సాగలేదు. నిజంగా రైతాంగ ప్రతినిధులు శాసన మండలిలో ప్రాతినిధ్యం వహించలేదని, క్రింది స్థాయి వారి నుండి దోచుకున్న మొత్తాలను పంపకం చేసుకొనే విషయంలో తగాదాలు పడిన వర్గాలు మాత్రమే పాలు పంచుకున్నాయని ఒక సభ్యుడు చాలా స్పష్టంగా తెలిపాడు.

మా అధ్యయన కాలం ముగిసేనాటికి పరిస్థితులు ఈ విధంగా రూపు దిద్దుకున్నాయి. రాజ్యాంగ సంస్కరణల తరువాతనే కొత్త శాసనం చేపట్టడం జరిగింది. ఇది శాసన మండలిలో జిరాయితీ హక్కులుగల రైతాంగాన్ని మరింత శక్తి వంతం చేసింది. ఇక వారు గ్రామీణ సమాజంలోని క్రింది స్థాయి వారిపై వ్యతిరేకంగా చర్యలు తీసుకోవడంలో జమిందార్ల రాజకీయ సహాయం ఎంత మాత్రం అవసరం లేకుండా పోయింది. వెంటనే 1928 నాటి రాజీ ప్రతిపాదను తొలగించారు. ముందస్తుగా భూమి నుండి ఖాళీ చేయించడం, బదిలీ ఫీజు రద్దు చేయబడినాయి. భాటకాన్ని పెంచడాన్ని కొంత కాలం వరకు నిలుపుదల చేసారు. ఆ తరువాత పొడిగించబడింది కూడా. ఆచరణలో జమిందార్ల ఆదాయం తీవ్రంగా పరిమితం చేయబడింది. ఆ వెంటనే వారి హక్కులు ఏక మొత్తంగా రద్దయినాయి. జిరాయితీ హక్కులు గల రైతులు అసలయిన బెంగాలీ భూస్వాములుగా అవతరించారు. ఇదే సమయంలో బెంగాల్‌లో వ్యవసాయోత్పత్తి తగ్గింది. స్వాదీనపు హక్కులుగల రైతుల ప్రతినిధులు దీనికి జమిందార్లు వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయడమే కారణమని నిందించారు. కాని తమకు ఎప్పుడు అవకాశం వచ్చినా వీరూ అదే చేసారు. భూమిని బార్గదార్‌లకు అప్పగించారు. భూమిని వారితో సాగుచేయించుకొనేందుకు ఉద్దేశ్య పూర్వకంగానే వారిని తక్కువ స్థాయిలోనే ఉంచడానికి నిరంతరం ప్రయత్నించారు.

బెంగాల్‌లో వ్యవసాయరంగం ప్రాబల్యం క్షీణించడం వ్యవసాయ విధాన ఫలితమేనని చెప్పవచ్చు. ఈ విధానం వాస్తవంగా భూమిని దున్నేవానికి ప్రోత్సాహకం ఇచ్చేందుకు బదులుగా గ్రామీణ సమాజంలోనిపై స్థాయి నుండి మధ్య తరగతి వరకు గల వివిధ వర్గాల వారి ఆలోచనను అనుసరిస్తూ, వారికి మేలు చేసే అంశాలపైననే దృష్టి సారిస్తూ క్రింది స్థాయి వారిని చేరడానికి

ఏ మాత్రం ప్రయత్నించలేదు. దేశ ఆర్థికాభివృద్ధిని పట్టించుకోకుండా విదేశీ పాలన కొనసాగించటానికే ఈ ప్రయత్నం చేసారు. ఉత్పాదకత తగ్గడంలో పర్యావరణ సంబంధమైన కారణాల ప్రభావం తప్పని సరిగా ఉంది. కౌలుదారీ శాసనం సృష్టించిన దడపుట్టించే భూస్వామ్య పద్ధతి దేశ ఆర్థిక వ్యవస్థను మరింత కృంగదీసింది. వ్యవసాయేతర సంబంధమైన పెట్టుబడులకు, వ్యాపారానికి మార్గాలు అంతగా లేకపోవడం వల్ల భూమి స్పెక్యులేషన్‌కు గురి చేసే ప్రధాన వనరుగా వ్యవసాయేతర వృత్తుల వారికి ఆదాయాన్ని సమకూర్చి పెట్టే ఆధారంగా మారింది. బెంగాల్‌లో ఈ వ్యవసాయేతర శక్తులు చాలా వరకు వడ్డీ వ్యాపారుల కంటె పట్టణాల్లో ఉండే బూటకపు - బూర్జువా వర్గానికి సంబంధించిన వేనని చెప్పవచ్చు. రక్షిత కౌలుదారు స్థాయికి చేరడం, పట్టణ సంబంధమైన సేవలకు చేరువ కావడం విద్యావంతులయిన మధ్య తరగతి చెందిన అధిక సంఖ్యాకులకు ఆర్థిక పరమైన ఆలంబనను కలుగజేసింది. 1921 జనాభాలెక్కల నాటికి బెంగాల్‌లో భాటకం పొందేవారి సంఖ్య దాదాపు 1.3 మిలియన్ల వరకు ఉన్నది. వీరిలో చాలా మంది జిరాయితీ హక్కులు గల రైతులయి ఉండవచ్చు. భాటకం ద్వారా వచ్చే ఆదాయానికి తోడుగా తమ స్వంత బర్గదార్‌లను దోపిడి చేస్తూనే బ్రిటిష్ వారికి ఒక రకమైన గుమాస్తాలుగా సేవలు అందిస్తూ స్వల్పమైన జీతాన్ని పొందుతూ వీరు ఎస్టేట్ విధానంగా బలపడినారు. వీరికి బెంగాల్ చట్టం ఒక మాగ్నా కార్టా వంటిదయింది. అందుకే దీన్ని వారు నిర్బంధంగా బలపరిచారు, తద్వారా తమ హక్కులను నిలుపుకోగలిగారు. ఈ బూటకపు బూర్జువాలు అందించుకున్న పరస్పర సహకారం భాటకం పొందే ఉద్యోగ వర్గాన్ని తయారు చేసింది. ఫలితంగా వ్యవసాయోత్పత్తి మిగులు పట్టణ మరియు పారిశ్రామిక సంబంధమైన పెట్టుబడులకు కాకుండా పట్టణ స్థాయి వినియోగాన్ని ప్రోత్సహించటానికి ఉపయోగించటం భాధాకరమైన విషయం.

బీహార్‌లో సామాజిక నిర్మాణం భిన్నమయినది .1930లలో కౌలుదారీ చట్టానికి సవరణ చేయటానికి అప్పటికీ సమయం మించిపోయింది. భూస్వాములకు, కౌలుదార్లకు మధ్య దీర్ఘకాలం పాటు కొనసాగిన ఘర్షణల వల్ల 1920లలో రాజీయత్నం అసాధ్యమయింది. సంస్కరింపబడిన శాసన మండలిలో మొదటి అంకం బెంగాల్‌లోని kerr కమిటీకి భిన్నంగా ఉన్నదని చెప్పవచ్చు. బార్గదార్‌ల సమస్యే ప్రస్తావించబడలేదు. బీహార్ జమిందార్లు బేరసారాలలో తమ ఉనికి కోసం ప్రయత్నించలేదు. బదిలీల స్వేచ్ఛ గురించి ఆంధోళన పడుతున్న జిరాయితీ హక్కులుగల రైతుల డిమాండ్ల పట్ల మాత్రం తీవ్ర వ్యతిరేకతను ప్రదర్శించారు. బెంగాల్ స్థాయిలో విద్యావంతులయిన మధ్య తరగతి వర్గం బీహార్‌లో లేదు. ఇక్కడి భూస్వాములు, బెంగాల్ అనుపస్థితి భూస్వాములకు భిన్నంగా పూర్తిగా గ్రామీణ అధికారమే ఆలంబనగా గలవారు. అక్కడి భూస్వాములవలె పట్టణాల్లో వుంటూ, రాజకీయాల్లో పాల్గొనే స్వభావానికి పూర్తి విరుద్ధంగా వీరు గ్రామీణ ప్రాంతాలతోనే దగ్గరి సంబంధాలు ఏర్పరచుకున్నారు. బిహార్

స్వాధీనపు హక్కుగల రైతు సహజంగా ఒక సామాన్య రైతు. బెంగాలీ అనుచరుడి కంటె ఇతనిని చాలా సులభంగా భయపెట్టవచ్చు. వాస్తవంగా, 1885 బెంగాల్ కౌలుదారీ చట్ట బీహార్ కోసం ఉద్దేశించబడినదే, ఆ కాలానికి చెందిన అధికారులు ఈ ప్రాంత పరిస్థితుల గురించే ఎక్కువగా ఆంధోళన చెందారు. ఇక్కడ అనేక ప్రాంతాలలో కౌలుదారు తనకు తానుగా నిలదొక్కుకోలేని పరిస్థితులు వుండేవి. పాట్నావంటి కొన్ని చోట్ల కౌలుదార్లు తమ ప్రయోజనాలు కాపాడుకొనే అవకాశాన్ని రైతులు కల్పించారు. బెంగాల్ కౌలుదారీ చట్టం ప్రవేశపెట్టిన గ్రామీణ సమాజ వర్గీకరణ, పూర్వపు బెంగాల్ ప్రాదేశిక ప్రాంతాలన్నింటిలోకి బీహార్ సమాజ నిర్మాణాన్ని మరింత విశ్వాసపాత్రంగా ప్రతిబింబించింది. తూర్పు బెంగాల్, అస్సాంలలోని అనేక జిల్లాలలో చట్టాన్ని సవరణ చేయవలసి వచ్చినప్పుడు బ్రిటిష్ అధికారులు ఈ అంశాన్ని ఉటంకించడం గమనించవచ్చు. బీహార్‌లోని పరిస్థితులకు చట్టం పకడ్బందీగా ఉండాలి. అందుకేనేమో చట్ట సవరణ చేయడం అక్కడ చాలా ఇబ్బందికరంగా పరిణమించింది.

ఒప్పందానికి సంబంధించిన వ్యవహారాలు నిర్వహిస్తున్నప్పుడు చట్టంలోని అనేక తీవ్రమైన అవకతవకలను గుర్తించిన బీహార్ ప్రభుత్వం మొదటి ముసాయిదా బిల్లును తయారుచేసింది. సంస్కరింపబడిన శాసన మండలి ఏర్పాటయేంత వరకు ఈ బిల్లును పరిగణనలోకి తీసుకోవడాన్ని వాయిదా వేసారు. 1922లో తయారుచేసిన కొత్త ముసాయిదా బిల్లును ఆమోదింపజేయటానికి భూస్వాముల, కౌలుదార్ల సమావేశాన్ని ఏర్పాటు చేసింది. ఈ సమావేశంలో ఎలాంటి అంగీకారం కుదరకపోవడంతో బిల్లు ప్రతిపాదనను విరమించుకున్నది. కౌలుదార్ల ప్రయోజనాలను చూసే ఒక ప్రతినిధి అనేక ప్రయివేటు బిల్లులను సమర్పించాడు. చాలా సంవత్సరాలుగా ఈ బిల్లులను అన్నింటిని వ్యతిరేకిస్తున్న భూస్వాములు తాము కూడా ఒక నమూనా బిల్లును రూపొందించుకోవచ్చునని, కౌలుదార్ల ప్రతినిధి సమర్పించిన బిల్లులతో పాటు దీనిని సెలెక్టు కమిటీకి నివేదించ వచ్చునని చివరగా ఒక సలహా ఇవ్వడం జరిగింది. 1928లోనే ఇదంతా జరిగినా, మళ్ళీ అవగాహన కుదరకపోవడంతో 1929లో ప్రభుత్వం నూతన ముసాయిదా బిల్లును తయారు చేసింది. దీర్ఘకాలం పాటు ఈ సంఘర్షణ కొనసాగటానికి భూస్వాములకుండే భూమి నుండి ముందస్తుగా ఖాళీ చేయించే అదికారం, హెచ్చు బదిలీ ఫీజు , కౌలుదార్లకు ఎలాంటి రాయితీ ఇవ్వాల్సి వచ్చినా, దానికి పరిహారంగా స్వంత వ్యవసాయం (bakasht) కోసం భూమి ఉంచుకొనే మొత్తాన్ని పెంచేందుకు అవకాశం ఇవ్వాలని చేసే డిమాండును కౌలుదార్లు అడ్డుకోవడం కారణమని చెప్పవచ్చు.

బకాష్త్ ( స్వంత వ్యవసాయం) సమస్యకు బీహార్‌లో ప్రత్యేక ప్రాధాన్యత ఉన్నది. బెంగాల్‌లో వలె కాక బీహార్ జమిందార్లు తమ కంటూ కొంత భూమిని మిగుల్చుకున్నారు. ఈ భూమిపై మొత్తం భూమిని జిరాత్ (Zirat) వలె సక్రమంగా వర్గీకరణ చేయలేదు. చాలా

వరకు బకాప్త్‌గానే వ్యవహరించారు. అంటే కౌలుదారు కాకుండా. భూస్వామి ఒక్కడే స్వంత వ్యవసాయం చేసే హక్కును కలిగి వుంటాడని అర్థం. జిరాత్ (Zirat) కు సమానమయిన భూమిని స్వంత సేద్యానికి (బకాప్త్) లాక్కోవడమే భూస్వామి ఉద్దేశ్యం. ఇందుకు కావలసిన హక్కును తాము నిరూపించుకోలేకపోతున్నందువల్ల, చట్టం తమ ఎస్టేట్‌లో కొంత శాతాన్ని స్వంత సేద్యం కోసం కేటాయించాలని కోరారు. స్వాతంత్ర్యానంతరం జమిందారీ విధానాన్ని రద్దు చేయడానికి ఇవే ప్రతిపాదనలు చేయడంపై, పై అంశాలు ప్రభావాన్ని చూపాయి. 1929లో జమిందారీ రద్దు కనుచూపువేరలో లేనందున, స్వంత వ్యవసాయానికి భూమిని కెటాయించడమే వారికి తగిన రాయితీ. కౌలుదార్లకు బదిలీ స్వేచ్ఛ కల్పించడం అసమంజసమని వారు చేసిన వాదనకు ఈ ఫలితం దక్కిందనవచ్చు. చర్చలు పదేపదే విఫలమయ్యాయి. బీహార్‌కు చెందిన అతి ప్రముఖ భూస్వామి అయిన దర్‌భాంగ మహారాజా జోక్యం వలన 1929లో బిల్లు ఎట్టకేలకు వైరి వర్గాల మధ్య ఒక అవగాహన సాధించగలిగింది. భూస్వాములు కౌలుదారును ముందస్తుగా ఖాళీ చేయించే హక్కును వదులుకున్నారు. 1828 బెంగాల్ చట్టం నిర్ణయించిన 20 శాతం బదిలీ ఫీజు కంటే అతి తక్కువగా 8 శాతంతోనే సంతృప్తి పడినారు. అయితే వారి ఎస్టేటులలో 10 శాతం జిరాత్‌గా అంటే స్వంత సేద్యానికి వీలుగా మార్చబడుతుంది. ఈ అంశం వివాదాస్పదంగా తయారయింది. దీని వలన (2) రెండు మిలియన్ ఎకరాల భూమి ప్రభావితమవుతుందనే అంచనాలు వార్తా పత్రికలలో చోటు చేసుకున్నాయి. ఏమయితేనేం, బిల్లుపై జరిగిన తదనంతర చర్చల్లో ఈ అంశాన్ని వదులుకున్నారు. జిరాత్ క్రింద భూములను కెటాయించటానికి భూస్వాముల ఎస్టేట్లు తిరిగి సర్వే చేయడం తప్పని సరిగా జరుగుతుందని నిర్ధారణ కావడంతో, ఇది అనేక చట్ట పరమయిన సమస్యలను (తగాదాలను) సృష్టిస్తుందనే భయంతోనే ఈ ఆలోచన విరమించుకున్నారు. పరిస్థితులు అప్పటికి యదాతథంగా పూర్తిగా కౌలుదార్లకు అనుకూలంగా ఉందని వాదించవచ్చునని అనుకున్నారు. అందుబాటులో లేని రాయతీల కోసం అర్రులు చాచారు. ఉత్తర భారతదేశంలోని చాలా మంది భూస్వాముల వలె వీరు కూడా రాజకీయంగా అసమర్థులు. వీరంతా ఇప్పటికీ తమ ఎస్టేట్‌లను చిన్న రాజ్యాలుగా, తమ ఇష్టాయిష్టాలే చెల్లుబాటు కావాలనే ధోరణిలో వ్యవహరించారు. అందువల్లనే రాజకీయాలు విస్తృత స్థాయిలో వివిధ అంశాలపై చూపే ప్రభావాన్ని గుర్తించలేకపోయారు. కౌలుదార్ల ప్రతినిధులు ఈ అంశాన్ని చాలా త్వరగా అవగాహన చేసుకొన్నారు. శ్రీ కృష్ణ సిన్హా మొదటి కాంగ్రెస్ ప్రభుత్వపు ముఖ్యమంత్రిగా వీరు అధికారంలోకి వచ్చారు. చాలా నిజాయితీగా బదిలీ ఫీజును రద్దు చేసారు కాని, గ్రామీణ వ్యవస్థలోని క్రింది స్థాయి వారికి రాయితీలు ఇవ్వటాన్ని చాలా జాగ్రత్తగా తప్పించుకున్నారు.

## 7.3 Bengal Precedent and the Madras Estates Land Act of 1908.

బ్రిటిష్ రైతువారి పద్ధతికి మద్రాస్ ప్రెసిడెన్సీ జన్మ స్థానంగా పేర్కొనవచ్చు. అయినప్పటికి, శాశ్వత ఒప్పందం గల ఎస్టేట్‌లు కూడా అధిక సంఖ్యలో వుండేవి . శాశ్వత ఒడంబడిక 1800వ సంవత్సరంలో దక్షిణ భారత దేశంలో విస్తార భూభాగాన్ని బ్రిటిష్‌వారు తమ ఆధిపత్యంలోకి తెచ్చుకున్న వెంటనే ప్రవేశపెట్టారు. ఇందులో చాలా ఎస్టేట్‌లు బెంగాల్ ప్రెసిడెన్సీ ప్రక్కనే ఉన్న, ఉత్తర ప్రాంతాలలో ఉండేవి. కొన్ని ఇలాంటి ఎస్టేట్‌లను మద్రాస్ దక్షిణాది జిల్లాలయిన మధురై, సేలం, ఉత్తర ఆర్కాట్ మరియు <u>తిరునల్వేలి</u> కూడా ఉండటాన్ని గమనించవచ్చు. శాశ్వత ఒడంబడికలపై వ్యతిరేకత మొదలయ్యే సరికి మద్రాస్ ప్రభుత్వం భూమి శిస్తు బకాయిలు ఉన్న ఎస్టేట్లను కొనగోలు చేసి వేలం వేయడం ద్వారా పరువు నిలబెట్టుకోడానికి ప్రయత్నించింది. 1820,1830లలో కొన్ని ఎస్టేట్‌లు ఈ విధంగా పడిపోయాయి. ప్రారంభంలో మద్రాస్ ప్రెసిడెన్సీలోని మూడువంతుల భూభాగం శాశ్వత ఒడంబడికల క్రింద వుండేది. కాల క్రమంలో ఇది ఐదవ వంతుకు తగ్గింది.20వ శతాబ్దంలో ఈ ప్రెసిడెన్సీ 60వేల చదరపు మైళ్ళ పరిధిలో రైతువారి విధానాన్ని కలిగివుండగా, 14 వేల ఎకరాలు శాశ్వత ఒడంబడికల క్రింద వుండేది.

రైత్వారి పద్ధతికి అలవాటు పడ్డ మద్రాస్ అధికార వర్గం 1820లలో జమిందారీ రద్దు గురించి సాహసోపేతమయిన ప్రతిపాదనలతో ముందుకు వచ్చారు. శాశ్వత ఒడంబడిక క్రింద ఉన్న భూములను జమిందార్లకు నష్టపరిహారం చెల్లించడం ద్వారా రైతువారీ పద్ధతికి మార్చడానికి రెండు సూచనలు చేయబడినాయి. జమిందార్ల ఆస్తులను ద్రవ్య పరమయిన ఆస్తులుగా మార్చి ఎస్టేట్ రాబడిలో కొంత నిశ్చితమైన శాతాన్ని వారికి ఆదాయంగా సమకూర్చడం ఒక పద్ధతి. జమిందార్ల ప్రత్యక్ష నియంత్రణలో ఉన్న భూమిని మాత్రమే వారికి వదిలి, దాన్ని కౌలుదార్లకు కౌలుకు ఇవ్వకుండా, దానికి స్వల్ప శిస్తు రేటును మదింపు చేసి జమిందార్లకు ఇవ్వడం రెండవ పద్ధతి. ఈ రెండు పద్ధతులను కలిపి ఏదో విధంగా ఉపయోగించాలనే సూచనలు కూడా చేయబడినాయి. ఈ సాహసవంతమైన నిర్ణయాలలో ఏ ఒక్కటీ పూర్తిగా ఆచరణలోకి రాకముందే 1857 సిపాయిల తిరుగుబాటు ఈ ధోరణిని మార్చివేసింది. భూస్వాముల వ్యవహారంలో జోక్యం చేసుకోవాల్సిన అవసరం ఇక ఎంత మాత్రం లేదు. 1860 తర్వాత ధరలలో పెరుగుదల వల్ల ఆదాయం పెరిగి భూస్వాములు శిస్తును చాలా సులభంగా చెల్లించగలిగారు. పైన పేర్కొన్న ఏ పద్ధతిలోను ఇచ్చే నష్టపరిహారం గురించి వారికి ఆసక్తి ఏమాత్రం లేదు. మద్రాస్ ప్రభుత్వం కూడా గతంలో వలె ఎస్టేట్‌లను అక్రమించుకొనే పద్ధతికి స్వస్తి చెప్పింది. కొంత కాలం తర్వాత అవకాశం అందివచ్చినపుడు భారత ప్రభుత్వం, ఎస్టేట్‌ల స్వాధీనానికి ప్రభుత్వ ధనాన్ని ఖర్చు చేయడానికి అభ్యంతరం

తెలిపింది. మద్రాస్ అధికార వర్గం తమకు ఇష్టం ఉన్నా లేకపోయినా శాశ్వత ఒప్పందాలుగల ఎస్టేట్‌ల తో వ్యవహరించడంతోనే గడపవలసి వచ్చింది. వీరు ఎప్పుడైతే ఈ పరిస్థితిని గమనించారో, శాసన పరమయిన వ్యవహారంలో పునరుక్తి లేకుండా బెంగాల్ తరహాను అనుసరించడం ద్వారా సమయం, శక్తి ఆదాచేయవచ్చుననుకున్నారు. వాస్తవంగా ఈ రకమయిన పనులపై వారికి అంతగా ఆసక్తి లేదు కూడా. ప్రభుత్వం మాత్రం తమ స్వంత పరిపాలనా సంప్రదాయాన్నే అనుసరించాలని ఒత్తిడి చేసింది. ఇతర ప్రెసిడెన్సీల నుండి సిద్ధంగా వున్న శాసనాలను దిగుమతి చేసుకోవడాన్ని తిరస్కరించింది. పైగా తాము జమిందార్లతో సహజీవనం చేయవలసి వుంటుందన్న వాస్తవాన్ని చాలా మంది అధికారులు గుర్తించక పోవటం వల్ల జమిందారీ భూములలో రైతువారీ పద్ధతిని ప్రవేశ పెట్టాలన్న వారి పూర్వపు ఆలోచనలు మళ్ళీ తలెత్తాయి. మద్రాస్ అదికార యంత్రాంగం సాహసవంతమైన ప్రతిపాదనలు చేయడం వాటిని శాసన రూపంలోకి తేవడం పట్ల గొప్ప నిరాసక్తత చూపడం వంటి విచిత్రమైన సమ్మేళనాన్ని ప్రదర్శించింది. ఈ ప్రెసిడెన్సీలో ఏ విషయాన్ని అత్యవసరమైనదిగా భావించకపోవడమే దీనికి కారణమనిపిస్తుంది. భూస్వాములు గాని, రైతాంగం గాని ప్రశాంతతను భంగపరచలేదు. భూస్వాములు రైతాంగాన్ని నిర్బంధపెట్టే మరియు బలత్కారంగా దోచుకునే వారుగా కాక అసమర్ధులుగా, ముందుచూపు (దూరదృష్టి) లేని వారుగా వ్యవహరిస్తే, రైతాంగం విధేయత, శ్రమించే స్వభావం కలిగి ఉండేవారు. వడ్డీ వ్యాపారులు ఆ ప్రాంతంతో సంబంధాలు గల స్థానిక సంఘాలకు చెందినవారై, అధికారుల దృష్టి అంతగా పడకుండా తమ వ్యాపారాన్ని సాఫీగా కొనసాగించుకోవాలనే తాపత్రయం గలవారు. మద్రాస్ పరిపాలకులు భూస్వామి , రైతాంగం పట్ల వ్యవహార పరంగా, సిద్ధాంత పరంగా నడచుకొనేవారు. ఎలాంటి చర్యలు తీసుకోవలసిన అవసరం గాని కోరిక గాని లేక పోవడం వల్ల వ్యవహార పరంగాను, ప్రధాన సమస్యల నుండి లభించిన స్వేచ్ఛ వీరు ప్రతి ప్రశ్నకు ముందుగా సిద్ధంచేసుకున్న సిద్ధాంతపరమయిన ఆలోచనల ఆధారంగా స్పందించటానికి తగినంత సమయం దొరికింది. ఈ స్థితి సాహసవంతమైన ప్రతిపాదనలు, జ్ఞాన దాయకమైన నివేదికలు, చురుకైన పరిశీలనలు పూర్తి నిష్క్రియాపరత్వం నిండివున్న వాతావరణంలో తరుచుగా చోటు చేసుకోవటాన్ని విశదపరుస్తోంది.

ఇలాంటి సంప్రదాయం గల మద్రాస్ రాష్ట్రం (ప్రెసిడెన్సీ) కౌలుదారీ రక్షణకు ఇచ్చిన పిలుపుకు చాలా నెమ్మదిగా ప్రతిస్పందించింది. బెంగాల్ కౌలుదారీ చట్టం రూపొందించిన 32 సంవత్సరాల తర్వాత గాని తన స్వంత చట్టాన్ని సృష్టించ గలిగింది. ఇన్ని సంవత్సరాలు బెంగాల్ తరహా కౌలుదారీ విధానాన్ని లోతుగా అధ్యయనం చేయడానికే సరిపోయాయి. ఈ మధ్య కాలంలో అనేక (లెక్కలేనన్ని) ముసాయిదా బిల్లులు తయారయ్యాయి. ఇవి మద్రాస్ పాలకులు వివిధ ఆలోచనా ధోరణులను ప్రతిబింబించాయి. దాంతో పాటు బెంగాల్ పాలకులు

చేసిన అనేక తప్పులు పునరావృతం అయ్యాయి. తుది ఫలితం బెంగాల్ శాసనానికి ఏమంత భిన్నంగా లేదు. కాని, మద్రాస్ ప్రెసిడెన్సీ ఆ గమ్యం చేరటానికి తనదైన బాణీని కనుగొనాల్సి వచ్చింది. ఈ రెండు ప్రాదేశిక రాష్ట్రాలలో భాటక చట్టాలు వేర్వేరుగా ఉండడం తోనే ఈ తేడా మొదలయింది. 1859లో బెంగాల్ కోసం రూపొందిన ప్రముఖ భాటక చట్టం ఉత్తర మధ్య భారత దేశానికి విస్తరించింది. మద్రాస్ ప్రెసిడెన్సీ అంతకు మందే 1865లో తనకంటు భాటకం వసూలు చట్టాన్ని రూపొందించు కోవడం వల్ల బెంగాల్ చట్టం ఇక్కడ అన్వయింపబడ లేదు. రెండు చట్టాల్లోనూ ఒకే విధమయిన దోషాలున్నాయి. గతంలో ప్రస్తావించిన 1862లో నాటి పాలనాధికారి పీకాక్ చేసిన నిర్ణయం బెంగాల్ లో నిర్వహించిన పాత్ర ఎలాంటిదో మద్రాసు హైకోర్టు 1870లో ఇచ్చిన తీర్పులో స్పష్టంగా తెలుపబడింది. భూస్వామి భాటకాన్ని పూర్తి మార్కెట్ విలువ వరకు పెంచుకోవచ్చుని నిర్ణయిస్తే , మద్రాస్ న్యాయవాదులు ప్రతి రెవెన్యూ సంవత్సరం అంతానికి కౌలు నిర్ణయాలన్నింటిని రద్దు చేసుకోవచ్చునని తేల్చారు. ఈ భాటకం చట్టాలు రెండూ కౌలుదారుకు అవసరమయిన అతి ముఖ్యమైన రక్షణను కల్పించడంలో విఫలమయ్యాయి. దీన్ని మద్రాస్ ప్రభుత్వం పట్టించుకోలేదు. 1880 సంవత్సరంలో కరువు నివారణ సంఘం (famine commission) కౌలుదారీ శాసనాన్ని రూపొందించాలని అవశ్యకతను గుర్తిస్తూ చేసిన సూచనను గౌరవించక పోగా, మద్రాస్ అధికార, యంత్రాంగం ఈ సూచనను అధిక్షేపించింది. వాస్తవంగా సాగు చేసే వానిపై అతిగా దృష్టిని కేంద్రీకరించటం వల్ల తమ రైతువారీ పద్ధతి నిర్లక్ష్యానికి గురవుతుందేమోనని వీరు ఎప్పుడూ భయపడుతుండే వారు. కౌలుదారీ రక్షణ సంబంధమైన చర్యలు వారికే ముప్పు తెస్తాయని, భూస్వాములు కౌలుదార్లను తప్పించి రోజు వారీ కూలీలతోనే పని చేయించుకోవటానికి సిద్ధపడవచ్చునని వీరు వాదించారు. ఈ స్వభావం కలిగిన మద్రాస్ పాలకులు జమిందారీ ప్రాంతాలలో కౌలుదారీ రక్షణపై తమ ఆలోచన సారిస్తారని ఆశించలేము. దీని విషయమై ఏదో ఒకటి చేస్తే బాగుంటుందని అనుకున్నవారు కూడా రైతాంగం ఇలాంటి శాసనాన్ని గురించి డిమాండు ( ఒత్తిడి) చేయకపోవడం వల్ల అలాంటి ఆలోచనను మానుకున్నారు. ఎంతో జాప్యం తరువాత 1912లో కూడా కౌలుదార్ల స్థితిగతుల గురించి అంచనా వేయటానికి వచ్చిన ప్రత్యేక కమిటీ ముందు రెవెన్యూ కార్యదర్శి సాక్ష్యాన్ని తక్కువ చేసి చూపాడు. రెవెన్యూ యంత్రాంగంలోని ఒక సభ్యుడు, కొంత సానుభూతిని ప్రదర్శిస్తూ కౌలుదార్లు దారుణమైన పరిస్థితులలోనే ఉండి యుండవచ్చునని అంగీకరిస్తూనే, దేనినైతే వారు హక్కుగా కోరడం లేదో లేదా ప్రశాంతంగా వున్న ప్రస్తుత పరిస్థితులలో జోక్యం చేసుకోడానికి ఇష్టపడటం లేదో అలాంటి వారికి ఏ విధమైన హక్కులు కల్పించడమైనా తెలివి తక్కువ వ్యవహారమని భావించాడు. మొదటి ప్రపంచ యుద్ధానికి కొన్ని సంవత్సరాలకు ముందు మద్రాస్ పాలకులు

ఈ విధంగా ఆలోచిస్తే, వీరికంటె ముందున్న పాలకులు 1885లో ఏరకమయిన ఆతృత చూపకపోవడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. కౌలుదారీ శాసనం గురించి ఏదో ఒకటి చేస్తున్నట్లు కన్పించారు. ఇది కూడా బెంగాల్ తరహా ప్రభావం వల్లనో, భారత ప్రభుత్వం దీర్ఘకాలంగా ఒత్తిడి చేస్తున్నందువల్లనో జరిగింది. మద్రాస్ పాలకులకు కౌలుదారీ శాసనం రూపొందించటం అంటే ఎవరో ఒకరి నిర్దేశన వల్ల పని చేయడం తప్ప మరొకటి కాదు. ఈ శాసనాన్ని రూపొందిచటానికి వారు కావలసినంత సమయం తీసుకున్నారు. బిల్లును రూపొందిచడంలో పరస్పర విరుద్ధమయిన ప్రతిపాదనలు చేయడం వారికి శాసనం పట్ల నిర్దుష్టమైన ఉద్దేశ్యం ఆతృత లోపించడాన్ని ప్రతిబింబించాయి. చాలా సార్లు భారత ప్రభుత్వం ఇలాంటి ముసాయిదా బిల్లులను వెనక్కి పంపించి, మొత్తం విషయంపై సరియైన అవగాహనతో మళ్ళీ పని చేయాలని మద్రాస్ పాలకులను కోరింది. ప్రభుత్వం కంటె కేంద్ర ప్రభుత్వం ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధ కనబరచటం వల్ల ఈ సమస్య దాదాపు అనిశ్చితంగా కొనసాగింది. అందువల్ల శాసనం తయారవడంలో జరిగిన సుదీర్ఘ జాప్యానికి మనం ఆశ్చర్యపోనవసరం లేదు. ఇన్ని సంవత్సరాల తర్జన భర్జనల తరువాత కూడా మద్రాస్ ఎస్టేట్‌ల భూమి చట్టం బయటకు రాకపోవడమే ఆశ్చర్యకరమైన విషయం.

మొదటి ముసాయిదా బిల్లు 1887లో తయారయింది. ఇది 1865 భాటకం పునః స్వాధీన చట్టంలోని ముఖ్య లక్షణాలను, బెంగాల్ కౌలుదారీ చట్టంతో సంధానం చేయటానికి ఉద్దేశించబడింది. దీనిని రెవెన్యూ బోర్డు విమర్శించింది. బోర్డు సభ్యులు మద్రాస్‌కు అసంగతమైన బెంగాల్ తరహాను బదులు తెచ్చుకోవటానికి అనవసర ప్రయత్నంచేశారని, ఈ ప్రాదేశిక ప్రాంతానికి అవసరమయిన అనేక అంశాలను వదిలివేసారని అభిప్రాయపడినారు. రెవెన్యూ బోర్డు చేసిన ప్రతిపాదనలు రైతువారీ స్వభావాన్ని స్పష్టంగా ప్రతిపలింపజేసాయి. ప్రభుత్వం భాటకం రేట్ల రికార్డు, హక్కుల రికార్డును తయారు చేసే సామర్థ్యం కలిగి వుండాలి. జమిందారు యొక్క ఎస్టేట్ సర్వే చేయాలి. కౌలుదార్ల చేతుల్లో ఉన్న భూమిని భూస్వామి స్వీయ నియంత్రణలో ఉన్న భూమి నుండి వేరు చేయాలి. అప్పుడు కౌలుదార్ల ఆధీనంలో వున్న భూమిపై జిరాయితీ (స్వాదీన) హక్కు ఇవ్వాలి. భాటకానికి సంబంధించి నంతవరకు ఒప్పందం చేసుకొనే స్వేచ్ఛను రద్దు చేయాలి. మూడు సంవత్సరాలు మించి భాటకం బకాయిలు వుంటే వాటిని మాపీ చేయాలి. కౌలుదారుకు గతంలో ఉన్న ఋణం భారం నుండి అతనిని విముక్తం చేయకుండా, అతనికి మంచి భవిష్యత్తు కల్పిస్తామనే భరోసా ఇవ్వడం అర్థరహితమని ఐరిష్ అనుభవం ప్రస్ఫుటం చేస్తున్నది. రెవెన్యూ బోర్డు వేసిన ఈ పథకం క్రింది స్థాయి నుండి తొందర మరియు ఒత్తిడులు లేనప్పుడు మద్రాస్ పాలకులు చూపే సాహసానికి ఒక చక్కని ఉదాహరణగా చెప్పవచ్చు. ఈ పథకంలో కొంత అర్థం ఉన్నా, అది

అవాస్తవికమైనది. జిరాయితీ హక్కును భూమికి కల్పించడంపై కార్యదర్శి ప్రతిక్రియగా కొన్ని సంవత్సరాల క్రితం లార్డ్ రిప్పన్ బెంగాల్‌కు సంబంధించి చేసిన ప్రతిపాదనలపై వ్యాఖ్యను పోలి వుండి వచ్చునని అపేక్షించారు.

మద్రాస్ పాలకులలో ఇప్పుడు మూడు వర్గాలు తయారయ్యాయి. వీరు, 1865లో తయారయిన పాత చట్టానికి కొన్ని స్వల్ప సవరణలు తీసుకరావడంతో ఆమోదించాలనే వారు, బెంగాల్ తరహాను పాటించాలనేవారు, రెవెన్యూ బోర్డు పథకంతో ఏకీభవించేవారు. 1892లో బోర్డు ప్రతిపాదనలను మద్రాస్ ప్రభుత్వానికి సమర్పించినప్పుడు ఆ ప్రభుత్వంలో వున్న మెజారిటీ సభ్యులు బెంగాల్ తరహాకు అనుకూలమయిన ఆలోచనా ధోరణి కలవారే. అందువల్ల వారు ఆ ప్రతిపాదనలను త్రోసి పుచ్చారు. బెంగాల్ నమూనా పై ఆధారపడి తయారుచేసిన బిల్లు చిత్తు ప్రతిని భారత ప్రభుత్వానికి సమర్పించారు. భారత ప్రభుత్వం ఈ ముసాయిదా బిల్లును సమీక్షించేందుకు తగు సూచనలతో వెనక్కి పంపిన సమయానికి మద్రాస్ ప్రభుత్వంలో సభ్యుల శ్రేణి మారింది. రెవెన్యూ బోర్డు మాజీ సభ్యులలో కొందరు ప్రభుత్వంలో చేరారు. కొత్త సభ్యులు భారత ప్రభుత్వ విమర్శను సంతోషంగా అంగీకరించారు. ఎందుకంటె వారి ఆలోచనా సరళి సరయైనదేనని ఈ విమర్శ రుజువు చేసింది. అయితే వాస్తవంగా భారత ప్రభుత్వం, బెంగాల్ విధానాన్ని అనుసరించనందుకుగాను మద్రాస్ ప్రభుత్వాన్ని విమర్శించలేదు. ముసాయిదాను రూపొందించటంలో కొన్ని ముఖ్యమయిన అంశాలను వదిలివేసినందుకుగాను తప్పు పట్టింది. భారత ప్రభుత్వంలో ఈ విషయాలను చూస్తున్న మెక్‌డోనెల్, బెంగాల్,కౌలుదారీ విధానాన్ని చాలా దగ్గరగా పరిశీలించిన వాడవటం వలన మద్రాస్ ప్రభుత్వం రూపొందించిన ముసాయిదాలోని లోపాలను సులభంగా కనుగొన్నాడు. బెంగాల్ చట్టంలోని పదవ అధ్యాయంలోని ముఖ్యమయిన ప్రతిపాదనలేవి ఈ ముసాయిదాలో చోటుచేసుకోలేదు. కౌలుదార్ల జిరాయితీ హక్కులు సరిగా పరిరక్షించబడలేదు. ఉప-కౌలుదార్లు పూర్తిగా నిర్లక్ష్యం చేయబడినారు. 1898లో మద్రాస్ ప్రభుత్వం సవరించిన ముసాయిదాను భారత ప్రభుత్వానికి పంపింది. మెక్‌డోనెల్ ప్రస్తావించిన కొన్ని అంశాలను ఇందులోకి తీసుకున్నారు. ఉపకౌలుదార్లకు సంబంధించినంత వరకు మద్రాస్ ప్రభుత్వం ఏ మార్పు చేయడానికీ అంగీకరించలేదు. ఈ మార్పులు రైతువారీ పద్ధతి అమలులో ఉన్న ప్రాంతాలలో ప్రమాదకరమయిన పరిస్థితిని సృష్టిస్తాయేమోనని వీరు ఆందోళన చెందడమే దీనికి కారణమనవచ్చు. ఈ విషయంలో మద్రాస్ స్పష్టమైన విధానాన్నే ఎన్నుకున్నా, కొత్త ముసాయిదాలోని ఇతర అంశాలలో సందిగ్ధత నెలకొన్నది. మద్రాస్ ప్రభుత్వంలోని నూతన సభ్యులు, రెవెన్యూ బోర్డులోని మాజీ సభ్యులు భారత ప్రభుత్వంలో చర్చలో అంశమయిన బెంగాల్ ప్రమాణానికి కట్టుబడి వుంటూనే తాము కొన్ని ఇతర అంశాలను ప్రస్తావించటానికి

ప్రయత్నించారు. జమిందారీ పద్ధతి అమలులో వున్న ప్రాంతాలలోని జిరాయితీ హక్కులు గల కౌలుదార్లను, రైతువారీ ప్రాంతాలలోని శిస్తు చెల్లించే రైతులతో ఎలా సమానంగా చూడాలో నిర్ణయించే విషయమై కేంద్రానికి ప్రాదేశిక ప్రభుత్వానికి మధ్య తీవ్ర భేదాభిప్రాయం - తలెత్తింది. ఉదాహరణకు, భారత ప్రభుత్వం రైతువారీ ప్రాంతాలలోని శిస్తు చెల్లించే రైతులతో ఎలా సమానంగా చూడాలో నిర్ణయించే విషయమై కేంద్రానికి ప్రాదేశిక ప్రభుత్వం రైతువారీ ప్రాంతాల ప్రధాన హక్కయిన బదిలీ స్వేచ్ఛ హక్కును జిరాయితీ హక్కులున్న కౌలుదార్లకు సంక్రమించిపజేయాల్సి వుంటుందని అభిప్రాయం వెలిబుచ్చింది. దీనికి సంబందించి పూర్వపు శాసనాలు లేనందువల్ల, జమిందారీ ప్రాంతాలలో ఒప్పందాలకు సంబంధించిన సంపూర్ణ, నిరపేక్షమైన స్వేచ్ఛ ఉన్నందువల్ల, రైతులు పొందుతున్న హక్కులను - అదే విధంగా జిరాయితీ హక్కుగల కౌలుదార్లకు వెంటనే సంక్రమింపజేయటం సాధ్యం కాదని మద్రాస్ ప్రభుత్వం నిశ్చితంగా సమాధానం ఇచ్చింది. మద్రాస్ ప్రభుత్వం సాగుకు యోగ్యమై నిరుపయోగంగా ఉన్న భూమిపై జమిందార్ల నియంత్రణను పరిమితం చేసేందుకు సిద్ధంగా లేదు. అలాంటి భూమి ఒక సారి కౌలుకు ఇచ్చినట్లయితే, ఆ భూమిపై కౌలుదారు వంశపారంపర్య హక్కులు ఇవ్వవచ్చునని సూచించింది. వంశపారంపర్య హక్కు గురించి మద్రాస్ ప్రభుత్వం ఒక వినూత్నమైన పద్ధతిని సూచించింది. జిరాయితి హక్కును భూమిపై నిర్ధారణ చేసే ప్రతిపాదనను మళ్ళీ ప్రస్తావించలేదు. లార్డ్ రిప్పన్ ప్రతిపాదనలకు కార్యదర్శి తెల్పిన అభ్యంతరాలు, తన ప్రత్యక్ష నియంత్రణలో ఉన్న భూమిని గురించి ప్రత్యేకించి తేల్చి చెప్పలేని భూస్వాములున్న బెంగాల్‌కే వర్తిస్తాయనే అభిప్రాయం ముందుకు వచ్చింది. మరోవైపు మద్రాస్‌లో భూస్వామికి భూమిపై ఉన్న హక్కు (మెల్‌వారమ్), సాగుచేసే హక్కు (కుడివారమ్) చాలా స్పష్టంగా ఉన్నాయి. ప్రతి భూస్వామి తనకు ఏ భూమిపై ఈ రెండు హక్కులు ఉన్నాయో తెలుసుకోవలసి వుంటుంది. మద్రాస్ ప్రభుత్వం సరికొత్త స్వాదీనపు హక్కు ఇవ్వాలని నిశ్చయించుకున్నది. ఎప్పుడు, ఎక్కడ సాగుచేసారనే దానితో ప్రమేయము లేకుండా ఒక సారి పన్నెండు సంవత్సరాలపాటు భూమిని సాగుచేసిన ప్రతి రైతుకు ఈ హక్కు ఇవ్వాలని ప్రభుత్వం ఉద్దేశ్యం భూస్వాములు ప్రభుత్వానికి సమర్పించుకున్న అర్జీ (విజ్ఞప్తిని) లో నిగూఢమైన ఈ స్వాధీనపు హక్కును అపహాస్యం చేశారు. ప్రభుత్వం ఈ పద్ధతి ద్వారా ఏ హక్కులు లేని కౌలుదార్లను ఉపయోగించుకునే అవకాశం లేకుండా చేయ సంకల్పించిందని వీరు గ్రహించారు. ఎందుకంటే ప్రభుత్వం అమలు చేయాలనుకున్న ఈ విధానంతో క్రమంగా గ్రామంలో వున్న ప్రతి ఒక్కరికి జిరాయితీ (స్వాదీనపు) హక్కులను పొందేందుకు అర్హులవుతారు. వంశపారంపర్య హక్కుల ద్వారా భూమిపై స్వాదీనపు హక్కును సంక్రమింపజేసే పద్ధతిని మద్రాస్ పాలకులు సహజంగా ఎందుకో ఇష్టపడలేదు. కాని, ఈ

ప్రతిపాదనలో వంశపారంపర్య హక్కులకు ఊహించని ఉపయోగితను కట్టబెట్టారు. భూమి పరస్వాధీనం కాకుండా అడ్డుకోవాలన్న తమ విధానానికి ఈ ఆలోచన అనుకూలంగా లేదని, భారత ప్రభుత్వం తన అసంతృప్తిని వ్యక్తం చేసింది. 1898 ముసాయిదా బిల్లును పరిశీలించే భారత ప్రభుత్వంలోని ఒక సభ్యుడు మద్రాస్ రాష్ట్రం, బెంగాల్ చట్టం కంటె, మధ్య భారతంలోని ప్రాదేశిక ప్రాంతాల్లో అమలులో వున్న కౌలుదారీ విధానాన్ని అనుసరించి వుండాల్సిందని అభిప్రాయం వ్యక్తం చేసాడు. అయినా, అప్పుడే ఇది భారత ప్రభుత్వానికే సమర్పించిన రెండవ ముసాయిదా బిల్లు అవడం వల్ల ఇట్లాంటి కొత్త సూచనలు చేయడం. నిరుపయోగమని కూడా తెల్పాడు. వైస్రాయి లార్డ్ ఎల్గిన్ ఈ అభిప్రాయంలో ఉన్న విజ్ఞతనే , స్వీయ నిబద్ధతను హృదయ పూర్వకంగా అంగీకరించాడు. జిరాయితీ హక్కులు సంక్రమింపజేయడానికి సంబంధించిన అంశాలను తిరిగి వ్రాయాలని మాత్రమే కోరుతూ మద్రాస్ గవర్నర్ యొక్క శాసన మండలిలో బిల్లును ప్రవేశపెట్టడానికి ఆమోదముద్రవేసాడు.

భారత ప్రభుత్వం అనవసరంగా ఎంతో స్వీయ-నిబద్ధతను ప్రదర్శించింది. మద్రాస్ శాసన మండలిలో ఈ బిల్లు చర్చకు వచ్చినప్పుడు, ఈ బిల్లుకు బాధ్యత వహించే ప్రభుత్వ ప్రతినిధి, రెవెన్యూ బోర్డు సూచనలకు అనుగుణంగా శాసనం ఉండాలని తెల్పి చెప్పడంతో మొత్తం సమస్య మళ్ళీ మొదటికి వచ్చింది. ఈ దశలో బయటికి వచ్చిన కొత్త బిల్లు మద్రాస్ పరిపాలకుల వారి ఆవేశపూరితమైన మేధస్సును ప్రస్ఫుటం చేసింది. జమిందారీ ప్రాంతాలలో రైతువారీ విధానాన్ని విస్తరింపజేయాలని ఈ బిల్లు ప్రతిపాదించింది. రైతులు జమిందార్లకు చెల్లించే భాటకాన్ని రాబడిగా పరిగణించారు. ఈ చెల్లింపు రేట్లను 1801లో జమిందార్లు మొత్తం పొందిన వాటా ఆధారంగా క్రమబద్ధం చేయాలని కూడా పేర్కొనడం జరిగింది. ఇది జమిందార్ల ప్రధాన కౌలుదార్లతో ఒక రకమయిన శాశ్వత ఉప- ఒడంబడికకు దారి తీసింది. భారత దేశంలో కౌలుదారీ శాసనం రూపొందించడంలో జరిపిన సుదీర్ఘ చర్చలలో బయల్పడిన పథకాలన్నింటిలోకి ఇది అతి సాహసోపేతమయినదని ఖచ్చితంగా చెప్పవచ్చు. 1903లో ఈ కొత్త ముసాయిదా చేరగానే భారత ప్రభుత్వం నిశ్చేష్టిత మయింది. పోటీని పూర్తిగా తొలిగించి, 1801లోని సంప్రదాయ రేట్లకు మళ్ళిన ఈ పథకం, మద్రాస్‌లోనే కాక ఇతర ప్రాదేశిక ప్రాంతాలలో మొత్తం రెవెన్యూ వ్యవస్థను భగ్నం చేస్తుందని కేంద్రం మద్రాస్ ప్రభుత్వాన్ని హెచ్చరించింది. మద్రాస్ ప్రభుత్వం ఈ పవిత్ర సూత్రాన్ని ముందుకు తెస్తూ భారత ప్రభుత్వపు అనేక ఆలోచనలను నిరాకరించటంతో,, గతంలో తాను అంతగా ఆసక్తి చూపని ఒడంబడిక స్వేచ్ఛను గురించి ఈసారి మద్రాసు ప్రభుత్వానికి గుర్తు చేసింది. ఈ బిల్లుకు సంబంధించిన వ్యవహారాన్ని చూడవలసిన ఇబ్బటిసన్ అనే అధికారి కూడ ఈ రకంగా ఒకేసారి దూకుడుగా సంప్రదాయక రేట్లకు మళ్ళటం అనేది పోటీని నిర్మూలిస్తుందని అభిప్రాయపడినాడు. పైగా భూస్వామికి, రైతుకు మధ్య మధ్యవర్తులు చొరబడేందుకు అవకాశమిస్తుందని తెల్పాడు. ఇన్ని

అభ్యంతరాలు ఎదురయినప్పటికీ, ఎప్పటి వలెనే మద్రాస్ ప్రభుత్వం తనకు కావలసినంత సమయాన్ని తీసుకొని, ఇంకా కొన్ని సంవత్సరాల తరువాతనే ఈ సమస్యను పునరాలోచించింది. మొత్తం మీద ఈ సాహసోపేతమైన పథకాన్ని వదిలిపెట్టింది, బెంగాల్ ప్రమాణం మళ్ళీ ముందుకు వచ్చింది. 1801లో సంప్రదాయక రేట్లను విడిచిపెట్టి,. అంతిమంగా భాటకం పెంచడంపై బెంగాల్ చట్టంలో ఉన్నవాటిని పోలిన నియంత్రణలను అంగీకరించింది. ఇలాంటి నియంత్రణ వ్యవధి ఆ చట్టంలో 15 సంవత్సరాలుంటే, రెవెన్యూ ఒప్పందాల సమీక్షను 30 సంవత్సరాల వ్యవధిలో జరపటానికి ప్రతిపాదన చేసింది. ఈ మొత్తం కాలంలో భాటకం రేటు గరిష్ట స్థాయి $12^1/_2$ శాతం వద్దనే కొనసాగాలని నిర్ణయించింది. ఈ నియంత్రణ మరీ అతిగా వుందని కార్యదర్శి అభిప్రాయపడినాడు. రైతువారీ ప్రాంతాలలో రెవెన్యూ మదింపుపై జరిగిన సమీక్ష ఫలితంగా భాటకం రేట్లు గతంలో ఉన్న $12^1/_2$ శాతం కంటె ఎక్కువగా నిర్ణయించబడినట్లు వెల్లడయింది. చివరికి, భాటకం రేటు అదేశాతంలో కొనసాగినా, కాలపరిమితి మాత్రం 20 సంవత్సరాలకు కుదించబడింది.

భూమిని బదిలీ చేసే స్వేచ్ఛ సంబంధమైన ప్రధాన సమస్య పరిష్కరించడంలో బెంగాల్ వలె స్థానిక సంప్రదాయానికి వదలకుండా మద్రాస్ ప్రభుత్వం చట్ట పరమైన హక్కును ప్రసాదించింది. రైతువారీ ప్రాంతాలలో ఉన్న చట్టాలతో సంప్రదాయ నియంత్రణ లేవి పోటీ పడలేవని ఈ పద్ధతిని అనుసరించింది. భూమి పరాధీనం కాకుండా నిరోధించే ప్రశ్నపై ఒక ప్రత్యేక శాసనాన్ని రూపొందించాల్సిన అవసరం ఉండవచ్చునని అభిప్రాయపడింది. అయితే మద్రాస్ ప్రబుత్వం ఇలాంటి శాసనం తయారుచేయడం ఆవశ్యకతపై తన సందేహాన్ని కేంద్రానికి తెలియపరిచింది. భూమి బదిలీ చేసే స్వేచ్ఛను చట్టపరం చేయడంతో, దశాబ్దాల పాటు బెంగాల్ ప్రభుత్వాన్ని అనేక ఇబ్బందుల పాలు చేసిన ఈ సమస్యను మద్రాస్ ప్రభుత్వం చాలా సులభంగా మున్ముందు ఏలాంటి పునరాలోచనకు అవకాశం లేకుండా పరిష్కరించగలిగింది. బెంగాల్ ప్రాంతానికి తెలియని ఒక ప్రత్యేక సమస్య మద్రాస్ ఎదుర్కొవలసి వచ్చింది. అదే, ఈ కొత్త వ్యవస్థలో ఇనాందార్ల స్థానాన్ని నిర్ణయించే సమస్య 1905 వరకు వివిధ శాసన పరమయిన ప్రతిపాదనలలో ఈ సమస్యపై ఎలాంటి ప్రత్యేక శ్రద్ధ కనబర్చలేదు. 1865 భాటకం వసూలు చట్టంలోని ప్రతిపాదనల క్రింద ఇనాందార్లను, జమిందార్లతో సమంగా చూడటం వలన వీరిపై ప్రత్యేక శ్రద్ధ చూపాల్సినంత కారణం కూడా కల్పించలేదు. అయితే ఈ చట్టం ముఖ్యంగా భాటకం సాధించుకోవడానికి సంబంధించినది కనుక ఈ విషయంలో పై ఇరువురు ఒకే స్థాయిలో ఉన్నారు. కౌలుదార్ల స్వేచ్ఛగా బదిలీ చేసుకోగల జిరాయితీ హక్కులు మంజూరు చేయడం గురించి వచ్చేసరికి ఇనాందార్లు అప్రమత్తులయ్యారు. అయితే, వారి స్వల్పకమతాలను. మద్రాస్ ఎస్టేట్‌ల భూమి చట్టం పరిధిలో ఎస్టేట్లుగా వర్గీకరించాలా, లేదా అన్నదే ప్రధాన సమస్యగా మిగిలిపోయింది.

ఈ కాలం నాటికి మద్రాస్ ప్రెసిడెన్సీలో దాదాపు మూడు (3) మిలియన్ ఎకరాల భూమి ఇనాందార్ల చేతుల్లో వుంది. అనేక మంది క్రింది స్థాయి ఉద్యోగస్తులకు, పూజార్లకు పండితులకు, మత పరమయిన సంస్థలకు దాదాపు 5000 గ్రామాలను ఇనాంగా ఇవ్వడం జరిగింది. శాశ్వత ఒడంబడికలు జరిగిన తరువాత కూడా జమిందార్లు ఈ రకమయిన ఇనాంలు ఇవ్వడం చూడవచ్చు. ఇనాందార్లలో చాలా మంది బ్రాహ్మణులే అయినా, ముస్లింలు, ఇతర కులాలకు చెందివారు కూడా వున్నారు. జీవ సంబంధమైన నిర్ధారణ ఇక్కడ పనిచేసింది. మత పరమయిన సంస్థలకిచ్చిన ఇనాంలు తప్ప మిగతావి మొదటనే స్వభావరీత్యా చాలా చిన్నవిగా ఉన్న ఎస్టేట్లను విఘటనకు గురి చేయడం జరిగింది. అందువల్ల చాలా మంది ఇనాందార్లు పేదలే వీరిని అసలయిన జమిందార్లతో పోల్చడం ఎంత మాత్రం సబబు కాదు. వారు ఎంత పేదలయితే అంతగా వారు తమ కౌలుదార్లను దోపిడి చేయటం మీద ఆధారపడవలసి వచ్చేది. ఎందుకంటే, వీరిలో చాల మంది సాగుదార్లు కాదు. బెంగాల్‌లోని మధ్య తరగతికి చెందిన విద్యావంతులయిన రైతులు బర్గదార్లను దోపిడి చేయడం తమ హక్కుగా భావించినట్లే, మద్రాసు ప్రెసిడెన్సీలో ఈ కోవకు చెందిన ఇనాందార్లు తమ కౌలుదార్లపై నియంత్రణ గురించే మధన పడేవారు. చాలా సందర్భాలలో వీరు బానిసల కంటె ఎక్కువగా ఏమీ చూడలేదని చెప్పుకోవడం జరిగింది. ఇనాందార్ల చట్టంలోని అంశాలను బట్టి తమను జమిందార్లతో కలిపి చూడవద్దని, వారి సమస్యను ప్రత్యేకంగా పరిశీలించాలని మద్రాస్ ప్రభుత్వాన్ని ఒత్తిడి చేసారు. అయితే వారి వాదన ప్రకారం పేదలయిన తాము మరింత పేదలయిన కౌలుదార్లను దోపిడి చేసే హక్కుందనే పద్ధతిలో కాకుండా, ఇంతకు ముందే ప్రాచుర్యంలో వున్న మెల్‌వారమ్, కుదివారమ్‌ల మధ్య తేడాను వీరి వాదనకు ఆధారంగా చేసుకున్నారు. వ్యవసాయోత్పత్తిలో వచ్చే మిగులు ద్వారా తమ కుటుంబాన్ని గడుపుకోనటానికి ఉద్దేశించి ఇనాంలు ఇచ్చారు కనుక, ఇనాందారు మెలావారమ్ మాత్రమే కలిగి వుంటాడు. అయితే చాలా సందర్భాలలో తమకు మెల్‌వారమ్, కుదివారమ్ రెండూ ఉన్నట్లు ప్రకటించుకున్నారు. సగటు కమతం అతి చిన్నదవడంవల్ల భూమిపై ఉన్న ఈ రెండు హక్కుల మధ్య తేడా గుర్తించడంచాలా కష్టమయింది. అందువల్ల వారి వాదనలో కొంత సమంజసత కన్పించింది. ఇందుకు అనుగుణంగానే శాసన సభ్యులు ఇనాందార్లకు సంబంధించి ప్రత్యేక అంశాలను సిద్ధం చేసారు. చట్టం నిబంధనల ప్రకారం ఎస్టేటును నిర్వచించేటప్పుడు ఇనాం క్రింద ఉన్న అన్ని గ్రామాలను చేర్చి చెప్పడం జరిగింది. అతి చిన్న ఇనాంలను చట్టం నుండి తప్పించారు చాలా వరకు చిన్న ఇనాంలు రైతువారీ సగటు కమతం కంటె తక్కువగా ఉండటం వల్ల, రైతులకు గాని, కౌలుదార్లకు గాని ప్రభుత్వం ఏమీ చేయకపోవడంవల్ల, చట్టపరిధి నుండి ఇలాంటి ఇనాందార్లను తొలగించడం సరియైన చర్యయే అని చెప్పవచ్చు. ఈ రకమయిన వాదనకు ప్రభుత్వం అంతగా ప్రాధాన్యత ఇవ్వదలచుకోలేదు.

మెల్వారమ్ - కుదివారమ్ సముదాయాన్ని గురించిన చర్చ చాలా కాలం కొనసాగింది. ఖచ్చితంగా కొంతకాలం ప్రీవీ కౌన్సిల్ కార్యదర్శి తో సహా అందరు అధికారులను సందిగ్ధంలో ఉంచింది.

చట్టం ఆమోదం పొందిన వెంటనే, అందులోని లోపాలు బహిర్గతమయ్యాయి. మద్రాస్ ప్రభుత్వం చట్ట సవరణకు ఎంతోకొంత కార్యక్రమం చేపట్టడానికి సిద్ధమయింది. కాని, భారీ స్థాయిలో సవరణను నలుగురు సభ్యులు ప్రవేశపెట్టిన ప్రైవేట్ బిల్లుల వల్ల తరువాత ప్రత్యేక అధికారి నివేదిక వల్ల చివరగా జరిగిన, సాధారణ చర్చలు, మొదటి ప్రపంచ యుద్ధం వల్ల చాలా నెమ్మదిగా నడిచాయి. మరోసారి ముసాయిదా బిల్లుల ప్రక్రియ ప్రారంభం కాకమునుపే ప్రీవి కౌన్సిల్, ప్రస్తుతం నడుస్తున్న న్యాయ వ్యవస్థను తీవ్రమైన దాడులతో ధ్వంసం చేసింది. తనకు తెలిసిన, ఆశ్చర్యకరమైన అతి ప్రమాదభరితమైన రీతిలో ఈ దాడులు జరిగాయి. ఒక ఇనాందారు, మెల్వారమ్, కుదివారమ్ రెండూ కో[illegible]ంటున్నట్లయితే, జిరాయితీ హక్కుగల కౌలుదారు దీన్ని నిరూపించవలసిన బాధ్యత వుంటుందని ప్రీవీ కౌన్సిల్ 1918లో తీర్మానించింది ఇంతకు మునుపు ఎస్టేట్ల చట్టం క్రింద ఈ బాధ్యత ఇనాందార్లపై ఉండేది. ప్రీవీ కౌన్సిల్ తీర్మానం వీరికి కోరని వరమయింది. ఎందుకంటే, కౌలుదారును భూమిపై అతనికున్న హక్కును ఇతరులు ప్రశ్నించినప్పుడు ఆ హక్కును పొందేందుకు చూపటానికి కౌలుదారు సహజంగా కలిగివుండడు. ఇనాందార్లు సయితం ఇది అతి మంచితనాన్ని చూపుతోందని అంగీకరించారు. ప్రభుత్వం ఈ పరిస్థితిని ముసాయిదా బిల్లుకు తగిన సవరణ ద్వారా సరిదిద్ద వలసిన తప్పని స్థితి ఏర్పడింది. యుద్ధానంతర సవరణల పర్వం మరో ప్రధాన అంశంతో ప్రభావితమయ్యింది.

ప్రభుత్వం మొదటి రాజ్యాంగ సవరణల తాజా క్రమాన్ని అమలు చేయాలనుకున్నది. వెంటనే ఒక కొత్త ముసాయిదా బిల్లును సిద్ధం చేసి రెవెన్యూ బోర్డుకు, దీనిపై కొన్ని సంవత్సరాలపాటు పనిచేసిన కమిటీకి సమర్పించింది. తుదకు, పూర్తి స్థాయిలో కొత్త ముసాయిదా బిల్లు 1928లో బయటకు వచ్చింది. ఫలితంగా, బెంగాల్ కౌలుదారీ చట్టం రూపొందడానికి పట్టినంత కాలాన్ని తీసుకున్నది. మద్రాస్ ప్రభుత్వం శాసనం చేయడానికి ఇంకా సిద్ధంగా లేదు. ఇంకా కొన్ని సంప్రదింపులు జరపాలని కోరింది. ఎస్టేట్ చట్టం పేర్కొన్నట్లు భాటకానికి సంబంధించిన దావాలను పరిష్కరించటం రెవెన్యూ అధికారుల చేతుల్లోనే వుంచాలా? లేక పౌర న్యాయస్థానాలకు బదిలీ చేయాలా? అన్నది వివాదాస్పదమైన ప్రధాన సమస్య అయింది. ఇందుకు సంబంధించిన సమాధానం కొరకు రెవెన్యూ బోర్డును, హైకోర్టును మద్రాస్ ప్రభుత్వం ఆశ్రయించింది. వీరి నుండి వచ్చిన సమాధానం ఆధారంగా ప్రభుత్వం భాటక సంబందిత దావాలను రెవెన్యూ అధికారుల నిర్ణయానికే వదిలివేయాలని నిర్ణయించింది. మొత్తం మీద కొత్త ముసాయిదా బిల్లు 1932లో మద్రాస్ శాసన మండలిలో ప్రవేశ పెట్టబడింది.

ఈసారి కల్లా మాంద్య పరిస్థితులు రైతాంగం పై చూపుతున్న ప్రభావాన్ని గుర్తించటం వల్ల, శాసన కర్తలు చట్ట రూపకల్పనకు తొందరపడాల్సిన అవసరం ఉందని భావించారు. అనేక రైతు సంఘాలు అక్కడక్కడ సమావేశాలు జరిపి, శాసన మండలిలో కౌలుదార్ల ప్రయోజనాలను ప్రతిబింబించే వారికి తగు స్థైర్యాన్ని ఇవ్వటానికి ప్రయత్నించాయి. బొబ్బిలి రాజా ఆధ్వర్యంలో నడచిన జస్టిస్ పార్టీకి ఈ అంశంపై సరియైన ఉద్దేశ్యం, అవగాహన లేకపోయినా మండలి సభ్యుడొకరు ఈ పార్టీ ధనిక ప్రజాస్వామ్య వాదుల వర్గానికి చెందినదైనా, ప్రజాస్వామిక విధానాల పట్ల అచంచల విశ్వాసం గలది అని పేర్కొన్నాడు. రాబోయే ఎన్నికలపై దృష్టిగల జస్టిస్ పార్టీ, విస్తృత ఓటు హక్కు ద్వారా ఈ ఎన్నికలు నిర్వహింపబడతాయి కనుక ఆపార్టీ స్థాపకుడు బొబ్బిలి రాజా, అతనివైపు వున్న ధనిక ప్రజాస్వామిక వాదులు, ఈ చట్టంపై తమకెంతో ఆసక్తి ఉన్నట్లు ప్రదర్శించి జన బహుళ్యంలో ప్రాచుర్యం పొందాలని ప్రయత్నించారు. నిజానికి ఇనాందార్లకు ఈ పార్టీలో అంతగా ప్రాతినిధ్యం లేకపోవడం వల్ల వారికి న్యాయం జరుగక పోవచ్చు, ప్రభుత్వానికి, ఈ పార్టీకి మధ్య జరిగే చర్చల్లో వీరు పాల్గొనే అవకాశం కూడా లేదు. అందువల్ల జస్టిస్ పార్టీ ఎంతగా నటించినా 1933లో ఆమోదింపబడిన చట్ట సవరణ 1916లో ప్రీవీకౌన్సిల్ ఇచ్చిన తీర్పు కంటె ముందున్న పరిస్థితిని కాపాడటమే కాక ఇనాందార్ల క్రింద ఉన్న కౌలుదార్లకు స్వేచ్ఛగా బదిలీ చేసుకోగలిగే జిరాయితీ హక్కులను కల్పించింది. దీనిని ఇనాందార్లు తీవ్రంగా ప్రతిఘటించారు. మద్రాస్ ప్రభుత్వం చట్ట సవరణకు తన ఆమోదాన్ని ఉపసంహరించుకున్నది. ఇనాందార్లకు సంబంధించిన అంశాలను ప్రస్తుత సవరణలో నుండి తొలగించి, దాన్ని రెండవ చట్ట సవరణలో పరిశీలించాలని కోరుతూ బిల్లును శాసన మండలికి తిప్పిపంపింది.

చట్ట సవరణపై ఓటింగ్ అసహ్యకరమైన రాజకీయ పరిస్థితిని ప్రతిబింబించింది. ఈ స్థితి 1928లో జరిగిన బెంగాల్ తరహా అవగాహనకు అవకాశం ఇవ్వలేదు. పరస్పరం రాయితీలు ఇచ్చుకోవడానికి, అవకాశాలను అందిపుచ్చుకోవటానికి ఇనాందార్లకు ఏ రాజకీయ పార్టీ అండదండలు లేవు. తమ రోత పుట్టించే రాజకీయాలపైననే వీరు ఆధారపడి, ప్రతీకార చర్యలకు పూనుకున్నారు. దీన్ని తరువాత మరికొంత పరిశీలించడం జరిగింది. 1934 శాసన గ్రంథంలో ఈ మొదటి చట్ట సవరణ చేర్చబడింది. ఈ చట్టంలో నీటి పారుదలకు సంబంధించి ఒక ప్రత్యేక అధ్యాయాన్ని రూపొందించటం దీని అత్యంత ప్రధాన విజయమని చెప్పవచ్చు. మాగాణి, మెట్ట ప్రాంతాలకు భాటకం, శిస్తులలో తేడాలుండటం వల్ల వరిసాగుచేసుకునేందుకు వీలుగా మగాణి భూములకు స్థానికంగా నీటి వసతి అందించడం తప్పనిసరి కనుక మద్రాస్ ప్రభుత్వానికి ఇది ప్రాధాన్యత విషయమని చెప్పవచ్చు. మాగాణి భూములకు నీటి వసతిని విస్తృతం చేయటం ద్వారా రాబడిని పెంచుకోవచ్చునని ప్రభుత్వం ఆలోచన పాత చట్టంలో

నీటివసతి కల్పించవలసిందిగా అభివృద్ధి పనులను చేపట్టాల్సిందిగా జమిందారును నిర్బంధ పెట్టేందుకు గాని, ఆవిధంగా నీటి వసతి కల్పించనట్లయితే భాటకాన్ని తగ్గించేందుకు గాని రైతుకు అంతగా అవకాశం లేదు. తనే స్వయంగా నీటి వనరులను బాగు చేసి, అందుకైన ఖర్చులను భాటకంలో మినహాయించుకునే అవకాశం మాత్రం ఉండేది. ఇది వాస్తవంగా సమస్యకు నివారణయే కాదు. పైగా నిరోధించదగినది కూడా. కొత్త చట్టం ఈ వ్యవహారంలో రెవెన్యూ అధికారిని అత్యంత ముఖ్యమైన మధ్యవర్తిగా సృష్టించింది. జమిందారు నీటి వసతి కల్పించలేక పోయినట్లయితే తాత్కాలికంగా భాటకాన్ని తగ్గించేందుకు ఈ అధికారి ఆదేశాలు జారీ చేయవచ్చు. నీటి వనరులను బాగు చేయాల్సిన పరిస్థితుల్లో శిస్తు బకాయిలపై అనుసరించిన పద్ధతిలోనే జమిందారుపై కొంత భారం వేసేందుకు కూడా వీలున్నది. ఆచరణాత్మకంగా ఈ పద్ధతి భూమి సాగుచేసే కౌలుదార్లకు ఎంతో ప్రయోజనకారి అయింది. రాబోయే సంవత్సరాల్లో రాజకీయంగా ప్రాధాన్యత పొందగల వారు కూడా వీరేనని చెప్పవచ్చు. ఆ రోజుల్లో ప్రతి ఒక్కరు రాజకీయ పరమైన నాటకాన్ని రసవత్తరంగా నడిపించేవారు. తమకు వచ్చే ఓట్లపై ఎప్పటికప్పుడు లెక్కలు వేసుకునేవారు. ఇనాందార్ల సమస్యను పరిశీలించేటప్పుడు మద్రాస్ గవర్నమెంట్ బోర్డ్ సెషన్స్ కూడా కొత్త ఓటు హక్కును గమనంలోకి తీసుకోవాల్సి వచ్చింది. జమిందార్ల క్రింద ఉండే రక్షిత రైతులకు ఓటు చేసే హక్కు వుండగా, ఇనాందార్ల క్రింద ఉన్న కౌలుదార్లకు మాత్రం వారి హోదాను మెరుగుపరచనంత వరకు ఈ హక్కుకు అవకాశం ఉండదని, ఈ లోసుగును సరిదిద్దాల్సిన అవసరాన్ని గుర్తించాలని భారత ప్రభుత్వానికి విన్నవించాడు. కేంద్రం కూడా చట్ట సవరణలో ఉన్న సమస్యలను పరిష్కరించే ప్రయత్నంలోనే వున్నది.

రెండవ సవరణ బిల్లు ప్రతిపాదించాల్సిన సభ్యుడు మొదటి చట్ట సవరణలో వదిలివేసిన అవే అంశాలనే తిరిగి ప్రవేశ పెట్టాడు. శాసన మండలిలోని అత్యధికులు ఈ చర్యను సమర్థించటమే ఇందుకు కారణం. బయట ఎంత ప్రతిఘటన చూపినా ఇనాందార్లకు శాసన మండలిలో వారికి ఏమాత్రం బలం లేదు. ఇక ముందు ఎలాంటి శాసనం రూపొందిచేటప్పుడైనా ముందుగా ఇనాం భూములపై సమగ్ర సర్వే చేయాలని, ఆ తరువాతే నిర్ణయాలు తీసుకోవాలని కోరుతూ, ఈ బిల్లును పరిశీలించే సెలెక్ట్ కమిటీకి నివేదన సమర్పించారు. వీరి వాదనకు ప్రతిగా బిల్లులో చట్టం అమలులోకి వచ్చిన మొదటి రెండు సంవత్సరాలలో చట్ట పరమయిన విచారణ జరిపేందుకు వీలు కల్పించింది. ఇనాందార్లు ఆశించింది ఇది కాదు. వారు భవిష్యత్తులో శాసనం రూపొందించేందుకు ముందే సర్వే జరిగినట్లయితే వారి వాదనకు బలం చేకూరుతుందని, తమకు ప్రయోజన కారి కాని శాసనం వాయిదా పడవచ్చునని ఆశించారు. ఎన్నికల తర్వాత ''జమిందార్లకు, రైతులకు మధ్య ఉన్న అపవిత్ర కలయిక'' సమసి పోతుందని,

తమకు అనుకూలమయిన పరిస్థితులు ఏర్పడగలవని ఆశించారు. అయితే ఈ అపవిత్ర కలయిక' వీలయినంత త్వరగా బిల్లును తీసుకరావాలని కోరుతున్న మద్రాస్ పరిపాలకులను బలపరచటంతో ఇనాందార్ల తీవ్ర వ్యతిరేకత మధ్య బిల్లు ఆమోదింప జేసుకున్నారు. ఈసారి గవర్నర్ వీరికి ఏరకంగాను సహాయం చేయలేకపోయాడు. ఇక వారి ఆశలన్నీ కార్యదర్శి మరియు గవర్నర్ జనరల్‌పైననే ఉంచారు. వారైనా తమకు అనుకూలంగా ఉండకపోతారా అని ఆశించారు. ఇనాందార్ల మరియు వారి కౌలుదార్ల ప్రతినిధుల బృందం భారత ప్రభుత్వాన్ని ఆశ్రయించారు. కేంద్ర సచివాలయంలో తమ సమస్యకు అనుకూలంగా వ్యవహరించే కొంత మంది అధికారులను వీరు సంపాదించుకోగలిగారు. గ్రాహం మరయు గిరిజా శంకర్ బాజ్‌పాయ్‌లు సంయుక్తంగా తయారుచేసిన వివరణ పత్రం, గతంలో బెంగాల్ గవర్నరుగా పనిచేసిన ప్రస్తుత కార్యదర్శి అయిన మార్క్విస్ ను బాగా ప్రభావితం చేసింది. వైస్రాయి, లార్డ్ విల్లింగన్ , కార్యదర్శి కి వ్రాసిన లేఖలో తన సహచరులతో సుదీర్ఘ చర్చలు జరిపిన అనంతరం తాను ఇదివరకు బిల్లుకు ఆమోదం నిరాకరించటాన్ని గురించి పునః పరిశీలించి, అప్పటి చర్య సరియైనది కాదనే అభిప్రాయానికి వచ్చినట్లు తెల్పాడు. మద్రాస్ ప్రభుత్వం కావాలనే కొన్ని తప్పులు చేసినట్లు, దీని వల్ల ప్రభుత్వం, జస్టిస్ పార్టీతో లోపాయికారిగా వ్యవహరించినట్లు ఆపోహ కల్గించిందని, అయితే ఇది ప్రధాన సమస్య నుండి ప్రభుత్వ దృష్టిని మరల్చరాదని అభిప్రాయపడినాడు. కౌలుదార్ల సమస్యల తీవ్రతతో హింసాత్మక దోరణులు దేశంలో తలయెత్తే ప్రమాదం ఉందని, వీరి సమస్యలను నివారించడంలో ఆలస్యం జరిగే కొద్ది వినాశకరమైన ప్రచారానికి అవకాశం ఎక్కువగా వుంటుందని, రైతాంగ తిరుగుబాటు వంటి స్వభావం ఏదీ కన్పించక పోయినా కొత్తగా ఏర్పడే శాసన మండలులు అతి అత్రుతతో లొసుగులతో కూడిన మరియు కౌలుదార్ల భూములకు రక్షణ లేని రీతిలో శాసనాలు చేసే ప్రమాదం ఉందని కూడా ఈయన సందేహం వ్యక్త పరిచాడు. అయితే రాజ్య కార్యదర్శి దృష్టి ముఖ్యంగా రైతాంగ ఆందోళన గురించి కంటె ఇతర రాజకీయ పరిణామం పైననే ఉన్నది. ఒక సుదీర్ఘమైన తంతి ద్వారా చట్టానికి ఆమోదము తెలుప వొద్దని వైస్రాయ్‌కి ఆదేశాలు జారీ చేసాడు. చట్టం దురుద్దేశ పూరిత మయినదని, బ్రిటిష్‌వారి ఆలోచనా సరళికి అనుగుణమైనది కాదని తెల్పాడు. ఇనాందార్ల...ండి తీసుకున్న భూమిని కొత్తగా ఏర్పడిన హక్కుదార్లకు ఇవ్వవచ్చునని ఊహించాడు. అంతిమంగా ప్రస్తుతం జిరాయితీ హక్కుగల రైతుల చేతిలో ఉన్న భూమిపై తమకు కుదివారమ్ ఉన్నట్లుగా ఇనాందార్లు నిరూపించుకోగలిగినట్లయితే నష్ట పరిహారాన్ని నిర్ణయించేందుకు వీలుగా ట్రిబ్యునల్ ఏర్పాటు చేయవచ్చునని సూచించాడు. కార్యదర్శి ప్రతిక్రియను మద్రాస్ ప్రభుత్వం నిరసించింది. భారత ప్రభుత్వానికి పంపిన వినతి పత్రంలో దక్షిణ భారత దేశంలోని సమస్యను ఉత్తర భారత దేశం పరిస్థితుల దృష్టితో గ్రాహం మరియు బాజ్‌పాయ్ కార్యదర్శిని ప్రభావితం చేసారని,

ఈ మొత్తం సమస్యకు వీరే కారకులని ఆరోపించింది. కుదివారమ్, మెల్‌వారమ్‌ల మధ్యగల స్పష్టమైన తేడాకు ఉత్తర భారతదేశంలో ఎట్లాంటి సమాంతర పరిస్థితులు కల్పించవని తెల్పి చెప్పింది. జమీందార్ల మరియు ఇనాందార్ల కౌలుదార్లను ఒకే విదంగా చూడాల్సి వుంటుందని అభిప్రాయం వ్యక్తం చేసింది. మద్రాస్ ప్రభుత్వం తాను రూపొందించిన బిల్లు బ్రాహ్మణ వ్యతిరేక చర్య అని వచ్చిన విమర్శకు తీవ్రంగా స్పందించింది. మద్రాస్ శాసన మండలిలో బ్రాహ్మణ సభ్యుడే. ఈ బిల్లు బ్రాహ్మణేతరులపై కూడా ప్రభావం చూపించిందని పేర్కొనడం గమనర్హం. మద్రాస్ ప్రభుత్వం పంపిన పత్రానికి సమాధానంగా కేంద్రం జమిందారుకు, ఇనాందారుకు మధ్య తేడా వుందని పునరుద్ఘాటించింది. గ్రహమ్, బాజ్‌పాయ్‌లు తాము సూచించిన పద్ధతిని అనుసరించాలని ఒత్తిడి చేసారు. భారత దేశంలో అప్పటి ప్రముఖ న్యాయ నిపుణుడయిన తేజ్ బహదుర్‌సప్రు కూడా ఈ పద్ధతిని ఆమోదించినట్లుగా చెప్పుకోవడం జరిగింది. సంబందిత అధికారుల మధ్య జరిగిన తదనంతర చర్చల్లో నష్టపరిహారంగా చెల్లించాల్సిన మొత్తం, దాని మదింపు మరియు నిర్ధారణ ప్రధాన అంశాలయినాయి. కౌలుదార్లకు రాయితీ హక్కులు కల్పించడంలో తనకెంత మాత్రం అభ్యంతరం లేదని కార్యదర్శి విస్పష్టంగా చెప్పడంతో ఇవి ప్రధాన చర్చనీయాంశాలయినాయి. ఇనాందార్లు చివరి కంటా పొరాడారు. నష్టపరిహారంగా ఇచ్చే మొత్తం చాలా తక్కువగా ఉంటుందని, మద్రాస్ వంటి దూర ప్రాంతంలో వున్న ట్రిబ్యునల్ రాకపోకలు సాగించడం అతి కష్టమయినదవడం వల్ల చాలా మంది ఇనాందార్లు నష్ట పరిహారాన్ని కోరడానికి కూడా ముందుకు రాలేకపోయారని వాదించారు. ప్రభుత్వానికి సమర్పించిన విజ్ఞాపనలో, గణాంక సమాచారం ఆధారంగా మెజారిటీ ఇనాందార్లు 10 ఎకరాల కంటే తక్కువ భూమి కలిగి వున్నారని పేర్కొన్నారు. ఈ మధ్య కాలంలో మద్రాస్ ప్రభుత్వం మద్రాస్ ఎస్టేట్ భూముల (మూడవ సవరణ) చట్టం తయారీలో నిమగ్నమయింది. ఈ సవరణలో కార్యదర్శి ఆదేశానుసారం కొంత నష్ట పరిహారం ఇవ్వాలనే ఏర్పాటు చేసింది. ఒక సంవత్సరపు భాటకాన్ని పరిహారంగా ఇస్తే సరిపోతుందని అభిప్రాయపడింది. సెలెక్ట్ కమిటీ ఈ మొత్తం ఒక సంవత్సరపు భాటకానికి రేట్లు ఉండాలని నిర్ణయించింది. ఎన్నికలకు ముందు అంతమ తీర్పుగా ఈ చట్టాన్ని ఆమోదించిన శాసన మండలి నష్టపరిహారం మొత్తాన్ని మళ్ళీ తగ్గించింది. ఈ మొత్తం వ్యవహార సరళిపై ఒక స్థానిక దిన పత్రిక తన ప్రముఖ వ్యాసంలో శాసన మండలి సభ్యుడు'' ఇక ఇనాందార్లను పూడ్చి పెట్టడమే మిగిలింది '' అని వ్యాఖ్యానించినట్లుగా ఉటంకించింది. దిక్కార పూరితమయిన ఈ సమాధానాన్ని గవర్నర్ జనరల్ ఆమోదించగలడా? జమిందార్లకు ఇనాందార్లకు సమానమైన నష్టపరిహారాన్ని ఇవ్వాలని డిమాండు చేసిన ముందుతరం వారికి ఏమని సమాధాన మివ్వగలడు ? అని ఆ పత్రిక సంపాదకుడు ప్రశ్నించడం చూడవచ్చు. ఈ సారి చట్టానికి నూతన వైస్రాయి లార్డ్ లిన్‌లిత్‌గో తన ఆమోదాన్ని తెల్పాడు. కొత్తగా ఏర్పడిన మండలులు మరికొన్ని శాసనాలు రూపొందించడంలో నిమగ్నమయ్యాయి. సాధికారికంగా హక్కులు గల రైతుల కంటె పై స్థాయిలో ఉన్నవారి భూ సంబంధిత ప్రయోజనాలకు మాత్రం రోజులు దగ్గర పడినాయి.

ఎనిమిదవ అధ్యాయం

# ఆగ్రా, ఔథ్‌ల సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలు

## వాయువ్య ప్రాదేశిక ప్రాంతాల సంప్రదాయం

ఉత్తర భారత దేశంలో బ్రిటిష్‌వారి వ్యవసాయ విధానానికి నాందీ ప్రస్తావన వాయవ్య ప్రాదేశిక ప్రాంతాలలోనే జరిగింది. గ్రామీణ రైతాంగానికి రక్షణ కల్పిస్తూ, భూస్వాములకు తగు నియమనిబంధనలు సూచించే శక్తి వంతమయిన రెవెన్యూ పరిపాలనా సంప్రదాయం సిపాయిల తిరుగుబాటుకు కొన్ని దశాబ్దాల ముందే చాలా ఖచ్చితమైన రీతిలో ఏర్పాటయి వున్నది. ఆ తరువాత ఈ పద్ధతి క్రమంగా పంజాబ్, మధ్య ప్రాదేశిక ప్రాంతాలకు కూడా విస్తరించింది. ఔధ్ ప్రాంతానికి ఈ సంప్రదాయాన్ని విస్తరింపజేయడం కష్టతరమయింది. బ్రిటిష్‌పరిపాలకులలో కులీన వర్గానికి చెందిన వారు అక్కడి తాలుక్‌దార్లను గొప్ప జమిందారీ వంశజులుగా భావించేవారు. సిపాయిల తిరుగుబాటు తర్వాత వీరి స్థితి మరింత పటిష్టమయింది. ఉత్తరాది ప్రాదేశిక ప్రాంతంగా పిలవబడిన సంయుక్త ఆగ్రా, ఔథ్‌ల ప్రాదేశిక ప్రాంతాలు భిన్న వ్యక్తిత్వాలకు ఆలవాలమయినాయి. వాయువ్య ప్రాంతాల, ఔథ్ ప్రాంతంలోని సంప్రదాయాలు పరస్పర విరుద్ధమయినవి అయినప్పటికి కౌలుదారీ శాసనానికి సంబంధించి పరస్పరం ఇచ్చి పుచ్చుకోగల కొన్ని అంశాలున్నా అవి సమస్యను, కొంత జటిలం చేయడానికే ఉపకరించాయి.

వాయవ్య ప్రాదేశిక ప్రాంతాలు, ఔథ్ నవాబు తన అధికారాన్ని మిగతా రాజ్యంలో నిలబెట్టుకోవడానికి బ్రిటిష్ వారికి 19వ శతాబ్ది ప్రారంభంలో సమర్పించుకున్న విశాల భూభాగంగా చెప్పవచ్చు. బ్రిటిష్‌వారు అప్పటికే అక్కడ ఆచరణలోవున్న పరిపాలనా విధానాన్ని అందిపుచ్చుకొని, దాన్ని మరింత పటిష్టపరిచారు. ఈ రకమయిన పాలనా యంత్రాంగంలో రెవెన్యూ అధికారి మరెక్కడ లేనంతగా అధిక ప్రాధాన్యత కలిగివున్నాడు. రైతువారి పద్ధతి అమలులో ఉన్న దక్షిణాది ప్రాంతాలలో రెవెన్యూ అధికారి భూమితో వ్యవహరిస్తే, ఉత్తరాది రాష్ట్రాలలో వ్యక్తులతో వ్యవహరించేవాడు. సంబంధిత చట్టం రూపొందడానికి ముందే రెవెన్యూ అధికారి భూమి శిస్తును, భాటకాన్ని నిర్ధారించి, భూస్వామికి, కౌలుదారుకు మధ్య సమతూకం సాధించటానికి ప్రయత్నించాడు. ఉత్తర భారత దేశంలోని రెవెన్యూ విధానానికి మూల పురుషుడయిన ఆర్.యమ్.బర్డ్ ఇక్కడి పద్ధతులు రైత్వారి ప్రాంతాలలో అనుసరించే పద్ధతులకంటే ఎంతో ఉన్నతమైనవని భావించాడు. ఆ ప్రాంతాలలోని పద్ధతులను గర్హించాడు కూడా. మద్రాస్ రాష్ట్రంలో మున్రో అనుసరించినట్లు జిల్లా మొత్తానికి శిస్తు చెల్లించవలసిన

సమగ్రమొత్తాన్ని ముందుగా నిర్ణయించి, ఆయా కమతాలను విభజించే పద్ధతికి పూర్తి భిన్నంగా ఆర్.యమ్.బర్డ్ ప్రతి కమతం యొక్క భాటక విలువను ముందుగా నిర్ధారించుకొని, దాన్ని హక్కుల రికార్డులో నమోదు చేసి దాని ద్వారా జిల్లా చెల్లించాల్సిన సమగ్ర శిస్తు మొత్తాన్ని నిర్ణయించే పద్ధతిని అమలు పరిచాడు. ప్రారంభంలో నవ్య సంప్రదాయవాదుల ఆర్థిక భాటక సిద్ధాంతాన్ని, అమలులో వున్న మార్కెట్ రేటును నిర్ధారించుకునేందుకు రెవెన్యూ అధికారి ఆచరించే సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని భాటక విలువ నిర్ణయించ బడేది. అసలు మార్కెట్ రేటు అనేది అందుబాటులో లేదనేది క్రమంగా మరింత స్పష్టమయినపుడు, స్థానిక ఆచారాన్ని సాగుదారు కులాన్ని, భూస్వాముల ఆలోచనను బట్టి భాటకం రేట్లు రకరకాలుగా వుండేవి. ఈ రేట్లు ఎలా వుంటే అలాగే రికార్డులలో నమోదు చేయబడేవి. రెవెన్యూ అధికారి తన స్వీయ నిర్ణయం ప్రకారం గణించే సగటు రేట్లనే 'అమలులో వున్న భాటకం రేటు' గా అంగీకరించబడేది. దీనితో భాటకంతో పాటు భూమి శిస్తును నిర్ణయించగల అధికారం రెవెన్యూ అధికారి చేతుల్లో వుండేది. భూమి శిస్తు, భాటకానికి కొంత నిశ్చిత నిష్పత్తికి అనుగుణంగా ఉంటుంది కనుక, అమలులో వున్న భాటకం రేటు తక్కువగా ఉంటే ప్రభుత్వం రాబడిని కోల్పోవలసి వస్తుంది. అందుకే, భూస్వామికి, కౌలుదారుకు మధ్య సమతూకాన్ని కాపాడాలని అధికార వర్గం ప్రయత్నించడం కోశపరమయిన అవసరాల దృష్ట్యా ప్రభుత్వ రాబడిని పెంచేందుకు ఉద్దేశించబడినదే తప్ప ప్రజా సంక్షేమం కోసం మాత్రం కాదు. భాటకం, కౌలు సంబంధమయిన వివిధ కేసులలో న్యాయపరమయిన విధులను కూడ రెవెన్యూ అధికారికి అప్పగించటం వల్ల, అతని పాలనా పరమయిన నియంతృత్వ ధోరణి మరింత పెచ్చరిల్లేందుకు దోహదమయింది. వ్యవసాయ క్షేత్రంలో తాను ఏదైతే నిర్ణయించాడో దాన్ని న్యాయస్థానంలో నిలబెట్టుకొనే అవకాశం ఏర్పడింది. రెవెన్యూ అధికారులు తమ పాలనా పరమయిన, న్యాయసంబంధమైన అధికారాలతో కౌలుదార్లను రక్షించటానికి కృషి చేస్తున్నప్పుడు కౌలుదారీ శాసనం చేయవలసిన అవశ్యకత అంతగా కన్పించదు. వంశాను క్రమాణికంగా జిరాయితీ హక్కులు పొందడానికి అనుసరించిన 'పన్నెండు సంవత్సరాల' నిబంధనకు మూలం వాస్తవంగా ఈ ప్రాదేశిక ప్రాంతంలోని పాలనా సంబందిత ఆచరణ నుండే ఉద్భవించిందని చెప్పవచ్చు. అందువల్ల 1859 లోని పదవ చట్టాన్ని ఇక్కడ నవోన్మేషిత మార్పుగా గుర్తించలేదు. పైగా ఈ చట్టం ఉత్తర భారతదేశంలోని పరిపాలకుల కొన్ని అధికారాలను తగ్గించి వారి వ్యవహార సరళిలో ఆటంకాన్ని కల్గించింది. 1862లో న్యాయమూర్తి పీకాక్ తీసుకున్న దురదృష్టకరమైన నిర్ణయం ఈ అధికారులకు అశనిపాతమైనప్పటికి, 1865లో Great rent case పై వెలువడిన తీర్పు వీరికి కొంత ఊరట కల్గించింది. బెంగాల్‌లో ఈ కేసుకు సంబంధించి న్యాయమూర్తులు రూపొందించిన స్థూల ఉత్పత్తి నిబంధన అంతగా ఉపయోగపడలేదు. భూస్వామి, కౌలుదారు

నిబంధన ప్రకారం పూర్వపు పద్ధతుల నుండి వైదొలగటానికి అంగీకరించక పోవడమే దీనికి కారణం. రెవెన్యూ అధికారులకు భూస్వామిని కౌలుదార్లను నియంత్రించగల శక్తి వున్న వాయవ్య ప్రాంతాలలో ఈ నిబంధన మరికొంత ఉపయోగకారిగా వుండేది. అందుకే ఈ ప్రాదేశిక ప్రాంతంలో కౌలుదారీ శాసనం భిన్న స్వరూపాన్ని సంతరించుకున్నది. బెంగాల్‌లో పౌర న్యాయస్థానాలకు అందుబాటులో వున్న పరిష్కార మార్గాల ద్వారా 1859లోని పదవ చట్టం వదిలివేసిన అంశాలను భర్తీ చేయగల మరో ముసాయిదా శాసనాన్ని రూపొందించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. వాయవ్య ప్రాదేశిక ప్రాంతాలలో, కౌలుదార్ల భవిష్యత్తును రెవెన్యూ అధికారుల చేతుల్లో కేంద్రీకృతం చేస్తూ, వారిని మరింత శక్తి వంతం చేసే యుక్తి పూర్వకమైన విధానాన్ని అవలంభించటానికి ప్రయత్నించారు. 1873 కౌలుదారీ చట్టం, భూమి శిస్తు చట్టాన్ని పోలివున్నది. రెవెన్యూ పరిపాలనా పద్ధతులను వివిధ నిబంధనల క్రింద మార్పులకు గురిచేసింది.

ఈ శాసనపు ముసాయిదాను తయారు చేసేటప్పుడు వివాదాస్పదమయిన అంశాలను గురించి వర్ధించడం జరిగింది. ఈ అంశాలు ఉత్తర భారతదేశ పరిస్థితులకు అనుగుణమయినవి. బెంగాల్‌లో ఇందుకు సమాంతర పరిస్థితులు కన్పించవు. కౌలుదార్ల భద్రత గురించి ఆందోళన, ప్రభుత్వ భూములకు ఇవ్వవలసిన నిర్వచనం గురించిన చర్చ, రెండూ చోటు చేసుకున్నాయి. భూస్వాములకు కొంత రాయితీ ఇచ్చే విధంగా ఈ నిర్వచనంలో రెవెన్యూ అధికారులు పరిశీలనకు అనుకూలంగా నమోదు చేసిన ప్రభుత్వ భూములతో పాటు 12 సంవత్సరాలుగా వ్యవసాయ కూలీల సహాయంతో స్వయంగా సాగుచేసుకుంటున్న భూమిని కూడా చేర్చటం జరిగింది. తద్వారా భూస్వామికి ఏదో విధంగా స్వాధీన హోదా సంపాదించుకుని కౌలుదార్లను భూమినుండి తొలగించగల అవకాశం లభించింది. జిరాయితీ హక్కులుగల కౌలుదార్ల స్థితి గాలికి వదిలివేసారు. భూస్వామి కౌలుదారును భూమినుండి తొలగించకుండా, అతనికి చెందవలసిన వంశపారంపర్య హక్కులను కాలరాయకుండా నియంత్రించే ఎలాంటి నిర్దుష్టమైన చర్యలు తీసుకోబడలేదు. పైగా, బెంగాల్ శాసనం కల్పించిన జిరాయితీ హక్కు (స్వాధీనపు) గల కమతాన్ని బదిలీ చేసుకోగల హక్కును, ఈ చట్టం నిరోధించింది. ఈ చట్టానికంటె ముందు రూపొందిన ముసాయిదా, 1885 బెంగాల్ శాసనం వలె ఈ హక్కును స్థానిక సంప్రదాయానికి వదిలివేసింది. వారసత్వాన్ని బట్టి హక్కులు బదిలీ చేయడం 'పూర్వీకుల' సంబంధంగా గత ముసాయిదా గుర్తించింది. దీన్ని ఒక విమర్శకుడు ''ఆదాంకు బంధువునని చెప్పుకోగల శక్తి గల'' ఎవడైనా కమతంపై స్వాధీనపు హక్కును కోరగలడని చమత్కరించాడు. తుది ముసాయిదా జిరాయితీ హక్కుగల కమతాలబదిలీ వారసత్వం వల్ల అంటే అతని తండ్రి నుండి మాత్రమే జరుగుతుందని స్పష్టం చేసింది. దాయాదులు, తత్సంబంధీకులు, మరణించిన హక్కుదారు జీవితకాలంలో భూమిని సాగుచేయడంలో పాలుపంచుకోనట్లయితే వారిని ఈ పరిధి నుండి మినహాయించటం జరిగింది.

బెంగాల్‌లో వలె భాటకాన్ని పెంచే విషయమై ఒక నిశ్చితమైన శాతంలో నిర్ధారణ కావాలని గాని, మరి ఎలాంటి స్పష్టమయిన నియంత్రణలు ఈ చట్టంలో చోటు చేసుకోలేదు. ఒక వ్రాత పూర్వక ఒప్పందం ద్వారాగాని, భాటకం, నిర్ధారణ చేసే అధికారి గాని భాటకాన్ని పెంచవచ్చు. పది సంవత్సరాల తరువాత లేదా నిర్ధారణకు సంబంధించి పునః సమీక్ష జరగనంతవరకు ఏది ముందయితే దాన్ని బట్టి మాత్రమే తిరిగి భాటాకాన్ని పెంచాలి. కొన్ని గ్రామాల సముదాయంలో భాటకం రేట్లను పోల్చి చూడడం ద్వారా అధికారి భాటకాన్ని ఏ విధంగా నిర్ధారణ చేయాలో చట్టంలో వివరించడం జరిగింది. కౌలుదార్ల గురించి ప్రభుత్వ భూములపై వారికి సంక్రమింప జేయ తలపెట్టిన స్వాదీనపు హక్కుల గురించి వారు సమస్యల సృష్టికర్తలు కాకుండా నిరోధించే ఏర్పాట్ల గురించి తుది ముసాయిదాలో తగిన వివరణ ఏదీ చోటు చేసుకోలేదు. మొదట, ఈ హక్కులను ముందుతరం వారికి కూడా ప్రసాదించాలని యోచించారు. ఇలాంటి వారు అధిక సంఖ్యలో ఉంటారని వీరిని సంతృప్తి పరచవలసిన అవసరం ఉందని భావించారు. కాని తుదకు ముందు తరం వారికీ హక్కు కల్పించాలన్న యోచనను మానివేసి, చట్టం ఆమోదం పొందిన తరువాత ఆస్తులను కోల్పోయిన వారికి మాత్రమే రక్షణ కల్పించాలని నిర్ణయించారు.

జిరాయితీ కమతాల బదిలీపై విధించిన నియంత్రణ పని చేయడంలో తలెత్తిన లోపాన్ని తన తీర్పు ద్వారా హైకోర్టు బహిర్గతం చేయడంతో, దీనికి ప్రతిగా చట్ట సవరణ చేయవలసిన అవసరం అతి త్వరలోనే ఏర్పడింది. కౌలుదారుకు రుణదాత కూడా అయిన భూస్వామి, రుణ బకాయిలపై న్యాయస్థానం నుండి నిర్ణయం పొందడం ద్వారా కౌలుదారును కమతాన్ని విక్రయించాల్సిందిగా, భూమిపై అతని హక్కులను కొనివేయడం ద్వారా కల్గించే ఇబ్బందుల నుండి కౌలుదారును కాపాడటానికి, భూస్వామిని ఇలాంటి చర్యలకు పూను కోకుండా నిరోధించటానికి చట్టంలో ఎలాంటి ఏర్పాట్లు పొందుపరచబడలేదని న్యాయమూర్తులు అభిప్రాయపడినారు. ఈ రకమయిన వ్యవహారాన్ని నిరోధించటానికి, అంశాల్ని మరింత విస్పష్టం చేయటానికి **1881**లో శాసనకర్తలు చట్ట సవరణను ఆమోదించారు. స్వల్ప సవరణలతో **1873** చట్టం **19**వ శతాబ్దం చివరిదాక కొనసాగింది. చట్టానికి భారీ సవరణలు చేయాల్సిన బెంగాల్ కౌలుదారీ శాసనం తరహాలో సమగ్ర అంశాలను చేర్చవలసిన అవసరం ఎంత మాత్రం లేదని ప్రాదేశిక ప్రభుత్వం భావించింది. అప్పటి లెఫ్టినెంట్ గవర్నర్ ఆల్‌ఫ్రెడ్ లియాల్ కూడా ఇదే మోస్తరు అభిప్రాయాన్ని బాహాటంగా వెల్లడించాడు. లార్డ్ రిప్పన్ వైస్రాయ్‌గా కౌలుదారీ శాసనాన్ని గురించి ఖచ్చితంగా పట్టించుకుంటున్న కాలంలో కూడా లియాల్ ఇదే సమాధానం పంపించాడు.

వాయువ్య ప్రాదేశిక ప్రాంతాలలో జిరాయితీ హక్కులు తగిన రీతిలో పరిరక్షింపబడుతున్నాయా ? లేదా ? అనేదే భారత ప్రభుత్వాన్ని కలవరపెట్టింది. ఈ రక్షణ విస్తరింపబడటానికి బదులుగా తగ్గిపోతున్నదనే అభిప్రాయం ఆరోజుల్లో బలంగా వుండేది. లియాల్ తన ప్రాదేశిక ప్రాంతంలో జిరాయితీ హక్కులుగల కౌలుదార్ల క్రింద ఉన్న భూమిలో మార్పు చేర్పుల గురించి సమగ్ర విచారణ జరిపి జిరాయితీ కమతాలు 13 శాతం తగ్గితే మరో 20 శాతం పెరిగాయని మొత్తం 7 శాతం నికరమైన పెరుగుదల ఏర్పడిందని తెల్పాడు. జిరాయితీ కమతాలు తగ్గటానికి వారసులు హక్కుగా నిరూపించుకోలేని కమతాల బదిలీపై నియంత్రణ ఉండటంవల్ల, ఆ కమతాలు తిరిగి భూస్వామిని చేరటం ప్రధాన కారణమని వాదించాడు. అతని అధికారులు మరికొన్ని కారణాలను చూపించారు. అలహాబాద్ జిల్లా పరిస్థితులపై రూపొందిన నివేదిక, జిరాయితీ హక్కులుగల రైతులు చెల్లించే భాటకం కంటె హెచ్చురేటును ఒప్పందాలను పునః సమీక్షించడం ద్వారా కౌలుదార్లు చెల్లించాలని నిర్ణయించటం వల్ల, భూస్వాములు భాటకాన్ని పెంచే ప్రయత్నం చేసారు. కౌలుదార్లు దీన్ని ఎదుర్కొన్నారు. ఈ నిశ్చయాత్మక పోరాటంలో ఎన్నో జిరాయితీ కమతాలను కోల్పోవలసి వచ్చింది, జిరాయితీ హక్కుగల రైతుల క్రింద ఉన్న భూమి గణనీయంగా తగ్గిపోయింది. మొత్తం ప్రాదేశిక ప్రాంతానికి సంబంధించిన గణాంక సమాచారం ప్రకారం కౌలుదార్లు సాగుచేస్తున్న భూమిలో సగటున 50శాతం జిరాయితీ హక్కుగల రైతుల చేతిలో వుండాల్సినదేనని వెల్లడిఅవుతున్నది. ఆరోజులలో భూస్వాముల క్రింద ప్రభుత్వ భూమి రూపంలో 2.8 మిలియన్ ఎకరాలు ప్రత్యేక్ష స్వీయ నియంత్రణలో అదనంగా 2.5 మిలియన్ ఎకరాల భూమి ఉండేది. జిరాయితీ హక్కుగల రైతుల చేతిలో దాదాపు 8 మిలియన్ ఎకరాల భూమి ఉండేది. వీరు దాదాపు 30 మిలియన్ రూపాయల భాటకాన్ని చెల్లించేవారు. ఏ హక్కులు లేని కౌలుదార్ల చేతిలో కూడా దాదాపు అంతే భూమి వుండేది. అదే స్థాయిలో భాటకాన్ని చెల్లించేవారు. ఉపకౌలుదార్లు 2 మిలియన్ ఎకరాల భూమి సాగుచేస్తూ 9.6 మిలియన్ రూపాయల భాటకాన్ని చెల్లింస్తుండేవారు. వీరు చెల్లించే భాటకం, కౌలదార్లు చెల్లించేదానికంటే ఎక్కువగా వుండటం చూడవచ్చు. ఈ ప్రాదేశిక ప్రాంతంలోని పశ్చిమ భూభాగంలో ఉప-కౌలుదార్లు ప్రముఖంగా కన్పిస్తారు. ఇదే ప్రాంతంలో జిరాయితీ హక్కుగల రైతులు అధిక శాతంలో ఉండటం కూడా వాస్తవం. ఈ సంపన్నమయిన ప్రాంతాలలో జిరాయితీ రైతులు ఉప-కౌలుదార్లను భరించగల శక్తిని కలిగి వుండేవారనేది ఈ ప్రాంతపు ప్రత్యేక పరిస్థితిని తెల్పుతుంది.

పై విచారణ ఆధారంగానే ఆల్‌ఫ్రెడ్ లియాల్‌వాయవ్య ప్రాదేశిక ప్రాంతాలలో భారీగా మార్పులతో శాసనాలు చేయాల్సిన అవసరం లేదని నిరూపించాడు. అందుకు అనుగుణంగానే భూస్వాములు కౌలుదార్లను ఒక కమతం నుండి మరొక కమతానికి మార్చడం ద్వారా వారికి

సంక్రమించాల్సిన వంశపారంపర్యమైన హక్కులను కాలరాయకుండా నిరోధించటానికి మాత్రమే సవరణ జరిగింది తప్ప మరెలాంటి గణనీయమైన మార్పులు ఈ ప్రాదేశిక ప్రాంతంలో చోటు చేసుకోలేదు. ఔధ్‌లో పరిస్థితి ఇందుకు భిన్నంగా వున్నది. తాలూక్ దార్ల ప్రాభల్యపు వట వృక్ష ఛాయలో జిరాయితీ హక్కులు ఎంత మాత్రం ఎదుగుదలకు నోచుకోలేదు. ఔద్ కోసం శాసనం రూపొందిచాలని లియాల్ సలహా ఇచ్చినప్పటికీ, తిరుగుబాటు తర్వాత తాలూక్‌దార్లను తిరిగి నియమిస్తూ బ్రిటిష్‌వారు వారికి ఇచ్చిన హామీలతో ఎలాంటి చర్యలకు అవకాశం లేకుండా పోయింది.

### 8.2 నిబద్ధత, రాజీ : ఔధ్‌లోని తాలూక్ దార్‌ల స్థితి.
### (Commitment and Compromise: the Case of Talukdars of Oudh.)

ఔధ్ తాలూక్ దార్ల స్థితిని కాపాడటానికి బ్రిటిష్ ప్రభుత్వం నిశ్చయించుకోవడం, బెంగాల్ శాశ్వత బడంబడిక కంటె ఎన్నో విధాలుగా అతి గంభీరమయినదిగాను, ప్రమాదకరమైనదిగా చెప్పవచ్చు. తాలూక్‌దార్లు ఒక్కొక్కరు వ్యక్తిగతంగా బ్రిటిష్‌వారి నుండి లిఖిత పూర్వకమయిన ఆధారపత్రాలను పొందారు. ఈ పత్రాల ద్వారా తాలుక్‌దార్ల హక్కులు ధృవ పరచబడినాయి. ఈ హక్కుల పత్రం నివాసేతర భూస్వామ్యానికి రాజముద్ర వేసినాయి. దీంతో తాలుక్ దార్లు తమ క్రింద పని చేసే రైతాంగాన్ని ఏ హక్కులు (రక్షణ) లేని కౌలుదార్లుగా చూసేవారు. తాలుక్‌దార్లకు భూమిపై హక్కు వారసత్వంగా లభించేది. అందుకు అనుగుణమయిన చట్టాన్నే పాటించేవారు. అదనంగా రూపొందించిన శాసనం వీరి ఎస్టేట్లు చెక్కుచెదరకుండా ఉండేందుకు ఉపకరించింది. వీరు ఏ విధంగాను పూర్వ కులీన వంశజులు కాకపోయినా తిరుగుబాటు జరిగిన రోజులలో వీరికి గల ప్రాభల్యాన్ని గమనించిన బ్రిటిష్ వారు ఈ తాలుక్‌దార్ల పట్ల భయం, భక్తి ప్రదర్శించడం నేర్చుకున్నారు. అందువల్లనే వీరు నవాబుల పాలనా కాలంలో అనుభవించని రీతిలో, బ్రిటిష్‌పాలనలో తమ స్థితిని ఎంతో పటిష్టం చేసుకోగలిగారు. భూస్వాముల క్రమాణికతను గమనంలోనికి తీసుకున్నట్లయితే వీరు జమిందార్ల కంటె జాగీర్‌దార్లకు దగ్గర గా ఉండేవారు. భారతీయ ప్రభుత్వాల పాలనలో జాగీర్దార్లు, జమిందార్ల తరహాలో నిలదొక్కుకున్నారు. నవాబుల పాలన నుండి బ్రిటిష్ పాలనలోకి మారిన తర్వాత తాలుక్‌దార్లు కూడా అదే పద్ధతిలో నిలదొక్కుకున్నారు. వారు తమ రాజకీయ అధికారాన్ని కోల్పోయినా స్థానిక వ్యవహారాలపై పూర్తి నియంత్రణను నిలబెట్టుకున్నారు. కాలక్రమంలో బ్రిటిష్ పరిపాలకులలో తాలుక్‌దార్ల పట్ల ప్రత్యేక ఆసక్తి గల వర్గం ఏర్పడింది. విదేశీ పాలకులకు పూర్తి మద్దతుగా వుండే ఔధ్ జమిందార్లుగా గుర్తింపబడిన వీరిని అవసర సమయాల్లో మద్దతు నివ్వడం గొప్ప విషయంగా భావించేవారు.

బెంగాల్‌లో వలె ఔథ్‌లో బ్రిటిష్ పాలకులు తాలుక్‌దార్లకు శాశ్వత ఒప్పందాన్ని సంక్రమింపజేయలేదు. వాయువ్య ప్రాదేశిక ప్రాంతాలలో ఆచరణలో వున్న తరహాలోనే కాలానుగుణమయిన ఒప్పందాలకు వీలుండేది. వాయువ్య ప్రాంతాలలో మాదిరిగా భూస్వామికి, కౌలుదారుకు మధ్య సమతూకాన్ని కాపాడటం రెవెన్యూ అధికారులకు ఇక్కడ సాధ్యపడక. తీవ్ర అసంతృప్తికి లోనవ్వాల్సి వచ్చేది. ముఖ్యంగా తాలుక్‌దార్ల క్రింద వుండే కౌలుదార్లకు ఏదైనా ఉపయుక్తమయ్యే చర్య చేపట్టడం పూర్తిగా ఇబ్బందికరంగా వుండేది. భూస్వాములకు, కౌలుదార్లకు మధ్య తలయెత్తిన తీవ్ర సంఘర్షణలు అధికారులను మేలుకొలిపాయి. ఈ కౌలుదార్లు మొదట స్వతహాగా చిన్న స్థాయి భూస్వాములుగా ఉండేవారు. క్రమంగా స్థాయి దిగజారి మొదట కౌలుదార్లుగా ఆ తరువాత ఏ హక్కులు లేని కౌలుదార్లుగా మారారు. బ్రిటిష్ వారినుండి పొందిన అధికార పత్రంలో తాలుక్‌దార్ తన క్రింద పని చేసే కౌలుదార్ల సంక్షేమం గురించిగాని, వ్యవసాయాన్ని మెరుగుపరిచే విషయమై గాని అంతస్పష్టమైన వివరణ అంటూ ఇవ్వలేదు. అందువల్ల ఈ బాధ్యతలను నిర్వర్తించటంలో తాలుక్‌దార్ విఫలమయ్యాడని తేల్చి చెప్పటానికి సరియైన ప్రాతిపదిక ఏదీ లభించదు. ఈ పరిస్థితి బ్రిటిష్ పరిపాలకులను కొంత నిరుత్సాహానికి గురిచేసింది. శాసనం చేయవలసిన అవశ్యకత ఏర్పడింది. లార్డ్ లారెన్స్ వైస్రాయ్‌గా వున్న కాలంలో ఈ సంబంధంగా కృషి ప్రారంభమయినా, ఫలితం పూర్తి నిరుత్సాహపూరితంగానే వచ్చింది. బ్రిటిష్ పరిపాలకులలోని కులీన వర్గం యొక్క ఆలోచనా సరళి ప్రభావాన్నుండి పంజాబ్ విధానాన్ని (వ్యవస్థను) కాపాడేందుకు లారెన్స్ పంజాబ్‌లో శాసనం తేగలిగాడు. ఔథ్‌కు చెందిన కూలీన వర్గం పరిస్థితిని యధాతథంగా కొనసాగించటానికే సంకల్పించింది. కొంత మెరుగయిన స్థితిని ఎదుర్కొన్నది. బ్రిటిష్ పాలకులు, తాలుక్ దార్లతో కుదుర్చుకొన్న ఔథ్ అవగాహన వల్ల తాలూక్ దార్లు, కౌలు భద్రత అనుకూలమయిన భాటకం రేట్లు నిర్ణయించటం వంటి రాయితీలను పూర్వపు చిన్న జమిందార్ల నుండి కౌలుదార్లుగా మారిన వారికి ఇస్తారనే భావన వ్యక్తమయింది. తాలుక్‌దార్లకు బ్రిటిష్ ప్రభుత్వం కల్పించే రక్షణ, రాయితీలతో తాలుక్‌దార్లు తమ క్రింది స్థాయి గణనీయ సంఖ్యలో వున్న కౌలుదార్లకు కూడా రక్షణ కల్పిస్తారేమోనని ఆశపడ్డ బ్రిటిష్ వారికి, తాలుక్ దార్లు దాదాపు ఒక శాతం కౌలుదార్లకు మాత్రమే ఇలాంటి రక్షణ కల్పించటం అశనిపాతమయింది, మరోవైపు తాలుక్‌దార్లకు నైతిక విజయాన్ని స్వంతం చేసింది.

బ్రిటిష్ వారితో బేరసారాలలో పైచేయిసాధించి, తమ క్రింద పనిచేసే కౌలుదార్లను గుప్పిట్లో ఉంచుకొని తాలూక్ దార్లు నిశ్చితంగా, సురక్షితంగా తమ స్థానాన్ని పదిలపరచుకున్నారు. ఏదో కొద్ది మందికి తప్ప మిగతా కౌలుదార్లందరికి వంశపారంపర్య హక్కులు అందకుండా, చెందకుండా జాగ్రత్త పడినారు. దీనితో అత్యధిక సంఖ్యలో కౌలుదార్లు,

ఏ హక్కులు లేని కౌలుదార్లుగా, తాలుక్ దార్ల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి, వారి కనుసైగతో తొలగింపబడే దుస్థితికి నెట్టబడినారు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ పరిస్థితినంతా తీవ్ర అసంతృప్తితో గమనిస్తూనే వున్నది. తుదకు ఔధ్ ప్రధాన కమీషనర్, కూపర్, సలమావు తాలూక్ దార్పై చర్య తీసుకున్నాడు. పత్రాలలో ప్రస్తావించిన రీతిలో కౌలుదార్లకు రక్షణ కల్పించవలసిన బాధ్యతను నిర్వర్తించలేదనే కారణంపై తాలుక్దారును అతని అధికార స్థాయినుండి స్థాన భ్రంశం కలిగించాడు. అతని ఎస్టేట్ను ప్రభుత్వ నిర్వాహణ క్రిందకు చేర్చాడు. ఈ సమస్యను పరిశీలించిన అప్పటి వైస్రాయ్ లార్డ్రిప్పన్, పత్రంలో చేర్చబడిన ప్రతిపాదన ఔధ్ ప్రాంతంలోని కౌలుదారీ సమస్యను పరిష్కరించడానికి ఎంత మాత్రం సరిపోదనే అభిప్రాయానికి వచ్చాడు. అందువల్ల ఇతర చర్యలను చేపట్టవలసిన అవశ్యకతను ఉద్ఘాటించాడు. కౌలుదార్ల సమస్యను పరిష్కరించటానికి వెంటనే శాసన పరమయిన ప్రతిపాదనలు చేయాలా? వీరి పరిస్థితిని అధ్యయనం చేయటానికి విచారణ సంఘాన్ని వేయాలా? అన్న మీమాంసలో, రిప్పన్ విచారణ సంఘాన్ని వేయడానికే మొగ్గు చూపాడు. విచారణ సంఘం తన నివేదిక సమర్పించగానే లాయల్ కౌలుదారీ శాసనానికి సంబంధించిన తొలి ప్రతిపాదనలతో కూడిన విజ్ఞాపన పత్రాన్ని సిద్ధం చేసాడు. ఇప్పటి వరకు బ్రిటిష్ ఇండియాలో కౌలుదారీ చట్టాలు జిరాయితీ హక్కులున్న కౌలుదార్ల హక్కులను గురించి పట్టించుకున్నాయే తప్ప ఏ హక్కులు లేని కౌలుదార్ల రక్షణ గురించి ఎలాంటి ప్రయత్నం చేయలేదని తన విజ్ఞాపనలో పేర్కొన్నాడు. 'ఔధ్ అవగాహన' లో వంశానుక్రమ హక్కులను తొలగించటం, మినహాయించటం వల్ల కౌలుదార్ల స్థితిని మెరుగుపరిచే ఆశ ఏమాత్రం మిగలలేదు. దీని దృష్ట్యా కౌలుదార్ల రక్షణ కోసం ఇతర పద్ధతులను వెదకాల్సిన అవసరం ఏర్పడింది. పెంచిన భాటకాన్ని చెల్లించకపోతే భూమి నుండి తొలగిస్తామని బెదిరించడం ద్వారా భూస్వాములు కౌలుదార్లపై పెంచిన భాటకాన్ని బలవంతంగా రుద్దేవారు. **1868** చట్టం, అంటే ఔధ్అవగాహన క్రింద భూస్వామి భాటకాన్ని పెంచాలన్నట్లయితే కౌలుదారుకు భూమిని వదిలివేయాల్సిందిగా నోటీసు జారీ చేయవల్సిన తప్పని పరిస్థితిని కల్పించడం ఇందుకు కారణమని లాయల్ అభిప్రాయపడినాడు. ఇలాంటి దురదృష్టకరమైన చట్టం కౌలుదార్లు జిరాయితీ హక్కులను పొందగలగటాన్ని నిరోధించటమే కాక భాటకాన్ని పెంచటానికి కౌలుదారును భూమి నుండి తొలగించటాన్ని ఒక ప్రధాన ఆయుధంగా వాడుకోవటానికి అవకాశాన్నిచ్చింది. ఈ మధ్య కాలంలో ఈ ప్రాంతంలో ఆర్థికాభివృద్ధి పొడసూపింది. శిస్తు పరిష్కార వ్యవహారాలతో స్థానిక భాటకం రేట్లలో చాలా తేడాలున్నాయని భూస్వాములు గ్రహించే అవకాశం ఏర్పడింది. సగటు భాటకం కంటె తక్కువ రేట్లు విధిస్తున్న భూస్వాములు వెంటనే భాటకం రేట్లను పెంచేందుకు ప్రయత్నించారు. అయితే విచారణ సంఘం తన నివేదికలో మాత్రం భూస్వాములు తమ అధికారాలను దుర్వినియోగం

చేస్తున్నట్లుగా చూపించలేక పోయింది. భూస్వాములు అతి ఎక్కువ మొత్తంలో భాటకాన్ని వసూలు చేస్తారని అధిక్షేపించాలంటే, ముందుగా భాటకాన్ని నిర్వచించాల్సి వుంటుంది. ఔధ్ అవగాహనకు దారి తీసిన అంశాలను గురించి పదే పదే చర్చించడం అనవసరమని కూడా లాయల్ భావించాడు. పై పరిస్థితుల దృష్ట్యా ప్రభుత్వం కౌలుదార్లకు జిరాయితీ హక్కులు కల్పించబోవడం లేదని తాలూక్‌దార్లకు హామీ ఇవ్వడం వంటి తీవ్రమయిన చర్యకు పాల్పడేదానికంటె, ప్రత్యామ్నాయ పద్ధతులను ఆలోచించటం అన్ని విధాల శ్రేయస్కర మనిపించక తప్పదు. రెవెన్యూ అధికారులకు భాటకాన్ని భూమి శిస్తు రేట్లను నిర్ధారించేటువంటి నిర్ణీత కాలంలో భాటకాన్ని పెంచేందుకు వీలులేదని వెల్లడించే అధికారాన్ని అప్పజెప్పడం, భాటక సంబంధమైన తగాదాలను పరిష్కరించేందుకు ప్రత్యేక ట్రిబ్యునల్ ఏర్పాటు చేయడం లేదా నష్టపరిహారాన్ని చెల్లించడం వంటి మూడు పద్ధతులను ప్రత్యామ్నాయంగా చూపించడం జరిగింది. ఐర్లండ్ అనుసరించే పద్ధతులను ఉటంకిస్తు లాయల్ నష్టపరిహారం ఇచ్చే పద్ధతిని సమర్థించాడు. ఈ పద్ధతి స్వయం చాలకంగా పని చేసేదే అయినప్పటికి, భాటకం రేటును కనీస స్థాయిలో పెంచడాన్ని కూడా ఆటంక పరచలేని స్థాయిలో నష్ట పరిహారాన్ని నిశ్చయించడమే ప్రధాన సమస్య అని వాదించాడు. ఇలాంటి పరిస్థితి కొనసాగితే, అంటే నష్టపరిహారాన్ని సరిగా నిశ్చయించలేకపోయినట్లయితే భూస్వాములు, కౌలుదార్ల మధ్య ఘర్షణ తలెత్తుతుందని, మార్కెట్‌లో పోటీవల్ల భూమి యొక్క భాటకం విలువ పెరిగి తద్వారా వచ్చే ఎలాంటి ఫలితమైన తనకు తప్ప కౌలుదారుకు సంక్రమించ కుండా నిరోధించేందుకు ఇతర మార్గాలను అన్వేషిస్తాడని ఈయన అభిప్రాయం. లాయల్ సమర్పించిన విజ్ఞాపనను పరిశీలించిన లార్డ్ రిప్పన్, అన్ని రకాలుగా లాయల్ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. కౌలుదార్లకు జిరాయితీ కల్పించబోవడం లేదని కౌలుదార్లకు హామీ ఇవ్వడం వంటి పద్ధతిని నిర్ద్వందంగా వ్యతిరేకించాడు. లాయల్ సూచించిన నష్టపరిహారం చెల్లించే పద్ధతిని ఆమోదించినప్పటికి, ఐరిష్ శాసనంలో నిర్ణయించిన పరిహారపు మొత్తం కంటే మధ్య భారతం ప్రాదేశిక ప్రాంతపు అదేరకమయిన శాసనంలో పరిహారపు మొత్తం తక్కువగా వున్నా, అదే చాలా ఎక్కువమొత్తమని, ఆ మొత్తాన్ని ఔధ్‌కు అన్వయించడం వీలుపడదని లాయల్ ఎందుకు భావించాడో ఊహించలేకపోయాడు. మధ్య ప్రాదేశిక ప్రాంతాల్లో కంటె ఔధ్‌లో భూమిపై ఒత్తిడి వల్ల పోటీ అధికంగా ఉన్నదని, అందువల్ల అక్కడికంటె ఔధ్‌లో నష్టపరిహారపు రేట్లు ఎక్కువగా ఉండాలని రిప్పన్ అభిప్రాయపడినాడు.

ఈలోగా ప్రాదేశిక ప్రభుత్వం రెండవ ఘట్టం విచారణను ప్రారంభించింది. జిరాయితీ హక్కులు లేని ప్రాంతాలలో భాటకం పెంపుదల సగటు భాటకం స్థాయిని చేరడానికోసం జరిగిందా ? లేక కౌలుదార్లను తీవ్ర ఇబ్బందులకు గురి చేసేంత ఎక్కువగా, వేగంగా పెరిగిందా?

అనేది తెలుసుకునేందుకు వీలుగా గత దశాబ్దకాలానికి చెందిన భాటకపు రేట్ల పెంపుదలకు సంబంధించిన సమాచారాన్ని అందజేయవలసిందిగా జిల్లా యంత్రాంగాన్ని ఆదేశించింది. నివేదికలు వెల్లడించిన అంశాలను క్రోడీకరించిన మేజర్ ఎర్స్కిన్ ఇటీవల ప్రారంభమయిన వస్తురూప భాటకం నుండి నగదు రూప భాటాకానికి మార్చే ప్రక్రియ వల్ల సగటు నగదు భాటకాన్ని నిర్ధారించడం, అన్ని భూములకు అన్వయింపజేయడం చాలా కష్టమని పేర్కొన్నాడు సక్రమంగా నగదు భాటకం చెల్లించేందుకు జరిగే ఒప్పందాలలోనే భాటకం పెంపుదలకు సంబంధించిన తగాదాలు ఉత్పన్నమయ్యే అవకాశం వున్నదని, నగదు భాటకాన్ని ఆశించే పరిస్థితులలో భూస్వామి అతి హెచ్చురేట్లను విధించేందుకు ఉత్సుకత చూపుతాడని, ఇక కౌలుదారుకు అంతంత మాత్రమే మిగులుతుందని కూడా స్పష్టం చేసాడు. నగదు భాటకాన్ని భూస్వామి పెంచకుండా చూడగలిగినట్లయితే కౌలుదారు గతంలో భూస్వామితో పంటను పంచుకున్న రోజులలో కంటె కొంత మెరుగ్గా బ్రతికేందుకు, తన పెద్ద కుటుంబాన్ని వెళ్ళదీసేందుకు వీలవుతుంది. వస్తురూప భాటకానికి సమాన మొత్తంలో నగదు భాటకాన్ని జీవనాధార స్థాయికి అనుగుణంగా నిర్ధారించడం కష్టమని ఎర్స్కిన్ పేర్కొంటు,' సరియగు భాటకం' లెక్కించడం వీలుకాదని అభిప్రాయం వ్యక్తం చేసాడు. అందువల్ల లాయల్ ప్రతిపాదించిన నష్టపరిహారం సూచనయే ఆమోదయోగ్యమయిన పద్ధతిగా భావించడం జరిగింది. నష్టపరిహారపు మొత్తంగా 36 రూపాయలు లేదా ఒక సంవత్సర భాటకాన్ని నిర్ణయించాలని సూచించడం జరిగింది.

ఆల్ఫ్రెడ్ లాయల్ ఈ నివేదిక తయారు చేస్తున్న సమయంలో పంజాబ్ ఆర్థిక శాఖ కమీషనర్ అయిన జె.బి.లాయల్ ను ఔధ్‌లో కౌలుదారీ రక్షణ గురించి విజ్ఞాపన తయారు చేయవలసినదిగా కోరాడు. పంజాబ్, బెంగాల్‌లలో కౌలుదార్ల పరిస్థితితో ఔధ్ కౌలుదార్ల పరిస్థితిని సరిపోల్చుకున్న జె.బి.లాయల్ ఔధ్ ప్రాంతానికి చెందిన కౌలుదార్లలో 88శాతం మందికి జిరాయితీ హక్కులు లేనేలేవని, అదే పంజాబ్‌లోనయితే దాదాపు చాలా మంది కౌలుదార్లు వాస్తవంగా స్వతంత్ర భూకమతాలుగలవారని, తమ స్వంత భూమికి అదనంగా కొంత భూమిని కౌలుకు సాగుచేసేవారని పేర్కొన్నాడు. ఔధ్ ప్రాదేశిక ప్రాంతానికి కౌలుదారీ శాసనం అత్యావశ్యకమయినదని అంగీకరించాడు. జిల్లాలనుండి వచ్చిన నివేదికలను బట్టి వ్యవసాయ భూమిపై జనాభా ఒత్తిడి పెరుగుతున్నప్పటికి భాటకం రేట్లు ధరల స్థాయిని మించి పెరగలేదని, భూమి కోసం ఏర్పడే పోటీ తీవ్రత ఇంకా పూర్తి స్థాయి ప్రభావం చూపలేదనే నిర్ణయానికి వచ్చాడు. అయినప్పటికి, రాబోయే కొద్ది సంవత్సరాలలో ఇట్లాంటి పరిస్థితులకు ఖచ్చితమైన అవకాశం ఉన్నందువల్ల కౌలుదారీ శాసనాన్ని వెనువెంటనే సిద్ధంచేయాల్సి వుంటుందని భావించాడు. ఔధ్‌ప్రాంతంలో జిరాయితీ హక్కులగురించి తదనంతర చర్చలను వ్యతిరేకించిన జె.బి.లాయల్ కొత్త ప్రతిపాదన చేసాడు అన్ని బాటక ఒప్పంధాలు ఏడు

సంవత్సరాల కాలానికి వర్తించేవిగా ఉండాలని, అదే విధంగా భాటకాన్ని మళ్ళీ పెంచటానికి కూడా ఈ ఏడు సంవత్సరాలు ప్రాతిపదికగా వుండాలని ప్రతిపాదన చేసాడు. దీనితో పాటు నష్టపరిహారం విషయాన్ని కూడా సూచించాడు. 1866లో పంజాబ్‌లో తాను అమలు పరిచిన ఇలాంటి ప్రయోగాత్మక విధానాన్నే ఇక్కడ అమలుచేయాలని, భూస్వాములు, కౌలుదార్ల మధ్య పంజాబ్‌లో ఈ పద్ధతి ద్వారానే అవగాహనకుదర్చడం జరిగిందని కూడా ఉద్ఘాటించాడు.

మేజర్‌ఎర్‌స్కిన్ నివేదిక, జె.బి.లాయల్ విజ్ఞాపనలను జిల్లా అధికారులకు మరోసారి పంపించడం జరిగింది. తదనంతర చర్చలు నష్టపరిహారంగా నిర్ణయించవలసిన మొత్తాన్ని గురించి, భాటకాన్ని పెంచకుండా నిరోధించలవలసిన కాల వ్యవధిని గురించి కేంద్రీకృతమయినాయి. నిర్ణయించే కాలవ్యవధి పూర్తయిన తరువాత భాటకాన్ని పెంచే హక్కు భూస్వామికి ఉంటుంది కనుక ఈ పెంపుదలపై కొంత పరిమితిని విధించకపోయినట్లయితే, కొంత నిశ్చితమైన మొత్తాన్ని నిర్ణయించకపోయినట్లయితే భూస్వాములందరు దీనిని సాకుగా తీసుకొని కౌలుదార్లను భూమి నుండి తొలగించే ప్రమాదం ఉన్నది. భాటకం రేటుకు పరిమితి విధించడం కంటె భూస్వామి ఇలాంటి తొలగింపుకు చెల్లించవలసిన నష్టపరిహారాన్ని తగినంత హెచ్చుగా నిర్ణయించడం వల్ల భూస్వామి ఇలాంటి చర్యకు పూనుకోకుండా నిరుత్సాహపరచ వచ్చుననే ఒక అభిప్రాయం ఈ చర్చలలో బయల్పడింది. జిల్లా అధికారులకు కేంద్ర ప్రభుత్వం నుండి భవిష్యత్‌లో జరిగే శిస్తు నిర్ధారణ విషయంలో వాస్తవంగా భూమిని సర్వే చేయడం ద్వారా పునః సమీక్ష జరిపి తద్వారా లభించే సమాచారం మీద కాకుండా పూర్వపు శిస్తు ఒప్పందాలకు సంబంధించిన గణాంక సమాచారాన్ని ఆధారంగా తీసుకోవాలని ఆదేశాలు జారీ అయ్యాయి. గత ఒప్పందాల ఆధారంగా శిస్తు నిర్ధారణ చేయడం వల్ల కౌలుదార్లకు పూర్వం నుండి లభిస్తున్న హక్కులను తిరిగి కాపాడే అవకాశం అధికారులకు కలిగింది. భాటకాన్ని అతిగా పెంచే చర్యలను కూడా నిరోధించే వీలు దొరికింది. అయితే ఏ హక్కులు లేని కౌలుదార్లకు ఈ పద్ధతిలో రక్షణ కల్పించే అవకాశం లేకుండా పోయింది. కొత్తగా సృష్టించబడిన ఇలాంటి అధిక సంఖ్యాకుల భవిష్యత్‌ను వాస్తవ సర్వే మాత్రమే నిర్ధారించగలిగేది. మేజర్ ఎర్‌స్కిన్ ఇలాంటి అసంగతమైన పరిమితులన్నింటిని నిరాకరించాడు. భూస్వామి ఏదో విధంగా కౌలుదారును భూమి నుండి తొలగించే ప్రయత్నంచేస్తున్నప్పుడు ఈ నియంత్రణ లేవీ పని చేయకపోవచ్చునని అభిప్రాయపడినాడు. పైగా నియంత్రణలు ఏర్పరచడం గతంలో కుదిరిన అవగాహనకు విఘాతం కల్గిస్తాయని పేర్కొంటూ, తాను గతంలో సూచించినట్లు కౌలుదారును భూమినుండి తొలగించేటట్లయితే ఒక సంవత్సరపు భాటకాన్ని పరిహారంగా చెల్లించే పద్ధతి కట్టుబడి, అమలు చేయడం ఒక్కటే సరియైన పద్ధతి అని పేర్కొన్నాడు. 'మధ్య' ప్రాదేశిక ప్రాంతాలలో వలె హెచ్చు నష్టపరిహారాన్ని నిర్ధారించడమంటె పరోక్షంగా కౌలుదార్లకు జిరాయితీ హక్కులు కల్పించినట్లేనని జిల్లా అధికారులలో కూడా బలమైన

అభిప్రాయం ఉండటం వల్ల మేజర్ ఎర్స్కిన్ సూచనపట్ల ఎలాంటి వ్యతిరేకత ప్రదర్శితం కాలేదు.

అందరి అంగీకారం పొందిన ఈ సూచనకు వ్యవసాయ శాఖ సంచాలకుడు, బెనెట్ గండి కొట్టాడు. నష్టపరిహారం నిర్ణయించే పద్ధతికి సంబంధించి ప్రాథమికమైనకొన్ని అభ్యంతరాలను లేవనెత్తాడు. భూమినుండి వచ్చే పంటలో కొంత అనుపాతాన్ని ఆధారం చేసుకొని న్యాయ వ్యవస్థ పరంగా భాటకం నిర్ధారణ జరిగితే బాగుంటుందని అభిప్రాయం వ్యక్తం చేసాడు. ఐరిష్‌లో అమలులో వున్న నష్టపరిహారం పద్ధతి ఔథ్ పరిస్థితులకు అనుసరణీయం కాదన్నాడు. ఐర్లాండ్‌లో చట్ట ప్రకారం కాకపోయినా అనుచానంగా వస్తున్న జిరాయితీ హక్కులను పొందగలుగుతున్నారు. కౌలు కాలపరిమితి కూడా నిర్ధారించబడక పోయినా భూమి నుండి బదిలీ చేయబడితే హెచ్చు ధరనే పొందగలిగేవారు. దీని ఆధారంగానే భూస్వామి కౌలుదారును తొలగించినప్పుడు పొందే నష్టానికి కూడా తత్సమానమైన పరిహారాన్ని చెల్లించే పద్ధతి ఆచరణలోకి వచ్చింది. ఔథ్‌కౌలు భూములు బదిలీకి వీలయ్యేవి కావు కనుక పరిహారం మొత్తాన్ని నిశ్చయించేందుకు ఎలాంటి ఆధారాలు లేవు. భాటకం ఒప్పందాలను ఏడు సంవత్సరాల కాల వ్యవధి కోసం స్థిర పరచే ప్రతిపాదనను కూడా విమర్శించాడు. ప్రభుత్వం శాసనాన్ని రూపొందించవలసిన ఆవశ్యకతను ఆకర్షించిన అసంఖ్యాక తొలగింపులు వాస్తవంగా జరిగిన వాటికంటె చాలా తక్కువగానే ప్రభుత్వ అంచనాల్లోకి చేరినాయని చూపగలిగాడు. అతి సాధారణమైన అంచనాలను బట్టి కూడా ఏడు సంవత్సరాల నిబంధనను ఖచ్చితంగా అమలు చేసినా, ప్రతి సంవత్సరం మొత్తం కౌలుదార్ల క్రింద ఉన్న భూములలో ఏడవ వంతు కౌలుదార్లు భూమి నుండి తొలగింపబడతారని తెల్పాడు.

ఈ మొత్తం చర్చ ఫలితంగా వివిధ సూచనలలోని లోటు పాట్లు చాలా స్పష్టంగా బహిర్గతమైనాయి. తుదకు బెంగాల్‌తరహాలో భాటకం పెంపుదలపై నియంత్రణను ఆచరణలో పెట్టేందుకు అంగీకరించక తప్పలేదు. ఏడు సంవత్సరాలకాల పరిమితి ముగిసిన తర్వాత వర్తమాన భాటకంలో $6^1/_4$ శాతాన్ని అదనంగా పెంచుకోవచ్చునని ఈ పథకంలో సూచించడం జరిగింది. బెంగాల్‌లో అయితే 15 సంవత్సరాలకు $12^1/_2$ శాతం పెంచే వీలుకల్పించడంతో ఇది దాదాపు ఒక మెరుగ్గా వున్నదని చెప్పవచ్చు. జిరాయితీ హక్కులు సంక్రమింపజేయక-పోవడం వలన తుది బిల్లులో 'నష్టపరిహారపు అంశాన్ని' కొనసాగించక తప్పలేదు. ఆతర్వాత కాలంలో భాటకం పెంపుదల నష్టపరిహారం పై ఆధారపడక పోవటం వల్ల ఈ పథకం ప్రాధాన్యతను కోల్పోయింది. అయితే ఏడు సంవత్సరాల తర్వాత కౌలుదారుకు కౌలుదారు క్రింద వున్న భూమి యధాతధంగా కొనసాగాలని కోరుకున్న హక్కును ప్రభుత్వం గుర్తించలేదు. మరణించిన కౌలుదారు సంతానంగాని, భాగస్వామిగాని అతని తదనంతరం

ఏడు సంవత్సరాలలో మిగిలిన కాలానికి మాత్రమే భూమిని స్వాధీనంలో ఉంచుకోవచ్చు. ఆ తరువాత భూమి నుండి తొలగించబడినా నష్టపరిహారాన్ని కోరే హక్కు లేదు. కౌలుదార్లకు ఎలాంటి. వంశపారంపర్యమయిన హక్కులు కల్పించడమన్నా వారికి జిరాయితి హక్కులు సంక్రమింపజేసినట్లే అవుతుందని ఆల్‌ఫ్రెడ్ లియాల్ ఇలాంటి చర్యలను వ్యతిరేకించాడు. లియాల్ ఇట్లాంటి అభిప్రాయాన్ని అన్వయింపజేయటాన్ని లార్డ్ రిప్పన్ నిరసించాడు. ఒక్క తరంలో కౌలు ఒప్పందాలన్నీ రద్దు అవుతాయని, భూస్వామి తన ఇష్టానుసారంగా ఎలాంటి పరిమితి లేకుండా భాటకాన్ని పెంచే స్వేచ్ఛ లభిస్తుందనే సారాంశం ఈ అభిప్రాయంలో ఇమిడివుందని లార్డ్ రిప్పన్ భావించాడు. లియాల్ ఎలాంటి మధ్య మార్గాన్ని ఆమోదించటానికి సంసిద్ధంగా లేడు. ఔధ్ ప్రాదేశిక ప్రాంతం నుండి మినహాయింపబడిన జిరాయితీ హక్కులను వేరే మార్గంగా ప్రవేశపెట్టడానికి ఇష్టపడలేదు. దీనికి రిప్పన్ జిరాయితీ హక్కుగల కౌలుదారుకు ప్రత్యేక చట్టం ద్వారా రక్షణ పొందే చట్టబద్ధమైన కౌలుదారుకు మధ్య తేడా ఉన్నదని సమాధానమిచ్చాడు. రాజ్య కార్యదర్శికి పంపిన సందేశంలో కూడా ఇదే పేర్కొన్నాడు. బ్రిటిష్ పాలకుల విధాన నిర్ణయంపై రిప్పన్ ప్రభావం ఉండటంవల్ల బిల్లు బయటకు రావటానికి గల అవకాశాలు విస్తృతమయ్యాయి. చట్ట బద్ధతగల కౌలుదార్లకు వారసత్వపు హక్కులు సంక్రమింపజేయాలని రిప్పన్ పట్టుదలతో ఉండడమే దీనికి కారణమనవచ్చు.

రిప్పన్ ఆశీస్సులతో ముందుకు నడచిన బిల్లుకు లండన్‌లో ప్రాపకం లభించక పోవడంతో, రిప్పన్ పరిభాషలో పేర్కొనబడిన 'చట్టబద్ధ కౌలుదారు' తన స్థాయిని నమోదు చేసుకోవటానికి 1921 వరకు వేచి ఉండాల్సి వచ్చింది. ఇదే సమయంలో పరిశీలనలో ఉన్న బెంగాల్ కౌలుదారీ చట్టం అంతగా విమర్శకు గురి కాలేదు. ఔధ్ పరిస్థితి పరిశీలనకు వచ్చేసరికి, తిరుగుబాటు జరిగిన నాటి జ్ఞాపకాలు పునరావృతం కావటంతో, ఈ ప్రాంతానికి సంబంధించిన ఏ నిర్ణయం తీసుకోవటంలో అధికారులు అతి జాగరూకతతో వ్యవహరించడం గమనించవచ్చు. అందువల్ల భారతదేశ వ్యవహారాలు చూసే కార్యాలయంలో ఈ బిల్లుకు గట్టి మద్దతు తెల్పే వారొక్కరూ కన్పించలేదు. తదనుగుణంగానే రాజ్యకార్యదర్శి భారత ప్రభుత్వానికి పంపిన కబురు కేంద్రాన్ని, ప్రాదేశిక ప్రభుత్వాన్ని తీవ్ర నిరాశకు గురిచేసింది. తను పంపిన పత్రంలో కార్యదర్శి ఔధ్‌లో కౌలుదారీ శాసనం చేయాల్సిన ఆవశ్యకతను సమర్థిస్తూ తెలిపిన కరణాలతో తాను ఏకీభవించటం లేదని, ప్రభుత్వం సలమావ్ తాలుక్ దారుపై తీసుకున్న తొందరపాటు చర్యను ఖండించాడు కూడా. అయితే లియాల్ ప్రతిపాదనను క్షుణ్ణంగా చర్చించిన అనంతరం కనీసంగా వ్యవసాయ కార్యకలాపాన్ని మెరుగుపరిచేందుకు కౌలుదారుకు కొంత పరిహారాన్ని అందజేసేందుకు తగు హామిని ఇచ్చే కొన్ని అంశాలను అంగీకరించేందుకు సిద్ధమేనని తెల్పాడు. కౌలుదారు సంక్షేమం కోసం తాలుక్‌దార్లు చేయవలసిన పనులగురించి తాలుక్‌దార్లు పొందిన పత్రాలలో పేర్కొనబడిన అంశాలపై ప్రత్యేక శ్రద్ధ కనబర్చాల్సిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసాడు.

కార్యదర్శి పంపిన పత్రానికి రిప్పన్ తన పదవీ కాలపు చివరి రోజులలో సమాధానం పంపాల్సి వచ్చింది. ఇందులో కార్యదర్శి వ్యక్తం చేసిన అభ్యంతరాలనన్నింటిని ఖండించాడు. ఐర్లాండ్‌లో కంటె ఔధ్‌లో పరిస్థితులు చాలా దుర్భరంగా వున్నాయనే వాస్తవాన్ని నొక్కి చెప్పాడు. సలమావ్ తాలుక్ విషయంలో ప్రభుత్వ చర్యను సమర్థించాడు. పైగా ఈ విషయం పత్రంలోని కౌలుదార్ల సంక్షేమాన్ని గురించి ప్రస్తావించిన భాగం నిరుపయోగమైనదనే విషయాన్ని స్పష్టం చేసిందని పునరుద్ఘాటిస్తూ, ఈ భాగాన్ని వాడుకలోకి తీసుకరావాలని భారత ప్రభుత్వాన్ని కార్యదర్శి ఎందుకు హెచ్చరించాడో అర్థంకావటంలేదని అభిప్రాయపడినాడు. కార్యదర్శి పత్రంలో పేర్కొనబడిన భాటక సిద్ధాంతాన్ని గురించి చర్చించి, భారత ప్రభుత్వం భూమి సాగుచేసే వారికి చట్ట పరమయిన రక్షణ ఇవ్వక పోవడం వల్ల జనాభా ఒత్తిడి ఏర్పడుతోందని వాదించిందని కార్యదర్శి పేర్కొనడాన్ని రిప్పన్ ఖండించాడు. దానికి బదులుగా రిప్పన్ కౌలుదారీ రక్షణ లేకపోవడం దాంతో పాటు జనాభా పెరుగుదల రెండూ కలిసి భూస్వాములకు అత్యంత అనుకూలమయిన పరిస్థితులను సృష్టించిందని మాత్రమే ప్రభుత్వం నొక్కి చెప్పిందని వాదించాడు. భూమి పట్ల గల పోటీ, ద్రవ్యరూపమయిన భాటకం రెండూ జనాభా ఒత్తిడికి దారీ తీయవచ్చునని కూడా పేర్కొన్నాడు. ఈ సందర్భంగా 1866లో నే ప్రభుత్వానికి, తాలుక్‌దార్లకు మధ్య ఔధ్ అవగాహన కుదరడానికి ప్రయత్నించిన సందర్భంలో జాన్ స్ట్రాచీ ఈ అంశంపై దృష్టి సారించినట్లుగా రిప్పన్ ఉటంకించాడు. తుదకు రిప్పన్ ప్రభుత్వం తాను కౌలుదారీ శాసనాన్ని రూపొందించటానికి చేసిన ప్రతిపాదనలపై తాలుక్‌దార్లను ఒప్పించగలిగింది. కనుక ఇలాంటి శాసనం తయారు చేయటానికి లభించిన అవకాశాన్ని ఎట్టి పరిస్థితులలో జార విడుచుకోకూడదని కోరాడు. అట్లా జరగనట్లయితే తదనంతర కాలంలో తాలుక్ దార్లతో జరిగే ఘర్షణలు మరింత తీవ్రతరంగా ఉండవచ్చునని హెచ్చరించాడు.

రిప్పన్ తరువాత వైస్రాయ్‌గా వచ్చిన 'లార్డ్ డుఫెరిన్', రిప్పన్ ప్రభావంతో భారత ప్రభుత్వం రూపొందించిన అన్ని ప్రతిపాదనలను విరమించుకొని కనీసం లియాల్ సూచించిన అంశాలనయినా అంగీకరించవలసిందిగా రాజ్య కార్యదర్శిని కోరాడు. దానికి ఆయన అంగీకరించాడు. తాలుక్‌దార్లు తమ క్రింద ఉన్న కౌలుదార్లకు నష్టపరిహారం చెల్లించడాన్ని వారి తప్పని సరి బాధ్యతగా చేయడం పట్ల అయిష్టత ప్రదర్శిస్తున్నారని గ్రహించిన లియాల్ ఈ మధ్య కాలంలో తాలుక్‌దార్లకు మరికొన్ని వరాలు అనుగ్రహించటానికి సిద్ధమయ్యాడు. తమ కౌలుదార్ల చట్టపరయిన ఏడు సంవత్సరాల ఒప్పందం కుదుర్చుకోవడం కంటె ఎనిమిది సంవత్సరాలలో ముగిసే ఒప్పందాలను కుదుర్చుకోవడం ద్వారా నష్టపరిహారం చెల్లించే బాధ్యతనుండి తప్పించుకోవచ్చునని వాదించాడు. నష్టపరిహారం విధించే పద్ధతి, ఇతర ప్రాంతాల, దేశాల పద్ధతుల నుండి పుట్టుకొచ్చిందని, పరిహారం చెల్లించాల్సిన భారం పడవేయని దీర్ఘకాలిక

ఒప్పందాలు 'తాలుక్‌దార్' కౌలుదార్ల మధ్య జరగడం మంచిదని లియాల్.భావించాడు. ఒప్పందం కుదుర్చుకోవడంలో స్వేచ్ఛ ఉండడమే వ్యవసాయ సంబంధాలకు గట్టి పునాది వేస్తుందని అభిప్రాయపడినాడు. బిల్లును గవర్నర్ జనరల్ యొక్క శాసన మండలిలో ప్రవేశపెట్టేనాటికి నష్ట పరిహారమే బిల్లు యొక్క ప్రధాన సూత్రమని మరోసారి ఉద్ఘాటించడం జరిగింది. ఆ తరువాత బిల్లును పరిశీలించటానికి ఏర్పడిన సెలెక్ట్ కమిటీ తాలుక్ దార్ల అభీష్టం మేరకు పరిహారానికి సంబంధించిన అంశాలను గణనీయంగా నియంత్రించడంగాని, మార్పుచేయడంగాని చేసింది. కౌలుదార్లకు నష్టపరిహారాన్ని చెల్లించడం తమ హోదాకు భంగకరంగా వుంటుందని, కౌలుదార్లను భూమి నుండి తొలగించినందుకు కౌలుదారుకు నష్టపరిహారాన్ని చెల్లించడం కంటె ప్రభుత్వానికి కొంత జరిమాన కట్టడం తమకు ఇష్టమని తాలుక్‌దార్లు స్పష్టంచేసారు. ప్రభుత్వానికి ఈ ప్రతిపాదన వింతగాను, ఇబ్బందికరంగాను తోచింది. ఇలాంటి ప్రతిపాదనను అంగీకరించడమంటూ జరిగితే, కౌలుదారీ రక్షణ కోసం ప్రభుత్వం పడే ఆరాటం వెనుక తన రాబడిని పెంచుకోడానికి దీన్ని ఒక సాధనంగా వాడుకునే ఉద్దేశం ఉన్నట్లుగా అపోహ ఏర్పడే అవకాశం వుందని గ్రహించింది. భారత్‌దేశ వ్యవహారాలు చూపే కార్యాలయంలో ఈ బిల్లుకు సంబంధించి బాధ్యత వహిస్తున్న అధికారి ఈ పరిస్థితులలో మొత్తంగా నష్టపరిహారం ప్రతిపాదనను వదిలివేయడం మంచిదని సూచించారు. ఇంత తతంగం నడుస్తున్నా ప్రభుత్వం మరోసారి తాలుక్‌దార్లు సూచించిన మధ్యేవాద మార్గాన్ని (రాజీని) అంగీకరించాలని నిర్ణయించుకున్నది. తత్ఫలితంగా బ్రిటిష్ ఇండియా కౌలుదారీ శాసన చరిత్రలోనే లేని వింతైన ఒక భాగం చోటు చేసుకున్నది. అదేమిటంటే కౌలుదారును భూమి నుండి తొలగించదలచుకున్న భూస్వామి తనకు వచ్చే సంవత్సర భాటకంలో సగం మొత్తాన్ని న్యాయస్థానానికి జరిమానాగా చెల్లించాలి. ఈ విధంగా 'నష్ట పరిహారం' ప్రతిపాదన యొక్క మౌలిక ఉద్దేశం మొత్తంగా మరుగున పడింది. కౌలుదారును భూమి నుండి తొలగించకుండా కాపాడటానికి ఇది అతి దుర్బలమైన ప్రయత్నంగా మిగిలిపోయింది. ఐర్లాండ్ తరహా ఔథ్‌లో ప్రభుత్వానికి,తాలుక్‌దార్లకు మధ్య ఒక ప్రత్యేకమయిన సంబంధాన్ని ప్రతిబింబించే వింతైన పథకంగా రూపాంతరం చెందింది.

కొంత కాలం పాటు 1886 చట్టం బాగానే పని చేస్తున్నట్టు కనిపించింది. బ్రిటిష్ అధికారులు ఈ విజయానికే ఉప్పొంగిపోయారు. భాటకాన్ని పెంచటంలో కౌలుదారును ఏడు సంవత్సరాల వ్యవధి తర్వాత భూమి నుండి వదిలించుకోవడంలో భూస్వామికి అవధులులేని స్వేచ్ఛ లభించడంతో, ధరలు, జనాభా ఒత్తిడి పెరుగుతున్న ఆ కాలంలో మరిన్ని ఘర్షణలకు దారితీసింది. పరిహాసాస్పదంగా మారిన జరిమాన (సంవత్సర భాటకంలో సగం), మరో కొత్త కౌలుదారుకు భూమిని కౌలుకు ఇవ్వాలనుకున్నా, వర్తమాన కౌలుదారుతోనే ఒప్పందం

పొడిగించుకోవాలనుకున్నా కౌలుదార్ల నుండి భారీ మొత్తంలో నజరాన రూపంలో రాబట్టుకోవటానికి భూస్వామి వేసే ఎత్తుగడలను, ఉపయోగించే అధికారాలను ఎంత మాత్రం నియంత్రించ లేక పోయింది. భూమి నుండి తొలగిస్తానని భూస్వామి బెదిరించే సరికే కౌలుదారు నజరానచెల్లిస్తాడు కనుక, భూస్వామి న్యాయస్థానంలో జరిమాన చెల్లించే ప్రసక్తేరాదు. ఇతర ప్రాంతాల్లో కంటె దక్షిణ ఔథ్‌లో జనాభా ఒత్తిడి మరీ అధికంగా ఉండేసరికి మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత తీవ్ర ఉద్రిక్తతలు, హింసాత్మకమైన ఆంధోళనలు పెల్లుబికాయి. రైతాంగ సమూహాలన్ని ఒక్కటై భూమినుండి తొలగింపుకు, నజరాన చెల్లింపుకు వ్యతిరేకంగా గళమెత్తాయి. ఇదే సమయంలో గాంధీజి తలపెట్టిన సహాయనిరాకరణోద్యమం ప్రారంభమయింది. పరిస్థితి తీవ్రతను గమనించిన ప్రభుత్వం 1886 చట్టానికి సవరణ తేవడం ద్వారా కౌలుదార్ల కనీస కోర్కెలనయినా తీర్చేందుకు తాలుక్‌దార్ల మద్దతు కోసం ప్రయత్నించింది.

ఈ విషయంలో బ్రిటిష్ పాలకుల పరిస్థితి అనిశ్చితంగా తయారయిందని. 'ఔథ్ అవగాహన'యే ఒక గుదిబండగా తయారయిందను కుంటె, మారిన శాసన మండలిలో భూస్వాములకు మెజారిటీ ఉండటం మరో సమస్య అయింది. భూసంబంధమైన శాసనాలు చేయడం ప్రాదేశిక ప్రాంతపు అంశంగా మారింది. ప్రభుత్వం ప్రతిపాదించే ఎలాంటి మార్పులయినా విజయవంతం కావాలంటే ప్రాదేశిక శాసన మండలి ఓటు నిర్ణయాత్మకంగా మారింది. ఈ పరిస్థితులలో వ్యవహారమంతా ప్రాదేశిక ప్రాంతం గవర్నరుపై ఆధారపడి వుంటుంది. ఆ కాలంలో తాలుక దార్ల చాలా దగ్గరి మిత్రుడని సగర్వంగా చెప్పుకొనే హర్‌కోర్ట్‌బట్లర్ గవర్నరుగా ఉన్నాడు. వారితో వ్యక్తిగతమయిన రహస్య చర్చలు సాగించి ఎంతో కొంత వారినుండి రాబట్టగలిగాడు. చట్ట పరమయిన కౌలుదార్లు తమ జీవిత కాలమంతా భూమిని కౌలుక్రింద సాగు చేసుకోవచ్చు. భూస్వాములు ప్రభుత్వ భూములను విస్తరింపజేసుకొనేందుకు సౌకర్యం కల్పించబడుతుంది. భాటకాన్ని వసూలు చేసుకోవటంలో రెవెన్యు యంత్రాంగం సహకరిస్తుంది. భారత ప్రభుత్వం ఈ రకమయిన బేరసారలతో విసుగెత్తి పోయింది. పేరెన్నికగన్న న్యాయవాది, ఉదార రాజకీయవాది, సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలకు చెందినవాడై ఆసమయంలో భారత ప్రభుత్వ న్యాయ సలహా సంఘంలో సభ్యుడయిన తేజ్ బహదుర్ సప్రూ బట్లర్ తాలుక్‌దార్లకు ఇచ్చినరాయితీలు, కౌలుదార్ల కిచ్చిన అవకాశం కంటె ఎన్నో రెట్లు అధికంగా వున్నాయని, ప్రభుత్వం అప్పటికే కౌలుదార్ల విషయమై ఒక నిర్ణయానికి రావటానికి ప్రయత్నిస్తూనే వున్నదని తెల్పాడు. భూస్వాములు తమకు 'నచ్చని' కౌలుదార్లను తొలగించుకోవచ్చునని బట్లర్ తన ముసాయిదా బిల్లులో చేర్చటం పట్ల సప్రూ దిగ్భ్రాంతికి గురయినాడు. దీంతో తమకుగాని, తమ తాబేదార్లకు గాని ఎలాంటి హాని తలపెట్టినా, వారి గౌరవానికి భంగం కలిగించినా వారిని వదిలించుకునే స్వేచ్ఛ, అవకాశం భూస్వాములకు లభించింది.

ఇది మరో కొత్త అవగాహన అనవచ్చు. ఇక్కడ ప్రభుత్వం రాజీ పడింది. భవిష్యత్ నిర్ణయానికి కావలసిన బలమైన ఆధారం ఏదీ ఏర్పడలేదు. రాజ్య కార్యదర్శి కూడా బట్లర్ పథకాన్ని త్రోసిపుచ్చాడు. ఔథ్‌కు చెందిన కౌలుదార్లు, కనీసం ఇతర సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలోని కౌలుదార్లు పొందుతున్న స్థాయిలోనైన రక్షణ పొందే చర్యలు తీసుకోవాల్సి వుంటుందని అభిప్రాయపడినాడు. అనువంశికమైన కౌలు విధానానికై, పాత చట్టంలో వున్న భాటక నియంత్రణ సూత్రాన్ని మళ్ళీ నిలబెట్టేందుకై అప్పటి వైస్రాయ్ గట్టి కృషి చేసాడు కాని, బట్లర్ ఇవేవి చెవినపెట్టక తన వాదనసే గట్టిగా సమర్థించుకున్నాడు. భాటకం పెంపుదలపై చట్టపరమయిన నియంత్రణ, నజరాన వంటి దుష్ట సంప్రదాయానికి కారణమయిందని, దీనికి బదులుగా ద్వైవార్షిక భాటకం ఒప్పందం రూపంలో రెవెన్యూ అధికారులు భాటకాన్ని స్థిరపరచడమే సరయైనదని వాదించాడు. భూస్వాములు వంశపారంపర్య కౌలును అంగీకరించరని గమనించటం వల్ల, కౌలుదారు కుండే వారసుడు కనీసం ఐదు సంవత్సరాలు భూమిని సాగు చేసుకొనేందుకు భూస్వాములను అంగీకరింపజేయడమే చాలా గొప్ప విషయంగా పేర్కొన్నాడు. ప్రభుత్వ భూములకు సంబంధించి తాను ఇచ్చిన రాయితీ వల్ల ఏవిధంగాను, ఔథ్ భూస్వామి, ఇతర సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలోని భూస్వామి కంటె ఎక్కువ భూమి కలిగి వుండదని కూడా వాదించాడు. దీనికంతటికి ఆశ్చర్యకరమైన సంఘటన శాసన మండలిలో జరిగింది. తమ ఎస్టేట్‌లలో 10 శాతాన్ని ప్రభుత్వ భూములుగా విస్తరింపజేసుకునేందుకు పది సంవత్సరాలపాటు ఈ భూములను కూలీల ద్వారా స్వంత సేద్యం చేసుకోవటానికి వీలుగా సవరణను ప్రవేశపెట్టారు. ఇది బట్లర్ కుదుర్చిన అవగాహనను, అతను బహిరంగంగా వ్యక్త పరచిన స్థాయిని దాటి పోయింది. బట్లర్ ప్రభుత్వ భూములను, ఖుద్‌ఖాస్త్ (స్వీయ నియంత్రణలో వున్న) భూములను ఏకీకృతం చేసుకోడానికి మాత్రమే భూస్వాములకు అనుమతినిచ్చినట్లు చెప్పుకున్నాడు. ఏ వంశపారంపర్య హక్కులనయితే కౌలుదార్లకు అనుమతించవద్దని వాదిస్తూ వచ్చారో ఆ హక్కులను చట్ట సవరణ ద్వారా భూస్వాములు పొందగలిగారు. ఇంకా, భూస్వాములు చట్టబద్ధమైన కౌలుదార్ల వారసులను భూమినుండి తొలగించేందుకు, ప్రతి గ్రామంలో మంచి సారవంతమైన భూములను ఆక్రమించుకునేందుకు అవకాశమిచ్చింది. అయితే సాగు భూమిలో ఇది 10 శాతం మించకుండ జాగ్రత్త పడేవారు. ప్రస్తుతం కౌలుదార్లకు జీవితకాల కౌలుకు ఇచ్చిన అవకాశం వారిని కొంత శాంతింపజేసినా, భవిష్యత్తులో దీని ప్రభావం భయంకరంగా, ప్రమాదకరంగా ఉండవచ్చు. ఈ వ్యవహారాన్నంతటినీ భూస్వామ్య వ్యతిరేకమయినదిగా, ఇలాంటి భూస్వామ్య ప్రతికూల పరిస్థితులు నానాటికి ప్రబలమవుతున్నట్లుగా దీన్నుండి తమను, తమ కుటుంబాలను, తమ ఆస్తులను కాపాడుకునేందుకు తమ ఎస్టేట్‌లను సంఘటిత పరచుకొనేందుకు భూస్వాములు

ప్రయత్నించారు. దాదాపు అన్ని ప్రాంతాలలో భూస్వాములు ఇదే మాదిరిగా ఆలోచించారు. ఇవే వారి ప్రవచనాలు అయ్యాయి. బీహార్‌లో కూడా ఇదే పరిస్థితిని చూడవచ్చు. అయితే బీహార్‌లో దీనికి సంబంధించి శాసనం చేయడం ఇబ్బందికరంగా తయారయింది. ఔధ్ భూస్వాములు మాత్రం తమకు అనుకూలంగా శాసనాన్ని తీసుకరాగలిగారు. చట్ట సవరణ 51 : 36 ఓట్లతో ఆమోదం పొందింది. ప్రభుత్వ సభ్యులు ఈ బిల్లుకు వ్యతిరేకంగా ఓటు చేసారు. వీరు ఈ మొత్తం సంఘర్షణలో బిల్లును నిర్ద్వందంగా వ్యతిరేకించిన ఉదారవాదుల పక్షాన నిలిచారు. ఉదారవాదులు భూస్వాముల ప్రయత్నానికి ప్రతిగా వంశపారంపర్యమైన కౌలును అనుమతించాలని కోరుతూ సవరణను ప్రవేశపెట్టినపుడు ప్రభుత్వ ప్రతినిధులు తమ నైజాన్ని ప్రకటించుకుంటూ మరోసారి భూస్వాముల పక్షాన నిలిచి సవరణను పడదోసేందుకు సహాయపడినారు.

బట్లర్ సగర్వంగా ప్రకటించుకున్న 'రాజీని' భూస్వాములు పూర్తిగా తప్పుదోవ పట్టించినా బిల్లుకు తన ఆమోదాన్ని కొనసాగించాడు. అంతేగాక, ఈ విషయానికి సమ్మతి తెలియజేస్తు భారత ప్రభుత్వం తన ఉన్నతస్థాయి అధికారులను ఈ విషయంలో తనకు అండగా నిలిచేట్లు చూడాలని, వారి సమర్ధనపైననే బిల్లు భవితవ్యం ఆధారపడి వుందని తెల్పాడు. దీనివల్ల గవర్నర్ జనరల్ కూడా బిల్లుకు తన అనుమతిని ఉపసంహరించే వీలుండదని బట్లర్ ఆశించాడు. 'అయిష్టతగల' కౌలుదార్లు, భూస్వాముల 'గౌరవం' వంటి క్లాజులను తొలగించగలిగినట్లు బట్లర్ భారత ప్రభుత్వానికి నివేదించాడు. చట్టానికి సంబంధించి అతని ప్రధాన ఉద్దేశ్యం దెబ్బతిన్నది. బహిరంగంగా బట్లర్ పథకం వీగిపోయినట్లు కన్పించినా అది ఆయన ఎత్తుగడలో ఒక భాగమే. ఆయన కాలంలో ఎదురయిన రాజకీయ ఇబ్బందులకు అడ్డుకట్ట వేస్తూ కౌలుదార్లకు జీవితకాల కౌలును సంక్రమింపజేయాలన్న అతని దృఢ అభిప్రాయం ఈ ప్రధాన అంశాన్ని తిరగదోడనంతవరకు శాసనమండలిలోగల మెజారిటీతో త[illegible] అనుకూలమయిన సవరణలు చేసుకొనే అవకాశాన్ని భూస్వాములకు కలుగజేసాడు. భూస్వాములు శాసన మండలిలో ప్రతిపాదించే ప్రతి అంశానికి ప్రభుత్వ ప్రతినిధులు గుడ్డిగా ఓటు చేయాల్సిన అవసరంలేదని తన అభిప్రాయంగా వ్యక్త పరిచాడు. రాజ్య కార్యదర్శి తో, భారత ప్రభుత్వంతో బట్లర్‌కు గల సంబంధాలలో మొదట బట్లర్ మొహం చాటు చేసుకోవాల్సిన పరిస్థితి ఉన్నట్లుగా కన్పించినా తుదకు తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోగలిగే స్థాయికి తెచ్చుకున్నట్లు గమనించవచ్చు. ఔధ్ సమస్యను పరిష్కరించటానికి ప్రయత్నించిన ప్రతి గవర్నర్ తన ప్రయత్నంలో వీగిపోవటం, వారి చివరి అనుభవంగా చూడవచ్చు. ఈ ర కంగా బట్లర్ అనుభవం లియాల్ అనుభవానికి చేరువలోనే ఉన్నదని చెప్పవచ్చు. రిప్పన్ ప్రత్యేక శ్రద్ధ, ప్రాబల్యంవల్ల లియాల్ కనీసం కౌలుదార్లకు చట్టబద్ధతకలుగజేయగలిగాడు. బట్లర్ సాధించలేని వంశాను క్రమణిక కౌలు పద్ధతిని, 1939లో చట్టానికి మరో సవరణ చేయడం ద్వారా చట్టబద్ధమైన కౌలుదార్లకు సంక్రమింపజేయడం జరిగింది.

ఈ క్రమంలో, మొత్తం మీద ఔథ్ కౌలుదార్లు, సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలోని జిరాయితీ హక్కులు గల కౌలుదార్లు ఎంతో ముందు నుంచే అనుభవిస్తున్న 'కౌలు కాలాన్ని' స్థిరపరచే హక్కును పొందగలిగారు. జిరాయితీ రైతులకు సంబంధించిన శాసనాలతో పోల్చినపుడు, ఔథ్ కౌలుదారీ శాసనం చాలా వెనకబడినట్లు కన్పించినా, ఏ హక్కులు లేని కౌలుదార్ల రక్షణ విషయమై చాలా నెమ్మదిగా కొనసాగుతున్న వ్యవహారంతో పోల్చుకున్నప్పుడు మాత్రం చాలా ముందంజలో ఉన్నట్లు కన్పిస్తుంది. ఈ కారణంగా ఇతర సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలో జిరాయితీ రైతాంగం పరిధిని దాటి శాసనాలు రూపొందించటంలో ఔథ్‌లో అనుసరించిన పద్ధతి ప్రాధాన్యత పొందింది. ఈ మార్పులో ఒక రకమయిన తార్కికతను గమనించవచ్చు. వాయవ్య ప్రాదేశిక ప్రాంతాలలో అనుసరించిన సంప్రదాయం ఔథ్‌లో ప్రభావాన్ని చూపింది. ఔథ్ కౌలుదారీ శాసనంలోని ప్రధాన అంశాలు, ఆగ్రాలో పిలువబడుతున్న ప్రాదేశిక ప్రాంతపు చట్టాల రూపకల్పనలో ఉపయోగించబడినాయి. నూతన ఒరవడులు రూపుదిద్దుకోవటంతో మరోసారి శాసన ప్రక్రియ చోటు చేసుకున్నది. సంయుక్త ప్రాదేశిక ప్రాంతాల అధికారిగా ఆంథోనీ మెక్‌డోనెల్ వచ్చిన తర్వాత ఔథ్ తరహా శాసనపు తొలి ప్రభావం చవిచూడటం జరిగింది. బెంగాల్ కౌలుదారీ చట్టం గురించి గతంలో పనిచేసినవాడు కనుక మెక్‌డోనెల్, భారత దేశంలో కెల్ల సమగ్రమయిన, తాజా కౌలుదారీ శాసనాన్ని రూపొందించేందుకు కృషిచేసాడు. మధ్య ప్రాదేశిక ప్రాంతాలకు ప్రధాన కమీషనర్ అయిన తర్వాత ఇక్కడి కౌలుదారీ చట్టాన్ని పునః సమీక్షించాలని కూడా కోరాడు.

## 8.3 శాసనపరమైన సమైక్యతా ఆవృత్తం

వాయువ్య ప్రాదేశిక ప్రాంతాలకోసం నూతన కౌలుదారీ శాసనం మరోమార్గం పట్టడానికి శాసనపరమయిన సమైక్యత సాధించాలనే కోరిక ఒక ఆధారంకానేకాదు. భారత ప్రభుత్వం ఇందుకోసం ఒక విభిన్న రీతిలో అభ్యర్ధన చేసింది. ముజఫర్ నగర్ జిల్లాకు చెందిన ఒప్పందపు నివేదికను సమీక్షిస్తున్న తరుణంలో భారత ప్రభుత్వం జిరాయితీ రైతులు చెల్లించే తక్కువ స్థాయి భాటకం రేట్ల కారణంగా భాటకం మదింపు విషయంలో సంబంధిత అధికారి ఇబ్బందులు ఎదుర్కొంటున్నట్లు వాయవ్య మరియు ఔథ్ ప్రాదేశిక ప్రాంతాల దృష్టికి తీసుక వచ్చింది. ఈ కాలంలో కేంద్ర ప్రభుత్వం భూమి శిస్తును పెంచేందుకు చాలా ఆతృతపడుతున్న స్థితిని గమనించవచ్చు. అందువల్లనే గత దశాబ్దంలో ఎవరి పట్లనయితే చాలా ఆసక్తి చూపిందో, ఎవరి రక్షణ కోసం తాపత్రయపడిందో, అదే రక్షిత కౌలుదార్ల పట్ల ఈర్ష్యాసూయాలను పెంచుకొన్నది, ఈ రక్షిత కౌలుదార్లు తాము చెల్లించే తక్కువ స్థాయి భాటకం ద్వారా రెవెన్యూ మదింపును కుదింపచేయడమే గాక వారి సంఖ్య గణనీయంగా ఉండటంవల్లను, జిల్లా మదింపు

సగటు రేట్లపై ఆధారపడటం వల్లను వీరి ప్రభావం శక్తి సగటు నిలువను వక్రీకరించింది. తద్వారా వాస్తవికుగా ప్రభుత్వరాబడిలో స్తబ్దత దారి తీసింది. శాశ్వత శిస్తు విధానం అమలులో ఉన్న ప్రాంతాలలో ప్రభుత్వరాబడి పెరిగే అవకాశం లేదు. పైగా కౌలుదారీ రక్షణ వల్ల కలిగిన ఈ ప్రభావాన్ని గురించి ప్రభుత్వం అంతగా పట్టించుకోలేదు. భాటకం పెరుగుతున్న అనుపాతంలో భూమి శిస్తు తద్వారా ప్రభుత్వం రాబడి పెరుగుతున్న ఉత్తర భారతదేశంలో మాత్రం కౌలుదారీ రక్షణ చర్యలు చేపట్టినందుకు వ్యధ చెందింది. జిరాయితీ రైతులు, ఏ హక్కులు లేని కౌలుదారులు చెల్లించే భాటకం రేట్లలో అతికొద్ది సమయంలో తీవ్రమయిన తేడా ఏర్పడింది. 1870, 1880లలో వీరు దాదాపు ఒకే రకమయిన భాటకం రేట్లను చెల్లించగా, ముజఫర్‌నగర్ నివేదిక జిరాయితీరైతులు ఎకరానికి 4 రూపాయల కంటె తక్కువగా చెల్లిస్తే, ఏ హక్కులు లేని కౌలుదార్లు 5 రూపాయల 12 అణాలు చెల్లించినట్లు వెల్లడించింది. రెవెన్యూ అధికారులు జిరాయితీ భాటకం రేట్లను, ఆరైతులు చెల్లించే సగటు రేట్ల ఆధారంగా నిర్ణయించటంవల్ల ఆ రేట్లు ఎక్కడివక్కడే నిలిచిపోయే ఒక విషవలయం ఏర్పడింది. భూస్వాములు భాటకం రేట్లను ఏ విధంగాను పెంచే అవకాశం దొరకలేదు. సగటు రేట్లను నిర్ధారించేటప్పుడు జిరాయితీ రేట్లను పరిగణించక పోవడం లేదా ధరల పెరుగుదలను ఆధారంగా తీసుకోవడం వంటి పరిష్కారాలు సూచింపబడినాయి. ఈ విషయంలో రెవెన్యూ అధికారులకు తగిన స్వేచ్ఛను ఇవ్వడానికి కౌలుదారీ శిస్తు చట్టాలను సమీక్షించటం అవసరమనిపించింది. ఇంకా, భారత ప్రభుత్వం బెంగాల్ పద్ధతిలో జిరాయితీ హక్కుగల రైతుల భాటకాన్ని నిర్ణీత కాల వ్యవధి ప్రకారం ఒక నిశ్చిత శాతంలో పెంచాలని సిఫారసు చేసింది. రెవెన్యూ అధికారి ఎలాంటి నిర్దుష్ట శాతానికి కట్టుబడకూడదని గతంలో నిర్ణయించుకున్న పద్ధతికి ఇది పూర్తిగా వ్యతిరేకమయినది. ఇప్పుడు రెవెన్యూ అధికారి స్వీయ - నిర్ధారిం సగటుల విషవలయంలో చిక్కుకున్నాడు. గతంలో రెవెన్యూ అధికారులు ప్రోత్సహించిన చట్టపరమయిన నిబంధనలపైనే ఆధారపడటం మంచిదని అన్పించింది.

1895లో భారత ప్రభుత్వం వ్రాసిన లేఖలో బెంగాల్ తరహాను ప్రస్తావిస్తూ తన కౌలుదారీ శాసనంలో సవరణలు చేయవలసిందిగా ప్రాదేశిక ప్రభుత్వాన్ని కోరింది. ఔధ్ లెఫ్టినెంట్ గవర్నర్ అయిన తార్వత కొత్త శాసనాన్ని తీసుకరావలన్న భారత ప్రభుత్వ అభ్యర్ధనను సంతోషంగా ఆహ్వానించాడు. బెంగాల్ కౌలుదారీ చట్ట రూపకల్పనలో ప్రధాన భూమిక నిర్వహించిన వారిలో ఒకడయిన మక్‌డోనెల్, బెంగాల్ తరహాను ఉపయోగించుకుంటూ, మధ్య ప్రాదేశిక ప్రాంతాల కౌలుదారీ శాసనానికి తగు ప్రతిపాదనలు చేసాడు. అందువల్ల తన కొత్త హోదాలో బెంగాల్ తరహాను ఈ ప్రాదేశిక ప్రాంతానికి అన్వయించడంలో ఎలాంటి ప్రత్యేక శ్రద్ధ చూపాల్సిన అవసరం లేకుండా పోయింది. బెంగాల్‌తరహాలో 'శాశ్వత ఒప్పందంగల

రైతు'' భావనను దాని ప్రభావాల సహితంగా ప్రవేశ పెట్టేంత దూరం వెళ్లాడేమోనని కొంత భయాంధోళనలు చోటు చేసుకున్నాయి. బెంగాల్‌లో శాశ్వత ఒప్పందం గల రైతు' సాగుచేస్తున్న భూమి అంతా, 12 సంవత్సరాలపాటు స్వాదీనంలో వుంచుకోకపోయినా అతని స్వాదీన జిరాయితీ కమతంగా మారింది. ఇలాంటి అంశాన్ని ఉత్తర భారతదేశపు భూస్వాములు వ్యతిరేకించి వుండే వారు. అయినా ఈ భూస్వాములు కౌలుదార్లలో జిరాయితీ హక్కులు వ్యాప్తి చెందటాన్ని తమకు అందుబాటులో ఉన్న అన్ని పద్ధతులతో నిరోధించటానికి విశ్వప్రయత్నం చేసారు. త్వరలోనే భారత ప్రభుత్వ రాజ్య కార్యదర్శి ఈ విషయమై పూర్తిగా చల్లబడి, సంయుక్త ప్రాదేశిక ప్రాంతాల కౌలుదారీ చట్టంలో నవకల్పనలు ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకతపై సందేహం వ్యక్త పరచటంతో మక్‌డోనెల్ ఇబ్బందులలో చిక్కుకున్నాడు. ఆ వెంటనే ఆల్‌ఫ్రెడ్ లియోల్ విచారణ నివేదిక దుమ్ముదులిపి మక్‌డోనెల్‌ను, అతని ఆలోచనలను ఈ ప్రాంతంలో విశేషమైన. శాసనం అక్కరలేదని లియోల్ వ్యక్తం చేసిన అభిప్రాయంపై తన ఉద్దేశ్యం తెలుపవలసిందిగా కోరారు. ఈ నివేదిక గురించి తన కేమి పరిజ్ఞానం లేదని, 1895 లేఖలో భారత ప్రభుత్వం కూడా ఈ ప్రస్తావన చేయలేదని వెల్లడించవలసి వచ్చింది. మక్‌డోనెల్ మూడు విధాలుగా ఈ పరిస్థితిని ఎదుర్కొన్నాడు. మొదటగా తన ప్రతిపాదనలే అమలు జరగాలని పట్టుబట్టాడు. తరువాత, జిరాయితీ హక్కులు గల రైతాంగానికి తాను కల్పించదలచిన హోదాకు, బెంగాల్ లోని 'స్థిరపడిన రైతుల' హోదాతో సంబంధంలేదని, ఈ రైతులు పన్నెండు సంవత్సరాల పాటు భూమిని సాగుచేయకుండా హక్కులు పొందలేరని తెల్పాడు చివరగా, లియాల్ పొందుపరచిన గణాంక సమాచారాన్ని పునః పరిశీలించవలసిందిగా ఆదేశించాడు. పైగా, లియాల్ తన పరిశీలనా కాలంలో ఉన్న జిరాయితీ కమతాలస్థాయిని తక్కువచేసి చూపాడని, దీని ఫలితంగా అప్పటి సమాచారంతో నేటి పరిస్థితిని పోల్చుకున్నట్లయితే జిరాయితీ రైతుల క్రింద ఉన్న భూమి ఏమార్పు లేకుండా స్థిరంగా ఉండటంగాని, తగ్గిపోవడంగాని చూడవచ్చునని నిశ్చయంగా వాదించాడు. భారత ప్రభుత్వం మక్‌డొనెల్ తయారుచేసిన సమాచారాన్ని విశ్వసించకపోయినా, తప్పనిసరి పరిస్థితులలో అతనికి అండగా నిలవటానికే నిర్ణయించుకుంది. 1880లలో తదనంతర శాసనం రూపుదిద్దుకోకుండా అడ్డగించిన పరిస్థితులలో కూడా కొంత మార్పుచోటుచేసుకున్నది. ''బెంగాల్ మరియు ఔధ్‌లలో జరిపిన గొప్ప ప్రయోగాత్మక చర్యలు, తాము అత్యాశతో వేసిన అంచనాలను మించి విజయవంతమయ్యాయని'' ప్రభుత్వం సగర్వంగా ప్రకటించుకోవటం ఈ మార్పుకు దోహదం చేసింది.'' ఇంత జరిగినా, రాజ్య కార్యదర్శి మక్ డోనెల్ ప్రతిపాధనలను అంతగా సమ్మతించలేదు. వంశానుక్రమణిక హక్కులను విస్తరింపజేసేదాని కంటె, నష్టపరిహారం చెల్లించే పద్ధతి పట్ల మొగ్గు చూపాడు. ఇంకా అవసరమయితే భూమి నుండి తొలగించినందుకు

గాను ఔథ్‌లో మాదిరిగా న్యాయ స్థానంలో జరిమాన చెల్లించే పద్ధతి కూడా కౌలుదార్లకు రక్షణ కల్పించడంలో ఉపయోగంగా ఉంటుందని రాజ్య కార్యదర్శి అభిప్రాయపడినాడు. కౌలుదార్లను తొలగించటానికి భూస్వాములు చేస్తున్న ప్రయత్నాన్ని వమ్ము చేయటానికి చట్టాన్ని గత లావాదేవీలకు వ్యవహారాలకు వర్తింపజేయాలని అనుకున్నాడు. ఒక్క దెబ్బలో అతి విస్తారమైన ప్రాంతానికి జిరాయితీ హక్కులు సంక్రమింపజేయబడతాయనే నెపంతో మక్‌డోనెల్‌కు అలాంటి అవకాశాన్ని భారతప్రభుత్వం ఇవ్వలేదు. 'గత వ్యవహారాలకు చట్టాన్ని సంక్రమింపచేయటాన్ని' ఒక సంవత్సరానికి కుదించటం జరిగింది. అయినా సంబంధిత శాసనం కొంత కాలంపాటు అక్కడే రాజుకుంటూ ఉండేసరికి, ఈ కాస్త అవకాశానికి కూడా అర్థం లేకుండా పోయింది.

కొత్త కౌలు చట్టంలో బెంగాల్ తరహాను ప్రవేశపెట్టడంతో పాటు, ఔథ్‌లో అనుసరించిన 'ఏడు' సంత్సరాలు కౌలుకు తీసుకునే పద్ధతిని ప్రవేశపెట్టడం ప్రధానమైనదని చెప్పవచ్చు. భూస్వాములు తమ ఇష్టానుసారంగా కౌలుదార్లతో దీర్ఘకాల ఒప్పందాలు కుదుర్చుకొని జిరాయితీ హక్కులు ఏర్పడకుండా తప్పించుకునేందుకు ఈ అంశాన్ని ఒక 'ఎర' గా చూపడం జరిగింది. అయితే ఈ ఏర్పాటులో కౌలుదార్లను భూమినుండి తొలగించటానికి భూస్వాములు ప్రయత్నించినప్పుడు, అది సమంజసంగాలేదని, కేవలం భాటకాన్ని పెంచటం కోసమే ఇందుకు పూనుకున్నాడని నమ్మకం ఏర్పడినట్లయితే న్యాయస్థానాలు అలాంటి తొలగింపు ఆదేశాన్ని నిరాకరించే అధికారాన్ని పొందుపరచడంతో కౌలుదారు స్థితి(స్థానం) చాలా మెరుగయింది. మౌలికంగా ఈ ఏర్పాటు కౌలుదార్లందరికి రక్షణ కల్పించేందుకు ఉద్దేశించబడినప్పటికి, ఆ తరువాత సెలెక్ట్ కమిటీ 7 సంవత్సరాల పాటు కౌలు క్రింద భూమి కలిగివున్న కౌలుదార్లకే దీన్ని పరిమితం చేసింది. కౌలుదారును తొలగించేందుకు చూపే కారణం సరియైనదేనని నమ్మకం కలిగించేందుకు, భూమినుండి వెళ్ళ గొట్టిన కౌలుదారును కనీసం సంవత్సరం లోపుగా మళ్ళీ తీసుకోవటానికి వీలులేదనే మరో ఏర్పాటు చేయడం జరిగింది. పైకి ఇది క్రూరమైన చర్యగా కన్పించినా, దాదాపు భూమి నుండి ఖాళీ చేయించే అన్ని తాఖీదులు భాటకాన్ని పెంచేందుకు ఉద్దేశించే ఒక సాధనంగా ఉపయోగించటంవల్ల ఈ ఏర్పాటు ఒక మంచి వ్యూహంగానే అన్పిస్తుంది. ఏదైనా ఎస్టేట్‌లో గందరగోళపరిస్థితుల వల్ల ప్రజా జీవితానికి ఇబ్బందులు ఏర్పడినట్లయితే ప్రభుత్వం కదిలి జోక్యం చేసుకొని ఆ ఎస్టేట్‌లో భాటకాన్ని నిర్ధారించేందుకు వీలు కల్పించే మరో విభాగం కూడా ఈ చట్టంలో చేర్చబడింది. ఈ శాసనం రూపకల్పనతో సంబంధంగల ఒక అధికారి దీన్ని ''దుడ్డుకర్ర విభాగం''గా చాలా ఖచ్చితంగానే వర్ణించాడు. ''మొరటుగా వ్యవహరించే భూస్వాములు దీనికి నిరసన వ్యక్తం చేసిన, వారిని భయపెట్టేందుకు ఈ విభాగాన్ని కొనసాగించటం తప్పనిసరి అయింది. ఆసక్తికర విషయం

ఏమంటే, శాసన సభ్యులు బెంగాల్ మరియు ఔధ్ చట్టాలలో ఉన్నటువంటి భాటకం పెంపుదల నిబంధనను అంగీకరించలేదు. ప్రతి 5 సంవత్సరాలకు ఒకసారి రూపాయిలో ఒక అణావంతు పెంచే నిబంధన అమలుచేయటానికి కూడా మెక్‌డోనెల్ సిద్ధపడినాడు''. భారత ప్రభుత్వం కూడా మొదట నూతన శాసనాన్ని రూపొందిచాలని కోరేటప్పుడు, ఈ రకమయిన నిబంధన అవసరాన్ని గురించే ఆలోచించింది. అయితే, సెలెక్ట్ కమిటీ మాత్రం ఈ యాంత్రికమయిన నిబంధనల వల్ల, హెచ్చు భాటకం రేట్లు ఇంకా పెరుగుతాయని, తక్కువ స్థాయి భాటకం రేట్లు అదే విధంగా కొనసాగే అవకాశం వున్నదని, అందువల్ల భాటకం పెంపుదల నిర్ణయాన్ని రెవెన్యూ అధికారుల నిర్ణయానికి వదలివేయడమే మంచిదని అభిప్రాయపడింది. భూమి శిస్తు సవరణ చట్టానికి తోడుగా, తయారు చేసిన ఈ చట్టంలోని ప్రత్యేక అధ్యాయం రెవెన్యూ న్యాయ స్థానాల పరిధిని మరింత స్పష్టంగా పేర్కొన్నది. తద్వారా భాటక సంబంధిత కేసుల పరిష్కారంలో సామర్థ్యం పెరగటానికి దోహదం చేసింది. ఈ ప్రాదేశిక ప్రాంతంలో రెవెన్యూ మరియు పౌర న్యాయస్థానాలు సమాంతరంగా పని చేస్తుండటంతో ఏర్పడిన సందిగ్ధతకు సరితిగా ఇలాంటి స్పష్టీకరణ కోసం ఎప్పటినుండో వేచి చూడటం జరుగుతోంది. ఇందుకు సంబంధించి సెలెక్టు కమిటీ చక్కని దృష్టాంతాన్ని పేర్కొన్నది. భూస్వామి ఒక రైతుపై ఆక్రమణ దారుగా పౌర న్యాయస్థానంలో నేరం మోపుతాడు. వెంటనే ఆ రైతు రెవెన్యూ న్యాయస్థానాన్ని తన స్థాయిని నిర్ణయించవలసిందిగా అభ్యర్థిస్తాడు. చివరకు అతను జిరాయితీ హక్కులుగల రైతుగా కనుగొనబడతాడు. ఈ సందిగ్ధతను నివారించేందుకు కౌలుదారు హక్కులకు సంబంధించిన అన్ని విషయాలను రెవెన్యూ న్యాయస్థానాలకు అప్పగించటం జరిగింది. పౌర,న్యాయస్థానాలు పరిష్కరించవలసిన కేసులు ఏమయినా వుంటే వాటిని ఆన్యాయ స్థానాలకు పంపేవారు. దీనితో వ్యవసాయ సంబంధాలను నియంత్రించడంలో రెవెన్యూ యంత్రాంగం అధికారాలను మరింత స్పష్టంగా ధృవీకరించినట్లయింది. వాయవ్య ప్రాదేశిక ప్రాంతాల పూర్వపు సాంప్రదాయం అలాగే కొనసాగింది.

'' ఏడు సంవత్సరాలు కౌలుకు తీసుకునే ఒప్పందం'' కుదుర్చుకున్న కౌలుదార్ల గురించి విస్తృతంగా చర్చించడం కొత్త చట్టం యొక్క అత్యంత ప్రధాన లక్షణమయింది. ఔధ్‌లో జిరాయితీ హక్కులు ప్రసాదించడం సాధ్యం కాదు కనుక ఔధ్ చట్టంలో దీనిని ఒక పరిష్కార మార్గంగా ఉపయోగించటం జరిగింది. కొత్త చట్టంలో ఇది కౌలుదార్లకు వంశాను క్రమాణిక హక్కులు కల్పించే రక్షణకు సరియైన ప్రత్యామ్నాయంగా రూపుదిద్దుకున్నది. భూస్వాముల చేతికి కమతాలు తిరిగివస్తాయని జిరాయితీ హక్కుల ప్రాధాన్యత క్రమంగా తగ్గిపోతుందని శాసన సభ్యులు ఊహించారు. కాల క్రమంలో ఏడు సంవత్సారాలు భూమిని కౌలుకు తీసుకొని సాగుచేస్తున్న వారి స్థాయి హోదా జిరాయితీ రైతులకంటె ప్రభలంగా ఉన్నంతగానే ఉంటుందని

కూడా ఆశించారు. గతంలో చట్టబద్ధమైన కౌలుదార్లు కూడా అయిన ''పూర్వపు యజమానులస్థాయినుండి కౌలుదార్లు'' గా మారిన వర్గాన్ని గురించిన చర్చలు, సంబందిత విధానాల పర్యవసానంగానే తూర్పు , ఉత్తర భారత దేశపు పరిస్థితుల మధ్య స్పష్టమైన తేడా చూడగలిగే విధంగా ఈ చట్టం తన దృష్టినంతా జిరాయితీ రైతుల నుండి ''చట్టపరమైన కౌలుదార్ల'' వైపు మళ్లించింది. చట్టం పనితీరును పరిశీలిస్తే, భూస్వాములు జిరాయితీ హక్కులకు వ్యతిరేకంగా పోరాడటానికే ఇష్టపడినారు తప్ప '7 సంవత్సరాల' కౌలు ఒప్పందాలను ఉపయోగించుకోలేదు. అందువల్ల చట్టంలో ఇలాంటి వారికోసం ఏర్పరచిన నియమాల ఫలితం నిరాశాజనకమయింది. దశాబ్దాల తరువాత కూడా అతి స్వల్ప శాతం భూమి మాత్రమే ఇలాంటి కౌలుదార్ల చేతిలో ఉన్నది. మరోసారి సమస్య జఠిలంగా తయారయింది. వివాదం ముదిరేసరికి చట్టసవరణ అవసరం ఏర్పడింది కాని, కొంత కాలంపాటు అలాంటి ఆలోచనను వాయిదా వేయడం జరిగింది. ముసాయిదా బిల్లు తయారు చేసినప్పుడు 1901 చట్టాన్ని ప్రతిపాదించిన వారు అవసరమని భావించిన కొన్ని ముఖ్యమైన ప్రకరణాలను వదిలివేసింది. దీంతో జేమ్స్ మేస్టన్, ఈ ప్రాదేశిక ప్రాంతపు అధికారి, శాసనాన్ని మరోసారి వాయిదావేయాలని నిర్ణయంతీసుకున్నాడు. ఇక ముందు కంటి తుడుపు చర్యలు ఎంత మాత్రం పనిచేయవని, పూర్తి స్థాయి, సమగ్ర శాసనం తేవాలని అభిప్రాయపడినాడు. ఇలాంటి చట్టం జిరాయితీ హక్కులను నిరోధించే అవకాశం భూస్వాములకు కల్పించటంతో పాటు, ఒక నిర్ణీత చట్టబద్ధమైన కాలవ్యవధిలో కౌలుదార్లను భూమినుండి తొలగించే వీలు లేకుండా, రెవెన్యూ న్యాయస్థానం నిర్ణయించిన భాటకాన్ని మాత్రమే భూస్వాములు వసూలు చేసే విధంగా కౌలుదార్లకు కూడా రాయితీలు కల్పించేదిగా ఉండాలని భావించాడు. ఇంతకు మించి ఏ ఏర్పాటు కూడా భూస్వాముల,కౌలుదార్లకు మధ్య నిరంతరాయ సంఘర్షణను నివారించలేదు. అయితే ఇలాంటి ఆలోచన జనాభిప్రాయాన్ని మించిన స్థాయిలో ఉంటుందేమోనని, ఇదే క్రమంలో ముసాయిదా బిల్లును తయారుచేయడానికి మెస్టన్ కొంత సందేహించాడు. అంతకంటె ముందు తన మనసులో వున్న అభిప్రాయాలను తాను అంతగా వాటిని పట్టించుకోవడం లేదనే ధోరణి బయటకు ప్రదర్శితమయ్యే విధంగా ప్రజలలోకి వ్యాపింపజేసాడు. భారత ప్రభుత్వ అధికారులు మేస్టన్ నిర్ణయారాహిత్య ధోరణితో, సమస్య పట్ల తను ప్రదర్శిస్తున్న సంధిగ్దతకు తమ ఆమోదాన్ని పొందడానికి ప్రయత్నించడం పట్ల తీవ్ర అసంతృప్తిని, విసుగును ప్రజలు ప్రకటించారు. ఈ వ్యవహారాన్ని పరిష్కరించుకొనే బాధ్యతను ప్రాదేశిక ప్రభుత్వానికే వదిలివేయడం జరిగింది. హార్కోర్ట్ బట్లర్ కొత్త ఔధ్ అవగాహన కుదిర్చిన తర్వాతనే ఇతర సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలో మరోసారి శాసనం తయారుచేసే ప్రక్రియను చేపట్టడం జరిగింది.

1901 ఆగ్రా చట్టంలో ప్రవేశపెట్టిన 7 సంవత్సరాల ఒప్పందం గల కౌలుదారు' భావనను ఔధ్ చట్టం-1886, నుండి గ్రహించినట్లే, ఆగ్రా చట్టబద్ధమైన కౌలుదారుకు జీవితకాలపు కౌలును స్థిరపరిచే శాసనాన్ని రూపొందించడంలో మళ్ళీ ఔధ్‌లో అనుసరించిన పద్ధతే నిర్ణాయకంగా పనిచేసింది. మెస్టన్ ప్రతిపాదనలు అలాంటి పరిష్కారాన్ని కప్పివేయగలిగేవే కాని, చట్టబద్ధ కౌలుదార్లకు జీవిత కాలపు కౌలును సూచించగల ధైర్యం చేయలేకపోయాయి. త్వర త్వరగా మార్పుకు లోనయిన ఆర్థిక, రాజకీయ వ్యవహారాలతో ఈ ప్రతిపాదనలు 1917లో ఎంతో సాహసోపేతమైనవిగా ముసాయిదా బిల్లులో చోటు చేసుకోవాల్సిన స్థితినుంచి, కొన్ని సంవత్సరాల వ్యవధిలోనే పిరికి సూచనలుగా రూపాంతరం చెందాయి. 1926, ఆగ్రా కౌలుదారీ చట్టం ఆమోదం పొందడంతో నిస్పృహతో ఎదురుచూస్తున్న సంయుక్త ప్రాదేశిక ప్రాంతాల రెండు భాగాల ( ఔధ్, ఆగ్రా) శాసనాల మధ్య సమైక్యతా ప్రక్రియ దాదాపు పూర్తయినట్లయింది. దీనితో మెజారిటీ కౌలుదార్లను చట్టబద్ధమైన రక్షణ క్రిందకు తీసుకవచ్చినట్టయింది.

ఏ హక్కులు లేని కౌలుదార్లు భూస్వాముల ప్రభుత్వ భూమికి పరిమితం చేయబడినారు లేదా రక్షిత కౌలుదార్ల వద్ద ఉప-కౌలుదార్లుగా పని చేసారు. సంఘర్షణ, ఉద్రిక్తతలకు కారణ భూతమయిన సమస్యలు మాత్రం ఇంకా సమసిపోలేదు. 1920లలో కొన్ని సంవత్సరాలపాటు హెచ్చు ధరల వల్ల ఆదాయం పెరగటంతో కౌలుదార్లు భూస్వాములు సంతృప్తి పడగలిగే భాటకాన్ని చెల్లించగలిగారు. అయితే, మాంద్య పరిస్థితులు మరోసారి సంఘర్షణకు ప్రధాన హేతువులయినాయి.

1901, కౌలుదారీ బిల్లు గురించి (తన) శాసన మండలిలో మాట్లాడుతూ మక్‌డోనెల్, ఈ ధోరణిని ముందుగానే ఊహించినట్లు పేర్కొన్నాడు. జనాభా ఒత్తిడి పెరుగుతున్న దృష్ట్యా కౌలుదార్లు తమ కనీస జీవనాధారాన్ని నిలబెట్టుకోవడానికి ఎక్కువ భాగాన్ని కోరతారు కనుక వ్యవసాయిక మిగులులో వారి వాటా తగ్గబోతున్నదని భూస్వాములను హెచ్చరించాడు. ధరలలో, ద్రవ్యం విలువలో వచ్చిన మార్పులు మౌలికమైన ఈ ఆలోచనను తాత్కాలికంగా మరుగుపరచినా, దీర్ఘకాలంలో భాటకంపై పరిమితి విధించక తప్పదని కూడా పేర్కొన్నాడు. భాటకాన్ని, భూమిశిస్తును ధరల సూచీకి అనుసంధానం చేస్తు, ధరలస్థాయిలో మార్పువల్ల ఈ రెండు ప్రభావితమవుతాయనే ఆలోచన ప్రభలంగా ఉన్న కాలంలో మెక్‌డోనెల్ వాదన విచిత్రంగా తోచింది. కాని, భారతీయ రైతాంగ వ్యవసాయ స్థితిగతులను గమనంలోకి తీసుకున్నట్లయితే అతని ఆలోచనలో ఎంతో వాస్తవికత వున్నట్లు చెప్పవచ్చు. మెక్‌డొనెల్ హెచ్చరిక కేవలం భూస్వాముల కోసమే కాకుండా, రక్షిత కౌలుదార్ల కోసం కూడా చేసాడు. స్వల్ప ఆస్తులుగల యజమానుల కంటె రక్షిత కౌలుదార్ల హక్కులు ఎంతో ముఖ్యమయినవి, విలువయినవి కూడా. 1881లోనే కొన్ని ప్రాంతాలలో యాజమాన్య సంబంధమైన హక్కు-

విలువ కంటె కౌలుదారు హక్కు విలువను రెండు రెట్లు ఎక్కువగా గుర్తించేవారు. వాస్తవంగా పరిశీలిస్తే, ఏరకంగా చూసినా గణనీయ సంఖ్యలో ఉన్న రక్షిత కౌలుదార్లందరు ఎవరికి వారే చిన్నపాటి భూస్వాములు ఉపకౌలు విధానాన్ని చాలా ఖచ్చితంగా నిషేధించడం ద్వారా, ఇలాంటి పరిస్థితిని నిరోధించాలని మక్‌డొనెల్ ఆశించాడు. అయితే, 1901 చట్టంలోని అంశాలు ఈయన ప్రతిపాదించినంత కఠినమైనవి కావు. కౌలుదార్ల క్రింద వున్న ఉపకౌలుదార్లకు, సర్వత్రా వున్న పంట భాగస్వాములకు నిర్దుష్టమైన రక్షణ కల్పించనంతకాలం ఈ అంశాలు ఎంత కఠిన తరమైనవయినా ప్రభావ రహితమే అవుతాయి. భాటకం పొందే వారిలో పెద్ద భూస్వాముల కంటె రక్షిత కౌలుదార్లే వాస్తవంగా భూమి దున్నేవానిని మరింత సమర్థవంతంగా దోపిడి కొనసాగించగలిగే వాడు. బ్రిటిష్ అధికారులు మాత్రం తమ రాజకీయ పాలనకు తగిన ఆధారాన్ని ఏర్పరచుకోడానికి, పటిష్టపరచుకోడానికే ప్రాధాన్యత ఇచ్చారు. వారికి ఈ ఆధారం రక్షిత కౌలుదార్ల రూపంలో పొందవచ్చునని ఆశించారు. 1920, 1930లలో గ్రామీణ ప్రాంతాలలో చోటు చేసుకున్న ఆందోళనలు, వారి ఆశయం సాధించుకోలేకపోయారనే నిజాన్ని రుజువు చేసాయి వీరి నియంత్రణకు అతీతమయిన మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ఏర్పడిన తీవ్ర ఆర్థిక మాంద్యం వల్ల కలిగిన ప్రభావం వంటి ఆర్థిక పరిస్థితులవల్ల వారి ఆటకట్టింది. ఆశలు భగ్నమయ్యాయి. ఫలితంగా బ్రిటిష్ వాళ్ళు తమ కోసం, తమ అవసారాల కోసం చాలా జాగ్రత్తగా పెంచి పోషించిన మొత్తం యంత్రాంగాన్ని భారత దేశ జాతీయ వాదులు తమ హస్తగతం చేసుకున్నారు.

జాతీయ వాదులకు ప్రేరణ కల్గించడంలో సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలకు ప్రత్యేక ప్రాధాన్యత ఉన్నది. ఈ ప్రాంతంలో తమకు అత్యంత విశ్వాసపాత్రంగా మెలిగే భూస్వాముల అధికారాలను బ్రిటిష్‌వారు కుదించవలసి వచ్చింది. ఐనప్పటికి, గ్రామీణ ప్రాంతాలలో అశాంతికి వీరు గురికాక తప్పలేదు. బ్రిటిష్‌పాలకులకు ఇది చాలా వింత అనుభవం మారుతున్న పరిస్థితులలో తమ కెంతో మేలుజరగవచ్చునని ఎన్నో ఆశలు పెట్టుకున్న కౌలుదార్లను భూస్వాములు చాలా ఆలస్యంగా, అయిష్టంగానే సంతృప్తి పరిచారు. ముఖ్యంగా ఔధ్ తాలుక్‌దార్లు 1886లో ఎంత నిరాసక్తంగా ఉన్నారో 1921లో కూడా అదే స్వభావాన్ని ప్రదర్శించారు. విప్లవాత్మకమైన సహాయ నిరాకరణోద్యమాన్ని అణచివేయటానికి సహాయపడవలసిందిగా ప్రముఖ భూస్వాములనందరిని బ్రిటిష్ ప్రభుత్వం కోరింది. దీనితో, తమకు ఈ మొత్తం సమస్య పరిష్కారంలో ఎంతో ప్రాధాన్యత ఉన్నట్లు గర్వంలో ఉప్పొంగిపోయిన ఈ భూస్వాములు తగిన ఫలితాన్ని అనుభవించడంతో భారతదేశంలో బ్రిటిష్ వారి ప్రయోజనాలు నెరవేరటానికి బదులుగా మరికొంత వ్యతిరేకతను పెంచగలిగారు భూస్వాములు తమ వ్యక్తిగత స్వార్థంకోసం తప్ప ఇతరత్రా ఎంత మాత్రం కలిసి పనిచేయకపోవడం, ప్రతికూల

పరిస్థితులను ఎదుర్కొనేందుకు పటిష్టమైన రాజకీయ సంఘ నిర్మాణం చేసుకోకపోవడం, పైగా నిజమైన ప్రజానాయకులుగా చలామణికావాలని ప్రయత్నించడం బ్రిటిష్‌వారికి కంటగింపు అయింది. సిపాయి తిరుగుబాటు నాటి జ్ఞాపకాలు చుట్టుముట్టడంతో, కఠినమైన సంస్కరణలతో భూస్వాములను భయపెట్టడానికి, జాతీయవాదుల ప్రాబల్యాన్ని హరించటానికి బ్రిటిష్‌వారు సాహసించలేదు. పైగా కుప్పతెప్పలుగా పేరుకుపోయిన వ్యవసాయ సంబంధమైన శాసనాలను ఒక్కకలం పోటుతో మార్చడం సాధ్యంకాలేదు. ఎలాంటి మార్పులు, సవరణలు చేయాలన్నా తీవ్రంగా కృషిచేయాలి. పునరుద్ధరించ బడిన శాసన మండలులు ప్రతిపాదించబడిన సవరణలను బలపరచాలి. పరిణితి చెందిన మండలులలో కౌలుదారీ రక్షణ చర్యలు విస్తరింపజేయాలన్న ఘోషను, సంబందిత ప్రయోజనాలను పట్టించుకునేవాడు, కనీసం మండలి ముందు విన్పించేవాడు కరువయినాడు. ఈ పరిస్థితి సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలో మరీ స్పష్టంగా కన్పించింది. 1920లలో ఓటు హక్కు పొందిన 1.2 మిలీయన్ ప్రజానీకంలో మూడింట రెండు వంతుల మంది పటిష్టమైన కౌలుదార్లే. ఎంతో కాలంగా అన్ని విధాలుగా రక్షణ అనుభవిస్తున్నా వీరికి, శాసన మండలిలో బలమైన శక్తిగా ఉన్న భూస్వాములను, వారి నిర్ణయాలను వ్యతిరేకించటానికి తగు ప్రత్యేకమైన కారణమేది కన్పించలేదు. శాసన మండలులు బ్రిటిష్ వారి ఎంపిక చేయబడిన రక్షణ విధానాన్ని మాత్రమే చాలా వినాశాపాత్రంగా ప్రతిబింబించినాయి. అయితే, రాజకీయ అశాంతి ఇలాంటి రక్షణ వల్ల కలిగే ప్రయోజనం అతి నామ మాత్రం, సంకుచితమని నిరూపించగలిగింది.

తీవ్ర ఆర్థిక మాంద్య పరిస్థితులు ఈ ప్రాదేశిక ప్రాంతంలో మొత్తంగా వ్యవసాయక, రాజకీయ సంబంధాలను విచ్ఛిన్నంచేసాయి. భూస్వామిని, కౌలుదారును వారి వ్యక్తిగత ప్రయోజనాల దృష్ట్యా వ్యతిరేక శక్తులుగా నిలబెట్టింది. భారతదేశపు ఇతర ప్రాంతాలలో పంటలు బాగా పండటం, ధరలు తక్కువ స్థాయిలో ఉండటంతో తమ కుటుంబ జీవనాధారం కోసం నిరంతరం శ్రమించేరైతాంగం కొంత వెసులుబాటు పొందారు. ఋణదాతలు, వాణిజ్య పంటలు పండించిన వారు తీవ్రంగా ఇబ్బందుల పాలయ్యారు. ఇలాంటి నిరాశజనకమైన పరిస్థితులలో రైతాంగం నుంచి ఎక్కువగా ఫలితాన్ని పొందలేమని గ్రహించిన వడ్డీ వ్యాపారులు తమ బకాయిలను రాబట్టుకోవడానికి, చట్ట ప్రకారం ప్రయత్నం చేసారు. చాలా ప్రాంతాలలో బ్రిటిష్ ప్రభుత్వం భూమి శిస్తు తాత్కాలికంగా రద్దు చేయడం కట్టిన శిస్తును తిరిగి చెల్లించడం వంటి విధానాలు అమలుచేసింది. తమకు వచ్చే భాటకాలపైనే ఆధారపడిన భూస్వాములు, ఋణదాతలు తమపై చేసే ఒత్తిడిని తట్టుకోలేక బకాయిలను రాబట్టుకోవడానికి తీవ్ర ప్రయత్నం చేయడం వల్ల , కౌలుదార్ల ఆగ్రహానికి గురి అయ్యారు. ఆంధోని మక్‌డొనెల్ హెచ్చరించినప్పటికీ భూస్వాములు ధరల పెరుగుదలను దృష్టితో పెట్టుకొని భాటకం రేట్లను పెంచుతూ ఇబ్బందు

పాలవడం సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలో ఇదే మొదటి దృష్టాంతం అనవచ్చు. చాలా మంది భూస్వాములు, ధరలు హెచ్చుగా వుండి, కౌలుదార్లు వెంట, వెంట భాటకం చెల్లిస్తున్నంత కాలం తమ ఆదాయాన్ని విచ్చలవిడిగా ఖర్చుచేస్తూ, భారీగా తమకు అందుబాటులోకి వచ్చిన రుణ మొత్తాన్ని ఉపయోగించుకోటానికీ వెనుకాడలేదు. ఇక ఇప్పుడు వడ్డీ వ్యాపారులు వీరి ముందు పడిగాపులు పడినా చెల్లించే స్థితిలో లేరు. ఈ పరిస్థితులు సృష్టించిన రాజకీయ పరమైన ఇబ్బందులను గ్రహించగలిగిన ప్రాదేశిక ప్రభుత్వం వెంటనే రుణగ్రస్తమైన ఎస్టేట్‌లపై చట్టాన్ని శాసన మండలిద్వారా తీసుకరావటానికి తీవ్ర ప్రయత్నం చేసింది. ప్రాచినకాలపు దండ్‌పట్ నిబంధనను ఉపయోగించడం, ప్రత్యేక న్యాయమూర్తిని నియమించి ఋణాల స్థాయిని తగ్గించేందుకు ప్రయత్నించటంతో పాటు భూస్వాముల రుణాలను ప్రభుత్వ బాండ్లుగా మార్చే యోచన కూడా చేసింది. ఇలాంటి రాజకీయ ప్రయోజనం కోసం ఉద్దేశించబడిన ఔదర్యాన్ని మన్నించటానికి భారత ప్రభుత్వం తన అశక్తతను వ్యక్తం చేసింది, ఈ పథకం అంతటితో నిలిచిపోయింది. పైగా, రుణ మొత్తాలను తగ్గించటంతో రుణదాతలు అరచిగిపెట్టారు. రుణ మొత్తాలను తగ్గించే చట్టం రూపొందినట్లయితే తమ బ్యాంకు ఒక్కటే 1.2 మిలియన్ రూపాయల నష్టం పొందవలసి వస్తుందని బ్యాంక్ ఆఫ్ ఆలహాబాద్' అంచనావేసింది. ఇలాంటి ఇబ్బందికర పరిస్థితులలో భూస్వాములకు ప్రభుత్వం నుంచి తాము ఆశించిన సహాయం అందుతుందనే ఆశ అడుగంటింది. భాటకాన్ని రాబట్టుకోవడమే ప్రధాన సమస్య అయింది. ఆర్థిక మాంద్యం వల్ల ఏర్పడిన అత్యవసర పరిస్థితులను తట్టుకొనేందుకు భాటకం రేట్లను తగ్గించాలన్న ఆలోచనను భూస్వాములు ఎంతమాత్రం ఇష్టపడలేదు. రెవెన్యూ యంత్రాంగం కూడా ఈ సంబంధంగా వెంట, వెంట నిర్ణయాలు తీసుకోలేకపోయింది. 1920లో సహాయ నిరాకరణోద్యమంతో పాటు గ్రామీణ వ్యవసాయ రంగంలో అశాంతి తిరిగి చోటు చేసుకోవడంతో పరిస్థితి ఈసారి మరింత విషమించింది. వస్తురూపంలో కాకుండా నగదు రూపంలో భాటకం చెల్లిస్తున్న అన్ని రకాల కౌలుదార్ల నుండి 'భాటకం రద్దు' ప్రచారానికి పూర్తి మద్దతు లభించింది. విభిన్న దృక్పథాలు గల కౌలుదార్లు ఒకే రకమయిన కష్టాలు అనుభవించాల్సిరావడంతో వారి మధ్య బలమైన ఐక్యత చోటుచేసుకోవడం ఆకాలపు నుంచి అద్భుతమైన, అరుదైన దృష్టాంతంగా పేర్కొనవచ్చు. జవహర్ లాల్ నెహ్రూ నాయకత్వంలోని కాంగ్రెస్ పార్టీ ఈ వ్యవసాయ మార్పుల జనామోదపు వెల్లువను సంయుక్త ప్రాదేశిక ప్రాంతాలలో రైతాంగం హృదయాలలో పీఠంవేసుకొని, స్వాతంత్ర్య ఉద్యమంలో వారు పాలు పంచుకొని, పూర్తి సహకారం అందించేట్లుగా వారిని కార్యోన్ముఖులను చేసేందుకు ఉపయోగించుకున్నది.

తొమ్మిదవ అధ్యాయం

# పంజాబ్, మధ్య భారత ప్రావిన్స్‌లలో శాసనాత్మక కౌలుదారీ విధాన విజయం

శాసనాత్మక వర్గీకరణ - అనుపాదిత యాజమాన్య పద్ధతుల్లో (prospective prescription) వుండే సారూప్య ప్రయోజనాల చర్చను ఈ సందర్భంలో కొనసాగించడం అవసరం. నాగరిక దృష్టి వున్న చట్ట రూప కల్పనకు ''అనుపాదిత'' సూత్రం ప్రతిబింబంగా ఉంటుందని హెన్రీ మెయిన్ వ్యాఖ్యానించాడు. కాని ఈ సూత్ర అన్వయింపువల్ల భారత దేశంలోని బెంగాల్, ఉత్తర - పశ్చిమ (North-Western) ప్రావిన్స్‌లలో తీవ్రమైన సమస్యలు ఎదురైనాయి. 12 సంవత్సరాలుగా ఒక భూకమతాన్ని సాగు చేసిన ఆధారాలు వుంటే యాజమాన్య హక్కులు లభిస్తాయనే అవకాశం భూస్వామికి-కౌలుదారుకుండే సంబంధాల్లో సహజంగానే ఘర్షణలను సృష్టించింది. నిర్దుష్టమైన సంవత్సరాల గడవులో పుగల భూమిని సాగుచేస్తున్నవారికి న్యాయం కల్పించడమే ఈ అనుపాదిత యాజమాన్య సూత్రం (prospective prescription) లోని అంతర్యంగా భావించాలి. ఈ సూత్రం ప్రకారం, 12 సంవత్సరాల యాజమాన్య రికార్డును ఎవరు ఆక్షేపణ తెలపకపోతే అట్టికమతాన్ని న్యాయమూర్తి సాగుదారుకు దాఖలు పరచవచ్చు. చరిత్రకారునికి ఈ అంశం పరిశోధనకు ఆసక్తి కలిగించే విషయంగా ఉండవచ్చు, కానీ న్యాయమూర్తులకు మాత్రం సంకటాన్ని కలుగచేసింది. ఉత్తర భారత దేశంలో భూయాజమాన్య రికార్డులను తయారు చేసే ముందు సెటిల్‌మెంట్ అధికారులు ఈ 12 సంవత్సారాల నిరంతరాయ యాజమాన్య సూత్రాన్ని పరిగణనలోకి తీసుకొన్నారు. సంప్రదాయ వ్యవసాయ సంబంధాల్లో బాగుగా వుండే సాగుదార్ల హక్కుల రక్షణకు, సాధారణ న్యాయ విచక్షణకు అనుకూలమైన సాధనంగా ఈ సూత్రం పనిచేస్తూ వచ్చింది. సాగు హక్కుల ధృవీకరణ బాధ్యతను తీసుకొన్న ప్రతి అధికారికి అర్థమైన విషయం ఒకటుంది. సాగుహక్కుల నిర్ధారణలో ఎన్ని ప్రశ్నల పరంపరను క్రింది అధికారులపై గుప్పిస్తే అదే స్థాయిలో సమాధానాలు రావడం సహజం.

శీఘ్రమైనరీతిలో కార్యనిర్వాహక నిర్ణయాలను తీసుకోవడానికి అనుపాదిత యాజమాన్య సూత్రమే సరి అయిన అంశం. నిర్దుష్ట సంవత్సరాలుగా భూమిని స్వాధీనంలో కల్గి వుండటం మున్ముందు అట్టి భూమిని దఖలు పరచుకొనే అర్హతగా మారడమే భూస్వాములకు కంటకప్రాయమైన అంశం. చాలా మంది పాలనాధికారులు అనుపాదిత యాజమాన్య సూత్ర అన్వయింపువల్ల భూమిని దఖలు పరచడం కన్నా చట్టబద్ధమైన వర్గీకరణలో భాగంగా వుండే విధంగా కౌలుదారుల హక్కుల పరిరక్షణపట్ల మొగ్గు చూపినారు.

ముమ్ముందు ఎటువంటి ఇరకాటాలు రాకుండా రైతులకు సంబంధించిన వివాదాలను ఒకేసారిగా పరిష్కరించవచ్చునని అభిప్రాయపడ్డారు. మొట్టమొదటిగా భూమి హక్కులసెటిల్‌మెంట్ ప్రయత్నాలు ప్రారంభించిన ప్రాంతాలలో ఆనాడు కొనసాగిన దృష్టి కూడా ఇదే. సెటిల్‌మెంట్ ప్రయత్నాల వల్ల కౌలుదారీ శాసనరూపకల్పనకు దారులు వేసినట్టయింది. 1840లో పంజాబ్ ప్రావిన్స్, 1850లో కేంద్రీయ ప్రావిన్స్‌లు బ్రిటిష్ అధికారం పరిధిలోకి ఏసుకరాబడినాయి. ఈ ప్రాంతాలలో అమలు చేసిన రెవిన్యూ విధానానికి స్పూర్తి ఉత్తర- పశ్చిమ (North-West) ప్రాంతాలలో అన్వయించిన సందర్భంలోనిది. కౌలు హక్కులకు సంబంధించిన నిర్ధారణ విషయానికి వచ్చినపుడు మాత్రం పూర్వం బెంగాల్ ప్రాంతంలో వహించినవైఖరిని చేపట్టినారు. ఈ రెండు ప్రావిన్స్‌లలోనూ రూపొందించిన కౌలుచట్టాలు వాటంతట అవే రూపొందించబడినాయి తప్ప వ్యవసాయ భాటకపు వసూలు చట్టాలను సవరించే అవసరంలో నుంచి కాదు. 1859వ చట్టంలోని పదవ ప్రకరణపు సారాంశం ఎప్పుడూ కూడా పూర్తిగా పంజాబ్ కేంద్రీయ ప్రావిన్స్‌లలో ప్రవేశపెట్టబడలేదు. దానిలో వున్న కొన్ని రూపురేఖలను మాత్రమే సౌకర్యార్థం వుపయోగించుకొన్నారు. ఈ రెండు ప్రావిన్స్‌లలో కౌలుదార్లను విచిత్రమైన రీతిలో నిర్వచించినారు. కౌలుదార్లకు రక్షణగా రెవిన్యూ అధికారులు నిర్వచించిన రీతిలో నష్టపరిహారం, భాటకాన్ని నిర్ణయించడం వంటి చర్యలను చేపట్టినారు. ఈ విధంగా వివిధ ప్రావిన్స్‌లలో వున్న అనుభవాలను దృష్టిలో వుంచుకొని శాసన పరికల్పన చేసినారు. 1869లో పంజాబ్ కౌలుదారీ చట్ట పరికల్పన జరిగి 1887 నాటికి ఒక చట్టం రూపొందించబడింది. 1883లో కేంద్రీయ ప్రావిన్స్‌లలో కౌలుదారీ చట్ట ప్రయత్నాలు ఆరంభించబడి 1898నాటికి కౌలుదారీ చట్టంగా రూపొందించినారు. ఈ ప్రయత్నాల తదనంతరం పంజాబ్, కేంద్రీయ ప్రావిన్స్‌లలో ఇతర ప్రావిన్స్‌లకన్న జనాభా వత్తిడి తక్కువే. పంజాబ్‌కేంద్రీయ ప్రావిన్స్‌లలో కౌలుదారీ రక్షణ చట్ట ప్రయత్నాలు పరిపుష్ఠం చేయబడినాయి. వీటిపైన కొద్దిపాటి సవరణలు ఇరవై శతాబ్దంలో సూచించబడినాయి. దీనికి కారణం, చేపట్టిన కౌలుదారీ రక్షణ ప్రయత్నాలు చురుకుగా జరగడమే. అంతేగాక, పంజాబ్, కేంద్రీయ ప్రావిన్స్‌లకు ఇతర ప్రావిన్స్‌ల కౌలుదారీ రక్షణ చట్టాల అమలులో వచ్చిన అనుభవంలో భిన్నత్వం అధికంగా వుంది. జనాభా వత్తిడి తక్కువగా వున్న పంజాబ్, కేంద్రీయ ప్రావిన్స్‌లలో భూసాగు యాజమాన్య ధ్రువీకరణ సమస్యలు వున్నా, ఇతర ప్రావిన్స్‌లకన్నా త్వరితంగానే పరిష్కరించుకొనే వీలుండేది. చారిత్రిక కారణాల వునికి వల్ల ఈ పరిణామం సంభవించలేదు. పంజాబ్, మధ్య ప్రావిన్స్‌లలో వున్న కౌలు చట్టాల ప్రభావం పాత ప్రావిన్స్‌లపై పడే అవకాశం లేకుండా పోయింది. పాత ప్రావిన్స్‌లలో ప్రవేశపెట్టిన చట్ట ప్రయత్నాలను కొత్త ప్రావిన్స్‌లలో ఏర్పరచిన ఏర్పాటువల్ల తిరుగదోడే అవకాశం లేదు.

పంజాబ్‌ను, మధ్య ప్రావిన్స్‌లను ఒకే తరహా నమూనాగా గుర్తించేందుకు ఉపకరించే అంశాలు కొన్ని వున్నాయి. రెండూ ప్రావిన్స్‌లను కూడా కఠినమైన స్థానిక పాలకులు పాలించినారు. ఈ పాలకులు తమ పాలనా విధానాల ద్వారా గ్రామీణ సమాజంలో దూకోరు మధ్య వర్తులు ఆవిర్భవించ కుండా ప్రయత్నించినారు. ఇతర ప్రాంతాల్లో ఈ మధ్యవర్తులనే బ్రిటిష్ వారు ప్రోత్సహించడం వల్ల భూస్వాములుగా రూపాంతరం చెందేవారు. అందువల్ల, ఈ ప్రావిన్స్‌లకు రైత్వారీ పద్ధతి చక్కగా అన్వయింపబడే అంశం. సరాసరి గవర్నర్ జనరల్ అధికార ఆధీనంలో వుండటం వల్ల బాంబే ప్రెసిడెన్సీ తరహా రైత్వారీ విధానం అన్వయింపు చేయడం సాధ్యం కాలేదు. రైత్వారీ సంప్రదాయాలను ఈ క్రొత్త ప్రావిన్స్‌లలో ప్రవేశపెట్టడం సాధ్యం కాకుండా పోయింది. ఫలితంగా ఉత్తర - పశ్చిమ ప్రాంతాల్లోని సంప్రదాయానుసారంగా కౌలు విధానాలను సరి పుచ్చవలసి వచ్చింది.

పంజాబ్‌లోని మొట్టమొదటి కౌలుదారీ చట్టపు ఆవిర్భావం ఉత్తర-పశ్చిమ ప్రావిన్స్‌లలోని సంప్రదాయాల్లో ఇమిడి వున్న అంతర్గత వైరుధ్యాలచే జరిగినటువంటిది. ఈ వైరుధ్యాల కొనసాగింపువల్ల ఉత్పన్నమైన వివాదం ఒక చారిత్రిక ఘటనగా అభివర్ణించవచ్చు. కానీ దీనికి పునాదులు బ్రిటిష్ భారత వ్యవసాయ సంబంధాలు వృద్ధి చెందిన విధంలోనే వున్నాయి.

## మొదటి ధృవీకరణను నిర్ధారించడం : పంజాబ్ చట్టం - వివాదం.

పంజాబ్‌ను బ్రిటిష్ వారు స్వాధీన పరుచుకొన్నప్పుడు రైతాంగంలో పెద్దగా వైవిధ్యీకరణను గుర్తించలేదు. భూవనరులకు అంతగా కొరత లేదు. కానీ సిక్కు పాలకులు కోరుకొనే రెవిన్యూ డిమాండ్‌కు అవధి లేకుండా పోయింది. అధిక రెవిన్యూ చెల్లింపు భారం వల్ల భూయాజమానులు ఇతర రైతాంగాన్ని కలుపుకొనేందుకు ఫలితంగా పన్ను భారాన్ని పంచుకొనేందుకు ఉత్సుకతను చూపేవారు. ఎప్పుడైతే బ్రిటిష్ సెటిల్‌మెంట్ అధికారి భూయాజమాన్య నిర్ధారణకు వచ్చేవాడో, ఆనాటికి వీలైనంత ఎక్కువ మంది రైతులను సాగుదారులుగా చూపేందుకు, రికార్డుల్లోకి ఎక్కించేందుకు భూస్వాములు తాపత్రయపడ్డారు. ఈ రికార్డులో ఉపయోగించిన పదజాలం ఆసక్తికరంగా ఉండింది. అభీష్టానుసారం కొనసాగే (Tenant - at-will) కౌలుదారుకు ''గైర్‌మౌరాసి'', భూమిని స్వాధీనంలో వుంచుకొని సాగు చేస్తున్న (occupancy teanant) కౌలుదారుకు ''మౌరాసి'' అనే అధికారిక పదాల గుర్తింపు వుండేది. ఉత్తర - పశ్చిమ ప్రాంతాల నేపథ్యంలో నుంచి వచ్చిన ఈ పదజాలాన్ని పూర్తిగా చాల మంది అర్థం చేసుకోలేకపోయారు. పంజాబ్‌లో ఆధీన సాగుదారును '' ఆసామి'' అని, ఒక భూకమతాన్ని దీర్ఘకాలికంగా సాగుచేస్తున్న కౌలుదారును '' ఆసామి కద్మి'' అని పిలిచేవారు.

ఇటువంటి కౌలుదార్లు సమంగా శిస్తు చెల్లించే శిస్తు భాగస్వామ్యులేకానీ భాటకచెల్లింపుదారులు మాత్రం కాదు. ఇటువంటి వారికి, సమానార్థ హోదాను సూచించే పదం బ్రిటిష్ వ్యవసాయ పరిభాషలో లేకుండా పోయింది. అందువల్ల మొదటి గా చేపట్టిన భూనిర్ధారణ - ధృవీకరణ ప్రక్రియ ప్రాథమికమైనదిగా వుండేదికాని అంతిమంకాదని నాటి సెటిల్‌మెంట్ కమీషనర్ అభిప్రాయపడ్డాడు. వీటిలో చేర్పులు, మార్పులు అవసరమౌతాయని కూడా అభిప్రాయ పడ్డాడు. భూమినిసాగు చేసే కౌలుదారుల హక్కులు అనేవి శాశ్వత నిర్ధారితమైన వన్న అంశం సరి అయింది కాదన్న భూయజమానుల విన్నపాలపట్ల కమీషనర్ క్రమేపి ఆమోదాన్ని ఇవ్వడం మొదలు పెట్టినాడు. మొదటి సర్వేలో భూయాజమాన్యం పట్ల తప్పులు దొర్లినాయనే బావన పట్ల కూడా ఒప్పుకోవడం ప్రారంభించినాడు. బ్రిటిష్ వారికి చెల్లించే శిస్తు తేలికగా వున్నదని గ్రహించిన విషయాన్ని రైతులు నొక్కి పెట్టినారు. రైతులు ఈ తేలిక శిస్తులో భాగం కలిగి వుండడం వల్ల పెద్దగా నష్టమేమి చెందడం లేదనే దృక్కూడా భూస్వాములకు ఉండేది. ఈ విధమైన స్థానిక ఏర్పాటు ఉండడంపట్ల నాటి సెటిల్‌మెంట్ కమీషనర్ అయిన ప్రిన్సెప్ భూస్వామి కౌలుదారు వివాదాలను పరిష్కరించడానికి పంచాయితీలను సమావేశ పరచడం మొదలు పెట్టినాడు. భూమిని స్వాధీన సాగులో వుంచుకొన్న రైతు కేవలం బాటకం చెల్లించే వాడేకానీ శాశ్వత హక్కులు పొందేవాడు కాదన్న అంతర్లీనమైన అభిప్రాయం నాటి కమీషనర్‌కు ఉండేది. పంజాబ్‌లో సాగు చేస్తున్న రైతులు భాగస్వామ్య శిస్తు చెల్లింపు దారు లేకానీ భాటకపు చెల్లింపుదారులు కారు. కాబట్టి భూస్వాధీన హక్కులు ఉండడం సముచితంకాదనే భావన కమీషనర్‌కు కలిగింది. ఈ విధమైన తర్కంద్వారా అనేక మంది స్వాదీనసాగుదార్లుగా వున్న అభీష్టానుసార కౌలుదార్లు (tenants-at-will) తమ హక్కుల నుండి తొలగింపబడ్డారు. మరికొన్ని సార్లు, తమకు తప్పుగా స్వాదీనసాగుదారుగా (occupancy tenants) నమోదు చేసినారని ఫిర్యాదు కూడా చేయించేవారు. ఒక వేళ ఇట్లా చేయకుంటే ప్రాబల్య కుటుంబాల, కుల పెద్దల, ఆగ్రహాన్ని చవిచూడవస్తుందనే బయానికి అనేకమంది సాగుదార్లు కొత్తగా బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదించిన రెవిన్యూ చట్టవసతిని పొందడంలో వెనుకంజవేసినారు.

మొట్టమొదటి- రెండవ సెటిల్‌మెంట్ ప్రయత్నాల్లో భేదం ఉండటానికి కారణాలు వున్నాయి. మొదటి దశలో రైతులకు భూమి బ్రిటిష్ వారి దృష్టితో ఉండే '' ఆస్థి'' అనే భావనగా అర్థంకాలేదు. స్థానిక కుటుంబాలు తమ కుండే ఆర్థికపరస్... ...వ్యాపరమైన బలంద్వారా భూమిపై నియంత్రణను కలిగివుండేవారు. మరొకవైపు సిక్కుపాలకులు రెవిన్యూ అంచనాను వేసేటప్పుడు మాత్రం సాగుదారుని వ్యక్తిగతంగా మాత్రమే పరిగణనలోకి తీసుకొనేవారు. బ్రిటిష్‌వారు మాత్రం సాగుదార్లు చెల్లించే రెవిన్యూ చెల్లింపులను సమానంగా వాటా వేసుకొని చెల్లించే బాధ్యతను గ్రామంలోని ప్రాబల్య కుటుంబాల, తెగల, కులాల అంతర్గత

ఏర్పాటుకు వదిలివేసినారు. రైత్వారీ ప్రాంతాల్లోలాగా, ఉత్తర-పశ్చిమ ప్రావిన్స్ మాదిరిగా కాక, గ్రామాల్లో ఉండే భూమికి మొత్తంగా ఒక రేటును 'రెవిన్యూగా' ప్రభుత్వం ప్రకటించేది. బయటిశక్తుల చొరబాటును నిరోదించేందుకు ఉపయోగపడిన గ్రామ ప్రాబల్యకులాల నియంత్రణను ఇప్పుడు గ్రామంలోపల పూర్తి ఆధిపత్యాన్ని పొందటానికి వెచ్చించేందుకు మళ్ళించినారు. సెటిల్మెంట్ అధికారి ధృవీకరించిన భూయాజమాన్య నిర్ధారణలు గ్రామంలో ఒక లిఖితరాజ్యాంగంగా పనిచేసింది. ఈ లిఖిత పత్రాలలో ఒకసారి నమోదు అయిన పిమ్మట దానిని మార్చటం గ్రామస్తులకు వీలుకానిపని. సెటిల్మెంట్ కమీషనర్గా పనిచేసిన ప్రిన్స్ఫ్ విచారణ కొనసాగిస్తున్నప్పుడు అనేక మంది ప్రాబల్యకుల పెద్దలు భూస్వాములు ఈ లిఖిత ఆధారాల్లో తమ కనువైన రీతుల్లో మార్పులు చేయడానికి వత్తిడిని అధికం చేసేవారు. దీనికి అనుగుణ్యంగా ప్రిన్స్ఫ్ ఒక అధికారిగా ఈ వత్తిడులకు తల ఒగ్గి చేర్పులను మార్పులను 'జేయడాన్ని' ఆయన సహచర అధికారులు నిరసించినారు. వీరంతా మొదటి సెటిల్మెంట్ సర్వేలో పాల్గొన్న వారు కనుక వాస్తవాలను మరుగున పరచడాన్ని వ్యతిరేకించినారు.

వైస్రాయి లార్డ్ లారెన్స్, రిచర్ట్ టెంపుల్, నాటి భారత ప్రభుత్వం లాకమీషన్ సభ్యుడైన హెన్రీమెయిన్ ప్రిన్సెప్ చేస్తున్న చర్యలను నిరోదించడంలో ప్రముఖ పాత్ర వహించినారు. మొదటి సర్వే ప్రకారంగా వున్న రికార్డులను ప్రమాణికంగా తీసుకోవాలనే బ్రిటిష్ ప్రభుత్వ వాగ్దానాన్ని భంగం చేయరాదని, అనవసరపు వ్యవసాయ విప్లవాత్మకతపేరిట ప్రతికూల విప్లవాత్మక స్థితిని ప్రోత్సహించరాదని గట్టిగా విశ్వసించినారు. హెన్రీ మెయిన్ వాదిస్తూ పంజాబ్లో బ్రిటిష్ దేశపు ఆస్థిని పరిగణించే దృష్టి అనుభవంలో లేకపోయినా దానిని సృష్టించే సందర్భంలో ఎవరు ' ఆస్థిని ' కలిగివుండాలో అనాలోచితంగా తొందరపాటుతో నిర్ణయించడం అతి పెద్ద తప్పవుతుందని హెన్రీమెయిన్ భావించినాడు. మొదటి సెటిల్మెంట్ సర్వే ధృవీకరణ పైన తీసుకొన్న నిర్ణయాలనే ప్రమాణికంగా తీసుకోవడం సముచితమని అధికారులు భావించినారు. రెండవ సర్వేసెటిల్మెంట్లో అనిశ్చితమైన అభిప్రాయాలను భూయాజమాన్యంపై వుంచడం ప్రమాదకరమని కూడా భావించినారు. హెన్రీమెయిన్ ప్రదర్శించిన చాక చక్యమైన చట్టపరమైన ఒర్పు వల్ల పంజాబ్లో కౌలుదారీ చట్టాన్ని తేవాలన్న వైస్రాయ్ లారెన్స్, టెంపుల్ చేస్తున్న ప్రయత్నాలకు పెద్ద ఊతమేలభించింది. ఈ ప్రయత్నాలను వమ్ముచేయడానికి వున్న వ్యతిరేక వర్గానికి నాటి పంజాబ్ లెఫ్టినెంట్ గవర్నర్ మెక్లాడ్ అభిప్రాయాలు సాకుగా ఉపకరించినాయి. భారత రాజ్య కార్యదర్శి, మండలిలోని అనేక మంది సభ్యులు, ఆర్గిల్ రాజు తదితరులు కౌలుదారీ చట్ట ప్రయత్నాలకు వ్యతిరేకంగా పనిచేయడం మొదలు పెట్టినారు. అయితే రాజ్యకార్యదర్శి కౌలుదారీ చట్టానికి ఆమోదాన్ని తెలిపినాడు. అయితే, భూయాజమాన్యపు

నిర్ధారణను బుజువుపరిచే సాక్ష్యాధారాలు సరిగా లేనట్లయితే కోర్టులో సవాలు చేసే అవకాశముందని ప్రకరణల చట్టంలో ఉండడం వల్ల రాజ్య కార్యదర్శి ఆమోదాన్ని తెలిపినాడు. ఈ ప్రకరణం వుండటం వల్ల కౌలుదారుకు వ్యతిరేకంగా కోర్టులు సవాలు చేసే బుజువు, ఆధారం చూపించవలసిన బాధ్యత వుండడంతో భూస్వామిపై అదనపు భారం పడింది. ఈ రకమైన బుజువులను ఎప్పటికప్పుడు తయారు చేయడం సులువుగా వీలైయ్యేదికాదు. 1870-1874 మధ్య కాలంలో ఇటువంటి వివాదపు కేసులు 3000లదాకా ఉన్నాయి. సెటిల్‌మెంట్ కమీషనర్ ప్రిన్సెప్ భూరికార్డుల నుంచి కొట్టివేసిన 60,000ల కేసులతో పోలిస్తే పైసంఖ్య తక్కువే. అందువల్ల కౌలుదారీ చట్టం మొట్టమొదటి సర్వే ఫలితంగా భూహక్కులను పరిరక్షించడంలో కొంత ప్రయోజనాన్ని రైతులకు అందించినా మిగిలిన అన్ని దృక్కోణాల్లో ఊహించినంత ప్రయోజన కారిగా మిగలలేదు. ఈ కౌలుదారీ చట్టంలో రూపొందించిన ఒక ప్రకరణాన్ని ఉదహారణగా తీసుకొంటే ఎంతమేరకు కార్యసాధకంగా ఇది మిగిలిందో చూడవచ్చు. ఈ ప్రకరణం ప్రకారం, కౌలుదారీ చట్ట పరికల్పనకు ముందు వున్న రెవిన్యూ అధికారి అనుమతిలో వున్న ఒప్పందాలను ఈ చట్టం ముట్టుకొనేవీలులేదు. చట్ట పూర్వకాలంలో జరిగిన ఒప్పందాలన్నీ ఆమోదయోగ్యమైనవే. 1871లో ఆమోదించబడిన పంజాబ్ లాండ్ రెవిన్యూ చట్టంద్వారా ఈ ప్రకరణం మరింత బలోపేతం చేయబడింది. 1871కంటె ముందు ఏర్పరచుకొన్న అన్నీ క్రయ - విక్రయ, సాగు-కౌలునామా ఒప్పందాలన్నీ ఆమోద యోగ్యమైనవనీ, 1868వ చట్టంలోని మూడు,నాలుగు అధ్యాయాలకు సంబంధించినవి. అయితే అవన్నీ అమోదయోగ్యమైనవైతే వాటిని పునః ప్రస్తావనకు తెచ్చే అవకాశం వుండబోదని ఈ చట్టం వక్కాణించింది. ఈ మూడు, నాల్గు అధ్యయల్లో భాటకం, నష్టపరిహారం, కౌలు ఒప్పంద వివరాలు, భూకమతంనుండి తొలగింపు, స్వచ్ఛందంగా కమతపుసాగునుండి విరమించుకోవడం వంటి అనేక అంశాలు స్పష్టపరచబడినాయి. కౌలుదారీ చట్టంలోని రెండవ అధ్యాయంలో సాగుస్వాధీన హక్కులు కలిగివున్న రైతులకు సంబంధించిన చర్చవుంది. ఒక వేళగతంలోని భూ రికార్డులలో యాజమాన్య బుజువులు వున్నట్లయితే స్వాధీన హక్కులకు సంబంధించిన సవరణ రాబోయే సవరణ సర్వేలో ఇమడ్చబడుతుందని ఈ అధ్యాయం స్పష్టం చేసింది. రెండవ దఫాసూచించిన సవరణా ప్రతిపాదనలను వాస్తవంగా అన్వయించడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. చివరకు 1883లో పంజాబ్ రెవిన్యూ అధికారులచే ఒక చట్ట ముసాయిదా తయారు చేయబడింది. గతంలో వున్న చట్ట స్ఫూర్తి నిజ పరిస్థితులకు అన్వయింపబడతదన్న విషయం ముసాయిదాను తయారు చేసే అధికారులకు కొంత మేరకు ఎక్కువ వెసులుబాటును కలిగించింది.

గత చట్టంలోని స్వాధీన సాగు హక్కులకు సంబంధించిన అధికార పరిధి విషయంలో మార్పులు తెచ్చేందుకు సరి అయిన అవకాశం వుండాలని శాసన కర్తలు భావించినారు. భాగ స్వామ్య రైతుగా అత్యధిక శిస్తు చెల్లించలేమని బయపడ్డ సాగుదారులు 'అభీష్టానుసారపు కౌలుదారులుగా'' రికార్డులో నమోదు చేయించుకొన్నారు. అట్టివారికి 1868 'నేటి నుండి' ''మున్ముందు' ' యాజమాన్య హక్కు కొనసాగేటట్లు అధికారులు తాము తయారు చేసిన రికార్డులలో పొందుపరిచినారు. ఈ దృష్టిని అవలంభించడానికి ఒక కారణం వుంది. ఉత్తర - పశ్చిమ ప్రావిన్స్ నుండి పంజాబ్‌కు ఒక జిల్లాను ఆ కాలంలో బదిలీ చేసినారు. పంజాబ్‌లో క్రొత్తగా ఈ జిల్లాను కలపడంవల్ల సాగుదారులకు భూస్వాధీన హక్కులు కోల్పోయి కౌలు రక్షణ వసతిని శాశ్వితంగా వదులుకోవలసి వచ్చింది. ఈ ప్రాంతం పంజాబ్‌కు బదిలీ కానట్లయితే ఈ చిక్కు వచ్చిపడేదికాదు. బదిలీ అయిన జిల్లావాసులకు జరిగిన అన్యాయం గురించి భారత ప్రభుత్వం ప్రాంతీయ ప్రభుత్వ దృష్టికి తెచ్చింది. దీని వల్లనే కొనసాగుతున్న చట్టానికి సవరణలను సూచించినారు. 1868 చట్టంలో ''నేటి నుండి మున్ముందుకు'' అనే పదం పొందుపరిచినందువల్ల వచ్చిన ఈ సమస్య జఠిలమైంది. అయినప్పటికీ, శాసనాత్మకంగా కౌలుదారుల హోదాను వర్గాలవునికిని నిర్వచించే సంప్రదాయపు మక్కువ కొనసాగించ బడుతూనే వుంది. ఎవరి తక్షణ పూర్వీకులైతే భూమిని భాటకం ప్రస్తావన లేకుండా స్వాధీనంలో వుంచుకొన్నామనే ఋజువులు అందించగలిగి శిస్తు మాత్రమే చెల్లిస్తున్నట్లుగా రికార్డులో వుంటే భూస్వాధీన హోదాను పొందుతారు. ఈ హోదా లభించడానికి ముందు షరుతుగా కనీసం అయాసాగుదార్లు ముప్పై సంవత్సరాలుగా భూమిని తన స్వాధీనంలో వున్నదన్నట్లుగా ఆదారాలు చూపించాలి. ముసాయిదా బిల్లులో ఈ అంశం ప్రస్తావనకు రాకపోయినా ఎంపిక కమిటీ ఈ అంశాన్ని చివరలో జోడించింది. 1887వ సంవత్సరం ఈ షరతు అన్వయింపబడే సంవత్సరంగా ప్రకటించబడింది. మున్ముందు లభించబోయే అదనపు కాల షరతు వల్ల లభించే ప్రయోజనాలను ముసాయిదా మినహాయించింది.

నూతన చట్టంలో ప్రస్ఫుటంగా కనిపించే అంశం ఒకటుంది. ఈ చట్టం ప్రకారం రెవిన్యూ అధికారుల అంచనా ద్వారా అద్దెను నిర్ణయించడం. గతంలో వున్న చట్టాలు చాలా అస్పష్టంగా బాటకాన్ని గురించి తెలిపినప్పటికీ భాటకపు అంచనాకు-రెవిన్యూ అధికారుల యంత్రాంగానికి విస్పష్టమైన సంబంధం ఏర్పడింది. వివిధ వర్గాలకు చెందిన కౌలుదార్లకు సంబంధించి వారివారి వునికిని బట్టి భాటకపు అంచనాల పట్టీ ఒకటీ తయారుచేయబడింది. సహజంగా భూమిని స్వాధీనం చేసుకొని సాగుచేసే కౌలుదార్లు రూపాయికి రెండు అణాల చొప్పునచెల్లించవలసి వుంటుంది. మిగితా తరహాకౌలుదార్లు, ముఖ్యంగా 1868కంటె ముందు స్థిరపడిన భూయాజమానులు, పూర్వపు జాగీరుదార్లు రూపాయికి నాలుగు అణాల చొప్పున

చెల్లించేటట్లు నిర్ధారించబడింది. భూస్వామినుంచి ఏరూపేణానైనా భూమిని కానుకగా పొందినట్లయితే అట్టి భూమిపై రూపాయికి ఎనిమిది అణాలు చెల్లించాలి. ఈ రుసుము అంతకూడా సాధారణంగా చెల్లించవలసిన భూమి శిస్తు కాక అదనంగా చెల్లించేటువంటిది. తదనంతర చర్చల తర్వాత 'సహజ సాగుదారు' లేదా భూమి సాగుదారుగా వుండే కౌలుదారు 2 అణాలు పూర్వ జాగీర్దార్లు 6 అణాలు, భూస్వామి భూములను పొందినవారు 12 అణాలు చెల్లించేటట్లుగా తుదకు ఒక నిర్ణయంగా తీసుకొన్నారు. కేటాయింపబడిన రెవిన్యూ మొత్తాన్ని వసూలు చేయడానికి సంబంధించిన బాధ్యత అంతా గ్రామస్తుల స్వీయ వివేచన పరిధికి వదలివేసినందువల్ల, రెవిన్యూ అధికారి ఏ విధమైన పద్ధతుల ద్వారా రెవిన్యూ అంచనాను వేయగలుగుతుండన్న విషయం నాటి రాజ్యకార్యదర్శికి అంతుచిక్కని విషయంగా మారింది. అయితే ఇది కేవలం ఒక పంజాబ్ ప్రభుత్వపు సమస్య మాత్రమే కాదు. సాగుదారు చేసే ఆస్థి కుండే అర్ధభాగపు విలువను అంచనా వేయడం అన్న ప్రావిన్స్‌లలో జరుగుతూ వచ్చింది. అభీష్టాను సారపు కౌలుదారులు ఆ భాటకపు మొత్తంకన్నా, రెవిన్యూరేట్లను చెల్లించితే దానిని బట్టి కూడా ఏమేరకు రెవిన్యూ మొత్తాలను ఖరారు చేయవచ్చునో స్పష్టంగానే చూడవచ్చు. భాటకం చెల్లించే ఆస్తులను విలువకట్టి అందులో సగంగా విభజించి దానికి రెవిన్యూ రేటును అంచనా వేయడం జరిగింది. ఇట్టి రెవిన్యూ రేటుకు కౌలుదారు చెల్లించవలసిన భాటకాన్ని అణాల రూపంలో జతచేయడం జరిగింది.

కౌలుదారు రక్షణ - రెవెన్యూ అంచనాల మధ్య సారూప్య సంబంధం మరింత ఇనుమడించడానికి కారణం ఆకాలంలోనే ప్రవేశపెట్టబడిన భాగస్వామ్య చట్టంగా (Companion Act) పేర్కొనాలి. దీనివల్ల భూమి రెవెన్యూ పద్ధతి క్రమబద్ధీకరించబడింది. గతంలో వున్న 1871వ సంవత్సరపు చట్టం ఈ క్రమబద్ధీకరణ లక్ష్యానికి పూర్తిగా సరిపోలేదు. కౌలుదారుల రక్షణకు, రెవిన్యూ అంచనాలకు మూలమైన ''భూమి రికార్డుల నిర్వాహణ'' పట్ల నూతన చట్టం ప్రత్యేక శ్రద్ధను కనపరచింది. అనేక చట్టాల్లో ఇమిడివున్న నియమ నిబంధనలను, అంశాలను క్రోడీకరించి ఈ చట్ట పరికల్పన చేసినారు. గత కౌలుదారీ చట్టం ప్రకారం నమోదు అయిన అంశాలు ఈ చట్టానికి నిరర్థకంగా మిగులుతాయి. 1868వ నాటి చట్టానికి ఈ షరతు పూర్తిగా భిన్నమైంది. పంజాబ్‌లో వున్న అన్ని గ్రామాల్లోని పట్వారీలు భూకమతాల గణాంకాలను నిర్వహించడం పట్ల ప్రత్యేక శ్రద్ధను చూపించినారు. మిగిత ప్రావిన్స్‌ల మాదిరిగా కౌలుదార్ల రక్షణ పంజాబ్‌లో పెద్ద సమస్యకాదు ఎందుకంటె 60శాతంకు పైగా భూమి సాగుచేసే రైతుల చేతుల్లో వుండేది. ఇతరులకు గానీ, వారిలో వారికి కౌలుకిచ్చుకోవడం పంజాబ్ రైతాంగంలో సర్వ సాధారణమైన పని. స్వంత భూమి లేకుండా కేవలం కౌలుదార్లుగా బ్రతికే వారి సంఖ్య స్వల్పం. బహుశా ఈ కారణాల వల్లనే పంజాబులో దేశంలోకెల్లా అతి

పంజాబ్ ప్రావిన్స్ నుండి మధ్య భారత ప్రావిన్స్‌ను భిన్నంగా వుంచిన అంశం ఒకటుంది. 1859లో రూపొందించిన పదవ (X) శాసనం 1864 మధ్య భారత ప్రాంతానికి అన్వయించడం వల్ల తేడా స్పష్టంగానే వుంది. ఈ చట్టం ప్రకారం భూకమతాల యాజమాన్యాన్ని శోధించే సెటిల్‌మెంట్ అధికారి స్థానిక సంప్రదాయాలను, సర్దుబాట్లను ప్రక్కకునెట్టి పనిచేసే వసతిని కల్పిస్తుంది. 12 సంవత్సరాల అవిచ్ఛిన్న గత యాజమాన్య సూత్రం తన శైలిలో కావలసిన రీతిగా భూస్వాములను, స్వాధీనసాగుదార్లను సృష్టించింది. అనుపాదిత యాజమాన్య సూత్ర అన్వయింపు వల్ల వచ్చే పరిణామాలను జాగ్రత్తగా తెలుసుకుంటూనే వున్నారు. ''మాల్‌గుజార్'' లాంటి భూస్వాములు కొంత ఉదాసీనంగా వుంటూ వచ్చినారు. భూయాజమాన్య నిర్ధారణ (Settlement) జరుగుతున్న సందర్భంలో మాల్‌గుజార్' భూస్వాములు అంతగా జోక్యాన్ని కలిగించుకోలేదు. జరుగుతున్న నిర్ధారణ వల్ల సంభవించబోయే నష్టం పట్ల ఇదంతా ఒక కర్మఅని భావించిన వారు కూడా వున్నారు. ఈ పరిస్థితే 1859 పదవ (X) చట్టాన్ని ప్రక్కకు తోసి వేరొక చట్టాన్ని రూపకల్పన చేయ్యాలని బ్రిటిష్ ప్రభుత్వం తలచింది. ఆనాడు కొనసాగుతున్న గ్రామీణ సమాజ నిర్మాణాన్ని యథాతథంగా కొనసాగించే ఉద్దేశ్యంతో అనుపాదిత యాజమాన్య సూత్రాన్ని తీసివేయాలనుకొన్నది. రూపొందించబోయే నూతన కౌలుదారీ చట్టంలో స్వాధీన హక్కులు పొందివున్న కౌలుదార్లను రక్షించి మిగిలా వారికి వర్తింపజేయరాదన్న ఉద్దేశ్యం స్పష్టంగా ప్రభుత్వానికి వున్నది. ఈ నూతన కౌలుదారీ చట్టం నాలుగు రకాలుగా గ్రామీణ వర్గాలను గుర్తించింది. 1864వ చట్టంకంటే ముందు వున్న స్వాధీన హక్కు కలిగి వున్న సాగుదార్లు, 1864వ చట్టం నిర్దేశించిన 12 సంవత్సరాలుగా అవిచ్ఛిన్న యాజమాన్యంకలిగి వుండి ఈ చట్టం ఆమోదింపబడటం వల్ల గుర్తింపు పొందిన రైతులు, సాధారణ కౌలుదార్లు, ఉపకౌలుదార్లుగా ఈ వర్గీకరణను తెలుపవచ్చు. సాధారణ కౌలుదార్లను తొలగించినట్లయితే వార్షిక భాటకానికి ఏడింతలు ఎక్కువగా చెల్లించాలన్న నిబంధన ఉండటంలో అక్రమమైన తొలగింపుల నుండి ఈ వర్గం పరిరక్షించబడింది. అనుపాదిత యాజమాన్య హక్కుల సూత్రం స్థానంలో ''కౌలుదార్లను తొలగించినందులకు నష్టపరిహారాన్ని'' అందజేసే పథకాన్ని రాజ్యకార్యదర్శి నిరసించినాడు. పశ్చిమ బెంగాల్ చట్టంలో ఈ అంశం ఏర్పాటును ప్రక్కకు పెట్టిన తరుణంలోనే ''కౌలుదార్ల తొలగింపునకు పరిహార'' సూత్రం మధ్య ప్రావిన్స్ చట్టంలో ఇముడ్చడం పట్ల రాజ్యకార్యదర్శి ఆశ్చర్యాన్ని ప్రకటించినాడు. రాజ్యకార్యదర్శి ఆశ్చర్యార్థక పరిశీలనలు మధ్య ప్రావిన్స్ పాలకులకు నచ్చలేదు. మధ్య ప్రావిన్స్ పాలకులు గట్టిగా తొలగింపునకు నష్ట పరిహార'' సూత్రాన్ని అభిలషించారు. ఈ సూత్రాన్ని అన్వయించటం వల్ల భూమిపై పోటీని నివారించగలగుతామని కౌలుదార్లను రక్షించ గలుగుతామని విశ్వసించినారు. అంతేగాక ఒక కౌలుదారు భూస్వామి నుండి అనుపాదిత యాజమాన్య హక్కును కొనే వీలును కూడా కల్పించినారు.

అయితే, కౌలుదార్లకుండే స్వేచ్ఛాయుత బదిలీ అవకాశాలు పై ఏర్పాటువల్ల సన్నగిల్లినాయి. అనుపాదిత యాజమాన్య సాగుదార్లకు మాత్రం ఇబ్బంది కలుగలేదు. ఎందుకంటే, వారు ప్రభుత్వానికి ధరఖాస్తు చేయడం ద్వారా భూమిని బదిలీ చేసే స్వేచ్ఛను కలిగివుంటారు. ఈ అవకాశం రైతులకు చట్టపరంగా వుండాలని వాదించి నెగ్గిన నాటి బెంగాల్ న్యాయవాది తరువాత తాను చేసిన చర్యలకు పశ్చాత్తాపం ప్రకటించినాడు. ఎందుకంటే, ఈ అవకాశం వల్ల రైతులనుండి వడ్డీవ్యాపారస్తులు భూమిని వశం చేసుకొనే వీలుకలిగింది. రైతుల నుండి భూమిని బదిలీ చేసుకోవడానికి ప్రభుత్వ అనుమతిని పొందేటట్లు చేసి తదనంతరం అట్టి భూమిని వడ్డీ వ్యాపారస్తులు వశం చేసుకొనే వారు. ఇట్లా పరాయీకరించబడిన భూమి దాదాపుగా 17శాతంగా నిర్ధారించడం కూడా జరిగింది. ఇటువంటి పద్ధతుల ద్వారా అత్యధిక సంఖ్యలో కౌలుదార్ల భూమి పరాయికరింపబడటంతో ప్రభుత్వం ఇతరత్రా రైతాంగ వర్గాల నుండి భూమి జారి పోకుండా ఉండేటట్లు ప్రభుత్వం ఆంక్షలు విధించింది. 1883లో మరొక దఫా కౌలుదారీ రక్షణ చట్టం ఆమోదించబడేదాకా ఈ ఆంక్షలు కొనసాగినాయి. కౌలుదార్ల కుండే అనుపాదిత యాజమాన్య హక్కులను చట్ట పరిధి నుండి తీసివేయడంపై ప్రభుత్వం తదనంతర కాలాల్లో విచారాన్ని వ్యక్తం చేసింది. క్రొత్తగా ఆమోదించిన మధ్య భారత ప్రాంత చట్టంలో స్వాధీన సాగుదార్లనుండి భూస్వాములు భూమిని కొనకుండా నివారించేందుకు రూపొందించిన చట్టంలో కావలసిన ప్రకరణ మేది లేదని కూడా ప్రభుత్వం గమనించింది. భూములనుండి ఎవరినైనా కదిలించవలసివస్తే అధికమొత్తంలో నష్ట పరిహారం చెల్లించవలసి వస్తుందనే కారణంవల్ల భూమిపై భాటకాన్ని ఒక హక్కుగా పెంచే అవకాశం భూస్వామికి దక్కకుండా పోయింది. మరొకవైపు సాదాసీదా స్వభావం కలిగివున్న రైతులకు, కౌలుదార్లకు చట్టంలో లభించే హక్కులగురించి తెలిసే అవకాశం లేకుండా పోయింది. తమను తొలగించనట్లైతే నష్టపరిహారం చెల్లించవలసి వుంటుందనే విషయం, భూస్వాములనుండి హక్కు రీత్యా భూమిని సంక్రమింపచేసుకొనే వీలుందనే విషయం రైతులకు తెలీదు. అంతేగాక, సాగుదారు నుండి భూమిని భూస్వామి కొనే వీలును ఆక్షేపణ చేసే ప్రకరణ చట్టం లేనందువల్ల కౌలుదారీ చట్టం పరిధి నుండి భూస్వాములు తప్పించుకోగలిగి తమ ఆధీనంలో వుండే భూ విస్తీర్ణతను పెంపొందించుకోగలిగినారు. 1889లో ఆమోదించిన చట్ట సవరణలో ఈ లోపాన్ని సవరించగలిగినారు. ఈ సవరణ నూతనంగా ఆవిర్భవిస్తున్న వడ్డీ వ్యాపార స్వభావం కలిగిన భూస్వామి చర్యలను అరికట్టడానికి ఉపయోగించినటువంటిది. సంప్రదాయక మాల్‌గుజార్‌లనుద్దేశించినది కాదు. కౌలుదారు రక్షణ చట్ట పరిధి నుండి తప్పించుకోవడానికి తమ ఎస్టేటులను కాపాడుకోవడానికి వడ్డీ వ్యాపారస్తులు సాగుదార్లతో, రైతులతో ''భాగస్వామ్య రైతులుగా'' చెలామణి అవుతూ వచ్చినారు. ఆ విధంగా అనేక లోపాలు కౌలుదారు చట్టంలో కొనసాగుతూనే వున్నా చట్టపు ఆచరణను వేచి చూడవలసివుంటుందనే స్పష్టమైన లోపాలను సరిదిద్దే ప్రయత్నాలను ఎప్పటికప్పుడు దాటవేస్తూ వచ్చినారు.

ఆంథోని మెక్‌డొనాల్డ్ మధ్య భారత ప్రాంత ముఖ్య కార్యదర్శి కావడంలో చట్ట ఆచరణపై ఎదురుచూసే ఎత్తుగడలన్నీ'' ప్రక్కకుపోయి సమస్యపై దృష్టి మరల్చడం మొదలైంది. ఈయన కౌలుదారీ చట్ట పునాదులపైననే దాడి మొదలుపెట్టి దానిని పూర్తిగా మార్చాలని అభిప్రాయపడ్డాడు. కౌలుదారులను తొలగించి నందు వల్ల చెల్లించాలనే నష్ట పరిహార సూత్రం భారతీయ సమాజ సందర్భానికి సరిపోదని వాదించి నాడు. కౌలుదార్ల సమస్యలకు న్యాయపరమైన పరిష్కారాలను సూచిస్తూ బెంగాల్ కౌలుదారీ విధానంలో వున్న శాశ్వత ధఖలు పరిచే విధానాన్ని ''స్థిర హక్కులు కలిగి వున్న రైతు'' వ్యవస్థ పట్ల, అనుపాదిత యాజమాన్య హక్కుల పట్ల ప్రాధాన్యతను చూపినాడు. భూబదిలీ స్వేచ్ఛపై ఆంక్షలు విధించాలని, భూపరాయీకరణను నిరోధించాలని అభిప్రాయపడినాడు. ఈ అభిప్రాయాలన్నీ మూర్తీభవించే విధంగా కౌలుదారీ చట్టాన్ని సవరించాలనే దాకా మెక్‌డొనాల్డ్ ప్రతిపాదనలు చెయ్యలేదు. కానీ, ఆయన సూచించిన సూచనలను తర్వాతి పాలకులు పరిశీలించినారు. ఇతని తరువాత, క్రిస్ లాయల్ మధ్య భారత ముఖ్య కార్యదర్శిగా నియమితుడైనాడు. ఈయనపై పంజాబ్ మాదిరి కౌలుదారీ శాసన ప్రభావం అధికంగా వుంది. బెంగాల్ శాసన దృక్పథం అయిన ''స్థిర హక్కులు కల్గివుండే రైతు'' ప్రతిపాదన మధ్య భారత చట్ట ముసాయిదాలనుండి శాశ్వతంగా తొలగించబడింది. మెకాడొనాల్డ్ హోం సభ్యుడుగా వున్నప్పుడు ప్రతిపాదించిన ''స్థిరరైతు'' ప్రతిపాదనను ఆయన పాలన వారసుడైన వుడ్‌బర్న్ తిరస్కరించినాడు. ఆనాటి ముఖ్యకార్యదర్శికూడా కౌలుదార్ల భాటకాన్ని రెవిన్యూ అధికారులచే నిర్ణయించే పద్ధతి వైపే మొగ్గుచూపడం వల్ల మెక్‌డొనాల్డ్ ప్రతిపాదన శాశ్వతంగా వీగిపోయింది. అయినా బెంగాల్ శాసన దృష్టిలో ప్రధానంగా చర్చించబడిన ''కౌలుకమతదారుని' నిర్ణయించే సమస్య మాత్రం అట్లాగే వుంది. ఈ కౌలుకమతదారుని వర్గీకరణ రెండు ప్రయోజనాల నాశించి రూపొందించబడింది. మొదటిది సాగుదార్లను మోసంచేసి భూమిని దక్కించుకొని కౌలుదారునిగా వడ్డీ వ్యాపారస్తులు చెలామణి అయ్యేందుకు వీలుకల్పించడం మొదటి ప్రయోజనంకాగ, రెండవది, భూస్వాములు తమ భూమిని ముక్కలు ముక్కలుగా విభజించి బంధువుల పేరిటన నమోదు చేయించి వారిని కౌలుదారులుగా ప్రకటించి సాగుదారులకు భూమి దక్కకుండా చేయడం మరొక ప్రయోజనం. అందువల్ల, నాటి ముఖ్య కమీషనర్‌గా వున్న క్రిస్ లాయల్, కౌలు కమతదారుడు, అనే రైతాంగవర్గీకరణకు మధ్య భారత ప్రాంత సందర్భంలో అర్థం లేదని భావించినాడు. భూకమతాలను ఉపకౌలుకిచ్చే పద్ధతిపై ఆంక్షలను విధించినాడు. క్రిస్ లాయల్ తీసుకున్న ఈ చర్యలపై నాటి భారత ప్రభుత్వ ఉద్యోగులు అసంతృప్తిని ప్రకటించినారు. వివిధ ప్రావిన్స్‌ల కౌలుశాసనాల నేపథ్యంలోనుంచి రూపుదిద్దుకొన్న మధ్య భారత ప్రాంత చట్టం క్రమేపి పంజాబ్ ప్రాదేశిక కౌలుదారీ చట్ట

పోకడలవైపు మొగ్గు చూపుతూ .పటిష్ట మౌతు వచ్చింది. రెవిన్యూ అధికారే భూభాటకానికి. సంబంధించిన అన్ని వ్యవహారాలను నిర్ణయిస్తాడు. భూహక్కు ధఖలుపరచే పని నుండి మధ్య దశల్లో భూభాటకాన్ని హెచ్చింపును నిర్ధారించడం వరదాకా రెవిన్యూ అధికారే చూసుకొంటాడు. రెవెన్యూ అధికారికి ఈ విధమైన విధి నిర్వహణ పరిధిని కల్పించడంలో స్వాధీనకౌలుదారు మాదిరిగానే సాధారణ కౌలుదారుకు కూడా చట్ట పరంగా రక్షణ లభించింది. ఈ చట్టంలో ఇమిడివున్న సారాంశాన్ని అనాటి మధ్య భారత ప్రాదేశిక అధికార ప్రముఖుల్లో ఒకరైన జె.బి. ఫుల్లర్ చక్కగానే నిర్వచించినాడు. శాసన మండలిలో కమతపు కౌలుదారుకు ఇచ్చిన రక్షణలను ఆనాటి శాసన సభ్యుడు జి. ఎమ్. చిత్నావీస్ దుయ్యబట్టినాడు. ఈ రక్షణల ప్రకారం ఒక ఉపకౌలుదారు కూడా ఇతర మాములు కౌలుదార్ల మాదిరిగానే భాటకాన్ని రెవెన్యూ అధికారి ద్వారా నిర్ణయింప చేసుకోవచ్చును. భూకమతాలను పెట్టుబడిగా మార్చి లబ్ధిపొందాలను కొనే వాళ్ళ లక్ష్యాలకు ఈ చట్ట ప్రకారణాలు అడ్డంకిగా మిగిలినాయి. భూకమతాలను అమ్మనూలేరు. తమకనువైన రీతిలో భూస్వాములు అంత సులభంగా భూ భాటకాన్ని ఇచ్చి వచ్చిన రీతిలో నిర్ధారింప చేసుకోనూ లేరు. అందువల్లనే చిత్నావీస్ ప్రముఖంగా ఈ అంశాన్ని లేవనెత్తడం నాటి అధికారి ఫుల్లర్ హామీ ఇస్తూ ''రెవెన్యూ అధికారి ప్రతి కేసుకుండే ప్రత్యేక యోగ్యతలను ''గమనంలోకి తీసుకొంటాడనే విషయాన్ని ఉద్ఘాటించినాడు. ప్రభుత్వ లక్ష్యం ''సంయమనమైన భాటకాన్ని నిర్ధారించడమే తప్ప గుడ్డిగా సమాన భాటకాలను రూపొందించడం కాదని'' ఫుల్లర్ వ్యాఖ్యానించినాడు. ఈ వ్యాఖ్య ఒక వైరుధ్య వంతమైన అర్థాన్ని ధ్వనించింది. '' అందరూ సమానులేకానీ కొందరు మాత్రం అందరికన్నా అధికమన్న జార్జి ఆర్వెల్ భావనను ఈ వ్యాఖ్య స్ఫురిస్తూ వచ్చింది. బ్రిటిష్ రెవెన్యూ సిద్ధాంత పోకడలకు, కొనసాగుతున్న భాటకపు మొత్తాలకు, అందుబాటులో వున్న సగటు ప్రమాణాలకు ఈ వైఖరి పూర్తిగా భిన్నమైంది. చట్టంలో వున్న ప్రకరణాలపై చిత్నావీస్ తన అనంగీకారాన్ని వ్యక్త పరచినప్పటికీ అధిక సంఖ్యాక వోటుతో వాటిని ప్రక్కకు నెట్టినారు. మధ్య భారత ప్రాంతంలో అప్పుడప్పుడూ భూస్వామ్య వ్యతిరేక ఘటనలు జరుగుతున్నప్పుడు కౌలుదార్లకు ప్రభుత్వం చట్టపరంగా కురిపించే 'వరాలజల్లులో' ఈ చర్యలు కూడా ఒక భాగమని చిత్నవీస్ విమర్శించినాడు.

కౌలుదార్లలో తమ హక్కుల పట్ల పెరుగుతున్న దృష్టికి భూస్వాములు కలవరం చెందడమే కాక ప్రభుత్వం విధించిన అంక్షలను మరొక వైపు గుది బండల్లాగా వారు భావించినారు. ఎవరైనా భూస్వామి తమ ఎస్టేటును అమ్మినట్లయితే తమకుండే పారంపర్య భూమి (sirland) పై పరాయీకరింపబడిన విధంగా వుండే భూహక్కులు వుంటాయి. భూస్వాములు తమ కుటుంబాలను పోషించుకోవడానికి వారికి చివరి సారిగా ఇచ్చిన

అవకాశమిది. ఈ అవకాశం మాట ఎట్లా వున్నా విధించిన చట్టపరమైన అంశాల వల్ల ఎవరైనా వ్యవసాయేతరులు ఈ ఎస్టేట్లను కొనాలనుకున్నా వాటి విలువ కూడా తగ్గిపోవడం మొదలైంది. ఈ అంశాన్ని ప్రస్తావిస్తూ భూకేంద్రీకరణ ధోరణులను పరోక్షంగా తగ్గించడానికే ప్రభుత్వం కంకణం కట్టుకొన్నదని చిత్నావీస్ దెప్పిపొడిచినాడు. వ్యవసాయంతో సంబంధం లేని వారికి భూమిని కొనుగోలు చేసే అవకాశం వుండనివ్వరాదనే ఉద్దేశ్యం నాటి ప్రభుత్వానికి వున్నది. భూమికి అద్దెను, వెలను మార్కెటు ధరను నిర్ణాయకంగా తెలిపే అధికారాన్ని మధ్య భారత ప్రాంతంలో లాగా ప్రభుత్వం మరెక్కడా కలిగి లేదు. కానిదీని వల్ల అత్యంత పురోగామి స్వభావం కలిగిన కౌలుదారీ చట్టం రూపకల్పన జరిగి కౌలుదారుకు గణించదగ్గ స్థాయిలో మాత్రం మేలు జరిగింది.

సాపేక్షికంగా 1898 కౌలుదారు చట్టం భారత దేశంలో ఆనాటికి రూపొందించిన చట్టాలన్నింటికన్నా సమగ్రమైనది. ఇది ఇతర శాసనాల స్ఫూర్తిని, 1883,1885 నాటి బెంగాల్ కౌలు చట్టాల నేపధ్యాన్ని పుణికి పుచ్చుకున్నది. ఆంథోనిమెక్‌డొనాల్డ్ అందించిన పద్ధతుల వల్ల చట్టానికి వుండే కౌలుదారీ అనుకూల స్వభావం మరింతగా బలపడింది. 1833 కౌలుదారీ చట్టంలో ప్రస్తావించబడని కౌలుదారీ రక్షణాయంత్రాంగం గురించి ప్రస్తుత చట్టంలో స్పష్టంగా తెలిపినారు. అంతేగాక భూయాజమాన్య దృవీకృత లిఖిత హక్కులను (Record of Rights) ఏర్పాటు చేయడంపై చట్టంలో ప్రధానంగా నొక్కి చెప్పినారు. దీని వల్ల పంజాబ్ శాసనానికి మధ్య భారత ప్రాంత చట్టానికి స్వభావంలో చాలవరకు సామీప్యం ఏర్పడింది. అయితే, ఈ కౌలుదారీ చట్టమే అంతిమమైనదానిగా గుర్తించలేదు. అయితే, మొదటి ప్రపంచ యుద్ధకాలంలో మరొక దఫా శాసన ప్రయత్నాలు ఈ అంశంపై ఆరంభమైనాయి.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ప్రారంభమైన శాసన ప్రయత్నాల్లో మొదటివి 1917లో కౌలుదారీ రెవెన్యూ చట్టానికి ప్రతిపాదించిన సవరణలు. ఈ సవరణలు మరింతగా రెవెన్యూ అధికారి కుండే విధిపరిధిని మరింతగా విస్తృత పరిచినాయి. భూయాజమాన్య లిఖిత దృవీకరణ హక్కులను పటిష్టపరిచే ప్రయత్నాలు ముమ్మరమైనాయి. భూతగాదాల విషయంలో ఇరుపక్షాలు తన సమక్షంలోకి రాకపోయినా ఏక పక్షంగా తీర్పు చెప్పే అధికారం రెవిన్యూ అధికారికి ఈ సవరణల వల్ల లభించింది. 1920 మరొక సవరణకూడా జతచేయబడింది. ఈసవరణకు నేపథ్యంగా పనిచేసిన అంశాలు ఎక్కువగా 1901నాటి యునైటెడ్ ప్రావిన్స్ నుండి గైకొనబడినాయి. భూమిని స్వాధీనంలో వుంచుకొన్న రైతుకు సాధారణ కౌలుదారుకు వున్న వ్యత్యాసం చాలా వరకు తగ్గించబడింది. ఈ సవరణ వల్ల సాధారణ కౌలుదారు మరికొన్ని వారసత్వ హక్కులను పొందేందుకు వీలు కలిగింది. ఫలితంగా మధ్య భారత ప్రాంత కౌలుదారు మిగితా ప్రాంతాల కౌలుదార్ల చట్ట ప్రతిపత్తికన్నా ఒకడుగు ముందే

వున్నాడు. ఈ చట్టం శాసనమండలిలో బిల్లుగా వున్నప్పుడు కొనసాగిన చర్చలో కొంతమంది ప్రతినిధులు భూస్వాముల తరుపున వాదిస్తూ భూబదిలీ స్వేచ్ఛ ఉండాలని పట్టు పట్టినారు. ఈ వాదన భూస్వాముల పక్షంనుండి అతిసహజమైనదిగా, న్యాయమైనదిగాను వారికి అనిపించింది. ఎందుకంటే భూబదిలీ స్వేచ్ఛ సహజంగానే భూస్వాములకు అధికంగా ఉపకరించేది కాబట్టి. ఈ ఏర్పాటే కనుక ఆమోదించబడినట్లయితే కౌలుదార్లకు భూమి అందకుండా పోయే అవకాశముందని కౌలుదారీ రక్షణలగురించి వాదించిన ప్రతినిధులు భావించినారు.

ఈ అంశంపై మహాద్రవ్యోల్బణం సంభవించేకాలందాకా పురోగతి అంతగా సాధించబడలేదు. ద్రవ్యోల్బణ స్థితి ముదరడం వల్ల ప్రాంతీయ శాసన మండలి 1934లో ప్రైవేట్ ఋణపరపతిపై ఆంక్షలు విధించి భూతనఖా బ్యాంకులను ఏర్పాటు చేసింది. ఈ బ్యాంకు నుండి ఋణాలు పొందాలంటే సరిపోయే ఋణ భద్రతా అవసరం. ఈ బ్యాంకు నుండి కౌలుదార్లు ఋణాలు పొందాలంటే భూకమతాలను కుదవపెట్టడం ఒక ప్రధానమైన చట్టపరమైన షరతుగా వుంటుంది. ఒక వేళ ఋణం పొందిన కౌలుదారుడు తిరిగి దానిని చెల్లించలేనట్లయితే దానికి ముదరాగా కమతాన్ని బ్యాంకు స్వాధీనంలో వుంచవలసి వస్తుంది. ఈ అంశాలను చట్టంలో భాగం చేయ్యడానికి కౌలుదారీ చట్టానికి సవరణ అవసరం అయ్యింది. భూతనఖా బ్యాంకు నిర్మాణం కోసం ఉద్దేశించిన శాసనంతో పాటు కౌలుదారీ చట్టంలో పొందుపరిచిన సవరణ కేవలం లాంఛన ప్రాయమైన అంశం కనుక శాసన మండలిలో త్వరగానే ఆమోదం పొందుతుందని నాటి సంబంధిత అధికారులు భావించినారు. కానీ ఆశ్చర్యంగా, శాసన మండలిలో ప్రతిపాదిత సవరణపై పెద్ద చర్చ జరిగింది. ఈ సవరణవల్ల భూస్వాములు భూమిపై తమకున్న వునికి భంగపడుతుందని భావించినారు. ఋణం చెల్లించలేని స్థితిలో భూకమతాలు బ్యాంకుకు స్వాధీనం చేయువలసి వుంటుంది. అట్లా స్వాధీనం చేసిన భూకమతాలను బ్యాంకుకు అమ్మివేస్తుంది. అమ్మాకాలు ఒక ప్రక్రియగా బ్యాంకు ఆచరించడం వల్ల భూ అమ్మకపు మార్కెటు సృష్టించ బడే అవకాశముంది. ఇట్లా బ్యాంకులు జరిపే భూకమతాల అమ్మకపు మార్కెటుపై భూస్వాములకు ఎటువంటి పట్టుదొరకదు. సహజంగానే భూస్వాములు ఈ ఎర్పాటును వ్యతిరేకించినారు. చివరకు బిల్లులో కౌలుదారు సరాసరి బ్యాంకుకే కమతాన్ని స్వాధీన పరుచ వచ్చునని స్పష్టం చేయబడింది. భూస్వామికి ఈ విధమైన స్వాధీనంపై ఎటువంటి ప్రమేయం ఉండదు. స్వాధీన సమయంలో కౌలుదారు భూస్వామికి ఏ రుసుం చెల్లించనవసరం లేదు. ఇటువంటి తక్షణ విపత్తు కాలంలో వేరేవ్వరు ఎటువంటి ప్రమేయాన్ని కలిగి వుండకూడదని ప్రభుత్వం విస్పష్ట పరిచింది. ప్రభుత్వం విస్పష్టపరిచిన విధాన ప్రకటన పట్ల ముబావ పూర్వకమైన స్పందనతో భూస్వాములు

మిన్నకుండినారు. తరాలుగా కౌలుదార్ల భూకమతాలను '' అభీష్టానుసారంగా వదిలి వేసే ప్రక్రియ ద్వారా'' భూమిని పొందడం అలవాటు పడ్డ భూస్వాములకు ఈ ప్రభుత్వం చర్యలేవీ మింగుడు పడలేదు. ఈ విధంగా కౌలుదార్ల - భూస్వాముల పరస్పర ప్రయోజనాల ఘర్షణను మధ్య భారత ప్రాంత కౌలుదారీ చట్టం స్పష్టంగానే ప్రతిఫలిస్తూ వచ్చింది. ఈ చట్టం వల్ల గతంలో కౌలుదార్లను భూకమతంనుంచి తొలగించే అధికారాన్ని, అభీష్టాను సారంగా భాటకాన్ని నిర్ణయించడం, భూకమతం నుంచి తొలగించే అధికారాన్ని, భూస్వాములు శాశ్వతంగా కోల్పోయినారు. అయితే తగిన విధంగా నష్ట పరిహారాన్ని పొందేందుకు చట్టంలో వసతి కల్పించడం వీరికి కొంత ఊరటను కలిగించింది. ''అభీష్టానుసారంగా కమతాలను'' కౌలుదార్లు భూస్వాములకు అందచేయడం ద్వారా భూములను వదిలి వెళ్ళే పక్షంలో వాటిని వేరొకరికి అమ్ముకొనే భూ బదిలీ స్వేచ్ఛను కలిగి ఉండడం వల్ల, ఈ అమ్మకాల వల్ల వచ్చే లాభంతో భూస్వాములు సంతృప్తి పడ్డారు. ఈ పరిణామాలేవీ బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదించిన కౌలుదారీ చట్ట లక్ష్యంగా ఉద్దేశించినవికావు. బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదించే చట్ట లక్ష్యాలకు వాటి ఆచరణ వల్ల వచ్చే పరిణామాలకు ఎప్పటికీ భిన్నత్వం ఉండడం తరుచుగా జరిగేటువంటి అంశంగా వుండడం గమనించదగ్గదే గదా!

పదవ అధ్యాయం

# పశ్చిమ తీర ప్రాంత భూస్వాములు: మలబారు ప్రాంత జాన్‌మీలు, కొంకణ ప్రాంతంలోని ఖోట్‌లు

## రైత్వారీ వ్యవస్థలో భూస్వాములు

రైత్వారీ సెటిల్‌మెంట్ చట్టం రక్షాకవచంగా ఏర్పడిన కారణంగా భూస్వామీకరణ ఎలాంటి ఒడుదుడుకులకు లోను కాకుండా వుండి కొన్ని రైత్వారీ ప్రాంతాలలోకి విస్తరించబడి వుంది. శాశ్వత సెటిల్‌మెంట్ విధానం మద్రాసు ప్రెసిడెన్సీలో ఎక్కువగా లేకున్నప్పటికీ ప్రత్యేక చట్టం ద్వారా కౌలు చట్టాలను అమలు చేసిన రీతి భారత దేశమంతా కలిగి వుండడాన్ని గమనించవచ్చు. కానీ వీనిలో కూడా ఒక ప్రాంతంలోని భూస్వాములను కలుపుకొని రైత్వారీ సెటిల్‌మెంట్ చేయబడ్డప్పటికీ, వాస్తవంలో ఇది ఒక వైరుధ్యంగా తయారయింది. ఈ వైరుధ్యాలే భూస్వాములకు ప్రత్యేక లాభ కారణాలయినాయి. ఎందుకంటే, రైత్వారీ పద్ధతి వాస్తవంగా నిజ సాగుదార్లకు అన్వయించవలసి వుండగా మరొకవైపు కౌలుదార్ల ప్రయోజనాలను నిరాదరణకు గురి చేసింది. దాంతో కౌలుదార్లను భూస్వాములు ఇష్టమొచ్చినరీతిలో పరిగణించినారు. కౌలు చట్టం ద్వారా మొత్తం రెవెన్యూ పద్ధతి ఉపకౌలుదారు, రైతులను ఎన్నో ఇబ్బందులకు గురి చేసింది. కొన్ని జిల్లాల్లోని రైతుల రక్షణకై తెగించి చర్యలను చేపట్టి భూస్వాముల ఉనికిని తలక్రిందులు చేయడానికి బ్రిటిష్ పాలకులు సుముఖంగా లేరు. మద్రాసు ప్రాంతంలోని మలబారు, బొంబాయి ప్రాంతంలోని రత్నగిరి జిల్లాలు వాస్తవంగా ఇంతక్రితం పేర్కొనబడిన ప్రాంతాలకన్నా బ్రిటిష్ ప్రధాన పాలనా స్రవంతికి దూరంగా ఉన్నాయి. ప్రాథమిక పరిశీలనలోనే తీర ప్రాంత జిల్లాలు ఒక క్రమంలో లేకుండా మారుమూలవిగా భావించబడుతాయి. కాని భారత పశ్చిమ తీరములో ముఖ్యమైన పద్ధతుల ద్వారా ఈ భావనను బలపరుస్తుంది. ఈ తీరంలోని భూమి, సముద్రం, మిట్ట పల్లాలు గల పర్వత సానువుల మధ్య లోయలలో వుండడం వల్ల ఉన్నత పీఠభూమి ప్రాంత ఆధార ప్రభుత్వాలకు ఈ ప్రాంతాలను నియంత్రించడం కష్టంతో కూడుకొని ఉన్నటువంటి అంశం. కనుక, ఈ తీర ప్రాంత ప్రజలు ప్రభుత్వ పాలనకు దూరంగా ఉండటంవల్ల దేశంలోని ఆయా ప్రాంతాల నుండి రెవెన్యూ ఇతరత్రా వసూలు చేయడానికి మధ్య వర్తులపై ఆధారపడడం జరుగుతుంది. ఈ మధ్య వర్తిత్వంకై సాధారణంగా మలబార్‌లో జాన్‌మీలు, కొంకణ్‌లో ఖోట్‌లు వినియోగింపబడినారు. ఈ భౌగోళిక పరిస్థితులు లేకుంటే ఈ ప్రాంత ప్రజల స్థితిగతులు మరో విధంగా వుండేవి.

చాలా వరకు జాన్‌మీలు సాగు భూములే కాకుండా అటవీ సాగుయోగ్య నిరుపయోగ భూములపై నియంత్రణ కలిగి వున్న పెద్ద భూస్వాములు. సాధారణ సముదాయ

గ్రామ జీవితం కన్న మలబార్ ప్రాంతాల్లో గ్రామస్తులు తమ ఇండ్లను ప్రధానంగా కొబ్బరి తోటల్లో, పొలాల్లోనే కట్టుకొని నివసించేవారు. కనుక, స్థానిక జాన్మీ నివాసమే సామాజిక రాజకీయ వ్యవస్థల కేంద్ర, ప్రతిబింబం నిజానికి ఒక జాన్మీ భూస్వామి మొదలుకొని విస్తృత ప్రాంత ప్రజా సముదాయాన్ని ప్రాతినిధ్యం వహించే ఒక పెద్ద సర్దారు (cheiftain) వరదాకా వుండే చాలావరకు జాన్మీలు అంతా నంబూద్రి బ్రహ్మణులే. కానీ వారిలో సాంప్రదాయకంగా యుద్ధాల్లో భాగం పంచుకొన్న నాయర్‌లు, ముస్లిమ్ జాన్మీలు కూడా ఉన్నారు. మలబారు సాంప్రదాయిక రాజకీయ వ్యవస్థను టిప్పు సుల్తాన్ విజయం నీరుకార్చింది. కానీ ఇతని పాలన అతి తక్కువ కాలమే తీర ప్రాంత ప్రజలకు బ్రిటిష్ వారు మిత్ర పక్షంగా ఏర్పడి టిప్పు సుల్తాన్ రాజ్యాన్ని అంతమొందించి జాన్మీలను పునఃప్రతిష్టించారు. రైత్వారీ పద్ధతిని సాధించే క్రమంలో రెవెన్యూ చెల్లించే వారి నుండి వీరిని వేరు చేయటంలో శ్రద్ధ వహించక పోవడం వల్ల ఈ పద్ధతిలో జాన్మీలు, వారికి నచ్చిన రీతిలోకి మార్చబడినారు. మలబార్‌లో బ్రిటిష్‌పాలకులు రైతులుగా జాన్మీల పాత్రకు పోటీలేని విధంగా వ్యవహరించారు, చాలా ప్రాంతాల్లో వారు కౌలుదార్ల నుండి నేరుగా పన్నులను వసూలు చేసేవారు. జాన్మీల నిరుపయోగ భూములను సాగుచేయు రైతులకు రెవెన్యూ అధికారులు సరైన కౌలు పత్రాలను ఇచ్చినారు. ఈ పద్ధతి 1888లో మద్రాసు హైకోర్టు నిర్ణయం ద్వారా ఆపివేయబడింది. దీనిప్రకారం రెవెన్యూ అధికారులకు క్రొత్తవారితో లావాదేవీలు జరుపు అధికారం లేకుండా పోయింది. రెవెన్యూ చెల్లించడం జాన్మీల బాధ్యత. అతడే తన భూములకు కౌలుదార్ల నియమించుకోవచ్చని పేర్కొనబడింది. ఈ తీర్పు ద్వారా జాన్మీల యొక్క అసంగత స్థాయి రైతుగా నిర్ధారించి, బలపర్చబడి కౌలుదార్ల రక్షణ చట్ట అమలు సాధ్యం కానిదానిగా మార్చింది.

ఖోట్స్‌లు మరో విధమైన భూస్వాములైనప్పటికి రైత్వారీ పద్ధతి నీడలో వీరు లాభం పొందడం జరిగింది. నిజానికి ఇతను కొన్ని గ్రామాలను నియంత్రించగల ఒక రెవెన్యూ రైతు. తదనంతర కాలంలో వీరే క్రమేపి భూస్వామి పాత్రను నిర్వహించినారు. కొన్ని సందర్భాల్లో గ్రామ పెద్ద బాధ్యతను కూడా కలిగి వున్నారు. ప్రభుత్వానికి ప్రజలకు మధ్య పెద్ద మొత్తంలో రెవెన్యూ వసూలు అసమతౌల్యం ఏర్పడినప్పుడు మధ్య వర్తులుగా వీరు వ్యవహరించేవారు. వీరు చేసే నిర్బంధ వసూలుపై ఫిర్యాదులున్నప్పటికి, కొన్ని సంధర్భాల్లో ప్రజలు ఎవరు బాధ్యులు లేకుండా వుండడం కంటే ఖోట్‌లు వుండడమే మేలని భావించారు. రెవెన్యూ వసూలు బాధ్యతతో పాటు చాలా సంధర్భాల్లో రైతులకు ఋణాలను కల్పించేవారు. మరాఠాలను ఓడించిన అనంతరం బ్రిటిష్ వారు కొంకణ్ ప్రాంతంలో తమ ముందుతరాల వారు ఉపయోగించిన పద్ధతిలోనే ఖోట్‌లను కొనసాగించారు.

కొన్ని దశాబ్దాల అనంతరం పూర్వ రాజ్యాలకు ఉపయోగంగా ఉన్న మధ్య వర్తిత్వాల ప్రాభవాన్ని కోల్పోయిన పిమ్మట బ్రిటిష్ పాలన తీర ప్రాంతాలకు మరింతగా చొచ్చుకొని పోయింది. ప్రత్యామ్నాయంగా దాని కౌలుదార్లయెడ కొంత దృష్టిని కేంద్రీకరించింది.

ఇది బ్రిటిష్ వారిని తమంతటతాముగా, స్పష్టంగా వ్యవస్థాపరమైన ఔధ్ వంటి శాశ్వత సెటిల్‌మెంట్ లేదా తాలూకాదార్లకు నిబద్ధతను మించినటువంటి చట్టపరంగా కలిగించుకోవడాలుగా మారి నియంత్రించే అవకాశాలను ఏర్పరిచినాయి.

## మలబార్‌లోని ప్రాథమిక వ్యవసాయ సంబంధ వ్యత్యాసాలు - ప్రక్కదారులు

మలబార్ జాన్‌మీలను రైత్వారీ పద్ధతిలో సంపూర్ణ భూస్వామ్య స్థాయిగా వదిలి వేసినప్పటికి వారి కౌలుదార్ల హక్కులు మొత్తంగా నిర్వచి[illegible]డలేదు, వీరు కొన్ని సందర్భాల్లో ఔధ్ తాలూక్ దార్లను పోలివున్నారు. జ్యేష్ఠత్వము (primogeneature) ద్వారా వారు వారి యొక్క ఎస్టేటులను కలిగి వుండి, వారి కౌలుదార్లు హృదయపూర్వక కౌలుదార్లుగా ముందే చెప్పబడి ఒక రకంగా ఔధ్‌లో వ్యాపించి యున్న విధంగా వారి ఎస్టేటులను సబ్ సెటిల్‌మెంట్లుగా వ్యవహరిస్తున్నారు. బెంగాల్‌లో వలె మలబార్‌లో ఉప భూస్వామ్యం మరో ప్రక్క అభివృద్ధి చెందినది. దీన్ని మనం తర్వాత పరిశీలిస్తాం. మరింకొకవైపు భూస్వాముల రైతుల మధ్య భూమితో ప్రయోజనం గల విద్యావంతులైన మధ్య తరగతి వర్గం మధ్య వర్తులుగా ఆవిర్భవించారు. మలబారు ప్రాంతములోని కౌలు పద్ధతి అతి క్లిష్టమైనదనుటలో సందేహం లేదు. అనేక కమీషన్‌లు, ప్రత్యేక అధికారులు విస్తృత సమాచారాన్ని సేకరించినారు. మలబారు ప్రాంతపు కౌలు పద్ధతి అతిక్లిష్టమైనదనడంలో ఎలాంటి సందేహం లేదు. అనేక కమీాషన్‌లు, ప్రత్యేకాధికారులు ఈ విషయంపై విస్తృతంగా సమాచారం సేకరించినారు. భారత దేశంలోని మరే ప్రాంత కౌల[illegible]విధానం గూర్చి ఇంతగా రాయబడలేదు. పుంఖాను పుంఖంగా పరిశీలనలు , నివేదికలు తప్పని పరిస్థితి మారలేదు. నిజానికి శాసన పరమైన నిరాశ, నిస్పృహనే ఇతాధికంగా రచనలు చేయడానికి కారణం. మలబార్ పాలకులు ఈ విషయం పట్ల ఆసక్తి కన్పరచడానికి మరో కారణం కూడా వున్నది. జిల్లాలోని కౌలుదార్లలో ఎక్కువ మంది మోసాలు చేసే సముద్ర వర్తక సాహసికుల సంతతి. మతంపట్ల ప్రగాఢమైన విశ్వాసం ఆధారంగా సుసంఘటితంగా వున్న ముస్లింలు. వీరు పలుమార్లు భూస్వాములతో ఘర్షణ పడ్డారు. శాసన పరమైన జోక్యాన్ని కల్గించుకోడానికి ఎపుడు ఇష్టపడని మద్రాస్ అధికారులు కూడా ఈ విషయం తప్పనిసరిగా కల్పించుకోవాల్సిన అవసరాన్ని గుర్తించినారు. జిల్లాకు సంబంధించిన బ్రిటిష్ అధికార్లలో ఒకరు అక్కడ హిందూ భూస్వాములను, ముస్లిం కౌలుదార్లను ఐర్లాండులోని ప్రొటెస్టెంట్ భూస్వాములు కాథలిక్ కౌలుదార్లతో పోల్చినాడు. అంతేకాక ఈ పరిస్థితిని మెరుగు పర్చేందుకు న్యాయపరిహారాన్నివ్వడం అత్యంత ముఖ్యమైన చర్యగా, ఆ అధికారి సూచించాడు. ఇలాంటి

చర్య ఐర్లాండులో ప్రత్యేకంగా సూచించబడింది. ఇలాంటి చర్య ఐర్లాండులో ప్రత్యేకంగా ప్రవేశపెట్టాల్సి వుంటే, మలబారులో ఇది పూర్వం కొనసాగిన ఆచారమే కనుక పునః స్థాపన, చట్టపరమైన గుర్తింపు నివ్వడం అవసరమనీ పేర్కొన్నారు. మలబారు వ్యవసాయోత్పత్తుల్లో కొబ్బరి, పోక ముఖ్యమైనవి. వాటిని ఉత్పత్తి చేయడమే అభివృద్ధికరమైన చర్య. గతంలో ఇందుకోసమే ఏ భూస్వామైనా తన కౌలుదార్లను కౌలునుంచి తొలిగించినపుడు నష్టపరిహారం ఇచ్చేవారు.

వీరు చాలా సందర్భాల్లో భూస్వాములతో, శాసనపరమైన జోక్యాన్ని కల్గించడానికి ఎప్పుడు వెనుకాడే మద్రాస్ అధికారులు కూడా తప్పనిసరిగా జోక్యాన్ని కలుగచేసుకోవాల్సిన అవసరాన్ని గుర్తించకుండా ఉండలేక పోయారు. ఒక పాలనాధికారి నాటి వ్యవసాయ స్థితిని ఉదహరిస్తూ, మలబార్ హిందూ భూస్వాములు, ముస్లిమ్ రైతాంగ వ్యవసాయం నిజానికి కొబ్బరివంటి వృక్షవుత్పత్తుల చేనడిచేది. ఒక వేళ ఎవరైనా కౌలుదారును భూస్వామి భూకమతం నుండి తొలగిస్తే భూస్వామి పరిహారం ఇవ్వాల్సి ఉంటుంది. రెవెన్యూ అధికారులు లేదా కోర్టులు ఈ రకమైన పరిహారాన్ని అమలు చేయాలా ? వద్దా ? అనేది కీలక ప్రశ్నగా మారింది.

ఈ అంశాన్ని నిర్ధారించడానికి వ్యవసాయ సంబంధాల సమగ్ర పరిశీలనల ద్వారా తప్ప ఇది సాధ్యం కానిదిగా భావించారు. ఈ సందర్భంగానే మలబారు కౌలువిధానంపై నివేదిక రూపొందించడానికై విలియమ్ లోగాన్‌ను ప్రత్యేకంగా నియమించినారు. ఇతడు 1881లో తన నివేదిక సమర్పించినాడు. ఈ నివేదిక తీవ్రమైన వివాదానికి దారి తీసింది. జాన్ మీ - కనమ్‌కార్‌ల మధ్య కొనసాగుతున్న సంబంధాలు, కౌలుదారు అయిన కనమ్‌కార్ తిరిగి మరొకరు అయిన వెరుమ్ పట్టామ్‌దార్‌కు భూమిని ఇవ్వడం వంటి సమస్యలను ఈ నివేదికలో ప్రధానంగా ప్రస్తావించింది. సాధారణంగా వెరుమ్ పట్టమ్‌దార్‌లు భూమిని సాగుచేసే రైతులు. కాని కొన్ని సందర్భాల్లో వీరిలో కొందరు ఇతరులకు ఉపకౌలు ఇచ్చేవారు. నాటి బ్రిటిష్ అధికారి లోగాన్, జాన్‌మీలు సంపూర్ణ హక్కు కలిగి ఉండడాన్ని కాదన్నాడు. సంప్రదాయ వ్యవసాయ సంబంధాల్లో వచ్చిన వక్రీకరణలను ఆయన వ్యతిరేకించినాడు. నిజమైన సాగుదార్లయిన కౌలుదార్లకు చట్టబద్ధ న్యాయపరమైన రక్షణ కల్పించాలని ఇతడు సూచించినాడు. కానీ వెరుమ్‌పట్టామ్‌దార్లకు సంబంధించిన రక్షణలను ఇవ్వాలన్న సూచన జాన్‌మీలకు, కనమ్‌కార్లకు రుచించలేదు. సాగుచేసే నిజమైన కౌలుదార్లను దోపిడి చేయకుండా నివారించే చర్యలు ప్రతిపాదించ బడడం సహజంగానే ఈ భూస్వామ్య శక్తులకు నచ్చలేదు.

జాన్‌మీ కనమ్‌కార్‌ల సంబంధాలు ప్రత్యేకమైన స్వభావం కలిగి వున్నటువంటివి. ఆచారంగా రూపొందిన పద్ధతి కౌలుదారు తన అద్దెను భూస్వామికి ముందే చెల్లించాలి.

కొన్ని దశాబ్దాల అనంతరం పూర్వ రాజ్యాలకు ఉపయోగంగా ఉన్న మధ్య వర్తిత్వాల ప్రాభవాన్ని కోల్పోయిన పిమ్మట బ్రిటిష్ పాలన తీర ప్రాంతాలకు మరింతగా చొచ్చుకొని పోయింది. ప్రత్యామ్నాయంగా దాని కౌలుదార్లయెడ కొంత దృష్టిని కేంద్రీకరించింది.

ఇది బ్రిటిష్ వారిని తమంతటతాముగా, స్పష్టంగా వ్యవస్థాపరమైన ఔథ్ వంటి శాశ్వత సెటిల్‌మెంట్ లేదా తాలూకాదార్లకు నిబద్ధతను మించినటువంటి చట్టపరంగా కలిగించుకోవడాలుగా మారి నియంత్రించే అవకాశాలను ఏర్పరిచినాయి.

## మలబార్‌లోని ప్రాథమిక వ్యవసాయ సంబంధ వ్యత్యాసాలు - ప్రక్కదారులు

మలబార్ జాన్మీలను రైత్వారీ పద్ధతిలో సంపూర్ణ భూస్వామ్య స్థాయిగా వదిలి వేసినప్పటికి వారి కౌలుదార్ల హక్కులు మొత్తంగా నిర్వచించబడలేదు, వీరు కొన్ని సందర్భాల్లో ఔథ్ తాలూక్ దార్లను పోలివున్నారు. జ్యేష్ఠత్యము (primogeneature) ద్వారా వారు వారి యొక్క ఎస్టేటులను కలిగి వుండి, వారి కౌలుదార్లు హృదయపూర్వక కౌలుదార్లుగా ముందే చెప్పబడి ఒక రకంగా ఔథ్‌లో వ్యాపించి యున్న విధంగా వారి ఎస్టేటులను సబ్ సెటిల్‌మెంట్లుగా వ్యవహరిస్తున్నారు. బెంగాల్‌లో వలె మలబార్‌లో ఉప భూస్వామ్యం మరో ప్రక్క అభివృద్ధి చెందినది. దీన్ని మనం తర్వాత పరిశీలిస్తాం. మరింకొకవైపు భూస్వాముల రైతుల మధ్య భూమితో ప్రయోజనం గల విద్యావంతులైన మధ్య తరగతి వర్గం మధ్య వర్తులుగా ఆవిర్భవించారు. మలబారు ప్రాంతములోని కౌలు పద్ధతి అతి క్లిష్టమైనదనుటలో సందేహం లేదు. అనేక కమీషన్‌లు, ప్రత్యేక అధికారులు విస్తృత సమాచారాన్ని సేకరించినారు. మలబారు ప్రాంతపు కౌలు పద్ధతి అతిక్లిష్టమైనదనడంలో ఎలాంటి సందేహం లేదు. అనేక కమీషన్‌లు, ప్రత్యేకాధికారులు ఈ విషయంపై విస్తృతంగా సమాచారం సేకరించినారు. భారత దేశంలోని మరే ప్రాంత కౌలు విధానం గూర్చి ఇంతగా రాయబడలేదు. పుంఖాను పుంఖంగా పరిశీలనలు , నివేదికలు తప్పని పరిస్థితి మారలేదు. నిజానికి శాసన పరమైన నిరాశ, నిస్పృహనే ఇతాధికంగా రచనలు చేయడానికి కారణం. మలబార్ పాలకులు ఈ విషయం పట్ల ఆసక్తి కన్పరచడానికి మరో కారణం కూడా వున్నది. జిల్లాలోని కౌలుదార్లలో ఎక్కువ మంది మోసాలు చేసే సముద్ర వర్తక సాహసికుల సంతతి. మతంపట్ల ప్రగాఢమైన విశ్వాసం ఆధారంగా సుసంఘటితంగా వున్న ముస్లింలు. వీరు పలుమార్లు భూస్వాములతో ఘర్షణ పడ్డారు. శాసన పరమైన జోక్యాన్ని కల్గించుకోడానికి ఎపుడు ఇష్టపడని మద్రాస్ అధికారులు కూడా ఈ విషయం తప్పనిసరిగా కల్పించుకోవాల్సిన అవసరాన్ని గుర్తించినారు. జిల్లాకు సంబంధించిన బ్రిటిష్ అధికార్లలో ఒకరు అక్కడ హిందూ భూస్వాములను, ముస్లిం కౌలుదార్లను ఐర్లాండులోని ప్రొటెస్టెంట్ భూస్వాములు కాథలిక్ కౌలుదార్లతో పోల్చినాడు. అంతేకాక ఈ పరిస్థితిని మెరుగుపర్చేందుకు నష్టపరిహారాన్నివ్వడం అత్యంత ముఖ్యమైన చర్యగా, ఆ అధికారి సూచించాడు. ఇలాంటి

చర్య ఐర్లాండులో ప్రత్యేకంగా సూచించబడింది. ఇలాంటి చర్య ఐర్లాండులో ప్రత్యేకంగా ప్రవేశపెట్టాల్సి వుంటే, మలబారులో ఇది పూర్వం కొనసాగిన ఆచారమే కనుక పునః స్థాపన, చట్టపరమైన గుర్తింపు నివ్వడం అవసరమనీ పేర్కొన్నారు. మలబారు వ్యవసాయోత్పత్తుల్లో కొబ్బరి, పోక ముఖ్యమైనవి. వాటిని ఉత్పత్తి చేయడమే అభివృద్ధికరమైన చర్య. గతంలో ఇందుకోసమే ఏ భూస్వామైనా తన కౌలుదార్లను కౌలునుంచి తొలిగించినపుడు నష్టపరిహారం ఇచ్చేవారు.

వీరు చాలా సందర్భాల్లో భూస్వాములతో, శాసనపరమైన జోక్యాన్ని కల్గించడానికి ఎప్పుడు వెనుకాడే మద్రాస్ అధికారులు కూడా తప్పనిసరిగా జ్యోక్యాన్ని కలుగచేసుకోవాల్సిన అవసరాన్ని గుర్తించకుండా ఉండలేక పోయారు. ఒక పాలనాధికారి నాటి వ్యవసాయ స్థితిని ఉదహరిస్తూ, మలబార్ హిందూ భూస్వాములు, ముస్లిమ్ రైతాంగ వ్యవసాయం నిజానికి కొబ్బరివంటి వృక్షవుత్పత్తుల చేనడిచేది. ఒక వేళ ఎవరైనా కౌలుదారును భూస్వామి భూకమతం నుండి తొలగిస్తే భూస్వామి పరిహారం ఇవ్వాల్సి ఉంటుంది. రెవెన్యూ అధికారులు లేదా కోర్టులు ఈ రకమైన పరిహారాన్ని అమలు చేయాలా ? వద్దా ? అనేది కీలక ప్రశ్నగా మారింది.

ఈ అంశాన్ని నిర్ధారించడానికి వ్యవసాయ సంబంధాల సమగ్ర పరిశీలనల ద్వారా తప్ప ఇది సాధ్యం కానిదిగా భావించారు. ఈ సందర్భంగానే మలబారు కౌలువిధానంపై నివేదిక రూపొందించడానికై విలియమ్ లోగాన్‌ను ప్రత్యేకంగా నియమించినారు. ఇతడు 1881లో తన నివేదిక సమర్పించినాడు. ఈ నివేదిక తీవ్రమైన వివాదానికి దారి తీసింది. జాన్ మీ - కనమ్‌కార్‌ల మధ్య కొనసాగుతున్న సంబంధాలు, కౌలుదారు అయిన కనమ్‌కార్ తిరిగి మహోకరు అయిన వెరుమ్ పట్టామ్‌దార్‌కు భూమిని ఇవ్వడం వంటి సమస్యలను ఈ నివేదికలో ప్రధానంగా ప్రస్తావించింది. సాధారణంగా వెరుమ్ పట్టమ్‌దార్‌లు భూమిని సాగుచేసే రైతులు. కాని కొన్ని సందర్భాల్లో వీరిలో కొందరు ఇతరులకు ఉపకౌలు ఇచ్చేవారు. నాటి బ్రిటిష్ అధికారి లోగాన్, జాన్‌మీలు సంపూర్ణ హక్కు కలిగి ఉండడాన్ని కాదన్నాడు. సంప్రదాయ వ్యవసాయ సంబంధాల్లో వచ్చిన వక్రీకరణలను ఆయన వ్యతిరేకించినాడు. నిజమైన సాగుదార్లయిన కౌలుదార్లకు చట్టబద్ధ న్యాయపరమైన రక్షణ కల్పించాలని ఇతడు సూచించినాడు. కానీ వెరుమ్‌పట్టామ్‌దార్లకు సంబంధించిన రక్షణలను ఇవ్వాలన్న సూచన జాన్‌మీలకు, కనమ్‌కార్లకు రుచించలేదు. సాగుచేసే నిజమైన కౌలుదార్లను దోపిడి చేయకుండా నివారించే చర్యలు ప్రతిపాదించ బడడం సహజంగానే ఈ భూస్వామ్య శక్తులకు నచ్చలేదు.

జాన్‌మీ కనమ్‌కార్‌ల సంబంధాలు ప్రత్యేకమైన స్వభావం కలిగి వున్నటువంటివి.. ఆచారంగా రూపొందిన పద్ధతి కౌలుదారు తన అద్దెను భూస్వామికి ముందే చెల్లించాలి.

నిత్య జీవితంలో ఇది తాకట్టుగా పరిణమించి, కనామ్ కారులు వారి భూస్వాములకు ఋణదాతలుగా మారినారు. ఒకవైపు కనమ్‌కార్ భూమిని తాకట్టు పెట్టుకునే వాడుగానూ మరొక వైపు కౌలుదారుగానూ రెండు రకాల పాత్రను పోషిస్తాడు. జాన్‌మీ భూమి వడ్డీ వ్యాపారి చేతుల్లోకి పోవుట వలన బ్రిటిష్ కోర్టులో అప్పుకు గురయిన రైతుగా జాన్‌మీ దర్శనమిచ్చిన సందర్భాలున్నాయి. రైతు దగ్గరి నుంచి కొంత మొత్తాన్ని పొందిన భూస్వామి గతంలో తనకున్న కౌలుదారు ఒప్పందం పూర్తి అయిన పిమ్మట భూమిని అప్పగించే షరుతు ఉండటం వల్ల అతనే తన భూమిపై ఒక మూడవ వ్యక్తిగా మారుతాడు. ప్రాథమికంగా కౌలు సమయం పూర్తయినపుడు. భూస్వామి కూడా పునః నమోదు రుసుము చెల్లించుట ద్వారా ప్రత్యక్షంగా భూస్వామి అద్దె పెంపుదలకు కారణమౌతాడు. ఒక స్థాయిలో కనామ్‌కార్ తాకట్టు పెట్టుకొన్న వానిగాను మరొక సమయంలో సహృదయ కౌలుదారుగా పేర్కొనబడుటచే అన్వయించబడే పరిహారములేవీ వీరికి అందించబడలేదు. జాన్‌మీ భూస్వామిగా తన సామర్థ్యాన్ని బట్టి సాంప్రదాయ బద్ధమైన నియమానుసారం తను ఎవరికైతే ఇవ్వదల్చుకుంటాడో ఆయా చట్టబద్ధమైన కౌలుదారుకే పరిహారం ఇవ్వవచ్చును. కానీ రైతుగా నూతన స్థితిలో ఇలాంటి నియమాలు లేవు. బ్రిటిష్ కోర్టులు జాన్‌మీ కనామ్‌కార్‌ల మధ్యగల సంబంధాలను గూర్చి విచారించే సందర్భంలో మధ్యవర్తిత్వ చట్ట బద్ధ కౌలు విధానాన్ని ప్రోత్సహించినాయి. ఈ విధమైన భూమి తాకట్టును సాంప్రదాయబద్ధమైన కుదువపెట్టడంగా వివరించినాయి. ఈ వివరణను దృష్టిలో ఉంచుకొన్నప్పుడు ఏ సమయంలోనైనా జాన్‌మీ ఇలాంటి భూ తాకట్టులను విడిపించుకొనే హక్కు కలిగి వుంటాడు. ఒక ఋణగ్రస్త రైతుకు తన భూమిని వడ్డీ వ్యాపారస్తుని వద్ద తాకట్టు పెట్టినప్పుడుండే హక్కు వంటిదే ఇది. అప్పు తీరిన తరువాత వడ్డీ వ్యాపారస్తుని నుంచి రైతు ఎలాగైతే భూమిని విడిపించుకుంటాడో అల్లాగే జాన్‌మీలు కూడా తమ భూమి విడిపించుకోవచ్చు. ఏమైనప్పటికి, చట్టం ద్వారా తమయొక్క అబద్రతా స్థాయిని అధిగమించడానికి కనామ్‌కార్‌లు ఎక్కువ ఇష్టం కలిగి ఉండి, వీరు వెరుమ్ పట్టందారుల కన్న ఎక్కువ ప్రభావితం చేసే స్థితిలో ఉన్నారు.

లోగాన్స్ నివేదిక అనంతరం నియమింపబడిన విచారణ కమీషన్‌ను ప్రభావిత పర్చి ప్రజల, అధికారుల భావనలను మార్చడానికి కనమ్‌కార్‌లు నిర్ణయించుకున్నారు. నాటి అధికారి లోగాన్స్ ప్రస్తావించినదానికన్నా ఈ కమీషన్ కాస్త ముందుకు వెళ్ళి మలబార్‌లో సంక్రమిత హక్కులను ప్రవేశ పెట్టాలని సిఫారసు చేసింది. గత 30 సంవత్సరాల నుండి కౌలుదార్లుగా వున్న అన్ని భూములకు ఈ హక్కులు ప్రసాదించబడ్డాయి. ఈ సంక్రమణ హోదాను ప్రస్తుత కౌలుదారుకే కాకుండా భూమికి జతపర్చబడింది. అంటే ఇలాంటి భూమిని తిరిగి పొందే హక్కు భూస్వామికి శాశ్వితంగా లేకుండా పోయింది. సంప్రదాయంగా వుండే పునః నమోదు రుసుము ఒక సంవత్సర పంట దిగుబడి విలువకు మించకుండా

12సం॥ల అనంతరం చెల్లించవచ్చు). అన్ని సంక్రమిత కౌలు ఒడంబడికలకు స్వేచ్ఛాయుతమైన బదలాయింపులుంటాయి. జాన్మీలు ఈ హక్కును ముందే కలిగి వున్నారు. ఒకవేళ సంక్రమిత హక్కులు లేని కౌలుదారుల విషయంలో కూడా వారిని 10 సం॥ల వరకు భూసాగు నుండి తొలగించరాదని చెప్పబడింది. అయితే వారు సాగుచేసే కమతం మాత్రం బదలాయింపులకు అతీతమయినది. కౌలుదారులు చెల్లించే భాటకం మొత్తం ఉత్పాదనపై అధారపడి నిర్ణయింపబడుతుంది. సంక్రమిత కౌలుదారులకు పావుభాగం లేదా మూడింట ఒక వంతుగా విధించబడుతుంది. అభీష్టానుసార కవులుదారులు $^1/_{12}$ లేదా $^2/_3$ భాగం, ఉపకౌలుదారులు $^2/_3$ భాగం కంటె ఎక్కువ చెల్లించనవసరం లేదు. పై విధంగా ఉన్న వివిధ రకాల కౌలుదారులు చేపట్టే భూ అభివృద్ధి పనుల కోసం పూర్తి పరిహారానికి అర్హులుగా పేర్కొనబడ్డారు. సాగుయోగ్యమైన నిరుపయోగ భూములను రెవెన్యూ ధరలకు సమానమైన భాటకపు ధరలను నిర్ణయించి జిల్లా అధికారి అవసరం వున్నవారికి కేటాయించాలి.

లోగాన్స్ ప్రతిపాదనలు భూమిని దున్నే వారి ప్రయోజనం దృష్ట్యా మలచబడినవి, కమీషన్ సూచనలు జాన్మీలనుండి కౌలుకు తీసుకున్న కనమ్కార్ల ప్రయోజనాలకు అనుగుణ్యంగా ఉన్నాయి. సాగుదార్లకు భూమి తాకట్టు హక్కుకై కాకుండా, వారసత్వ హక్కు బదలాయింపు స్వేచ్ఛలను ఉండాలని లోగాన్స్ సూచించుట ద్వారా నిజమైన సాగుదారుకు ప్రయోజనాన్ని సాధించడానికి కృషి చేసాడు కాని ఎవరైనా రెవెన్యూ రశీదును చూపించుట ద్వారా ఈ సాగు హక్కులను పొందవచ్చు. కాని ఈ ప్రతిపాదనను కమీషనులోని ఎక్కువ సభ్యులు తిరస్కరించినారు. మద్రాసు సంస్థాన ఇతర ప్రాంతములలో ఇది ముందు ముందు ప్రమాదకరమైన పరిణామాలను సృష్టించునని నాటి కమీషన్ సభ్యులు పేర్కొన్నారు. నిజానికి ఇది ఒక తీవ్రమైన సమస్య. లోగాన్స్ మరొక ప్రతిపాదన ద్వారా రైత్వారీ పద్ధతిని జాన్మీల స్థాయిలో కాకుండా నిజమైన సాగుదారులకు కల్పించాలని అనుకున్నాడు. కాని ఈ ప్రతిపాదన కనామ్కారుల యొక్క ప్రయోజనాలను ప్రతిబింబించే కమీషన్ పక్షపాతం వల్ల ఆమోదాన్ని పొందలేదు.

కమీషన్ రిపోర్టు ముద్రణ అనంతరం మలబార్ హైకోర్టు ప్రధాన న్యాయాధికారయిన చార్లెస్ టర్నర్ ఈ చర్చలో కల్పించుకొని జాన్మీల హక్కుల రక్షకుడుగా పెద్ద విజ్ఞాపన పత్రాన్ని తయారుచేసి భూ స్వాముల హక్కులకు మద్దతు చేసినాడు. కనామ్కారుల యొక్క హక్కులను రక్షించాలనే కమీషన్ వాదనను తిరస్కరించినాడు. కోర్టులు తమ నిర్ణయాల ద్వారా సాంప్రదాయ ఏర్పాట్లను దెబ్బతీసినాయనే వాదనను ఖండించాడు. క్రమానుగతంగా కనామ్కారులు సాంప్రదాయకంగా రెవెన్యూ రుసుము జాన్మీలకు చెల్లించినప్పటికి వారికి సంక్రమణ హక్కులుండవని పేర్కొన్నాడు. జాన్మీ మూడవ వ్యక్తిగా మారు హక్కు కలిగి వున్నంత వరకు పునః రుద్ధరణ రుసుము లాంటి చట్ట బద్ధమైన హద్దులన్నీ కూడా నిష్ప్రయోజనమేనని చార్లెస్ టర్నర్ పేర్కొన్నాడు. ప్రస్తుత కౌలుదారుతో ఒప్పందం

అయిపోయిన అనంతరం ముందే డబ్బు పొందుట ద్వారా కౌలు బదలాయింపు జరుగుతుంది. జాన్‌మీ కనామ్‌కార్‌ల మధ్య కొనసాగే సంబంధం సంప్రదాయ ఏర్పాట్ల ప్రకారం కుదవ పెట్టిన వారు, కుదవబెట్టుకున్న వాడిగానే ఉంటుందని టర్నర్ వాదించినాడు. చాలా సందర్భాల్లో భాటకపు చెల్లింపులు వడ్డీ బకాయిల నుండి కుదువబడ్డ వాటి ని తీసివేసేవిగా ఉంటాయి. జాన్‌మీ తన సంక్రమిత హక్కు గుర్తింపుగా భూమి నుండి లభించే మొదటి ఫలసాయాన్ని పొందుతాడు. టర్నర్ అభిప్రాయం ప్రకారం భారత దేశ ఇతర ప్రాంతాల్లో కమీషన్ యొక్క సంక్రమణ హక్కులు అంగీకరించబడుతాయి. ఇంత క్రితం పేర్కొన్న బెంగాల్ కౌలు చట్టం యొక్క నిబంధనలను కౌలుదార్ల రక్షణకు ప్రత్యామ్నాయంగా సిఫారసు చేసినాడు. కర్టైనరీ ఇల్‌బెర్టుకు టర్నర్ వ్రాసిన వ్యక్తిగత లేఖలలో బెంగాల్ ప్రభుత్వం తన కౌలు చట్టంలో చూపించిన మిత వాద దృష్టి యెడ ఆశ్చర్యాన్ని వ్యక్త ం చేసినాడు . ఎందుకంటే ఈయన, కౌలుదారులకు ఇంకా ఎక్కువ రక్షణను సందేహం లేకుండా కల్పించడం న్యాయ సమ్మతమైనదని భావించి మలబార్‌కు బెంగాల్‌చట్టం నిబంధనలు ఖచ్చితంగా యోగ్యమైనవిగా అభిప్రాయపడ్డాడు. కనామ్‌కార్‌లు కౌలుభూములు కలిగిన కౌలుదార్లుగా, వెరుమ్ పట్టాదార్లుగా, సంక్రమిత రైతులుగా వర్గీకరించవచ్చునని తెలిపినాడు. కానీ టర్నర్ ప్రతిపాదించిన అంశాలు అమలుకాలేదు. టర్నర్ ప్రతిపాదనల్లో పాల్గొనడం కనామ్‌కార్‌లను నిరుత్సాహపరచడంతో వారు కౌలు చట్టంపై శ్రద్ధను కోల్పోయినారు. ఎందుకంటే ఈ ప్రతిపాదనలు వారికంటె, వారి కౌలుదారులకు ప్రయోజనమైనవిగా ఉండటం కనామ్ కార్‌లకు ఇష్టం లేదు. దాంతో చర్చలన్నీ మళ్లీ మొదటి స్థాయికే చేరినాయి. 1887లో ఒక చట్టం అమలుచేయబడి చేపట్టిన అభివృద్ధి చర్యలకు పరిహారం చెల్లించే సూచన చేయడంతో జాన్‌మీల హక్కులను ముట్టకుండానే వదిలివేయబడినాయి.

మలబార్ కౌలు సమస్యల గూర్చి కొన్ని సంవత్సరముల వరకు ఏమీ వినిపించలేదు. జాన్‌మీల హక్కులపై జరిగిన నిరర్థకమైన చర్చ ఒకరకంగా వారి స్థితిని మరింత బలపరిచింది. భాటకపు పెంపుపై వస్తుగతంగా క్రమబద్ధీకరణల ద్వారా భూస్వాములకు ఏ హానీ జరుగలేదు. 1887లో రూపొందించిన మలబార్ చట్టం, బెంగాల్ కౌలుచట్టం పుస్తక పరిమాణం పట్టి పరిశీలిస్తే చాల సూక్ష్మ పరిమాణాన్ని కలిగి వున్నది. నివేదిక కోసం సేకరించిన సమాచారం అత్యధికంగా ఉన్నప్పటికీ వాస్తవంగా చాలా సమాచారం నిరుపయోగంగా ఉండిపోయింది. తదనంతర సంవత్సరాలలో మరికొన్ని నివేదికలు, ముసాయిదా బిల్లులు తయారుచేసినారు. కాని ఎలాంటి పురోగతి జరుగలేదు. 1887వ చట్టం పునః పరిశీలించి 1900సం॥లో కొన్ని సవరణలను వెలువరించినారు. ఇవి చాలా వరకు చేపట్టిన అభివృద్ధి చర్యలకు పరిహారం ఇవ్వడం లేదా జాన్‌మీలను ముట్టకుండా వదిలివేసేవిగా ఉన్నాయి. ఫలితంగా ఇంకా విస్తృతంగా భూస్వాములుగా తమ హక్కులను విస్తరింపజేసినారు . మూడవ వ్యక్తి నుండి ముందే పెద్ద మొత్తంలో డబ్బు పొందే, నియమించే ప్రస్తుత కష్టపరమైన కౌలు విధానంను

ఎదుర్కొనుటకు మలబార్ కలెక్టర్ ప్రత్యేక బిల్లు ముసాయిదా రూపొందించినాడు. ఈ మలబార్ మెల్‌ఛార్ట్స్ బిల్లును మద్రాస్ ప్రభుత్వం 1901లో తిరస్కరించింది. దీనిపై కొంత కాలం వరకు ఎలాంటి నివారణ చట్టాలు చేయకుండా ఊరుకున్నారు. మద్రాసు ఎస్టేటు భూముల చట్టం అమలు మళ్లీ ఆశలను రేకెత్తించడంచే మలబారు వాటినే తన నిబంధనలుగా తెచ్చుకున్నది. కాని ప్రభుత్వం ఒక ప్రకరణం ద్వారా ఈ చట్టాన్ని మలబార్‌కు విస్తరింపజేయుటకు ముందు అమలులో వున్న చట్టాన్ని తొలగించవలసి వుంది. ఈ తరుణంలో మలబార్ కలెక్టర్ అనంతర చట్టంపై ప్రతిపాదనలు రూపొందించినాడు. కాని అతని తర్వాత కలెక్టర్‌గా వచ్చిన వ్యక్తి భూస్వాముల రక్షకుడగుటచే ఎలాంటి చట్టం అవసరం లేకపోయింది.

మొదటి ప్రపంచ యుద్ధం దాని అనంతరం మరోసారి పరిస్థితిలో మార్పు కనిపించింది. బ్రిటిష్ ప్రభుత్వ అధికారంలో భాగమై ఇరాన్‌లోని బాస్రా పట్టణంలో సైనిక స్థావరంలో పనిచేసిన చాలామంది మోప్లాలు ఆయుధాలను ప్రయోగించుటలో కొంత నేర్పరితనం సాధించి గొప్ప ఊహలతో మలబారుకు తిరిగి వచ్చినారు. భారత జాతీయ వాదులు మద్దతుతెల్పిన కిలాఫత్ ఉద్యమం కూడా మలబారు చేరిన తరుణంలో కొన్ని అనూహ్య పరిణామాలకు దారి తీసినవి. మోప్లాలు హింసాపూరితంగా ఆవిర్భవించి ప్రభుత్వానికి వ్యతిరేకంగానే కాకుండా వారి భూస్వాములకు కూడా వ్యతిరేకంగా తిరుగుబాటు చేసినారు. ఈ తిరుగుబాటు 1922లో వేగంగా వెనకకుపోయినా భూస్వాములకు వ్యతిరేకంగా మాత్రం ఉద్యమం అలాగే కొనసాగింది. 1880లో ప్రవేశపెట్టిన చట్టపరమైన ప్రయత్నాలను మోప్లాల అశాంతి తలక్రిందులు చేసింది. ఈ సమయంలో వదంతి మాత్రమే కాకుండా యధార్థమైన మోప్లాల తిరుగుబాటు వల్ల ముందు ముందు చట్ట నిర్మాణంలో సాధ్యమైనంత వరకు న్యాయమైన వైఖరి వహించేందుకు తోడ్పడింది. చాలా మంది చదువుకున్న కనామ్‌కార్ మధ్య తరగతి వారు జాన్‌మిలకు వ్యతిరేకంగా తమ సంకటములను అనుసంధిస్తూ, క్రూరమైన వారిగా మోప్లాలను పేర్కొనడం ద్వారా తమ సంతోషాన్ని వ్యక్త పర్చినారు.

1924లో క్రిష్ణన్‌నాయర్ మద్రాస్ చట్ట సభకు సమర్పించిన కౌలు చట్టం (బిల్లు) కనామ్‌కార్‌ల కోరికలను ప్రతిఫలింప చేసింది. ఇదే విధమైన కౌలు విధానాలు వ్యాప్తిలో వున్న బ్రిటిష్ రాష్ట్రాలయిన ట్రావన్‌కోర్, కొచ్చిన్‌లకన్నా ముందస్తుగా భూములకు వివిధ రకాలయిన వడ్డీలను నిర్ణయిస్తూ మలబార్‌కై చట్టాన్ని చేసినారు. ఇది ఒక విధంగా కనామ్‌కారులకు సంక్రమణ హక్కులు నాయర్ ప్రతిపాదనలచే సాఫల్యమైన రీతిలో లభించాయని భావించబడింది. మెల్‌చార్ట్‌ల విధాన రద్దు, భాటకపు క్రమబద్ధీకరణ, పునఃరుద్ధరణ రుసుము వంటి చర్యలపై స్పష్టమైన నిర్ణయాలు తీసుకోబడ్డాయి. 1926లో చట్ట సభలో ఈ బిల్లు అంగీకరించబడ్డప్పటికీ, మద్రాసు గవర్నర్ తన సమ్మతిని తెలయపర్చలేదు. ఈ నిర్ణయం వెనుక సభలో ఈ బిల్లును వ్యతిరేకించిన తన ప్రభుత్వ చట్ట సభ్యుడయిన సి.పి. రామస్వామి

అయ్యర్ వున్నాడని భావించబడింది. ఎప్పటివలనే ఈ కౌలు సమస్యపై మరొక ముసాయిదా బిల్లు తయారుచేయమని కమిటీని నియమించినారు. నియమించిన కమిటీ 1928లో తన నివేదిక సమర్పించింది. భూస్వామి తన సొంత సేద్యానికి భూమి అవసరమైతే కౌలుదారును బయటికి పంపి మళ్ళీ తన భూమిని పొందు స్వేచ్ఛను ప్రతిపాదించే విధంగా కౌలు చట్టంలో సూచన చేయడం జరిగింది. పునరుద్ధరణ రుసుము చట్టబద్ధం చేయడం ద్వారా తమ హక్కుల నియంత్రణచే రుసుము, అద్దెలను పొందేవిధంగా పరిహారాన్ని జాన్మీలు ఊహించిన విధంగా కొన్ని మంచి సౌకర్యాలను కల్పించినారు. కమిటీ బిల్లు నిబంధనలో యదార్ధంగా చట్ట సభ్యులచే ప్రవేశపెట్టబడిన పునః స్వాదీన పరుచుకొనే హక్కు జాన్మీలకు ఇచ్చినా స్వాధీనపరచుకోబోయే భూకమతం తనదేనని భూస్వామి నిరూపించవలసి వుంటుంది. ఈ విధంగా భూమి పునః స్వాధీనం చేసుకొనేటందుకు ఆభూమిని తనదే నని తెలిపే ధృవీకరణ భారాన్ని భూస్వామిపైననే మోపింది. అయినప్పటికి, ఆ సమయంలో ఈ చట్ట ప్రతిపాదన ఎక్కువ దృష్టిని ఆకట్టుకొన్నది. అంతేగాక ఈ చట్టం ఊహించినంతగా కౌలుదారులను రక్షించలేకపోయింది. ఈ చర్యల పర్యావసానంగా ఆవిర్భవించిన 1930 మలబార్ కౌలు చట్టం కార్యసాధకమైనదిగా మిగులలేదు. ఇందులోని చాలా నిబంధనలు కనామ్‌కార్‌ల సంప్రదాయమైన ఏర్పాటుగా చట్టం అందించిన 12 సంవత్సరాల నిరంతరాయ యాజమాన్య ప్రయోజనం కౌలుదారులకు దక్కలేదు. ఎందుకంటే 1942లో దానిని అమలుపరచడంతో 12 సంవత్సరాల గడువు ముగిసింది. కాని మలబార్ ప్రమాణాల వరకు ఇది ఒక గొప్ప పురోగతి. అందువల్ల భూస్వాముల కోపానికి ఇది కారణమైంది. మద్రాసు చట్ట సభలో జాన్మీల ప్రతినిధి అయిన కవలప్పారకు చెందిన ముప్పిల్‌నాయర్ రాజ్యపాలన సౌకర్యాలలో స్థానం, అధికారంలో కనీసం భాగాన్ని ఇవ్వాలని మధ్యతరగతి వారికి ఉండే సామాజిక అత్యాశ, పూర్తి ఈర్ష్యలతో కూడుకొని ఈ చట్టం వున్నదని భారత ప్రభుత్వంకు మహజరు పంపినాడు.

అదే సమయంలో భారత ప్రభుత్వాన్ని మలబార్ కౌలుదార్లు, భూస్వాములు అవలంభిస్తున్న కుట్ర పూరిత పద్ధతుల పట్ల, వాటిని మద్దతు చేస్తున్న మలబారు మాజీ, పదవీ విరమణ పొందిన చట్ట సభ్యుడు అయిన సి.పి. రామస్వామి అయ్యర్‌ల ప్రయత్నాల గురించి నాటి కలెక్టర్ ప్రభుత్వాన్ని హెచ్చరించినాడు. జాన్మీల కార్యకలాపాలు ఎట్లావున్నప్పటికి గవర్నర్ జనరల్ చట్టం యెడ తన సమ్మతిని తిరస్కరించలేదు. సాధారణ ప్రమాణాల ప్రకారం బ్రిటిష్ భారత మలబార్ కౌలు చట్టం తప్పనిసరిగా కౌలుదారుల పక్షంకన్నా భూస్వాముల చట్టంగానే చెప్పాలి. నిజానికి దీనిపై అసంతృప్తి పడడానికి కారణాలు ఏవీ లేవు. రెవెన్యూ అధికారులను కాదని భాటకపు నిర్ణయాలను సివిల్ కోర్టులకు వదిలి వేసినారు. భూస్వామి భూమిని తిరిగి పొంది, దానిని మరొక కౌలుదారుకు ఇచ్చుటకు వ్యతిరేకంగా దావావేయు నియంత్రణ హక్కు కూడా లేకపోవడం దారుణం. ఊహా మాత్రమైన

న్యాయపర అద్దెలు ఉన్నస్థితిలో తక్కువ అద్దెలకు పునరుద్ధరణ రుసుము పరిహారంగా గుర్తించడం కూడా తెలివి తక్కువ తనం. 1940లో మలబారు కౌలు చట్టాన్ని మరోసారి పునః నిర్వచించేందుకై ఈ అంశాలను మరో కమిటీకి అప్పగించినారు. E.M.S. నంబూద్రి పాద్ తన రాజకీయ జీవిత ప్రారంభంలో ఈ కమిటీ సభ్యుడిగా ఉండి, తదనంతర కాలంలో కేరళకు మొదటి కమ్యూనిస్టు ముఖ్య మంత్రిగా కొనసాగినాడు. అతడు వ్యవసాయ సంబంధాల విధానాన్ని మార్చే క్రమంలో మరో ఇరవై సంవత్సరాలు ఆగవలసివచ్చింది. అయినప్పటికి ఆ సమయంలో మలబార్ సమాజంలో బలీయమైన భూస్వామ్య శక్తులను ఎదుర్కొనవలసి రావడం, ఆస్తిపర శక్తులు ఊహించిన దాని కన్నా, ఎక్కువగా సంస్కరణలు చేపట్టే ప్రయత్నాలను ప్రభుత్వం మొదలు పెట్టడంతో నంబూద్రిపాద్ మంత్రి వర్గం తొలగించబడింది.

**భూరికార్డులో పేరుగల రైతులు, భాగస్వామ్య సాగుదారులు: సర్వే సెటిల్ మెంటు కారణంగా కోటీ పద్ధతి క్షీణత :**

మలబారు ప్రాంత భూస్వాములతో మద్రాసు ప్రభుత్వం జాగ్రత్తగా వ్యవహరించేది. కొంకణ్ ప్రాంత ఖోట్స్ వ్యవహారాలను ఎదుర్కొనే విషయంలో బొంబాయి ప్రభుత్వం కొంతవరకు ధైర్యంగాను, కొన్నిసార్లు అవివేకంగా వ్యవహరించేది. కౌలు చట్టంకు సంబంధించి బొంబాయి అధికారులకు అనుభవంలేదు. ఏమైనప్పటికి, ఖోట్స్ భూస్వాములే కాకుండా, ఈ మాదిరి రైత్వారీ ప్రాంతంలో బ్రతకడం నేర్చిన వారు కూడా గుజరాత్, సింధ్‌లోని కొన్ని ప్రాంతాలు భూస్వాముల చేతుల్లో ఉన్నాయి. ఈప్రాంతాల్లో కొందరు పాలకులు ముసాయిదా కౌలుబిల్లులను కూడా రూపొందించారు. కానీ బొంబాయి ప్రభుత్వం సాధారణంగా ప్రస్తుత రెవెన్యూ నిబంధనలలో మొత్తం క్షేత్ర స్థాయి అవసరాలను నిర్వహించ వచ్చని ఇలాంటి కౌలు ముసాయిదా సూచనలను నిరసించింది. ఖోట్స్ పట్లకూడా ప్రభుత్వం ఈ వైఖరిని అవలంబించడానికి ప్రయత్నించింది. బొంబాయి రైత్వారీ పద్ధతి నిర్మాతలలో ముఖ్యులయినకెప్టెన్ వింగేట్ భూస్వాములకున్న అపరిమిత అధికారాన్ని అడ్డుకొని రైతులకు న్యాయం చేయాలను కున్నాడు. ఈమేరకు భూస్వాములు సాగుదార్లతో ఉపకౌలు ఒప్పందాలను చేసుకొంటే మంచిదని భావించినాడు. రెవెన్యూ అంచనాలో వచ్చే 10% ''మాలికాన'' చెల్లింపులతో ఖోట్స్ తృప్తిపడతారని ఊహించాడు. కానీ ఈ సూచనలు ఆదరింపబడలేదు. అవసరమైన శాసన పునాది లేకుండా ప్రవేశపెట్టాలను కొనే సర్వేసెటిల్ మెంట్ ప్రయత్నాలు విఫలమైనాయి. చివరగా సెటిల్‌మెంట్ వ్యవహారాల ఇన్‌చార్జ్ రెవెన్యూ అధికారి ఖోట్స్‌ను ముట్టకుండా వదిలివేసి, వారి కౌలుదార్లను రక్షించడానికై 1859, 10వ చట్టాన్ని అమలు పర్చమని సూచించినాడు. ఇది కూడా ప్రభుత్వంచే తిరస్కరించబడింది. ఖోట్స్ రెవెన్యూ ఒప్పందమయిన సంవత్సరానికో సారి పునఃరుద్ధరణ చేసుకోవడం వంటి

పాలనా చర్యలచే నియంత్రించ వచ్చని, ఇలాంటి పునరుద్ధరణలకు సరైన విధానాలను అనుసందించవచ్చని కనుక ఎలాంటి చట్టాలు అవసరం లేదని పేర్కొన్నది.

నిజమైన రెవెన్యూ రైతాంగమైన ఖోట్స్ యొక్క విశేషమైన స్థితిని వార్షిక ఒప్పందాల ద్వారా ద్విగుణీకృతం చేసింది. ఈ ఒడంబడిక విధానంలోని లక్షణము, వారి కౌలుదార్లు, దారేకార్‌లో, ఎలాంటి అద్దె చెల్లించకుండా వారి రెవెన్యూ ధరను మాత్రం ఖోట్స్ ద్వారా ప్రభుత్వానికి బదలాయించడమే. అయినప్పటికి, దారేకారీలు, అర్థేలీలు సగం పంట- భాగస్వామ్య కౌలుదార్లు ,పూర్తి భూమి సేద్యం లేకుండా ప్రత్యక్షంగా అభీష్టానుసార కౌలుదార్లు లేదా కొన్ని రోజులకు సంబంధించి చెల్లింపులు లేని వ్యవసాయ కూలీలుగా తనకై పనిచేసే బానిసల ద్వారా ఖోట్ భూమిని నియంత్రణ చేయగలడు. ఈ కౌలుదార్ల నుండి ఖోట్ తన పంట భాగాన్ని అన్యాయంగానే తీసుకుంటాడు. సాధారణంగా నూర్పిడి సమయంలో పంట విభజన ఉండదు. పంట నూర్పిడికాకముందే అంచనా అనంతరమే లెక్కగడుతారు. ఈ పద్ధతి వల్ల అత్యాశ కలిగివున్న ఖోట్స్‌కు ప్రయత్నపూర్వకంగా ఎక్కువ అంచనా వేయడానికి అవకాశం ఉండేది. ఖోట్ ఒకవైపు రెవెన్యూ వసూలు అధికారిగా, మరోవైపు భూస్వామిగా, ఇంకా వడ్డీ వ్యాపారిగా తన పాత్రను నిర్వహించాడు. నిజానికి కొందరు దరేకారీల నుండి ఖోట్స్ అధికమొత్తం రెవిన్యూ వసూలు చేస్తూ, నిర్ణయింప బడిన నిష్పత్తిలో పంట భాగాన్ని తీసుకుంటున్నానని స్థిరంగా చెప్పుతూ, సాంప్రదాయ ప్రభుత్వాల అస్థిరమైన రెవెన్యూ డిమాండును మొత్తం మేమే భరించవలసి ఉంటుందని పేర్కొనేవారు. రెవెన్యూ ధరలకు వారి భూములను పొందడం ధర్మంగా ధారేకారీలు భావిస్తారు. ఎందుకంటే ధర్మానికన్నా రక్షణ వారికి మరింత ప్రాముఖ్యత గల అంశం. అనంతరం బ్రిటిష్ చట్ట సభ్యుల ద్వారా అసంపూర్ణ దారేకారీలుగా పిలవబడినారు. ఋణదాతగా ఖోట్ పాత్ర చట్టేతరకారకాల వల్ల లభించిన హోదాగా అర్థం చేసుకోవాలి. ఇతనికి లభించిన చట్టపర హోదాను తగ్గించే ఎలాంటి ప్రయత్నాలు ప్రవేశ పెట్టినప్పటికి వడ్డీ వ్యాపారిగా తన హక్కును బలవంతంగా పేర్కొని, తన కౌలుదారుల కన్న పూర్తి క్రింది స్థాయిలో తన ఋణగ్రహీతలను నిరాశకు గురి చేసేవారు. ఈ ఉపద్రవాన్ని బ్రిటిష్‌పాలకులు ముందే గ్రహించినారు. అయినప్పటికి కొంకణ్ తీర ప్రాంత సర్వే సెటిల్‌మెంటు కొరకై ఒక విధమైన చట్టం అవసరం ఉంది. ఖోట్స్ దీనిని వ్యతిరేకించి వారి కౌళ్ళను రెవెన్యూ రికార్డుల్లో నమోదు చేసుకోవడానికి సుముఖంగా లేరు. ఎందుకంటే ,ఎంతో విలువైన సామాజిక హోదా కలిగిన మధ్య వర్తులుగా వారి స్థాయి కోల్పోతారని భయంతో వున్నారు. ఈ సమస్యను పరిష్కరించే క్రమంలో 1865లో ఖోటీ అద్దె చట్టాన్ని ప్రభుత్వం రూపొందించింది. బొంబాయి రెవెన్యూ పాలనా తరహాలోనే ఈ చట్టం వుంది. ఈ చట్టం సెటిల్‌మెంట్ అధికారికి 30 సంవత్సరాల అద్దెకు ఖోట్స్‌కు ఇచ్చు అవకాశం కల్పించి, ఒకవేళ అవసరమైతే వారి కౌలుదారులకు రశీదులు ఇచ్చే విధంగా రూపొందించబడింది. ఇది ఒక

విధంగా సంవత్సర ఒప్పందాల విధాన ప్రతిరూపమే. ఖోట్స్‌కు ఇది ఒక రకంగా ప్రభుత్వం తరుపున స్పష్టీకరించే అధికారిక హామీ లాంటిదే. అయినప్పటికి, సెటిల్‌మెంట్ అధికారికి కౌలుదార్‌ల అద్దెల నిర్ణయంలో కావలసిన అధికారాన్ని చట్ట బద్ధంగా కలిగి వున్నాడు. కానీ ఈ చట్టం కౌలుధారులకు సంబంధించి ఎలాంటి నిర్వచనాన్ని ఇవ్వకుండా దారెకారీలను, అర్ధెలీలను ఈ వర్గీకరణలో చేర్చింది. ప్రత్యక్షంగా కౌలు చట్ట విధానం అనుభవ రాహిత్యాన్ని కలిగి ఉంది. ఇది ఈ చట్టం యొక్క ప్రతికూలమైన అంశము. వింగేట్ దృక్పథం ప్రకారం ఖోట్‌కు 10% మాలికానా పరిహారం చెల్లించి అతన్ని బయట ఉంచేటువంటి ఏర్పాటును బలహీనపర్చింది. దీని స్థానంలో సగ భాగస్వామ్యం, వాటాదారు పద్ధతి, సబ్-సెటిల్‌మెంట్‌ల ప్రవేశం ఖోట్స్ భూస్వామ్యాన్ని బలోపేతం చేసింది. అంతేగాక వాస్తవానికి సబ్‌సెటిల్‌మెంట్ కల ఔథ్ తాలుక్‌దార్ స్థాయికి వారి సామాజిక హోదా పెంచబడింది. ప్రభుత్వం భూమికి ఇచ్చే అధనంగా భూమినుంచి ఆదాయాన్ని, లాభాలను నిరాటంకంగా పొందేటట్లుగా ప్రభుత్వ హామీని పొందినారు. ఫలితంగా రైతు బాధలకు లోనైనాడు. ఎందుకంటే ఇంత క్రితం ఖోట్ కు పరస్పర అవగాహనతో వస్తు రూపంలో రైతులు చెల్లింపులు చేసేవారు. ప్రస్తుతం రెవెన్యూను ధనం రూపంలోనూ చెల్లించడమే కాక భూస్వామికి చెల్లించే అదనపు సొమ్మును కూడా (సర్‌చార్జ్‌గా) రైతులు చెల్లించవలసి వచ్చింది. ఈ మొత్తాలను చెల్లించలేని రైతుల భూభాగం రెవిన్యూ బకాయిలుగా లేదా ఖోట్స్ అధిక చెల్లింపుల క్రింద ముదరాగా ఉండడమో, నామమాత్రపు ఖరీదులకు అమ్మివేయడమో జరిగేది. ఎందుకంటే ఇలాంటి భూములను కొనడానికి ఎవరు కూడా ముందుకు రాకపోయేవారు. ఈ విధంగా ఖోట్స్ తన ఖోట్ ఖాస్గీ భూమిని జతచేసుకొని ఉత్తర భారత దేశ సర్‌కు సమానమయినారు. కానీ నూతనంగా ఏర్పర్చబడిన పరిమితుల వల్ల ఖోట్ ఋణ స్థాయిని తగ్గించుట వలన చాలా బాధకు లోనయినారు. వీరు భూమిని అద్దె కిచ్చువారిగా హోదా మారడం వల్ల , కౌలుదార్లకు ప్రయోజనంకై వీరు ఇచ్చే మద్ధతు చాలా వరకు తగ్గిపోయింది. అయినా రైతాంగాన్ని పీడించే ఈ భూస్వామ్య శక్తులను ప్రభుత్వం అదుపు చేయలేకపోయింది. ప్రతి ఒక్కరిని ఇబ్బంది పెట్టి, ఆందోళనకు బీజం వేసే పథకాన్ని ఎవరైనా రూపొందించాలని అనుకుంటే,దానికి సరిగ్గా సరిపోయే చర్యగా ప్రభుత్వ స్పందన మిగిలిపోయింది.

ఇతర ప్రాంతాల్లో కొనసాగించబడిన సాధారణ చట్ట ప్రయత్నాల పద్ధతులనే బొంబాయిలో కూడా విస్తారంగా పాటించాడు. తప్పు దిశలో వేసిన అడుగు మరొక చట్ట తయారికి పురి కొల్పింది. 1865 ఖోటీ అద్దె చట్టం యొక్క హేతు పూర్వక క్రమానుగమమే 1880 ఖోటీ సెటిల్‌మెంటు చట్టం. సబ్‌సెటిల్‌మెంట్ కౌలుదార్లను తగినట్లుగా నిర్వచించి వర్గీకరించుట ద్వారా నిర్వహించబడింది. దీని ప్రకారం నాల్గు రకాల రైతాంగ శ్రేణులు నిర్వచించబడినాయి. అవి : 1. దారేకారేలు 2. కాఫీ - దారేకారీలు 3. సంక్రమణ కౌలుదార్లు 1845 నుండి భూమి కలిగివున్నవారు 4. అభీష్టానుసార కౌలుదార్లు, మరోవిధంగా ఖోట్ ద్వారా నియంత్రింప బడే భూమి.

రాష్ట్ర అటవీ భూమి తప్పించి పూర్తి సాగు యోగ్య నిరుపయోగ భూమిపై నియంత్రణ కలిగి వుండి కొంత మొత్తం లాభ శాతాన్ని ఖోట్స్ పొందేవారు. ఈ చట్టం ప్రభుత్వం, ఖోట్‌ల మధ్య రాజీ ఫలితమని భావించపడుతుంది. ఈ చట్టం పది సంవత్సరాల పాటు అమలులో వుంది. రత్నగిరి జిల్లాలోని ఒక తాలూకాలో జరిగిన పునర్ సెటిల్ మెంట్ వల్ల ఆ ప్రాంతంలోని చాలా మంది ఖోట్‌లు తమ కౌల్దార్ల వద్దనుండి అద్దెగా స్వీకరించిన దాని కంటే ఎక్కువ చెల్లించవలసి వచ్చింది. ఈ విధమైన చెల్లింపుల వల్ల చట్ట స్థితిపట్ల ఒక అస్పష్టత ఏర్పడింది. దీనిని తొలగించడానికి కొన్ని ముసాయిదా బిల్లులు రూపొందించ బడ్డాయి. చివరకు కౌలు పద్ధతిలో ముఖ్యమైన విషయాలు అస్పష్టంగా వొదిలివేయబడడంవల్ల రాజ్య కార్యదర్శి కలుగజేసుకొనడం జరిగింది.

ఖోట్స్‌కు చెల్లించబడే భాటకం ఎలా నిర్ణయించబడుతుందనేది ముఖ్యమైన ప్రశ్న. ఈ ప్రయత్నంలో రెవెన్యూ అంచనా ఏమేరకు శాసన రూపకల్పనలో పాత్ర వహిస్తుందన్నది చాలా ముఖ్యమైనది. కాని ఎల్లప్పుడూ ఈ అంశాన్ని పరిపాలనా నియమాలకే వదిలి వేసినారు. సాధారణంగా బ్రిటిష్ పాలకులు చట్ట పుస్తకంలో అంచనా సూత్రంను పొందుపర్చునపుడు జాగ్రత్తగా వ్యవహరిస్తారు. కానీ ఈ విపరీత పరిస్థితిలో పునరుద్ధరించిన అద్దె విషయంలో పరీక్షించిన అంచనా క్రింది స్థాయిలో నుంచి రావటం వల్ల స్పష్టత కోసం ఒకే మారుగా చెల్లింపు సూత్రాన్ని పేర్కొన్నారు. దీని ప్రకారం ఆయా భూకమతానికి సంబంధిత రెవెన్యూ అద్దెకు గాను మొత్తం ఉత్పత్తిలో ప్రత్యేక శాతాన్ని భాటకంగా పేర్కొన్నారు. చాలా అద్దెలు వస్తు రూపంలో చెల్లించుట వలన ఈ గణాంకాలు సరైనవిగా తోస్తున్నవి. అయినప్పటికి ధన రూపంలో వచ్చే మార్పులతో పాటుగా అద్దె, రెవెన్యూల మధ్య సంబంధాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

1898 నాటి మొదటి బిల్లు గత 12 సం॥రాల లోని సంవత్సర సరాసరి విలువల అంచనాలను భాటకపు చెల్లింపు ఆధారంగా తీసుకున్నారు. సుదీర్ఘ చర్చల అనంతరం చట్ట సభ్యులు దీనిని నిరాకరించి రెవెన్యూ అంచనాలనే మార్గ దర్శకంగా తీసుకున్నారు. మొత్తం ఉత్పాదనలో ఈ అంచనా ధనం 1/6 గా పేర్కొన్నారు. ఖోట్ అద్దె అదనపు ధనంగా పేర్కొని మొత్తం ఉత్పత్తిలో ఇది అంచనాపై రెవెన్యూతో కలిపి $1/_{1/2}$ లేదా 1/3గా భూమి రకాన్ని బట్టి నిర్ణయించ వచ్చు. ఈ బిల్లు తప్పనిసరిగా నగదు చెల్లింపు వసతిని కల్పించింది. అద్దె, కౌలు అంశాలకు సంబంధించిన అన్ని నిర్ణయాలను రెవెన్యూ అధికారులకు వదిలి వేసింది. దీంతో సివిల్ కోర్టుల న్యాయ పరిధిని పెద్ద మొత్తంలో తగ్గించినట్లయింది. 1900 సం॥లోని ఈ బిల్లు బొంబాయి ప్రభుత్వం ఆధీనంలో గల రాజ్య కార్యదర్శి దృష్టిని ఆకర్షించింది. అదేమిటంటే, రెవెన్యూ అంచనాలో మొత్తం ఉత్పత్తిని పరిగణనలోకి తీసుకోరాదు. ఇది సాగు ఖర్చులను పరిగణలోకి తీసుకోదు. మొత్తం ఉత్పాదన ఇలాంటి

గణాంకాలలో అంగీకరించవలసిన ఒక అంశం మాత్రమే. అతడు తప్పనిసరి నగదు చెల్లింపు సూత్రం పీడించేదిగా భావించబడి, ఒకవేళ అద్దెలు పెరిగినప్పుడు, ఇంకా రెవెన్యూ అంచనా ఎక్కువగా వుండవచ్చునని అనుమానపడి ఈ సూత్రం అన్వయించబడుతున్న కడు బీద జిల్లా అయిన రత్నగిరి నుంచి అత్యధిక సమాచారాన్ని రాజ్య కార్యదర్శి కోరినాడు. రాజ్య కార్యదర్శి జోక్యం వల్ల ఈ బిల్లు వదిలివేయబడింది. మరొకసారి బొంబాయి పాలకులు ఈ సమస్య తిరిగి పునరాలోచించవలసి వచ్చింది. అయితే వారు తాము గతంలో వాదించిన వాదనలను రక్షించుకోవాడానికి ప్రయత్నించినారు. మరే ఇతర పద్ధతి కన్నా తాము రూపొందించిన రెవెన్యూ అంచనా సూత్రం మొత్తం ఉత్పత్తిలో 1/6 సరాసరిగా ఉంటుదని. పేర్కొన్నారు. తమ దృక్పథాన్ని సమర్థించుకునే క్రమంలో అద్దె నిర్ణయ సమస్యలో పంజాబ్ ప్రాంత పద్ధతిని పేర్కొన్నారు. తప్పనిసరి నగదు చెల్లింపు సూత్రానికి సంబంధించి కౌలుదారులు దీన్ని కావాలని కోరుతున్నా, ఖోట్స్ వ్యతిరేకిస్తున్నారని కనుక రాజ్య కార్యదర్శి దీనిని రైతుల కోసం చేసిందే కాని, భూస్వాముల కోసం చేసినదానిగా పరిగణించరాదని పేర్కొన్నారు. అధికారులు ప్రతిపాదించిన భాటకపు అంచనా చాలా ఎక్కువగా ఉన్నదన్న భయాలను విస్తృత గణాంకాలను ఉదాహరణగా చూపడం వల్ల దీనికుండే సమంజసత్వాన్ని నిరూపించే ప్రయత్నం చేసినారు.

పునః సమీక్షించబడిన బిల్లు 1903 సం॥లో రూపొందించబడింది. దీనిలో తప్పని సరి నగదు చెల్లింపు బదులుగా చెల్లించే రూపాలను వ్యక్తి ఇష్టా ఇష్టాలకు వదిలి వేసినారు. కానీ దీన్కై కౌలుదారు తన ఇష్టాన్ని తెలయ పరుస్తూ రెవెన్యూ అధికారులకు నివేదించ వలసి వుంటుంది. నిజమైన అద్దె చెల్లింపుదారుని, అతడు చెల్లించే ధనం లేదా వస్తురూపాన్ని రెవెన్యూ అధికారి నమోదు చేస్తాడు. తదనంతరం మొత్తం పంట ఉత్పత్తిలో వరిపండించు భూమికి 1/1/2 దాటకుండా, ఖుష్కి భూమికి 1/3 మించకుండా అద్దె నిర్ణయిస్తాడు. ఒక వేళ అద్దె రెవెన్యూ కన్నా తక్కువగా వుంటే రెవెన్యూ అధికారి దానిని పెంచుతాడు. అంచనా ధర మరియు 25% లాభాన్ని ఖోట్‌కు అనువర్తింప చేస్తాడు. అధికారిక అద్దె వసూలు క్రమంలో రాజ్యాని కుండే పరిమితులు ఇవి. అద్దెలను వస్తువుల నుండి నగదుకు మార్పు చేసే క్రమంలో రెవెన్యూ అధికారి సగం పంట భాగాన్ని మూడంతుల రెవెన్యూగా లెక్క గట్టుతాడు. ఇతర నగదు మార్పిడి ప్రమాణాలు లభించనపుడు 3 నుండి 2 వరకు రెవెన్యూ ధర నిర్ణయిస్తాడు. ఈ ఊహనలను, సూచనలను ప్రతిపాదించడం రాజ్య కార్యదర్శి ఆక్షేపణకుగురయింది. ఎన్ని విధాలు పేర్కొన్నప్పటికి, రెవెన్యూ అధికారులు తమకు తాముగా మొత్తం రెవిన్యూ అంచనా ఖరారులో రెవిన్యూ అధికారులకు పూర్తి అధికారం ఇచ్చుకున్నట్లైంది. ఈ బిల్లు కూడా అద్దె, కౌలు ఒడంబడికకు సంబంధించి ప్రత్యేక న్యాయ పరిధిని రెవెన్యూ అధికారులకు కల్పించింది. బొంబాయి చట్ట సభలోని భారత ప్రతినిధులు దీని స్థానంలో సివిల్ కోర్టులకే న్యాయ అధికార పరిధి కల్పించాలని శాసన మండలిలో జరిగిన

చర్చల్లో పేర్కొన్నారు. భాటకాన్ని ఖరారు చేయడం రెవెన్యూ అధికారులకు వదిలి, కౌలు ఒడంబడికకు చెందిన నిర్ణయాలను సివిల్ కోర్టులకు వదిలి వేయడం ద్వారా చివరికి రాజీ సూత్రం ఒకటి కుదిరింది.

ఈ విధంగా 1904 ఖోటీ సెటిల్‌మెంట్ చట్టం దాని ముఖ్యమైన నిబంధనలకు సంబంధించి పంజాబ్, మధ్య రాష్ట్రాల్లో ఇంత క్రితం జరిగిన చట్ట పరమైన కౌలు రక్షణ చట్టాలకు ప్రతి రూపంగా వుంది. రెవెన్యూ నిర్ణయానికి సంబంధించి మొత్తం కౌలు వ్యవస్థ రెవెన్యూ అధికారుల క్రిందికి తీసుక రాబడింది. ఖోట్‌ల భాగస్వామ్యసాగుదారులు బెంగాల్ బార్గాదార్‌లు, సాధారణ రైత్వారీ ప్రాంత రైతుల ఉప-కౌలుదార్ల కన్నా గుణాత్మకంగా రక్షించబడినారు. మలబారు జాన్‌మీలను ఇష్టపడని ప్రభుత్వం ఖోట్స్ యెడ మాత్రం తమకు కావల్సిన వారుగా గుర్తిస్తూ ప్రవర్తించింది. వస్తుతగా ఈ చట్టంకు 1912 మరియు 1913లలో దాని నిబంధనలను బలోపేతం చేయడానికై మరికొన్ని చిన్న చిన్న సవరణలు చేయబడ్డాయి. అయితే పూర్వం కన్నా ఖోటీ పద్ధతి బలహీనమయి పోయింది. కొన్ని దశాబ్దాలలో చురుకైన భారత రాజనీతి వేత్తలు ఖోటీ కౌలు ఒడంబడికలను సులువుగా నిషేధించ వచ్చని భావించారు. 1937లో డా.బి.ఆర్. అంబేద్కర్ బొంబాయి చట్ట సభలో ఖోటీకౌలు ఒడంబడికను రద్దు చేయాలన్న ఒక బిల్లును ప్రవేశ పెట్టినాడు. ఆయన ప్రయత్నాలు 1950 వరదాకా కొనసాగాయి కాని కార్యరూపం దాల్చలేదు. నిజానికి ఈ నిర్ణయం 1850లలో కెప్టెన్ వింగేట్ 100సం॥రాలకు పూర్వమే ప్రతిపాదించినాడు. కానీ కొంకణ్‌లో సర్వేసెటిల్ మెంట్ ప్రవేశ పెట్టిన మాదిరిగానే ఖోట్స్‌ను పరిగణలోకి తీసుకోకుండా ప్రభుత్వం కొనసాగగలదని నిరూపించవలసిన అవసరం ఆనాడు స్పష్టంగా కనిపించింది. ప్రాబల్య శక్తులను దువ్వే ప్రాధాన్యతలో ఈ ప్రయత్నాలు చాలా రోజులుగా వాయిదా పడ్డాయి. బొంబాయి ప్రభుత్వం మాత్రం రైత్వారీ పద్ధతి అమలులో సహకరించని ఏ శక్తుల పట్ల మెతక వైఖరిని అవలంబించలేదు. కౌలు రక్షణ, రైత్వారీ వ్యవస్థ అమలు విషయంలో మద్రాసు ప్రభుత్వంకన్నా కఠినంగానే బొంబాయి ప్రభుత్వం వ్యవహరించింది.

పదకొండవ అధ్యాయం

# చోటా నాగపూర్‌లో ఆదివాసుల సంఘీభావం, రైతాంగ అశాంతి

భూస్వామ్య, బ్రిటిష్ పాలనా పరిధిలో ఆదివాసీ గ్రామాల సముదాయంలో క్షీణించిన విధానాన్ని ఈ అధ్యాయంలో తెలుసుకోవచ్చు. బీహార్‌కు దక్షణాది ప్రాంతంలో చోటనాగ్‌పూర్ వుంది. ఇది బెంగాల్ ప్రావిన్స్‌లో భాగంగా వుండేది. బెంగాల్‌లో భాగమైనందు వల్ల శాశ్విత శిస్తు విధానం కూడా ఈ ప్రాంతంలో ప్రవేశపెట్టబడ్డది. శాశ్విత శిస్తు విధానంలో వున్న ఉప భూస్వామ్యం, జమీందారీ వర్గం బలపడడం వంటి సహజ పరిణామాల ప్రభావంలో చోటానాగపూర్ తీసుకరాబడింది. అయితే, బెంగాల్‌లో హిందూ, ముస్లిం రైతాంగం అధికంగా వుంటే, చోటా నాగపూర్ ప్రాంతంలో ముండాలు, సంతాల్‌లు, ఓరాన్ తదితర గిరిజన తెగలు అధికంగా వున్నారు. ఈ తెగల మధ్య గట్టి సంఘీభావ సంబంధం ప్రధానంగా కనబడుతుంది. పరాయి దేశ బ్రిటిష్ పాలనను ఈ తెగలు నిరసిస్తూవచ్చినవి. బ్రిటిష్ రెవెన్యూ పాలన లక్షణాలైన భాటక చెల్లింపులను రైతాంగం అందించవలసిన సేవల విషయంలో ఈ తెగలు, నాటి ప్రభుత్వాన్ని వ్యతిరేకించినాయి. ఈ నిరసన ధ్వనుల వెనుక అనాటికే క్రైస్తవమతాన్ని పుచ్చుకొని నూతన విశ్వాసాన్ని పొందిన ఈ గిరిజనులు స్థానిక హిందూ సంస్థానాదీశుల ఆధిపత్యాన్ని సవాలు చేస్తూ వచ్చినారు. ఎందుకంటే, ఈ సంసానాదీశులు కూడా ఒకప్పటి ఈ తెగల నుంచి ఉద్భవించిన వారే. అలా ఒకసారి అధికారంలోకి వచ్చిన పిమ్మట రైతంగాన్ని అణిచివేయడానికి బయటివారి సహాయాన్ని వీరు కోరినారు. మొదట్లో ఈ ఆదివాసి తెగలు పోడుపై ఎక్కువగా ఆధారపడి జీవించేవారు. క్రమేపి మైదాన ప్రాంత ప్రజల వలస అరణ్య ప్రాంతాల్లోకి అధికం కావడంతో జన సంఖ్య కూడా పెరుగుతూ వచ్చింది. ఫలితంగా అంత వరదాకా కేవలం ఆదివాసులు నివసించే ఈ ప్రాంతం అనేక హిందు కులాలు నివసించేదిగా కూడా మారింది. ఇల్లు స్థిరపడే క్రమంలో ప్రతి గ్రామంలో అనువంశిక కుటుంబాలకు ఉమ్మడి ప్రతినిధిగా ఒక సంస్థాపకుని ఏర్పరచుకొనేవారు. గ్రామంలో వున్న భూమి, కుటుంబాల ఉమ్మడి ప్రయోజనాలను జాగ్రత్తగా వారు కాపాడేవారు. సాగు చెయ్యని సమీప గ్రామ ప్రాంతాల్లో ఇతర జాతుల నివాసాన్ని అంగీకరించేవారు. ఇతర జాతుల వారి సంబంధీకులు, భార్యా పిల్లలు నివసించడానికి అనుమతి ఉండేది. ఇలా నివాసం వున్న వారు ప్రాంతీయ తెగ ముఖ్యులకు 'చందా' రూపేణా రుసుము చెల్లించే వారు. ఈ మొత్తం మాత్రమే క్రమేపి హిందూ రాజుల పోలిన విధంగా ఈ ప్రాంతీయ తెగ ముఖ్యులు పరిణామం పొందడం ఆరంభించినట్లుగా

భావించవచ్చు). వీరు త్వరగానే రాజరిక భూస్వామ్య జీవన సరళిని అనుకరించడం కూడా మొదలు పెట్టినారు. సాగు యోగ్యంగా వున్న వ్యవసాయ బదిలీలపై అదుపును పొంది, స్థిరపడ్డ రైతులనుంచి భాటకాన్ని వసూలు చేస్తూ సంస్థానాదీశులుగానూ, రాజులుగానూ రూపాంతరం చెందినారు. తెగ సంప్రదాయాల ఆధారంగా సాగుచేయబడుతున్న భూముల్లోకి ఈ విధంగా రూపాంతరం చెందిన రాజులు, వారి ఆధీన అనుయాయులు ప్రాబల్యాన్ని సంపాదించుకున్నారు. ఈ రాజులే తమకు దిగువ స్థాయిలో ఉండే జాగీర్దార్లను, ఇనాందార్లను, పరిమితకాలానికి అధికారాన్ని అనుభవించే హక్కుదార్లను కూడా సృష్టించినారు. వీరే రైతాంగాన్ని అష్టకష్టాల పాలు చేసినారు. తమ రాబడిని మాత్రమే చూసుకొన్న ఈ వర్గాలు ప్రజానీకపు కనీసపు సౌకర్యాలను కూడా పట్టించుకోలేదు. భూమిపై శాశ్వత, ప్రయోజనాలు ఇమిడి వున్న రాజులు కూడా అంత వరదాకా 'బుయాన్ హరి' (సమిష్టి పోడు) భూములను మజ్హస్ (జమీందారీ) భూములుగా మార్చివేసినారు. అలా మార్చడం వల్ల నిత్యం ఈ ఋణాల నుండి శిస్తు రూపేణా రుసుమును పొంది తమ పాలనను సుస్థిరం చేసుకొనే భావన స్పష్టంగా ఉండేది. ఈ విధానం అతి నికృష్టమైన అణిచివేతను రైతులపై కొనసాగించింది. దండ, దమన మార్గాలను ఉపయోగించి రైతాంగాన్ని కష్టాల పాలు చేసింది. సంతానం లేని రైతుల భూములను స్వాదీనం చేసుకోవడం లాంటిది వీరు అవలంబించిన అణిచివేత పద్ధతుల్లో ఒకటి. ఆదివాసుల సమిష్టి సముదాయ స్వాదీనంలో వున్న భూమి క్రమేపి సంసానాదీశుల, భూస్వాములపాలైంది. భూస్వాములు అన్యాక్రాంతంగా దక్కించుకొన్న భూములను సాగు చేయడానికి ఆదివాసుల శ్రమ వెట్టిగా మారిపోయేది. ఈ పరిస్థితి దాపురించడంలో అనేకమంది రైతులు దూర ప్రాంతలకు కూలీలుగా వలస వెళ్లినారు.

ఆదివాసుల దూర ప్రాంతాల వలస చోట నాగపూర్ ప్రాంతంలో చాలా కాలం నుండే కొనసాగుతూ వచ్చింది. బ్రిటిష్ పాలనా కాలం దీనికి కొనసాగింపుగా దోహదపడింది. పందొమ్మిదవ శతాబ్దంలో ఒక్క రాంచీ ప్రాంతంలో అన్నింటిని కోల్పోయిన ఆదివాసులు తిరుగబడుతున్న ప్రతీ సందర్భాన్ని అణిచి వేయిటకు బ్రిటిష్ ప్రభుత్వానికి ఒక విషమ పరిస్థితిగా మారిపోయింది. శాశ్వత భూమి శిస్తు విధానం ఈ అశాంతికి ఆజ్యంగా పని చేసింది. ఆదివాసుల తెగ పెద్దలతోనే జమీందారులు లావాదేవీలు కలిగి ఉండటం మూలనా బకాయిలు వసూలుకు పణంగా ఈ తెగపెద్దల ఆద్వర్యములో వున్న భూమిని మొత్తం స్వాధీనం చేసుకొనేవారు. తెగలో వున్న సాగుదార్లందరిని శిస్తు చెల్లించుటకు తెగ పెద్ద వత్తిడి చేసేవాడు. ఒక వేళ ఎవరైనా చెల్లించినట్లయితే అట్టివారి భూమిని శాశ్వతంగా వేరొకరికి అమ్మివేసేవారు. అంతవరాదాకా సాగుచేసిన ఆదివాసి సాగుదారుల సమ్మతముపై ఆధారపడి కొనసాగేకౌలుదార్ల

(Tenant - at - will) గుర్తించబడేవారు. అయితే, తెగపెద్ద అన్నిసార్లు నిస్సహాయిడిగా వుండేవాడుకాదు. తనపై కొత్తగా వుంచిన భూస్వామ్య హోదాను కొన్ని సార్లు చెలాయించేవాడు. గ్రామంలో పేరుకొని పోయిన తగాదాలును బయటినుంచి వచ్చిన భూ కొనుగోలుదార్లు వాడుకొనేవారు. గ్రామాన్ని మరిన్ని ముక్కచెక్కలుగా విభజించి రైతాంగాన్ని హింసించేవారు. ఏగ్రామమైతే తన సహజ సమిష్టి జీవన సరళిని యధాతథంగా ఉంచుకుంటుందో ఆగ్రామాన్ని ''కుంటాకట్టి'' గ్రామంగా పిలిచేవారు. సమిష్టి సముదాయ హక్కులు విభజింపబడి కుటుంబ పరంగా లభించే అనుశృత హక్కులను కల్గి వుండి పొందే భూములను బుయాన్ హరి భూములుగా పరిగణించేవారు. బ్రిటిష్‌న్యాయ విధానం పైవిధానాన్ని కొనసాగించింది. ఎప్పుడైతే రైతులు ఈ పద్ధతుల వల్ల అశాంతికి గురి అవుతారో అప్పుడు వారిని శాంత పరిచే ప్రయత్నాలను అవలంబించేది. తన సైన్య సంపత్తితో, చట్ట ప్రాబల్యంతో ఆదివాసుల చీదరించుకొనే మైదాన ప్రాంత వడ్డీ వ్యాపారస్తుడైన 'డికూ' ను బ్రిటిష్ ప్రభుత్వం రక్షించ పూనుకొంది. ఆదివాసులకు - డికూలకు మధ్య పరిస్థితి విషమించడంతో పరిహార శాసనాలను అన్వయించి చట్టపరంగా ప్రశాంత పరిచేందుకు ప్రభుత్వం ప్రయత్నించింది. కానీ, ఈ చర్యలన్నీ చాల ఆలస్యంగా చేపట్టబడడంతో ఆదివాసుల సముదాయక జీవన విధ్వంసనం జరిగేపోయింది. చోటానాగ్‌పూర్ ప్రాంతంలో కొనసాగుతున్న భూస్వామ్య అణిచివేతను రాంచీలో వున్న జర్మన్ లూథరిన్ చర్చి వారు పెద్ద యెత్తున బయటి ప్రపంచానికి తెలిసేటట్లు చేసినారు. ఆదివాసులపై జరుగుతున్న నిర్బంధాన్ని నిరసించినారు. స్థానిక భూస్వాములకు వ్యతిరేకంగా సమీకరించబడుతున్న ఈ ఆదివాసి సంఘీభావం మిషనరీలకు కూడా ఒక దశలో ఇబ్బందికరంగా మారింది. క్రైస్తవ మతం స్వీకరణ కేవలం నామ మాత్ర అంశంగా మిగిలి, సారాంశంలో దీనిని ఆదివాసుల రక్షణగా వాడుకొని, భూమి హక్కులను కాపాడుకోవడానికి ఒక క్రొత్త సంఘీభావాన్ని ప్రకటించుకొనే మార్గంగా మల్చుకున్నారు. మతం తరహా చెందిన ఆదివాసులు క్షవరం చేయించుకొనే నమునా ద్వారా ఒక కొత్త నూతన ఉత్తేజాన్ని పొందేవారు. ఒక బ్రిటిష్‌పాలకుడు అన్నట్లు'' ఆదివాసులు రాంచీకిపోతారు సరికొత్తపద్ధతిలో వెంట్రుకలను క్షవరం చేయించుకొని వెను తిరుగుతారు. గ్రామాలకు వచ్చి రావడంతోనే స్థానిక భూస్వాములను ఎదిరించడం మొదలు పెడుతారని'' వ్యాఖ్యానించాడు. కొన్నిసార్లు వీరు రాంచీకి పోవడం కూడా అవసరం లేకుండేది. నూతన మతాంతీకరణ పొందిన వాళ్లు తమలో తాము ఈ క్షవర కార్యక్రమం కొనసాగించేవారు. ఆవిధంగా నూతనోత్తేజాన్ని పొంది స్థానిక భూస్వాములైన వారిని ఎదిరించడం సర్వసాధారణ అంశంగా మిగిలింది.

1857 తిరుగుబాటు తదనంతరం వ్యవసాయ సంబంధాలు ఉత్పాదక స్థాయికి చేరుకొన్నాయి. అంత వరదాకా బలంగా వున్న క్రైస్తవ పాలనాధినేతల పట్ల, వారి అమయక రైతాంగం పట్ల భూస్వాములు పెద్ద యెత్తున దాడులు జరిపినారు. తిరుగుబాటు తదనంతరం బ్రిటిష్ పాలనా మాములు స్థితికి కోలుకొన్న పిమ్మట బ్రిటిష్ పాలనకు అనేక ఫిర్యాదులు రైతుల నుంచి అందినాయి. ఈకాలంలో పలుమార్లు భూస్వాములు ఏ విధంగా స్పందించినారో ఈ పిర్యాదుల్లో స్పష్టంగా తెలుపబడింది. మైదాన ప్రాంతనడవడిపైన, సరియైన అవగాహనను పొందిన విద్యావంతులైన శ్రేణులు కొంత మంది ఆదివాసులలో తయ్యారైనారు. ఆదివాసుల కడగండ్లను తీర్చడానికి న్యాయస్థానాలను ఆశ్రయించి న్యాయవాదులను పెట్టుకొని కేసులను సాధించడం మొదలైంది. కేసుల ఖర్చుల నిమిత్తం రైతుల నుంచి చందాలు వసూలు చేసి సమకూర్చడం వంటి పద్ధతులను ఈ విద్యా వంతులైన శ్రేణులు చేపట్టినాయి. బాహీబాహీ కుమ్ములాటల కన్నా ఈ న్యాయస్థానాలను ఆశ్రయించే పద్ధతులవైపు ఒకింత మొగ్గు చూపినా ఈ పద్ధతుల ద్వారా అంతగా ఆదివాసులు లబ్ధిని పొందలేదు. బ్రిటిష్ ప్రభుత్వం రైతుల పిర్యాదుల పట్ల చాలా ఆలస్యంగా స్పందించినది. రైతుల కడగండ్లను తీర్చడానికి చేపట్టిన ప్రభుత్వ చర్యలు కూడా చాలా వరకు అసమర్థంగా మిగిలిపోయినాయి. పరిరక్షణకౌలు శాసనం (Substantive tenancy legislation) బిర్సా ముండా తిరుగుబాటు ద్వారా పరికల్పన జేయబడింది. ఈ తిరుగుబాటు బ్రిటిష్ పాలకుల వెన్ను తట్టి తాము పనిచేయవలసిన ఫైళ్ళ కదలికను వేగ వంతం చేసింది. పాలనా పరంగా ఒక హెచ్చరికను మిగిల్చింది. బిర్సాముండా మిషనరీ పాఠశాల విద్యను అభ్యసించినవాడు. ఆదివాసి రైతాంగ తిరుగుబాటుకు ఒక గత వైభవ స్ఫూర్తిని ఇచ్చి పునరుద్ధరణ దృష్టిని బిర్సా ముండా అందించినాడు. బ్రిటిష్ వారు పేల్చిన తుపాకి గుండ్లు నీరై మారిపోతాయని ఆదివాసులకు వాగ్దానరీత్యా నమ్మకాన్ని వాస్తవాన్ని కలిగించినాడు. కొద్ది సంవత్సరాల తదనంతరం పశ్చిమ ఆఫ్రికాలో సంబంధించిన మాజీ మాజీ (Maji Maji) తిరుగుబాటులో కూడా ఇదే తరహా ధోరణులు ప్రస్ఫుటమైనాయి. చోటా నాగపూర్ ప్రాంతంలో ఉద్రిక్తత, నిస్పృహ సర్వత్రా వ్యాపించడం మొదలు పెట్టింది. ఆదివాసుల సంఘీభావాన్ని, ప్రతిఘటనను ఎదుర్కోలేక భూస్వాములు వారిని అణిచివేయడం అధికం చేసినారు. ఆదివాసులు తమకున్న సహజమైన సముదాయ భూహక్కులు ఏరకంగా భూస్వాముల వశమౌతున్న రీతిని ఇంకా పూర్తిగా మర్చిపోలేకున్నారు. ఏరకంగా సముదాయ జీవితం భూస్వామ్యమయం అవుతున్నదో ఆదివాసులు స్పష్టంగా చూడగలుగుతున్నారు. భూమి శిస్తు సెటిల్ మెంట్ నిర్వహణలో భాగమైన నాటి బ్రిటిష్ అధికారి నాటి గిరిజన రైతాంగ అశాంతికి మూలాలను చక్కగా తెలిపినాడు. సోనాపూర్ పరగణాకు తూర్పుదిశా

వున్న ప్రాంతాల్లో ఆదివాసి గ్రామాల్లో సముదాయ భూ యజమాన్యం ముక్క చెక్కలు చేయబడింది. కుంటాకట్టి సంప్రదాయం తుంగలో తొక్కబడ్డది. బునియారీ వ్యక్తిగత భూస్వామ్య విధానం పెద్ద ఎత్తున ప్రవేశింప చేసినారు. రాంచీ జిల్లాలోని అనేక ప్రాంతాల్లోని ఆదివాసీ గ్రామాల్లో జరుగుతున్న సమిష్టి జీవన విధ్వంసనకాండ రైతాంగపు తిరుగుబాటుకు ఆయువుపట్టుగా పనిచేసింది. శతాబ్దాలుగా గ్రామాలపై బిగుసుకుంటున్న భూస్వామ్య పట్టును విదిలించడానికి తొలిమలి ప్రయత్నాలను అవలంబించినారని చెప్పవచ్చు.

**బునియార్ సర్వే - భూస్వాములకు ఆదివాసులు చెల్లించే సేవలకు శాసన రక్షణ ఏర్పాటు : -**

బునియారీ భూములపై జరుగుతున్న ఆక్రమణలను నిరోదించడం, భూస్వాములు ఆదివాసులను వివిధ సేవలకు వినియోగించే సేవలను శాసన పరంగా గుర్తించడం వంటి రెండు పనులను బ్రిటిష్ ప్రభుత్వం తక్షణంగా చేపట్టవలసిన అంశాలుగా మిగిలినాయి. మొదటి సమస్యను రికార్డు ఆఫ్ రైట్స్ ( భూమి హక్కుల నిర్ధారణ) ను చేపట్టడం ద్వారా పరిష్కరించే ప్రయత్నం జరిగింది. రెండవ సమస్యకు రైతులు ఎన్నో సందర్భాల్లో భూస్వాములకు అందించే సేవలకు నగదు రూపేణా ఖరీదు కట్టబడింది. చోటా నాగపూర్ ప్రాంతంలో ఆదివాసీ రైతులను కాపాడే మొట్టమొదటి చర్య వారి భూమి హక్కులకు చట్ట భద్రత కల్పించడాన్ని ప్రభుత్వం చేపట్టింది. 1869 చోటానాగ్‌పూర్ చట్టానికి అదే కాలంలోని పంజాబ్ కౌలుదారీ చట్టాన్ని చాలా మంది అధికారులు పోల్చి తరచి చూసినారు. పంజాబ్ కౌలుదార్లు చట్టం ప్రవేశ పెట్టేనాటికి అంతకు ముందు దాఖలు పర్చిన ఋణ యజమాన్యాన్ని గుర్తించి అధికారికతను ఇచ్చింది. చోటానాగ్‌పూర్ చట్టం అంతకు ముందున్న శాశ్వత శిస్తు విధానరీతిలో జోక్యాన్ని కలిగించుకున్నది. ఇంకా ఆలోచిస్తే 1859నాటి చట్టంలోని పదవ ప్రకరణాన్ని పంజాబ్ ప్రాంతానికి ఎప్పుడూ అన్వయించలేదు. చోటానాగపూర్ ప్రాంతంలో కూడా ఈ ప్రకరణం అన్వయింపులో వున్నదా లేదా అన్న అంశం ఎవరికి తెలియదు. 1859లో చోటానాగపూర్ చట్టాన్ని ప్రవేశపెట్టే ముందు శాసనకర్తలు మాత్రం 1869 చట్టంలో వున్న సంకల్పం, రైతులకు మొదటి నుంచి వున్న సాగు హక్కులను గుర్తించడం కనుక ఈ అంశంపైనే శాసనకర్తలు ఎక్కువగా దృష్టిని పెట్టినారు. కొత్తగా వచ్చిన యాజమాన్య మార్పువారి ప్రాధాన్య అంశం కాలేదు. చోటానాగపూర్ ప్రాంతంలో పనిచేసే ప్రత్యేక కమీషనర్‌కు ఎలాంటి పరిమితులు లేని విధంగా ప్రతీ కౌలుదారుకేసును పూర్వాపరాలతో కూడా శోదించవలసిన బాధ్యత అప్పగించబడింది. చోటా నాగపూర్‌లో ఈ కాలంలో పనిచేసిన ప్రత్యేక అధికారి పంజాబ్ కౌలుదారీ చట్టం అన్వయింపు కున్న సంబద్ధత ఎక్కువగా పంజాబ్ ప్రాంతంలో వుండేటువంటిదని భావించినాడు. దీనికి భిన్నంగా చోటా నాగపూర్ ప్రాంతంలో అదివాసి భూ యాజమాన్యాన్ని సులువుగా ప్రతి ఒక్కరు గుర్తించ వచ్చుకనుక బునియారీ భూముల ధఖలు కోసం ప్రత్యేక శాసన దృష్టి అవసరమని భావించినాడు.

ఆదివాసులు వారి పునరుద్ధరణ శాసన ప్రతిపాదనపై గుర్తించ దగ్గ స్థాయిలో చర్చ జరిగినాక, అంతకుముందు ప్రభుత్వం ఒక నిర్ణయం తీసుకున్నది. ఈ నిర్ణయం ప్రకారం 1869 నాటి నుండి వెనుకకు 20 సంవత్సరాల గతాన్ని 'ప్రమాణిక కౌలు కాల పరిధిగా' తీసుకోవచ్చునని స్పష్టీకరించబడింది. అంటే 1849 నాటికి ఏ ఆదివాసులకైతే ఋణ స్వాధీనంలో వుందో వాటిపైన మాత్రమే స్పందించి పునరుద్ధరించడానికి కమీషనర్‌కు అధికారం వుంది. కమీషనర్ విధి నిర్వహణలో ఈ చర్యలను చేపట్టడంలో కోర్టుల, న్యాయవాదుల ప్రమేయాన్ని చట్టం మినహాయించింది. ఈ మినహాయింపుపై బెంగాల్ శాసన సభలో అభిప్రాయాలు భిన్నంగా వ్యక్తమైనాయి. ఆష్లీ ఎడెన్ అనే ఆయన అభిప్రాయపడుతూ బెంగాల్ లోని అధికార వర్గం ''రచ్చబండ న్యాయాన్ని అందించడానికి కుతూహలపడుతున్నదని '' ఎద్దేవా చేసినాడు. దీనికి స్పందనగా బెంగాలీ అధికారుల స్వరూపం తెలుసుకోవడంలో ప్రజలు సాధనమేమీ కాబోరనే అభిప్రాయం వ్యక్త పరిచినారు . పరిణామం ఏమైనా రెవెన్యూ అధికారుల పట్టును ఈ చట్టం ధృవీకరించింది. ఈ చట్టంపై నియమించబడిన సెలక్టు కమిటీ రైతు భూస్వామికి అందించే సేవల పైన ఒక సానుకూల క్లాజును చట్టంలో జతపరిచింది. తర్వాతి కాలంలో రైతు భూస్వామికి అందించే సేవల విషయంలో ప్రత్యేక చట్టాన్నే రూపొందించినారు.

రైతు అందించే సేవలను వెలకట్టడం (అద్దెరూపంలో) నిజానికి బునియారీ భూముల సర్వే కాలంలో అధికారులు వ్యక్తపరిచిన అంశాల వల్ల సాధ్యమైంది. 'బునియారీ' భూయాజమాన్య సంబంధాల్లో భూస్వామికి సేవలను అందించే ఏర్పాటు ఇమిడివుంది. దీనికి వెలకట్టడానికి ఆనాటి అధికారులు వహించిన వైఖరి పట్ల నిర్వహించిన తీరు పట్ల అనుమానాలు వెల్లడైనాయి. మొదట్లో భూస్వామి తన భూములను (బేతకేతా) సాగుచేయడానికి ఏర్పరిచిన రైతులను 'బేత్‌బిగారీ' గా వ్యవహరించేవారు. వీరు భూస్వామికి సంబంధించిన 'మజాహస్' భూములను సాగుచేయడానికి నియుక్తులైనటువంటివారు, ఎప్పుడైతే భూస్వామి అధిక శాతం 'మజ్‌హస్' భూములను సాగుచేయ్యడం మొదలు పెట్టినారో అప్పుడే వేరే రైతుల సేవలు అవసరమైనాయి. భూస్వామికి ఎలాగు భాటకం చెల్లించేది ఉంటుంది కనుక దానికి బదులుగా తమ శ్రమ సేవలను అందిస్తే సరిపోతుందని రైతులు భావించే వారు. ఈ వసతి రైతులకు వెసులు బాటుగా కూడా ఉండేదని భావించినారు. అంటే ఒక రకంగా తాము భూస్వామికి అందించే సేవల విషయంలో సంప్రదాయంలో భాగంగా అవ్యక్తంగానైనా కొంత సౌకర్యాన్ని కలిగివున్నారనే అభిప్రాయం కూడా వుంది. బునియారీ సర్వే మరొక విధంగా రైతులు సేవలందించే ఏర్పాటును మరింత పెంచడానికే దోహద పడ్డదిగా భావించవచ్చు.

'బునియార్' భూముల సర్వేలో ప్రస్ఫుటమైన ముఖ్యలోపం ఒకటుంది. 'బునియర్','మజ్‌హస్' భూములను మాత్రమే సర్వేలో రికార్డు చేసినారు. రాజుల ఆధీనంలో వున్న భూములను, పూర్తిగా 'కుంట్‌కట్టీ' (సముదాయ అజమాయిషీ) భూములను సర్వేలో ప్రస్తావించలేదు. ప్రధానంగా రాజులకు - రైతులకు మధ్య నిత్యం నలుగుతున్న యాజమాన్య హక్కుల నిర్ధారణ సమస్యను దాటవేసే ఉద్దేశ్యమే ఇందులో ఇమిడివున్న కారణమై వుండాలి. కుంటాకట్టీ భూములు యధాతథంగా సముదాయ అజమాయిషీలో వుండడంవల్ల వాటి ప్రస్తావన తేలేదు. ఒక వేళ ఈ రెండింటి తరహా యాజమాన్యాలను భూమి రికార్డులలో చేర్చగలిగి వుంటే తదనంతర సమస్యలు వచ్చివుండేవి కావు. ఫలితంగా ఒక దశాబ్ద కాలం పాటు కొనసాగిన బునియార్ సర్వే పరిష్కరించిన సమస్యల కన్న లేవనెత్తిన తగాదాలు అధికం. అధికమైన భూ తగాదాలే ఆదివాసుల అశాంతికి ఆజ్యమైన అంశాలుగా చెప్పవచ్చు. బునియారీ తరహా భూములకు బదిలీ చేసే అవకాశముందనే సందేశం ఈ సర్వే వల్ల వెల్లడయ్యింది. రైతులకు ఏదైతే రక్షణ చర్యగా ఉపకరించుకోవాలనుకున్నదో అదే బయటి శక్తులు ఈ ప్రాంతాల్లో భూములు కొనుగోలు చేసేందుకు భూబదిలీలను ఏర్పరచడం ద్వారా వీలుకల్పించి నట్లయింది.

ఒక వైపు బునియర్ సర్వే కొనసాగుతుండగానే 1859వ చట్టపు పదవ భాగాన్ని సవరిస్తూ ప్రభుత్వం 1879వ భూస్వామ్య కౌలుదారు విధాన చట్టాన్ని ప్రవేశపెట్టింది. రైతు - కౌలుదారులకు మధ్య వివాదంగా వుండే భాటకపు చెల్లింపు సమస్యకు సంబంధించిన అనేక అంశాలను ఈ చట్టం ప్రస్తావించింది. 12 సంవత్సరాలుగా భూమిని సాగు ఆధీనంలో వుంచుకోవడంవల్ల సంప్రాప్తించే భూమి హక్కుకు సంబంధించిన ప్రకరణం చోటా నాగపూర్‌లో ప్రవేశపెట్టిన ఈ చట్టంలో జొప్పించబడింది. ఎంతకాలమైతే అద్దె చెల్లిస్తారో అంతకాలందాకా భూమి సాగుచేసే హక్కులు కలిగిస్తుందే వసతివున్న చోటా నాగపూర్ ప్రాంతంలో ఈ క్లాజు ప్రభావం అంతంత మాత్రంగా వున్నది. దీనికితోడు బునియర్, కుంటాకట్టీ భూములకు అదనంగావుండే డిమాండ్‌తో పాటుగా నూతనంగా సాగుచేసే భూములకు (కోర్‌కార్) అనుకూలధరలు పలుకడం ఆరంభించినాయి. 1859లో బెంగాల్‌లో ప్రవేశపెట్టిన ఈ చట్టం అక్కడ స్థానికంగా 'భాటకం చెల్లింపు వివాదాల విషయంలో' రెవిన్యూ కోర్టుల ప్రమేయాన్ని ప్రోత్సహించింది. చోటా నాగపూర్ ప్రాంతంలో మాత్రం ఈ చట్టాన్ని అన్వయించినప్పుడు భాటకపు చెల్లింపుల వివాదంపై రెవిన్యూ కోర్టుల ప్రమేయాన్ని చట్ట పరిధినుండి మినహాయింపచేసినారు. పూర్తిగా అంగీకారం లేని అంతంత మాత్రపు ఈ రకమైన చట్ట పరికల్పన వల్ల ఏవర్గం సంతృప్తి నొందలేదు. బెంగాల్ చట్ట సంప్రదాయపుతీరుకు చోటానాగపూర్‌లో ఈ చట్టాన్ని అమలుపరచినవైఖరికి పూర్తి వ్యత్యాసం కనిపించింది. 1885 బెంగాల్ కౌలుదారీ

చట్టం పరికల్పన చేయబడిన తరువాత దానిని చోటా నాగపూర్‌కు అన్వయించే ప్రయత్నాలు జరిగినాయి. 1800 నాటి సంవత్సరాల కాలంలో భూస్వాములకు అద్దె చెల్లించేదే లేదన్న రైతాంగ ఉద్యమ నాయకుల నినాదం ఈ చట్టాన్ని త్వరితంగా అమలు చేయడానికి ఉపకరించింది. బెంగాల్‌లో అమలుపరిచిన రీతిలో కౌలుదారీ చట్టాన్ని చోటా నాగపూర్‌లో అమలు పరచడానికి భాటకపు సేవల విషయంలో మారకపు ప్రమాణాలను (నగదురూపంలో) నిర్ధారించడానికి అవసరమైంది. ఫలితంగా రైతు అందించే సేవలను ప్రామాణికంగా భాటక రూపంలో నిర్ధారించేందుకు 1891లో ప్రయత్నాలు ప్రారంభమైనాయి. సేవలను భాటకపు రూపంలోకి ప్రామాణికంగా మార్చడం మాత్రమే బెంగాల్ చట్టపు అన్వయింపుకు (చోటా నాగపూర్ ప్రాంతానికి) వున్న అడ్డంకి అని 1894లో ఈ అంశంపై ముసాయిదా శాసనాన్ని తయారుచేసిన భారత ప్రభుత్వ సభ్యుడైన ఆంథోని మాక్ డోనాల్ భావించినాడు. బెంగాల్ చట్టపు బిల్లును పరిశీలించేటప్పుడు ఈయన నిర్దుష్టంగా కొన్ని అభిప్రాయాలను ప్రకటించాడు. ఈ బిల్లు వల్ల అనవసరంగా రెవిన్యూ అధికారుల ప్రాపును పెంచడం జరిగిందని, సివిల్ కోర్టులకు - రెవిన్యూ యంత్రాంగానికి అక్కరలేని వైరధ్యాలను పెంచడం జరిగిందని కూడా అభిప్రాయపడ్డాడు. అలాగు ఇన్ని రోజులగా బెంగాల్ కౌలు విధాన బిల్లును చోటా నాగాపూర్ ప్రాంతానికి అన్వయింప చేయాలని వాదించిన కమీషనర్ 1897లో ఈ బిల్లును బెంగాల్ శాసన మండలిలో ప్రవేశ పెట్టేసరికి వెనకంజవేసి దీనిపై ఇంకా వేచి చూడవలసిన అవసరమున్నదని తన అభిప్రాయాన్ని మార్చి చెప్పినాడు. ఈ అభిప్రాయాన్ని మార్చుకొన్న వ్యక్తి అప్పటికే అంతవరదాక కమీషనర్‌గా వున్నాయన బెంగాల్ ప్రభుత్వ సభ్యుడుగా మారినాడు. కొత్త గా వచ్చిన నాటి కమీషనర్ కౌలుదారీ విధానాన్ని వ్యతిరేకించినాడు. బెంగాల్ చట్టం ప్రతిపాదించినట్లు చోటా నాగపూర్‌లో 'స్థిర వ్యవసాయదారుడు' అనే వర్గం లేదు కనుక ఈ చట్టం వర్తింపు అర్ధ రహితం అని భావించినాడు. బెంగాల్ చట్టం భూకమతాలు స్వేచ్ఛగా బదిలీ కావాడానికి అనుమతినిస్తుంది. ఈ అనుమతి చట్టబద్ధంగా ఉండటం మూలానా వడ్డీ వ్యాపారస్తులు, సంపన్నులు రైతుల భూములను కారుచౌకగా కొనేసి మధ్యస్థ స్థాయిలో వున్న వ్యవసాయ, కౌలుదారీ వర్గాలన్నీ దెబ్బతినే అవకాశముంది. కనుక ఈ బిల్లు అన్వయింపు ఏరకంగాను ప్రయోజకారి కాదని క్రొత్తగా వచ్చిన కమీషనర్ వాదించినాడు. చోటా నాగపూర్ ఎస్టేట్ వ్యవహారాలను చూసే నిర్వాహకుడి అభిప్రాయలనే కొత్త కమీషనర్ రూఢీపరిచినాడు. ఈ కాలంలోనే పెద్ద ఎత్తున భూబదీ[illegible]లు జరుగుతున్న కాలం కనుక వాటిపైన వెలువరించే అభిప్రాయాలు తక్షణ దృష్టిని ఆకర్షించినాయి. ఇటువంటి బెంగాల్ కౌలుదారీ బిల్లు భూస్వాములకు ఇతోధికంగా ఉపయోగపడుతుందని భావించినారు. భాటకపు పెంపుకోసం

రైతులపై వత్తిడిని పెంచి సాగు భూములను వదులుకొనేటట్లు చేసి భూబదిలీలను పెంచి భూస్వాములు ఈ బిల్లు ద్వారా లబ్ధిని పొందేందుకు అవకాశమున్నది.

అందువల్ల రైతు సేవల మారక చట్టం (Commutation Act) బెంగాల్ కౌలుదారీ బిల్లు సహభాగం లేకుండానే ఆమోదించబడింది. ఎంతో అర్థవంతంగా కనిపించే చట్టం దేన్ని సాధిస్తుందో ఇంకా స్పష్టం చేయవలసివుంది. సేవల మారకం గురించి అటు భూస్వామి కాని ఇటు కౌలుదారు కాని ప్రభుత్వాన్ని కోరవచ్చు. అయితే ఈ విన్నపం ఐచ్ఛికమేకానీ నిర్బంధమైంది కాదు. కానీ సేవల మారకపు రూపంలో ఒనగూడిన భాటకపు మొత్తం నిజభాటకపు మొత్తానికి నాలుగవ వంతుకన్నా మించరాదు. అయితే, అనేక కేసులలో ఈ మారకపు మొత్తం నిజ భాటకాన్ని మించి ఉండడం వల్ల ప్రవేశపెట్టి ఆమోదించిన చట్టం శవ ప్రయాణంగా మిగిలింది. ఫలితంగా మరొక్కసారి చట్ట ప్రత్యమ్నాయాలపై దృష్టిని సారించిన శాసన కర్తలు మళ్లీ వేచి చూడవలసి వచ్చింది.

## చోటా నాగపూర్ కౌలుదారీ చట్టం - బిర్సాముండా తిరుగుబాటు

1899లో ఉద్ధృతంగా పెల్లుబికిన బిర్సాముండా తిరుగుబాటుతో అసమర్థమైన, అంతంత మాత్రం పందొమ్మిదవ శతబ్దపు శాసనాలకు కాలం చెల్లినట్లైంది. మరొకవైపు ఇతర రైతాంగ ఉద్యమాల నాయకులు భాటకం చెల్లించే ప్రసక్తి లేదన్న నినాదాలతో, అత్యంత వ్యయభరితమైన కోర్టు కేసులతో నిరుపయోగ ప్రయత్నాలు చేసి దెబ్బతిన్నారు. ఇంకొకవైపు భాటకం బకాయిలు పేరుకొని పోవడంతో గ్రామాలకు గ్రామాలనే అమ్మేస్థితి అధికమైంది. రైతు వెన్ను శాశ్వతంగా విరిచే పద్ధతులను కొనుగోలుదారులు అవలంబించినారు. రికార్డు ధృవీకరణలో కుంటాకట్టీ గ్రామాలను మినహాయించిన ఖరీదు ఇప్పుడు చెల్లించవలసి వచ్చి చారిత్రకంగా జరిగిన తప్పిదం స్పష్టంగా కనపడుతూనే వుంది. పొరుగున వున్న కేంద్రప్రావిన్స్‌ల ప్రాంతంలోని నూతన కౌలుదారీ చట్టం బెంగాల్ చట్టం కన్న సానుకూల అంశాలను ముందుంచింది. 1898లో సవరించి అమలు పరుస్తున్న కేంద్ర ప్రావిన్స్‌ప్రాంతాల్లోని కౌలుదారీ చట్టం రెవెన్యూ అధికారుల ద్వారా భూవివాదాల పరిష్కారం, భూబదిలీలపై ఆంక్షలు అనే రెండు అంశాలను స్పష్టంగా ముందుంచింది. ఈ అంశాలే చోటానాగపూర్ ప్రాంత అధికారులకు అనుకూలమైనవిగా మారినాయి. సెంట్రల్ ప్రావిన్స్‌లకు కమీషనర్‌గా వ్యవహరిస్తున్న జాన్‌వుడ్ బర్న్ బెంగాల్‌కౌలు చట్టాన్ని తిరస్కరించినాడు. తానే తర్వాతి కాలంలో బెంగాల్‌కు లెఫ్టినెంట్ గవర్నర్‌గా గద్దెనదిష్టించినాడు. ఇదేసమయంలో బిర్సాముండా తిరుగుబాటు తీవ్ర దశలో ఉంది. తిరుగుబాటు తీవ్ర దశను గమనించి సవ్యమైన శాసన పరికల్పన చేయాలని వుడ్ బర్న్ భావించినాడు. వెంటనే చోటా నాగపూర్ ప్రాంతంలో తిరుగుబాటు బద్ధలైన ప్రాంతంలో

భూమి రికార్డులకు సంబంధించిన సమాచారాన్ని సేకరించమని అధేశించినాడు. సేకరించిన సమాచార ఆధారంగా శాసన పరికల్పన చేయాలని కూడా వుడ్ బర్న్ భావించినాడు. ఈ సమాచార సేకరణ కాలంలో ''కుంటా కట్టీ గ్రామాల ప్రస్తావన'' బలంగా వినిపించింది. ఈ గ్రామాల్లోని రైతులు అటు అనుపాదితరైతులుగాకానీ, కౌలుదార్లుగా కానీ నమోదు చేయబడలేదు. కేవలం ముండారీ కుంట్ కట్టీదారులుగా పెర్కొన్నబడ్డారు. బయటి వడ్డీవ్యాపారస్థుల కన్నుపడకుండా ఆదివాసుల భూములు భూబదిలీనీ నిషేదించే రక్షణలు ఇట్లా ఆదివాసులను ప్రత్యేక సాగు వర్గంగా ప్రకటించడంవల్ల లభ్యమ[illegible]నాయి. పంజాబ్ భూ బదలాయింపు నిషేద చట్టం ప్రకారంగా వుండే ' ఆదివాసుల మధ్య భూ [illegible]ర్పిడి' ప్రకరణం కూడా ఈ ప్రాంతంలో అన్వయింపబడడానికి అస్కారం లేదు. కనీసం ఈ వసతి కూడా లేనట్లయితే రైతుల మధ్య అప్పు లావాదేవీలకు ఇబ్బంది అవుతుందని హజరీ బాగ్ నుంచి వాదించిన ఒక న్యాయవాది అభిప్రాయాలకు పెద్దగా స్పందన లభించలేదు. కేంద్ర ప్రావిన్స్‌లలో ఆమోదించిన చట్టం ఎక్కువగా పంజాబ్ భూ బదిలీ నిషేధ చట్టాన్ని అనుకరించింది. దీనిలో జాన్ వుడ్ బర్న్ ప్రోత్సాహం ఎక్కువగా ఉంది. చోటా నాగపూర్ ప్రాంతంలో ఇటువంటి పటిష్టవంతమైన చర్యలు చేపట్టడానికి సుదృఢ చట్ట ప్రతిపాదనలను చేయవలసిందిగా భారత ప్రభుత్వానికి అభ్యర్థనను వుడ్‌బర్న్ పంపినాడు. భారత ప్రభుత్వం బాటకానికి సంబంధించిన, అనుపాదిత సాగుదార్లకు సంబంధించిన కొన్ని ప్రకరణాలను చేర్చాలన్న యోచన ఉండడంతో చట్ట ప్రతిపాదన జాప్యానికి గురి అయ్యింది. రాంచీ ప్రాంతంలో భూయాజమాన్య వివరాలను సేకరిస్తున్న సెటిల్‌మెంట్ అధికారి నివేదిక కోసం కూడా ప్రభుత్వం వేచి చూసింది. కుంటాకటియాదార్ హోదాను అతి నిశితంగా పరిశీలించిన ఈ సెటిల్‌మెంట్ అధికారి ఒకరకంగా గొప్ప సేవలనే అందించినాడు. 1903లో అంతిమంగా చట్టం ఆమోదించబడింది. రైతు అందించే సేవలు భాటకంగా మార్పిడి చేసే చక్కటి ప్రకరణాలను ఈ చట్టంలో పొందు పరిచినాయి. నిజ బాటకపు మొత్తానికి సేవల మారకపు భాటకపు మొత్తం నాలుగవ వంతుకు మించరాదన్న నియమం తొలగించబడింది. భాటకపు మారకపు నిర్ధారణ రెవెన్యూ అధికారుల న్యాయ వివేచనకు వదిలివేయడం జరిగింది. ఈ చట్ట రూపకల్పన మున్నెన్నడూ లేని విధంగా రెవెన్యూ అధికారిని బలోపేతం చేసింది. భూమి రికార్డుల ఆధారాన్ని బుజువుగా గుర్తించవలసిందని, అవే అంతిమ ఆధారాలుగా కాకూడదని భారత ప్రభుత్వం భావించింది. ప్రాంతీయ ప్రభుత్వాలు భూహక్కుల లిఖిత ఆధారాలను అంతిమంగా తీసుకోవడం ఆరంభించినాయి. ఫలితంగా, భూహక్కుల లిఖిత ఆధా[illegible] ప[illegible]ను ఎంతమేరకు పరిగణనలోకి తీసుకోవాలో నిర్దేశిస్తూ చట్టంలో సవరణలు తేవాలని ప్రభుత్వం భావించింది. బెంగాల్ ప్రభుత్వం మాత్రం భూహక్కుల లిఖిత ఆధారాలను అంతిమంగా తీసుకోవాలని

భావించింది. సివిల్‌కోర్టులు ఈ లిఖిత ఆధారాలను సాక్షాధారంగా మాత్రమే తీసుకుంటుందని భావించడం వల్ల రైతాంగ సమాజంలో అస్థిరత పేరుకొని పోతుందని బెంగాల్ ప్రభుత్వం లిఖిత ఆధారాలను అంతిమ ఆధారంగా గుర్తించాలని భావించింది. చివరకు కోర్టులు రైతు 'స్వాధీనత్వం' గురించిన అంతిమత్వం గురించిన ఆధారంగా భూహక్కుల లిఖిత ఆధారాలను పరిగణించినారు. భూమిపై పట్టా విషయంలో మాత్రం కాదు. శాసన కర్తలు ఊహించినదానికి భిన్నంగా కోర్టులు తిరిగి తమ పట్టును సాధించుకోవడానికి ప్రయత్నించినాయి. మరొకవైపు సెటిల్‌మెంట్ అధికారి ప్రయత్నాలను కోర్టులు వమ్ము చేయడం ప్రారంభించినాయి. కౌలుదారులనుండి పెద్ద మొత్తంలో భాటకాన్ని వసూలు చేయడం అలవాటైన భూస్వాముల బారి నుండి భూములను విడిపించగలిగే విధంగా సెటిల్‌మెంట్ అధికారి ప్రయత్నించినపుడు కోర్టులు ఆయన చర్యలకు ఆటంకాలను కలిగించినాయి. వీటన్నింటిని అధిగమించడానికి శాసనంలో స్పష్టమైన ప్రకరణాల అవసరమొచ్చి 1903 బిల్లు తర్వాత వెను వెంటనే మరో క్రొత్త శాసన రూప కల్పనా ప్రయత్నాలు ప్రారంభమైనాయి.

భూ సమస్య పరిష్కారంపై రెవిన్యూ అధికారులకు సివిల్‌కోర్టులకు సంప్రదాయకంగా ఉండే వైరుధ్యం మాట అట్లా వుంచి, 1903వ చట్టంలో ప్రస్తావించని విషయాలు అనేకం వున్నాయి. కుంటాకట్టి తరహా భూములు బదిలీ నిషేదానికి గురిఅయితే బునియారి తరహా భూములను బదిలీ నిషేదం నుండి మినహాయించినారు. ఈ మినహాయింపువల్ల మైదాన ప్రాంత పెట్టుబడిదారుల కన్ను ఈ భూములపై అధికంగా పడింది. కొండవాలుపై పండిస్తున్న వరి భూములను ఆదివాసులు తమవిగా గుర్తించినపుడు వాటిని వారికే స్వాధీనపరచే చట్టపరమైన రక్షణలు ఈ చట్టంలో పొందుపరచబడిలేవు. సాంప్రదాయకంగా చేసే కొండవాలు పోడు భూములకు ఎటువంటి అనుమతి లేకుండానే భూ విస్తీర్ణ రీత్యా పెంచుకుంటూ పోవచ్చును. వీటినే 'కార్‌కార్ ' భూములని పిలుస్తారు. వీటిని ఈ భూముల సాగుకు అదనపు గుర్తింపు పొందిన రీతిలో భాటకం చెల్లింపు వుంటుంది. కాని బ్రిటిష్ చట్ట ప్రకారం ఇటువంటి భూముల సాగుకు ఆయా బ్రిటీష్ ప్రభుత్వంచే అధికారాన్ని పొందిన భూస్వాముల అనుమతిని పొందవలసి వుంటుంది. ఈ చట్టపరమైన చిక్కులు ఏమీ తెలియని ఆదివాసులు తమ సాగుచేసుకొంటున్న భూములపై చట్ట నెపంతో భూస్వాములు విరుచకపడడంలో నిర్ఘాంతపోయారు. భూస్వాముల వత్తిడి ఇటువంటి భూములపై అధికం కావడంతో ఆదివాసులు కొత్త భూములను సాగుచేయడం మానివేసి జీవనోపాధికై దూర ప్రాంతాలకు వలస వెళ్ళినారు. అందువల్లనే జనాభా పెరుగుదలకు సాగుభూముల విస్తీర్ణం మధ్య అసమతౌల్యత చోటుచేసుకొన్నది.

ప్రతిపాదిత చట్టంలో పైన ఉటంకించిన లోపాలను ప్రభుత్వం సవరించ బూనుకున్నది. ఈ చట్టంలో ముఖ్యంగా పేర్కొన్న అంశాలన్నింటిని జాగ్రత్తగా చోటా నాగపూర్ కమీషనర్, సెటిల్‌మెంట్ అధికారి సంయుక్తంగా తయారుచేసినారు. వీరిద్దరు కలిసి ప్రధానంగా ఎత్తి చూపిన అంశాలన్నింటిని బెంగాల్ ప్రభుత్వం ఒక ముసాయిదాగా తయారు చేసి ఇమ్మని తెలిపింది. 1905లో ఈ ముసాయిదాను ప్రభుత్వానికి సమర్పించినారు. ఆదీవాసీ జీవనంతో అత్యంత సన్నిహిత సజీవ సంబంధం కలిగివున్న మిషనరీల ఉత్తరాలు కూడా ఈ ఇద్దరి అధికారుల ముసాయిదాలో జత పరుచబడినాయి. ఆదివాసీ రైతుల పట్ల బ్రిటిష్ చట్టాలు, సివిల్ కోర్టులు ఎట్లా వ్యవహారిస్తున్నాయో జేసూట్ మిషనరీ ఫాదర్ అయిన హాఫ్‌మెన్ తన సుధీర్ఘమైన లేఖలో తెలియజెప్పినాడు. చోటానాగపూర్ ప్రాంతంలో చాలా కాలందాకా భూశాసనం ఏమీ చేయ్యకపోవడం వల్ల ప్రతీ విషయానికి బెంగాల్ శాసనంపైన ఎట్లా ఆధారపడ్డారో హాఫ్‌మెన్ వివరించాడు. భూమంత భూస్వామికే చెందుతుందన్న బెంగాల్ శాసన దృష్టి చోటా నాగాపూర్ స్థానిక ప్రాంత ప్రత్యేకతలను ఆదివాసి ప్రజల హక్కులను పరిగణనలోకి తీసుకోలేదని హాఫ్‌మాన్ భావించినాడు. చోటానాగ్‌పూర్ ప్రాంతంలో వున్న ఈ విధమైన ప్రత్యేకతలను పరిగణనలోకి తీసుకోకపోవడం వల్లనే అన్నీ అనర్థాలు సంభవించినాయని కూడా పలువురు భావించినారు. చాలా మంది భూస్వాములు అత్యధిక మొత్తంలో రైతులనుండి అద్దెను డిమాండు చేయడం మొదలు పెట్టినారు. అద్దె రశీదులు ఇవ్వకుండా రైతుల నుంచి రెండుసార్లు అద్దెను బుకాయించి వసూలు చేయ్యడం, కోర్టు కేసుల్లో ఇరికించి వేదించడం వంటి పనులకు భూస్వాములు పాల్పడ్డారు. చివరకు రైతులు కూడా కోర్టులపైననే ఆధారపడడం ఆరంభించినారు. ఎందుకంటె కోర్టులో ఒకసారి కేసు పడినతరువాతనే అద్దె నిఖారుసుగా తేలుతుంది కనుక తదనంతరం భూస్వామి వేదింపులు వుండవనే విషయం తెలసినరైతులు కోర్టు తీర్పుల తదునంతరమే అద్దె చెల్లించడానికి సుముఖతను చూపినారు. రైతులకు ఉండే ఈ ఇబ్బందులను ప్రభుత్వం గమనించకుండానే భూస్వాములను రైతులు అద్దె చెల్లించడంలో కష్టాలు పెడుతున్నారనేతప్పుడు అభిప్రాయానికి ప్రభుత్వం వచ్చింది. సివిల్ కోర్టులపై, న్యాయ వ్యవస్థపై ఆదివాసులకు అపనమ్మకం ఎందుకున్నదో ఫాదర్ హాఫ్‌మన్ చక్కగా తెలిపినాడు. న్యాయ వ్యవస్థలో వున్న ఉపకోర్టుల జడ్జీలు, న్యాయవాదులు అనేకమంది భూస్వాముల కుటుంబాలకు చెందినవారో, సంబందీకులో అయినందువల్ల భూమిపై వారికుండే ప్రయోజనాన్ని వదులుకోలేని రీతిలో ఉంటారనే దృష్టి ఆదివాసులకు ఉంది. అందువల్ల వారు బ్రిటిష్ రెవిన్యూ అధికారులనే ఎక్కువగా నమ్మినారు. హాఫ్‌మాన్ కూడా తన లేఖలో ఆదివాసుల భూసమస్యకు సంబంధించి ఒక సమగ్ర శాసనం చేయమని

బలంగా కోరినాడు. బెంగాల్ ప్రభుత్వం ఈ దృక్కోణాలన్నింటిని పరిశీలించి ఒక సమగ్ర శాసనాన్ని రూపొందించేసరికి చాలా కాలమే పట్టింది. అంతిమంగా 1908నాటి చోటా నాగపూర్ చట్టం జాన్ వుడ్ బర్న్ మార్గ దర్శ అభిప్రాయాలను (సెంట్రల్ ప్రావిన్స్ అనుభవంలో ఉంచుకొని చేసినవి), బెంగాల్ ప్రావిన్స్‌లో ఏర్పాటు చేయని భూ రక్షణలు, చోటా నాగపూర్ ప్రాంత భూహక్కుల ప్రత్యేకతలు మొత్తంగా చోటు చేసుకున్నాయి. పరస్పర భిన్నమైన స్వభావం కలిగిన సెంట్రల్ ప్రావిన్స్ చట్ట అంశాలు, బెంగాల్ ప్రావిన్స్ చట్ట అంశాలు ఈ ఒక్క చోటా నాగాపూర్ కౌలువిధాన చట్టంలోనే చోటు చేసుకున్నాయి. దానికి కారణం ఈ ప్రాంతంలో ప్రత్యేక రైతాంగ సంబంధాలు ఉండడమే. జాన్‌వుడ్‌బర్న్, సెటిల్‌మెంటు అధికారి 1905లో సమర్పించిన ముసాయిదా కాలంనాటికి ఈ సమగ్ర శాసనం తేవాలని ఆలోచన లేదు. బునియారీ భూముల బదిలీలపై పరిమితులు విధించడం, 'కోర్‌కారీ' భూముల రక్షణను అందించడమే ప్రభుత్వ ఆలోచనలో ముఖ్యంగా ఉన్నటువంటివి. దీనికి అనుబంధంగా 1907లో ఎంతో ధైర్య సాహసాలతో నాటి లెఫ్టినెంట్ గవర్నర్ ఆండ్రూ ఫ్రెజర్ బెంగాల్ శాసన మండలిలో ప్రవేశపెట్టిన బిల్లును ఉపసంహరించినాడు. ప్రభుత్వానికి - సంబంధిత వర్గాల మధ్య భూ సమస్యను క్షుణ్ణంగా చర్చించడానికి రాంచిలో ఒక సదస్సును నిర్వహించినాడు. భూస్వాముల ప్రతినిధులు దీనికి చాలా మంది హాజరయినారు. అనేక అంశాలు చర్చకు వచ్చినాయి. ప్రభుత్వ ప్రతినిధులు తమ వైఖరిని కొనసాగెటట్లుగా పెద్ద ఎత్తున ప్రయత్నించినారు. ఈ చర్చల్లో రెండు అంశాలు ప్రధానంగా ప్రస్తావనకు వచ్చినాయి. అవి ఒకటి భాటకపు పెంపు, రెండవది, తక్షణ ఆధీనంలో వున్న భూ విస్తీర్ణ యాజమాన్యాన్ని పెంచుకొనే వీలు. భాటకపు పెంపు విషయంలో బెంగాల్ నమూనా ప్రకారం 15 సంవత్సరాల కొకసారి ప్రతి రూపాయికి రెండు అణాల పెంపు వుండేది. ఈ నమూన మాత్రమే భూ స్వాములకు అందుబాటులో ఉండేది. అయితే, చోటా నాగపూర్ సందర్భంలో ప్రభుత్వం ఈ అంశంపై ఉదారంగా ఉండటానికి నిశ్చయించి ఎప్పటికప్పుడు భాటకపు పెంపు విషయం అధికారులకు వదిలివేయవలసిందిగా ప్రభుత్వం భూస్వాములను కోరింది. బెంగాల్ నమూనా భాటకపు చెల్లింపు సూత్రాలనుండి తప్పించుకోవడానికి భూస్వాములు ప్రభుత్వం సూచించిన రీతిలో రెవెన్యూ అధికారుల అంతిమ నిర్ణయానికి కట్టుబడి వుండటానికే ఇష్టాన్ని చూపినారు. 'మజ్‌హాస్' సాగుభూములపై బూనియర్ సర్వేనాటి సంఖ్యాధారంగా ఆంక్షలు విధించకుంటనే బాగుంటుందని భూస్వాములు కాంక్షించినారు. సర్వే అనంతరం, భూములను పొందిన భూస్వాములకు అనుగుణంగానే ప్రభుత్వం ఆంక్షలను సడలించింది. అలాగే భూములు కోల్పోయిన రైతులు తిరిగి తమ భూములను రాబట్టుకోవడానికి కేసులను ప్రభుత్వానికి దాఖలు చేసే అవకాశాన్ని

కూడా కల్పించింది. నిజానికి దీనికి సంబంధించిన అంశాలు కఠినంగా వున్నాయి. 12 సంవత్సరాల లోపు యాజమాన్యం కలిగి లేకుండా భూములు తమకు చెందాలని రైతులు సివిల్ కోర్టులలో వేసిన దావాలను రెవిన్యూ కోర్టులకు తరలించాలని చట్టంలో నిర్దేశించబడింది. వ్యవసాయ సంబంధాలలో వచ్చిన అల్లకల్లోలము వల్ల కాని, వేరే ఏకారణాల చేతనైనా ఏరైతు అయినా భూమిని వదిలి వెళ్ళి కొంత కాలం తరువాత మళ్ళీ వచ్చి భూమిపై స్వాధీన హక్కులను కోరినట్లు అయితే వాటిని ఆయా రైతులకు చెందాలన్న అంశాన్ని అధికారులు చాలా గట్టిగా బలపరచినారు. చోటా నాగాపూర్ న్యాయ కమిషనర్ గా ఉన్న డబ్ల్యూ. హెచ్. విన్సెంట్ భూ సమస్య పరిష్కార పరిధినుండి సివిల్ కోర్టుల మినహాయింపును ఇష్టపడలేదు. అయితే ఈయనే బెంగాల్ శాసన మండలిలో చోటా నాగాపూర్ కౌలు బిల్లును ప్రవేశపెట్టడానికి బాధ్యుడుగా కూడా వున్నాడు. సివిల్ కోర్టు మినహాయింపు సమస్యపై శాసన మండలిలో బిల్లు ప్రవేశపెట్టినప్పుడు వివాదం చెలరేగవచ్చునని నాటి బెంగాల్ అధికారులతో విన్‌సెంట్ హెచ్చరించినాడు కూడా. నాటి బెంగాల్ ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి స్పందిస్తూ, ఒక వేళ చర్చలో అంత తీవ్రమైన వివాదమే చెలరేగితే ఆ అంశాన్ని రాజీ అంశంగా గుర్తించ వచ్చునని సమాధానం ఇచ్చినాడు. నిజానికి అదే జరిగింది. భూ వివిధ సమస్యలను రెవిన్యూ కోర్టులకు తరలించాలనే క్లాసును బిల్లునుంచి శాసన మండలి తొలగించింది. భూమిపై స్వాధీన హక్కుల ద్వారా రైతు పునః స్వాధీనం చేసుకొనే సంవత్సరాల గడువును 12 సంవత్సరాల నుండి మూడు సంవత్సరాల మేరకే కుదించినారు.

భాటకపు పెంపు విషయంలో ప్రాంతీయ ప్రభుత్వం ప్రతిపాదించిన ప్రకారణాలను బ్రిటిష్ భారత ప్రభుత్వం అధికారులు నిశితంగా పరిశీలించినారు. అవి అసాధారణమైనవని కూడా భావించినారు. ఔథ్ ప్రాంతంలో అన్వయింపబడ్డ భాటకపు నియమాలలో ప్రభుత్వానికి అధికారాలను ఇచ్చే ప్రకరణం ఒకటి భారత ప్రభుత్వ అధికారులకు ఆసరాగా దొరికింది. దీని ప్రకారం ప్రభుత్వం ప్రత్యేక ప్రకటన ద్వారా భాటకం పెంపుగాని, దానిపై విధించిన ఆంక్షలను కాని సవరించవచ్చును. బెంగాల్ శాసన మండలిలో ఈ అంశం ప్రస్తావించినప్పుడు కొంత వ్యతిరేకత కనపడ్డా కూడా కొంత వ్యవధి పిమ్మట రాంచి మండలిలో ఈ సమస్య రాజీకి రాబడినదన్న అంశంపై మరింత చర్చ జరగలేదు. భాటకపు పెంపు పట్ల ప్రభుత్వానికి విచేచనాధికారం ఉండాలన్న అంశాన్ని డబ్ల్యూ. హెచ్. విన్సెంట్ మద్దతు చేసినాడు. అంతగా అనుభవంలేని జూనియర్ రెవిన్యూ అధికారులు ఇష్టము వచ్చిన రీతిలో భాటక వ్యవహారాలు చూసినందుకు అవకాశం వుందని, అందువల్ల ప్రభుత్వం ఖచ్చితమైన నిబంధనలను రూపొందించాలని విన్సెంట్ బలంగా అభిప్రాయపడినాడు. సాధారణంగా రెవెన్యూ

యంత్రాంగంలో ఇమిడి ఉండే ఈలోపాలను ఎత్తిచూపడం జరగదు. అయన ప్రత్యేకమైన వాదనలతో భాటకం వ్యవహారాలను చూడడానికి బలమైన అధికారాలను పొందడానికి ప్రభుత్వం ప్రయత్నించి సఫలమైంది. న్యాయ వ్యవహారాల్లో దిట్టగా ఉన్న విన్సెంట్ మేధస్సు ఈ అంశంపై మౌనంగానే ఉండిపోయింది.

ఈరకంగా 1908లో రూపొందిచబడిన చోటా నాగపూర్ కౌలుదారీ చట్టం అర్ధ శతాబ్దపు పాటు భూ సమస్యలపై జరిగిన చర్చల సారాంశ ఫలితం. బెంగాల్, సెంట్రల్ ప్రావిన్స్, పంజాబ్ కౌలుదారీ చట్టాల స్వభావిక లక్షణాలు ఎన్నో ఇందులో ఇమడ్చబడినాయి. 'స్థిరపడిన రైతు' గత యాజమాన్య హక్కుల పరిరక్షణ, చట్టబద్ధ కౌలుదారుల ఏర్పాటు వంటి అనేక అంశాలు చోటా నాగపూర్ చట్టంలో భాగంగా రూపొందించబడ్డాయి. బెంగాల్ తరహాలో ఉన్న సివిల్ కోర్టులకు ఉత్తరాది నమునాలో బలమైన రెవెన్యూ అధికారులకు ఉతం రెండూ, చోటా నాగపూర్ చట్టంలో ఉండటం గమనించ తగ్గ విషయం. ప్రత్యేకించి భూహక్కుల రక్షణల విషయంలో రెవిన్యూ అధికారులకు అప్పగించి, మిగితా సాధారణ వ్యవసాయ సంబంధాల సమస్యలను ఎట్లా ఎదురుకోవాలో తెలియ చెప్పినందువల్ల ప్రభుత్వ వర్గాల మధ్య అంతర్గత ఘర్షణలను నివారించడం వీలైంది.

చోటా నాగపూర్ కౌలుదారీ చట్టం బెంగాల్ చట్టంలోని అధ్యాయాన్ని ఒక ప్రధాన భాగంగా స్వీకరించింది. దీనివల్ల సర్వేసెటిల్‌మెంట్ కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగింది. 1908 తరువాత రెండు దశాబ్దాల కాలంలో చోటా నాగపూర్ ప్రాంతం అంతా సర్వే సెటిల్‌మెంట్ జరిగింది. సర్వేసెటిల్‌మెంట్ కార్యక్రమంల వల్ల భూయాజమాన్య ధృవీకరణ జరిగి రైతుకు భూహక్కులపై గల పట్టును తెలియచెప్పడంలో కీలక పాత్ర వహించినట్లయింది. చోటా నాగపూర్‌లోని ముండారీ కుంటూకట్టీ ప్రాంతంలో మాత్రం సర్వేవల్ల ధృవీకరించబడిన భూయాజమాన్య హక్కులే రైతుహోదాకు సంబందించిన అంతిమ ఆధారాలుగా గుర్తించ బడినాయి. ఇతర ప్రాంతాల్లో ప్రభుత్వం ఒక అధికారి ప్రకటన ద్వారా వాటిని ''అంతిమ ఆధారాలుగా'' కూడా గుర్తించే వీలున్నది.

తర్వాతి సంవత్సరాల్లో జమీందారుల నుంచి ప్రభుత్వం భూమిని స్వాధీనం చేసుకొన్న పిమ్మట ఈ నాటికి కూడా చోటా నాగపూర్ కౌలుదారీ చట్టంలో పెద్దగా మార్పులు ఎమీలేవు. ఆరకంగా రెవెన్యూ యంత్రాంగ అధికార పరిధి పెరిగినట్లే. 1908కౌలుదారీ చట్టానికి 1914,1920,1923,1929 సంవత్సరాల్లో చిన్న చిన్న సవరణలను చేసినారు. 1920వ నాటి సవరణ భూబదిలీ స్వేచ్ఛపై కొన్ని సడలింపులను చేసింది. దీని సారాంశం ఎమిటంటే, ఒకే సముదాయంలో భూములను బదిలీ చేసుకోవడానికి చట్టపరిధిని కల్పించడమే. దాదాపు

పంజాబ్ భూబదిలీ నిషేద చట్టంలో వున్న అంశాలను అన్వయించినట్లుగా ఈ చర్యలను అర్థం చేసుకోవచ్చు. కానీ 1929వనాటి సవరణ మాత్రం వివాదాస్పదమైనది. ఈ సవరణ ప్రకారం రైతుల నుండి భూమిని బొగ్గు గనుల కంపెనీలు కొనుగోలు చేసేందుకు అనుమతి లభించింది. దీని వల్ల సాధారణ సాగుదార్లు, రైతులు దెబ్బతిన్నారు. భూస్వాములు బొగ్గు కంపెనీలకు భూములను కౌలుకు ఇచ్చి సాగుదార్లను తరిమి వేసే ప్రయత్నం చేసినారు. మరొకవైపు గనుల త్రవ్వకం వల్ల భూములు పాడైపోతే తగిన పరిహారం ఇవ్వబడలేదు. 'మన్ భం' ప్రాంతంలో సర్వే జరిపిన అధికారి భూబదిలీపై ఆంక్షలను పూర్తిగా తీసివేయాలని సూచించినాడు. దీనివల్ల రైతులకు తమ భూమిపై పూర్తి విలువను పొందే వీలుంటుందని భావించినాడు. పూర్తి విలువను పొందగలిగిన రైతు మరోచోటైనా భూమిని కొనుగోలు చేసే వీలుంటుందని కూడా ఈయన భావించినాడు. కానీ ప్రభుత్వం ఈ సూచనలకు అంగీకరించలేదు. భూ బదిలీపై పూర్తి సడలింపును తిరస్కరించింది కానీ, బొగ్గు లేదా ఖనిజాలను వెలికి తీసే కంపెనీలకు భూమిని రైతులు ఇచ్చేటట్లు ప్రభుత్వం నుంచి వత్తిడి తెచ్చింది. దీనికై అధికారులు ప్రత్యేక అనుమతినిచ్చేటట్లు ప్రోత్సహించింది. ఇష్టపడని రైతులకు తగిన ధరలను డిప్యూటీ కమీషనర్ ద్వారా ఏర్పాటు చేసి ఖనిజ కంపెనీలకు భూ బదిలీ చేసుకొనే వెసులు బాటును ప్రభుత్వం కల్పిస్తూ వచ్చింది. నిజానికి ఈ విధమైన అధికారికత చోటా నాగపూర్ కౌలుదారీ చట్టంలో ఉటకించబడ లేదనీ పలువురు ప్రాంతీయ శాసన మండలి సభ్యులు అభిప్రాయ పడ్డారు. ఖనిజాల వెలికితీతకై భూమిని స్వాధీనం చేసుకొనడానికి భూసేకరణ చట్టపు అన్వయింపు సరిపోయేది. కానీ ఇది కేంద్ర శాసనం కావటం వల్ల స్థానిక సమస్యకు దీనిని వర్తింప చేయడం సాధ్యం కాక పోవడంతో కౌలుదారీ చట్టంలోని ఈ అసాధారణ అధికార వివేచనను ఉపయోగించినట్లుగా ప్రకరణాల జోడింపు చేసినారు. అప్పటికే అపరిమిత అధికారాలను కలిగివున్న రెవెన్యూ అధికారులు మరింత బలపడినారు. స్వాతంత్ర్యా నంతరం కూడా కొనసాగిన ఈ ప్రాబల్య అధికారం అధికారుల చిత్త శుద్ధికి ఒక మచ్చగా మిగిలింది. బలమైన శక్తుల ప్రయోజనాలను కాపాడటానికి గానీ, ఆపివేయడానికి గానీ ఇది ఒక సందర్భంగా మిగిలింది.

చోటా నాగపూర్ ప్రాంత వ్యవసాయ సంబంధాల్లో మరొక ముఖ్యమైన శాసనం 1929 నాటి కౌలుదార్ల భాటకపు ఖాతా చట్టంగా (Chota Nagpur Tenure holders Rent Account Act of 1929) పేర్కొనవచ్చు. ఈ చట్టం నిజానికి బ్రిటిష్ ప్రభుత్వం అభీష్టానికి వ్యతిరేకంగా ఆవిర్భవించినటువంటిది. ఆనాటికి, హజారీ బాగ్ నుండి బీహార్ ఒరిస్సా శాసన మండలిలో ప్రాతినిధ్యం వహిస్తున్న కుశాగ్ర బుద్ధిశాలి అయిన ఎస్.బి.సహమ్ ప్రవేశ పెట్టిన

ప్రైవేట్ బిల్లు ఫలితంగా ఈ చట్టం ప్రభుత్వపు ఆమోదాన్ని పొందింది. అనేక సార్లుగా ఈ బిల్లును ప్రవేశపెట్టి సాధించాలనుకున్న సహాయ ప్రయత్నాలు చివరకు సఫలం కావడం వేరే మార్గం లేక ప్రభుత్వం ఒప్పుకోవలసి వచ్చింది. భూస్వాములనుండి భూములను కౌలుకు చేస్తున్నకౌలుదారులు కొన్ని సంధర్భాల్లో సహసాగుదార్లు లేదా భాగస్వామ్య సాగుదార్లుగా వుండేవారు. భాగస్వామ్య సాగుదారు ఎవరైనా ఒక్కరు చెల్లించకపోయినా మిగితావారు చెల్లించిన అట్టి భూమిని భూస్వామి మొత్తంగా భాటకపు బకాయిల క్రింద వేరొకరికి కేటాయించడమైనా, అమ్మడమైనా చేసేవాడు, అట్లాచేయడం వల్ల కౌలుదార్లు ఇబ్బందుల పాలయ్యేవారు సహాయ్ ప్రతిపాదించిన బిల్లు మధ్య రైతువర్గానికి చెందిన ఈ సహభాగస్వామ్యదార్లకు బాగా ఉపకరించింది. ఫలితంగా, డిప్యూటీ కమీషనర్ భూస్వాములను భాగస్వామ్య సాగుదార్ల నుండి వచ్చే భాటకపు చెల్లింపులపై ప్రత్యేక ఖాతాను నిర్వహించమని సూచించేవాడు. ఈ రకంగా ప్రాబల్యం వహిస్తున్న మధ్యతరగతి ప్రయోజనాలను రక్షించడం కోసం సరియైన శాసన పరికల్పనపై ప్రభుత్వం మక్కువను కూడా చూపింది. అయితే మొత్తంగా వ్యవసాయ సంబంధాల స్వరూపంలో మధ్య తరగతి రైతు వర్గ ప్రయోజనాలు ఏస్థాయిలో ఇమిడి ఉన్నాయనేది ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి సారూప్య తేడాలు వున్నాయి. చోటా నాగపూర్ ప్రాంతంలో మధ్య తరగతి ప్రయోజనాలకు కౌలునామాను కలిగివున్న వారు ప్రతిబింబిస్తే, మరికొన్ని ప్రాంతాల్లో ఇనాందార్ లేదా అనుపాదిత రైతులు ఈ హోదాను ప్రతిబింబిస్తారు. ఒక్కమాట మాత్రం వాస్తవం. భూమికౌలుపై వచ్చే భాటకపు రాక పోకలపై మధ్య తరగతి రైతుకున్న ఆపేక్ష తీవ్రమైనది. చాల మంది భూస్వాములు కౌలు చట్టపు క్రమ పద్ధతిపై నిర్లక్ష్యాన్ని, నియంతృత్వాన్ని కలిగి వుండేవారని కూడా చెప్పవచ్చు. చోటానాగపూర్ ప్రాంతంలో వున్న రాజ్‌పుత్ రాజులు కౌలు, ఎస్టేట్ వ్యవహారాల ఆణాకాణీ వివరాలను చూడడాన్ని నిరాసక్తతను, చికాకును ప్రదర్శించేవారు. మొదటి ప్రపంచ యుద్ధానికంటే ముందే వచ్చి స్థిర పడ్డ ఖనిజాల వెలికితీత కంపెనీలకు తమ భూములను కౌలుకు ఇచ్చి అపారమైన ధన సంపత్తిని పొంది, సువిశాల భవన హర్మ్యాలను నివాసాలుగా కలిగి వున్న చోటానాగపూర్ రాజ్‌పుత్ రాజులు, జమీందారులు కూడా తాము పొందిన ఈ లబ్ధిని చిరకాలం వుంచుకోలేకపొయ్యారు. గత కాలపు ప్రాభవంలో అత్యంత విలువైన సంపన్న జీవితాన్ని అనుభవించిన తమ పొరుగు ప్రాంత బెంగాల్ జమీందారుల మాదిరిగానే అనతి కాలంలోనే ఈ ప్రాంతపు రాజుల ( చోటా నాగపూర్) భవనాల పునాదులు కూడా క్రమేపి పెకిలిపోవడం ప్రారంభమైంది.

ముగింపు అధ్యాయం

# వారసత్వం

## (The Heritage)

బ్రిటిష్ పాలనాకాలంలో అవలంబించబడిన ప్రభుత్వ విధానం భారతదేశ గ్రామాలకు కొన్ని జీవితానుభవాలను మిగిల్చింది. గ్రామీణ సమాజంలోవున్నటువంటి ప్రత్యేక ప్రయోజనాలను కాపాడడానికి అనేక దశాబ్దాల నుండి కొనసాగుతూ వచ్చిన శాసనాత్మక, కార్యనిర్వాహక పరిరక్షణా చర్యలు గ్రామీణ సమాజ నేపద్యాన్ని నిశితంగా ప్రభావితం చేసినాయి. ఈ చర్యలే మరోరకంగా, మొదటి దశలో ప్రభుత్వ ప్రాపకాన్ని, పెద్ద మొత్తంలో హక్కులను పొందగలిగిన సంపన్న భూస్వామ్యశక్తులను ఒకమేరకు బల[illegible]న పరచగలిగినాయి. అయితే ఇటువంటి చట్ట పరిమితులను బలహీనపరచడానికి అవలంబించిన మార్గాలు కూడా అనేకం. చట్టాన్ని వక్రమార్గం పట్టించే ప్రయత్నాల పట్ల, వాటి వల్ల జరిగిన దుష్ప్రయోజనాన్ని న్యాయస్థానాలు పూర్తిగా స[illegible]ంచలేకపోయినాయి. ఏమార్గాలను అవలంబించైనా సరే తమకు రాజ్యదత్తం చేసిన భూములపైనున్న పట్టును మరింత పటిష్టవంతం చేసుకోవడమే భారతదేశములో నున్న భూస్వాము[illegible]లు వంట పట్టించు కొన్న ప్రధాన లక్షణం. తమ జమీందారీ లేదా రాజ్య సంక్రమణ భూముల్లో ఈ భూస్వాములకు అడ్డూ అదుపు లేని విధమైన హక్కులున్నాయి. చట్టబద్ధ హామీలేని కౌలుదార్లపైన, ఉపకౌలుదార్లపైన పంట భాగస్థులపైన భూస్వాముల అధికారం అపరిమితంగా ఉండేది. రక్షిత కౌలుదార్ల పరిస్థితి ఒకంతమెరుగ్గా వుండేది. వీరి భూస్వామ్య అనుయాయత మాత్రమే వారి కౌలు రక్షణకు మూలంగా పనిచేసే కారకం. ఈ విధంగా భూసంస్కరణల స్వభావం భూస్వాముల నిర్దే[illegible]చిన రీతిలో కొనసాగి చిరకాలంగా కమతాలను సాగుచేస్తున్న కొంతమంది కౌలుదార్లకు మాత్రం భద్రత కలిగించే విధంగా యాజమాన్య హక్కులను సంక్రమింపచేసినారు. ఇట్లా సంక్రమింప చేసినట్టి భూమి మొత్తాన్ని భూస్వాముల స్వాధీనంలో వున్నటువంటి మొత్తం భూమి శాతంతో పోల్చి చూస్తే అది కేవలం పది శాతమే. ఇంతకంటే ఎక్కువగా భూసంస్కరణలను అమలు పరుచాలనే [illegible]యత్నం నాటి చట్ట నిర్మాణంలో విప్లవాత్మకమైన మార్పులను ప్రతిపాదించవలసి వచ్చేది. కౌలుదార్ల సాగు హక్కుయే భద్రత కల్పించడం వల్ల మరొక ధోరణి పెద్ద యెత్తున ప్రబలింది. రక్షిత కౌలుదార్ల హక్కుల సాకుగా ఆస్తిపై వచ్చే అదనపు కిరాయి ఆదాయాన్ని పొందే వడ్డీ వ్యాపారస్తులు, మధ్య తరగతి ఉద్యోగవర్గం లబ్ధిని పొందినారు. రక్షిత కౌలుదార్ల ఆధీనంలో వున్న భూమిని ఇతరులు శాశ్వత స్వాధీనంలోకి తీసుకోవడానికి విధించిన నిషేధాన్ని నీరుకార్చడానికి అనేక ఉల్లంఘన మార్గాలను ఈ వర్గాలే అవలంబిస్తూ వచ్చినాయి. మరోకవైపు

ఆధిపత్య రైతాంగ వర్గాలు తమ ఆదాయాన్ని వివిధ రకాలుగా వెచ్చించడం మొదలు పెట్టినారు. తమ సంతానాన్ని అత్యధిక విద్యాధికులుగా తయారుచేయడం కోసం, ఇతర వ్యవసాయ వర్గాలకు అప్పులుగా డబ్బును ఇవ్వడం. మరికొన్ని భూకమతాలను తమ స్వాధీనంలోకి మార్చుకోవడం కొరకు తమ డబ్బును ఆధిపత్య రైతాంగ వర్గాలు వెచ్చించినాయి. ఈ రకంగా గతంలో వున్న జమీందారీ ప్రభువులకు భూమిపై పరోక్షంగా పెట్టుబడులు పెట్టే వడ్డీ వ్యాపారం లేదా రైతాంగ స్వభావంలేని పెట్టుబడి ( ఎవరైతే ప్రత్యక్షంగా వ్యవసాయ ఉత్పాదనలో భాగంకారో) దారులకు మధ్యగా గ్రామీణ శిష్టవర్గం ఆవిర్భవిం చింది.

స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో ప్రవేశపెట్టిన భూసంస్కరణల ఫలితంగా గతంలోని బ్రిటిష పాలనా కాలంలోని జమీందార్ల ప్రయోజనాల మాదిరిగానే భూస్వాముల, ధనిక రైతుల ప్రయోజనాలు కూడా ఒక విధంగా దక్కించబడ్డాయి. పైనున్న భూకేంద్రీకరణ కొంత కుదించబడ్డది. మధ్య తరగతి రైతాంగం ఒకటి స్పష్టించబడి వారి మధ్య వైవిధ్యీకరణ (Differentiation) కూడా జరిగింది. దిగువ స్థాయి రైతాంగం నిర్లక్ష్యం చేయబడింది. 1960 నాటి సమాచార ప్రకారం గ్రామీణ వ్యవసాయరంగంలోని భూయాజమాన్యం సంపద పంపిణీ తీరు తెన్నులు ఈ సంధర్భంగా తెలుపవచ్చు. మొత్తం సాగుభూమి విస్తీర్ణంలో ఐదవ భాగం రెండు శాతం గ్రామీణ కుటుంబాల ఆధీనంలో వున్నాయి. ఇళ్లు, పరికర సామాగ్రి, ఇతరత్రా సంపదనవనరులు మొత్తంగా గుణించి అంచనావేస్తే ఈ సంపదమొత్తం గ్రామసంపదలో మూడవ వంతుగా, మరొక ఐదవ వంతు భూమి ఆరుశాతం గ్రామీణ కుటుంబాల్లో ఉండి వారొక్కకరికి ఇరవై ఎకరాల చొప్పున ఉన్నట్లుగా అంచనా వేయబడింది. మూడొంతుల భూభాగం మొత్త గ్రామీణ కుటుంబాలు ,(మొత్తం భూభాగంలో) మరొక ఐదవ భాగం భూమి 16 ఎకరాల చొప్పున 12 శాతం గ్రామ కుటుంబాల అధీనంలో వున్నట్లుగా అంచనా వేయబడింది. అంటే, ఐదింట మూడొంతుల భూభాగాన్ని మొత్తం గ్రామీణ కుటుంబాల్లోని ఐదవ వంతు జనాభా కలిగి వున్నట్లుగా అంచనావుంది. ఇక్కడి నుండి దిగువ భాగంలోకి పరిశీలిస్తే భూయాజమాన్య తీరుతెన్నులు ఆసక్తికరంగా వుంటాయి. గ్రామీణ జనాభాలోని ఐదవ భాగం కుటుంబాలు మొత్తం భూభాగంలో మరొక ఐదవవంతు భూభాగాన్ని తల ఒక్కింటికి 8 ఎకరాల భూకమతాన్ని కలిగి వున్నట్లుగా అధికారిక అంచనాలు వున్నాయి. ఈ విధమైన భూయాజమాన్యం స్పష్టంగానే సమాజంలో వేళ్ళూనుకున్న సామాజిక అన్యాయాన్ని సూచిస్తాయి. గ్రామీణ జనాభాలో వున్న మొదటి ,రెండు, ఐదు వంతుల కుటుంబాలు ఐదింట నాలుగు భాగాల భూమిని స్వాధీనంలోకి వుంచుకున్న విషయం ఈ అసమదోరణిని ప్రతిబింబిస్తూనే వుంటుంది. ఐదింట మూడువంతుల జనాభా ఎడింట ఒక వంతు భాగాన్నే ఆధారం చేసుకొనే బ్రతికే పరిస్థితి దుర్భరమైంది. అంతేగాక అదనపు ఉపాధికి, పరపతికి

అధికులైన గ్రామీణ పేదలు అల్పసంఖ్యాక ధనికులపై ఆధారపడి ఉండటం గమనించ దగ్గ విషయం. ఈ రకమైన గ్రామీణ సమాజ నేపధ్య విశ్లేషణను ఆరవ అధ్యాయంలో తెలిపిన కౌలుదారీ వర్గంలో వైవిధ్యీకరణతో పోల్చి చూస్తే మరికొన్ని అంతర్గత విశ్లేషణ అంశాలు బయటపడుతాయి.

గ్రామీణ ప్రాంతాల్లోని జనాభాలో వున్న రెండు శాతం కుటుంబాలు గతంలోని సంపన్న భూస్వామ్య, మొదటి శ్రేణి ధనిక వర్గాలకు సంబంధించిన వారు. ఈ మొదటి శ్రేణి ధనిక వర్గాలకు చెందిన ఆరుశాతం గ్రామీణ జనాభాలో వుంటే, మిగితా 12 శాతం గతంలో హక్కు కలిగిన కౌలుదార్లుగా వున్నారు. వీరే రెండవ, మూడవ శ్రేణి సామాజిక స్థాయి కలిగి దాదాపుగా చట్టబద్ధమైన కౌలు భద్రతను కలిగి వుండేవారు. మిగితా 20 శాతం కుటుంబాలు గ్రామీణా జనాభాలో భాగమై 20 శాతం భూమిని కలిగి వుంటారు. వీరు సాధారణ కౌలుదార్ల హోదాను పొందుతూ నామ మాత్రపు పరిధిలో బ్రతికేటువంటివారు. వీరు వ్యవసాయ సామాజిక క్రమ శ్రేణిలో నాలుగవ శ్రేణికి చెందుతారు. మిగితావారు అత్యధిక శాతం వారు తమ భూములను కోల్పోయిన వాళ్ళు, అప్పులకు గురి అయినవాళ్ళు . భూకమతాల విభజన తరాల వారీగా జరిగి జీవనోపాధి దుర్భరమై మొత్తం భూభాగంలో ఒకింట వంతులో మాత్రమే బ్రతుకును వెళ్ళదీస్తున్నటువంటివారు. ఈ విధమైన సామాజిక హోదాకు కుటుంబాలకున్న ఆర్థిక స్థితిగతులకు, ప్రస్తుతం ఆయాకుటుంబాలకు' చెందిన రూపాంతరస్థితికి వున్న సహసంబంధ విశ్లేషణ, మదించిన సమాచారం ఇంకా రావలసి వుంది. అందువల్లపైన సూచించిన గణాంకాల, శాతాల సూక్ష్మ వివరణ ప్రతి పాదికలు ఈ అంశంపై చేపట్టబోయే సమాజ శాస్త్ర పరిశోధన ప్రణాళికకు ఉపకరించే అంశం.

పైన తెలిపిన గ్రామీణ సమాజ నిర్మాణం శిఖర రూపంలో ఉండేటువంటి ఒక క్రమ శ్రేణి స్వభావం కలిగివున్నటు వంటిది. దిగువ మట్టంలో వున్న జనాభా అంతకూడా దుర్భర సామాజిక స్థితిని కలిగి వుండడం స్పష్టంగా కనిపించే విషయం. అదుపు లేని స్థాయిలో, అసంఖ్యాకమైన భద్రత లేని కౌలుదార్లమీద పెత్తనం చేలాయించిన నివాసేతర భూస్వామ్యం పై విధమైన వర్గీకృత గ్రామీణ సమాజంలోవున్న అసమసంబంధాల ప్రతిఫలమే. మరొక విధంగా ఈ వ్యవసాయ వర్గాల వునికిని ఒక నమూనా పరిణామాన్ని తెలపాలంటే, మహోన్నత సాంచీ స్థూపాకార స్వభావాన్ని కలిగి వుండేటువంటింది. ఈ నిర్మాణం సులువుగా అవగాహన శక్యం కానీ పరివర్తన చెందుతున్న రూప, గుణ స్వభావాన్ని కలిగివుండేటువంటిది కూడా. గుండ్రటి ఆకారంగా వుండి అంచలంచెలుగా అసమదశలను సూచించే స్థూపాకారం కానీ, శిఖరరూపంలో వుండే స్వల్ప సంఖ్య శిఖర భాగాన వుండి ఈ దిగువ అంచెలలో అధిక మౌతున్న ఆకార ఆకృతిబట్టి నిర్మాణంలో స్థాయి భేదం మారిన కొద్ది సమాజంలో కూడా క్రమేపి

పెరిగే గ్రామీణ పేదల సంఖ్య పెరగడాన్ని, ప్రాంతీయ వైవిధ్యాల్ని సంకేత రూపంలో విశ్లేషించి అర్థం చేసుకోవచ్చు. విశాలమైన భూభాగాన్ని కలిగివున్న స్థూపాస్థలాకృతి (plat form) రైత్వారీ ప్రాంతాల్లో వున్న ఉపకౌలుదార్ల, వ్యవసాయకూలీల సముదాయంతో పోల్చవచ్చు. శాశ్వత భూమిశిస్తు విధానం ఏర్పాటు చేసిన ప్రాంతాలలో శిఖర రూపేణా అల్ప సంఖ్యాకంగా వున్న భూస్వాములు వుండి, అట్టడుగు స్థాయిలో అవ్యుతమైన విశాల రూపం మాదిరిగా అత్యధికంగా భాగస్వామ్య రైతులు వున్న వ్యవసాయ నిర్మాణం ఏర్పాటు అయింది. యునైటెడ్ ప్రావిన్స్‌లో రెండు భిన్నమైన నమూనాలు వున్నాయి. ఔధ్ ప్రాంతంలో వున్న దిగువ స్థాయి వ్యవసాయరంగం అత్యధికంగా నిరుపేదరైతుకూలీల సమూహమే. ఆగ్రా ప్రాంతంలో దిగువ, మధ్య స్థాయిలలో రైతుల, కూలీల సంఖ్య గణనీయంగా వుండి శిఖర రూపంలో మాత్రం భూస్వామ్య వ్యవస్థ ఒక స్థాయిలో ఉనికిని ఏర్పర్చుకున్నది. అట్లాగే కేంద్ర ప్రావిన్స్‌లో వున్న సాంఘీక నిర్మాణం ఒక సాధారణ శిఖరం నమూనా అయితే, అవిభాజ్య పంజాబ్ మాత్రం శిఖరానికి అత్యున్నత రూపంలో వుండే స్వల్ప ఆకారం మాదిరిగా అతిపెద్ద భూస్వాములు సామాజిక వ్యవస్థను నియంత్రించ గలిగేవారు. శిఖర రూపేణా కొనసాగిన భూస్వామ్యాన్ని ఆరంభంలో బ్రిటిష్ వారు బలపరిచే యత్నం చేసి తదుపరి కాలంలో మాత్రం శిఖరంలోని పైభాగాన్ని కేంద్రీకృత భూస్వామ్య సంపద అధికారానికి చిహ్నంగా భావించి వాటిని కుదించే ప్రయత్నం చేసినారు. శిఖరస్థాయి భూస్వామ్యాన్ని చిదిమివేసే ప్రయత్నాలు చేసినప్పటికి కొద్ది గొప్ప తేడాలతో మధ్య, దిగువ రైతాంగ స్థాయిలు మాత్రం అలాగే కొనసాగినాయి. భారతీయ రాజకీయ జీవనం, ఎదుగుదల క్రమం, ఈ విధమైనసమాజంలో ఉండే, వ్యవసాయ సంబంధాల ప్రాంతీయ వైవిధ్యాలనేపథ్యంలో నుండే ఆవిర్భవించినటువంటిదీ.

**సామాజిక నిర్మాణం – రాజకీయ వ్యవస్థ**

భారత దేశంలో రాజకీయ జీవిత ప్రక్రియ వృద్ధి చెందడానికి ముందు ఒక ముఖ్యమైన అంశాన్ని గమనంలో వుంచుకోవాలి. భారతదేశ రాజకీయ ప్రక్రియ ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల్లో వున్న సంపద నుండి ఉత్పన్నమైన అద్దె రూపంలో వున్న ఆర్థిక మిగులు ( భాటకం) (rent) ను వివిధ మధ్యంతర మార్గాల ద్వారా పొందే లబ్ధిదారులుగా వున్నట్టి నగర నివాస విద్యావంత మధ్యతరగతి వర్గం యొక్క ప్రయోజనాలకు వ్యక్తీకరణంగా ఎక్కువగా మల్చబడి నటువంటిది. గ్రామీణ సంపద నుండి వచ్చే అదనపు ఆర్థిక మిగులు (rent) ఆసరాగా తమ గ్రామీణ సమాజ నేపథ్యానికి నగర విద్యావంత స్వభావాన్ని ఒకటి రెండు తరాల్లో అన్వయించుకోగలిగినారు. ఈ పరివర్తనా క్రమం ప్రత్యేకించి మరి బాంబే, మద్రాస్ నగరాల్లో కనిపిస్తుంది. ఇదే క్రమం ఒక చిన్న ఇనాందారో లేక గ్రామీణస్థాయిలోని పట్వారోతమ తమ కుటుంబాల నుంచి కనీసం ఒక సభ్యుడినైనా నగర ప్రాంత వృత్తుల్లో స్థిరపడేటానికి కావలసిన

సదుపాయాలను ఏర్పరిచింది. అయితే ఈ రెండు నగరాల్లో స్థిరపడ్డ కుటుంబాలకు దీర్ఘకాలికంగా నగర కుటుంబ పోషణకు పూర్తిగా గ్రామ సంబంధ ఆధారమైన ఆర్థిక మిగులు సరిపోయ్యేదా! అన్న విషయంలోతూగా ఆలోచించేటువంటిది. కలకత్తా, ఉత్తరాధి భారతదేశ నగరాల్లో పరిస్థితి భిన్నమైంది. ఈ ప్రాంతాల్లోని గ్రామాల్లో ఉండే భూయాజమాన్య చట్ట స్వభావం వారసత్వ అధీనభూములవల్ల భూస్వామ్య కుటుంబాలకు అదనపు ఆదాయాన్ని అందచేయడానికి అనువుగా ఉండేది. నగరాల్లో స్థిరపడ్డ ఆయా గ్రామీణ భూస్వామ్య రెండో లేదా మూడో తరం కుటుంబాల పోషణకు గానీ, నగరాల్లో భూములను కొనడానికి గానీ సరిపోయేంతగా వుండేది. అందువల్లనే ఈ ప్రాంతాల్లో విద్యావంతులైన నగర మధ్య తరగతి వర్గం తమ తమ సంబంధిత గ్రామాల్లో వుండే పూర్వీకుల ఆస్థి, కుటుంబాలతో పెనవేసుకొన్న ప్రయోజన సంబంధాన్ని కలిగుండే వారు. ఈ కుటుంబాల ఆస్థి ప్రయోజనాల పరిరక్షణను పెద్ద యెత్తున చట్ట సభల్లో మద్దతు చేసేవారు. ప్రయోజనాల రక్షణకు ఎటువంటి ప్రత్యక్ష రాజకీయ చర్య కన్నా చట్టసభలే పరిరక్షణాకవచాలుగా పనిచేసేవి. ఫలితంగా పై వర్గం తమకున్నటువంటి జీవన విధానాన్ని పూర్తిగా నాగరీకరించ లేదు. అట్లాగని పూర్తిగా భూసంపద ఆదాయాన్ని తీసివేసుకోవాలనే కోరికలేదు. పైగా తాము గురి అయిన అధునీకరించబడ్డ నగర రాజకీయ ప్రక్రియలను గ్రామ ప్రాంతాల్లోకి ప్రవేశ పెట్టడం నిజమైన పూర్తి ఆసక్తిని వీరు కనపరచలేదు. ఎంతేకాక 1930 వరకు కొనసాగిన పరిమిత వయోజన వోటింగ్ గ్రామీణ భారతదేశంలో పెద్దయెత్తున రాజ్యాంగయుత రాజకీయాల ప్రవేశానికి అడ్డుకట్ట వేసింది. గాంధీ చేపట్టినటువంటి ఆందోళనా రాజకీయాల ఫలితంగా గ్రామీణ సమాజ అధికార పునాదిని సరళీకరించుకోవడానికి ఊతంగా పనిచేసినాయని తెలుపాలి. అయినప్పటికీ, బ్రిటిష్ వారు ప్రవేశపెట్టిన రాజ్యాంగయుత సంస్కరణలపట్ల గాంధీ తన అంగీకారాన్ని వ్యక్త పరచలేదు. అయితే గాంధీ చేపట్టిన ఆందోళనా రాజకీయాలు బ్రిటిష్ వారు చేపట్టిన వయోజన ఓటింగ్ విధాన పరిధిని విస్తృతం చేసే చర్యలకు వత్తిడి తెచ్చేవిగా మారినవి. తదనంతర దశల్లో భారత జాతీయ కాంగ్రెసుకు రాజ్యాంగ పరిధిని కూడా పెద్దయెత్తున వినియోగించుకోవడానికి బ్రిటిష్ పాలనా కాలంనాటి రాజ్యాంగ సంస్కరణలు కావలసిన సందర్భాన్ని అందించినాయి.

నిజానికి, మొదట్లో ఆందోళన స్వభావం కలిగిన రాజకీయాలు గ్రామీణ భారతంలో వ్యాప్తి కావడానికి కావలసిన అవకాశాలు పరిమితంగా ఉండేవి. ఎందుకంటే బ్రిటిష్ వారు అవలంబించిన రెవెన్యూ, సాంఘిక నిర్మాణ చర్యల వల్ల పరిగణించదగ్గ స్థాయిలో కౌలుదార్లను సంతృప్తిపరిచే ప్రయత్నం చేసినారు. మరోకవైపు భూస్వాముల, సామంత ప్రభువుల సామాజిక హోదా, స్థితిని సూత్రప్రాయంగా గుర్తిస్తూనే పరిరక్షించినారు. చేపట్టిన భూరెవిన్యూ విధానంవల్ల ఏర్పడిన వ్యవసాయ సదుపాయల వల్లగానీ ఒక మేరకు భూమిశిస్తు కట్టడంతో మొట్ట మొదటి

పాలనాటి బ్రిటిష్ పాలనకన్న మెరుగైన పరిస్థితిని రైతులు అనుభవించేటట్లు చూసినారు, కొన్ని సార్లు అకస్మాత్తుగా సంభవించిన ధరల అనిశ్చిత వల్ల జరిగే కృంగుబాటు వ్యవసాయ సంబంధాలను తల క్రిందులుగా చేసేది. ఇటువంటి పరిస్థితులలో బ్రిటిష్ ప్రభుత్వం శీఘ్రంగా అవసరమైతే రాజ్య ఖజానా కవసరమయ్యే ఆదాయాలను తాత్కాలికంగా మాఫీ చెయ్యకపోతే, ప్రజలకు అందవలసినవి కొంతమేరకు అందచేయడము జరగకపోతే రైతుల నుంచి పెద్దయెత్తున అశాంతి ఎదురయ్యేది. కానీ భూస్వాములు, ప్రభువులు, బ్రిటిష్ రాజ్య ఖజానకు అందచేసే మూల్యం కొరకు అద్దె సొమ్ము (rent) విషయంలో ప్రభుత్వం అంతగా వారిని వత్తిడికి, సక్తు చేయడంగానీ లేకుండెడిది. ఎందుకంటే ఆర్థిక ద్రవ్యోల్బణ కాలంలో ప్రభువులకే ఈ అద్దె సొమ్ము అత్యవసర వినియోగ అవసరంగా ఉండేది. ఫలితంగా రైత్వారీ పద్ధతిని అవలంభించని అన్ని ప్రాంతాలలో వ్యవసాయ అశాంతికి అపారమైన అవకాశాలు ఏర్పడినాయి. యునైటెడ్ ప్రావిన్స్‌లోని వాయువ్య డివిజన్‌లోనీ, ఔథ్ ప్రాంతాల్లోనూ వ్యవసాయ అశాంతికి కారణాలుండినాయి. శాశ్వత శిస్తు విధానం అమలులో వున్నచోట ఉప భూస్వామ్యీకరణ కొంత ఉపశమనంగా పని చేసింది. అయితే బీహార్‌లోని కొన్ని ప్రాంతాలు, యునైటెడ్ ప్రావిన్స్‌లోని వాయువ్య ప్రాంతాలు రెండు కూడా వ్యవసాయంలో గాంధీ చేపట్టిన ఉద్యమ ప్రచారంలో ఒకరకంగా నేపథ్య ప్రాంతాలుగా కూడా పనిచేసినాయి. 1920,1930లలో కూడా వున్న వ్యవసాయ అశాంతికి కారణం పడిపోయిన వ్యవసాయోత్పత్తుల ధరలు పడిపోవడానికి మొదటి సారియుద్ధం కారణమైతే రెండవ సారి తీవ్రమైన ఆర్థిక మాంద్యం కారణాలుగా చెప్పవచ్చు. ధరలు పడిపోవడం వల్ల అత్యధికంగా ఈ కాలాల్లో అశాంతికిలోనైన వాళ్లుగా గ్రామీణ, పేదల కన్నా కౌలుదారీ వర్గమే ఎక్కువ. ఈ వ్యవసాయ వర్గమే అటుతమ ఉత్పత్తులకు ధరలభించక చెల్లించవలసిన అద్దెసొమ్ము చెల్లించలేక నలిగి అశాంతికి ఉద్యుక్తులైనారు. అనుకూలమైన రీతిలో అశాంతితో కూడుకొన్న వ్యవసాయ రంగం ఉండడంతో బ్రిటిష్‌వారు అవలంభించిన సమాజ పాలనా నైఖరి తేటతెల్లంకావడం జాతీయ కాంగ్రెసు శ్రేణుల లభ్యం రక్షిత కౌలుదార్ల వర్గం నుంచి అధికంగా లభ్యమౌతూ వచ్చింది. ఈ రకమైన మద్దతు కాంగ్రెసుకు ఉత్తరాదిలోవున్న కొన్ని ప్రాంతాలు మినహా మిగితా నాటికి లభ్యంకాలేదు. ఉదాహరణకు బొంబే ప్రెసిడెన్సీ (పాలిత ప్రాంతం)లో 1930 దాకా స్వాతంత్ర్యోద్యమ ప్రచారం, జాతీయోద్యమ ఆరాటం అంతకూడా అధికంగా నగర కేంద్రీకృత వ్యాపార వర్గాల దక్కన్ పట్టణాలలోని బ్రాహ్మణ మధ్య తరగతి వర్గాల అభివ్యక్తీకరణగా మిగిలిపోయింది. మద్రాస్ రాష్ట్రంలో వచ్చిన ''బ్రాహ్మణేతర ఉద్యమం'' వల్ల జమీందారు రైతుల, మధ్య ఏర్పడిన 'అపవిత్ర కూటమికి' పునాదులను ఏర్పరచింది. బెంగాల్ మాత్రం చాలా కాలం వరకు ఒంటరిగా ఉంటూ తనకున్న బహుళమైన ప్రత్యేకమైన, ప్రాంతపరమైన ప్రయోజనాలను

సమతౌల్యీకరించుకొంటు వచ్చింది. బెంగాల్‌లో అత్యధికులు హిందూ జమీందారులు, భూస్వాములు. తూర్పు బెంగాల్‌లో అత్యధికులు కౌలుదార్లు. వీరిలో ఎక్కువ శాతం ముస్లిలుంటే, గ్రామీణ బెంగాల్ ముస్లింల నుండి నాయకత్వం అవకాశాలు తక్కువగా ఉండి కలకత్తా నగర ముస్లింలనుండి వీరికి ప్రాతినిధ్యం లభించేది. నాయకత్వం ప్రధానంగా ఉత్తరాధి ప్రాంతాల నుండి వున్నటువంటి ముస్లిం నాయుకుల చేతుల్లో ఉండేది. హిందూ రాజకీయ నాయకత్వం మాత్రం విడిపోయి వుండేడిది. కొంత మంది జమీందార్ వర్గానికి ప్రాతినిధ్యం వహించేవారు. మరి కొంతమంది కౌలుదారు రైతుల శ్రేణుల నుంచి వచ్చినటు వంటివారు. అయితే ఇరుపక్షాలు కూడా అప్పుడప్పుడు ఐక్యమయ్యేవి. హిందూనిమ్న కులాలకు, మెజారిటీ ముస్లింలకిచ్చే మినహాయింపులను నిరోధించడానికి పై ఐక్యత ప్రధానంగా పనిచేస్తూ వచ్చేది. దీని వల్ల బెంగాల్‌లోని ప్రాదేశిక రాజకీయాల్లో వీరు పూర్తిగా తలమునకలయ్యేవారు. అంతేగాక బెంగాల్‌కు అవలగా వున్న రాజకీయ విజ్ఞులకు ఈ ప్రాదేశిక రాజకీయాల స్వరూపం పట్ల పూర్తి అవగాహన లేదని కూడ విశ్వసించేవారు. పంజాబ్‌లో కూడా ఇదే పరిస్థితి. ఇక్కడ జాతీయోద్యమ భావాలు ప్రధానంగా నగర హిందూ మధ్య తరగతి వర్గం ద్వారా వ్యాప్తి చేయబడ్డాయి. వీరికి రైతాంగ నేపథ్యం కన్నా వ్యాపార ఆసక్తుల పరిరక్షణే ముఖ్యం. బ్రిటిష్ వారు ప్రవేశపెట్టిన, భూపరాయికరణం నిరోధక చట్టం వల్ల ఈ హిందూ నగర వ్యాపార వర్గాలను అదుపులో వుంచినట్లైంది. ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వం చర్యల పట్ల నిరసన నిక్షప్తమవుతు వచ్చింది. దానికి జాతీయోద్యమ సందర్భంలో వైరం. తూర్పు పంజాబ్‌లో హిందూ జాట్‌లని మినహాయిస్తే పంజాబ్‌లో యాజమాన్య రైతాంగం కానీ రక్షిత కౌలుదార్లుగానీ అత్యధికంగా సిక్కులు, ముస్లిములే. దీని వల్ల ఉపాయశాలిగా వున్న ముస్లిం నాయకత్వం అటు భూయాజమాన్య ప్రయోజనాలున్న హిందూ జాట్‌లకు ముస్లిం భూవర్గాల మధ్య సయోధ్యకుదిర్చి యూనియనిస్ట్ పార్టీ క్రిందకు తీసుకొని వచ్చి నగర హిందూ నాయకత్వాన్ని రాజకీయాధికారానికి దూరంగా వుంచే ప్రయత్నం చేసింది. రాజ్యాంగ సంస్కరణల ద్వారా **1935** నాటికి ప్రాదేశిక స్వయం ప్రతిపత్తి అందించేవరదాకా రాజకీయ స్వరూప మార్పుల పరంపరను విశ్లేషించే లక్ష్యాన్ని ప్రస్తుత అధ్యయనం కొనసాగించింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం వివిధ ప్రావిన్స్‌లలో రాష్ట్రాలలో ఏర్పడిన కాంగ్రెసు మంత్రిత్వాల వల్ల కీలకమైన రాజకీయ పరివర్తన చోటు చేసుకొన్నది. ఇటువంటి కీలకమైన మార్పులలో ముఖ్యమైనది ఏమిటంటే ఆయా ప్రాంతాలవారీగా వున్న ప్రాబల్య రైతాంగ కుటుంబాల్లో వున్న విద్యావంతులు చట్టసభల్లోకి ప్రవేశించగలగడమే. గ్రామీణాసక్తజన రాజకీయ వర్గంగా గతంలో ప్రస్తావించింది వీరినే. సంప్రదాయకంగా విద్యను జీవనాధార మార్గంగా ఎంచుకొని పాలనాపరమైన, వాణిజ్యపరమైన 'పౌరోహిత్య' స్వభావం కలిగిన నియమాకాల్లో

ప్రాతినిధ్యం పొందగలిగిన ఉన్నతకులాల విద్యావంతులకు పైన తెలిపిన గ్రామీణ శిష్టజన వర్గానికి తేడా వుంది. మొట్టమొదటి సారిగా బ్రిటిష్ న్యాయవ్యవస్థ, కోర్టుల నిర్వహణవల్ల అందించబడే సానుకూల ప్రయోజనాల లబ్ధిని, అందులో ఇమిడి వున్న సారాంశాన్ని గ్రామీణ ధనిక వర్గం రుచి చూసేందుకు ఉన్నత విద్య మంచి సాధనంగా ఉపకరించింది. అనేక చట్ట విషయాలను చదివి, రాసి, పరిస్థితిని ఆకళింపు చేసుకోనేందుకు పౌర, న్యాయ, నిర్మాణాల నడవడిని తెలుసుకోగలిగే కొడుకులను తయారు చేసుకోవడంలో కౌలుదార్లనీ, రక్షిత రైతాంగం ఎక్కువ అవసరాన్ని చూపినారు. పొలాలను దున్నేందుకు సహాయపడే సంతానం కన్నా ఇటువంటి లోకజ్ఞానం, పాలక విషయాల అవగాహనవుండే తరం అవసరం మరింత అధికమైంది తెప్పలుగా వచ్చిన వ్యవసాయ సంస్కరణ శాసనాల రూపకల్పన తరువాత ఈ రైతాంగ కుటుంబాల్లో రెండవ, మూడవ తరం వారు న్యాయవాదులుగా స్థిరపడడం, వారే తర్వాత కాలంలో రాజకీయాధికార చట్రంలో భాగస్వాములు కావడం తరుచుగా జరిగినటువంటి విషయం. ఇటువంటి వారే గ్రామీణ భారత దేశంలో పునాదులను కలిగివున్నారు. గతంలో జాతీయవాదులు ఎక్కువ శాతం నగర ప్రాంతాల్లో పునాదిని కలిగి వున్నారు, గ్రామీణ భారతాన్ని ప్రాతినిధ్యం వహించేందుకు సిద్ధపడినా బ్రిటిష్ పాలకులు దీనికి అంగీకరించలేదు.

రైతాంగం నుండి వచ్చిన విద్యావంతుల సంఖ్య రాజకీయాల్లో పెరుగుతూ ఉండడం వల్ల ఒక రకంగా రాజకీయాల్లో మితవాద భావజాల ప్రభావం కూడా అధికమౌతూ వచ్చింది. వీరిలో ప్రగతి శీల ప్రభావం కూడా అధికమౌతూవచ్చింది. అయితే వీరిలో ప్రగతి శీలవాదం తమపై సంపన్న ప్రభువుల పీడనను ఎదిరించడం వరకే పరిమితమై వుంది. వీరు తమ ప్రయోజనాలను మాత్రం చాల జాగ్రత్తగా కాపాడుకునేవారు. కొంత మంది ఉన్నతకులాల కుటుంబాల వారు రాడికల్ రాజకీయాలపట్ల మొగ్గుచూపినారే తప్ప పరావర్తన ఫలితంగా వచ్చిన సంపన్న వర్గ ప్రతినిధులు మాత్రం దూరంగా వుండిపోయారు. మితవాద రాజకీయాలకు ప్రతీకగా ఇటువంటి. ఆవిర్భావ కుటుంబాల నేపధ్యం నుంచి గుజరాత్ నుంచి వచ్చినటువంటి విశిష్టమైన రాజకీయ వ్యక్తి వల్లభాయిపటేల్, ఇటువంటి వారే జిల్లా ప్రాంతీయ కాంగ్రెస్ కమిటీలల్లో ప్రముఖ పాత్ర వహిస్తూ క్రమోపి జాతీయ కాంగ్రెస్‌లో కీలకమైన స్థానాన్ని అధిరోహించగలిగినారు.

రాజకీయాధికారం ధనిక రైతుల చేతుల్లోకి రావడం వల్లనే భూమిని దున్నే రైతులకు హక్కు పరమైన న్యాయం అందించడంలోనూ, భూవనరుల పునఃపంపిణీ కార్యక్రమాలను నిర్వహించడంలోనూ, భూకమతాలపై పరిమితులను విధించడంలోనూ స్వాతంత్ర్యనంతరం భారత ప్రభుత్వం తీవ్రమైన ఆటంకులను ఎదుర్కొన్నది. మొట్టమొదటగా భూసంస్కరణల రూపకల్పనలోనే ధనిక రైతు ప్రయోజనాలు పదిలపరచబడ్డాయి. గరిష్ట భూకమతాల పరిమితి

స్థాయి హెచ్చుగా ఉండటం ద్వారా ఈ ప్రయోజనం నెరవేరింది. అట్లాగే ఎన్నోరకాల వంకర మార్గాలను, దొడ్డి దారులను భూసంస్కరణల చట్టం రూపకల్పనలోనూ, అమలులోనూ కనిపిస్తాయి. కుటుంబ సభ్యుల వారీగా కమతాల విభజన చేసి భూకమతాల ఆంక్షల పరిధిల్లోకి రాకుండా ధనికరైతులు చూడగలిగినారు. అట్లాగే, భూములను ఉపకౌలుకు సాగుకు ఇవ్వడాన్ని నిరోదిస్తూ చేసిన నిషేదం ఒక రకంగా చిన్న సాగుదార్లకు తలనొప్పిని ఏర్పర్చింది. జీవనోపాది కష్టమై వేరే ప్రాంతాలకు వెళ్ళాలనుకునే వాళ్ళకు ఉన్న చిన్న కమతాల సాగుకు ఆర్థికపరంగా భారం కావడంతో దానిని సాగు చేసుకోవడమే ఒక సమస్య అయింది. కనీసం పొరుగువారికి అప్పగించి మళ్లీ వచ్చేదాకా తిరిగి పొందే వసతిని భూసంస్కరణల చట్టంలోని ప్రకరణాలను నిరోధించినట్లయింది. వ్యక్తిగతసాగు (personal cultivation) నెపం క్రింద అనేక మంది ఆధీనసాగుదార్ల ద్వారా పెద్ద భూకమతాలను తమ అజమాయిషీలో ధనిక రైతులు ఉంచుకో గలిగినారు. ఈ ఆధీనసాగుదారులు (dependent cultivators) తమ యాజమానులను న్యాయస్థానాల్లో ప్రశ్నించే అవకాశముండదు. జీవనభద్రత భయంవల్ల ఎవ్వరూ ఈ పనికి సాహసించరు. ఉపకౌలు పద్ధతిపై విధించిన నిషేదం, పై విధంగా ఏరకమైన చట్ట సవరణ లేకుండానే ధనిక రైతు ప్రయోజనాలను పరిరక్షించే వ్యవసాయ సంబంధాలను ముందుకు తెచ్చింది.

రాజకీయ జీవితంలో ధనిక రైతు ప్రాతినిధ్యంలో భారత దేశ రాజకీయ వ్యవస్థ గణించదగ్గ స్థాయిలో స్థిరీకరింపబడ్డది. అత్యధిక శాతం ఓటర్లను గ్రామీణ శిష్టజన వర్గం తన నియంత్రణలో వుంచుకొన్నది. ఈ నియంత్రణా క్రమంలో ప్రత్యేకత ఏమిటంటే ఆధీనరైతుపై కేవలం అధికార చెలాయింపు శిష్టజన వర్గమే చెలాయించదు. మరొకవైపు నుంచి పేద రైతు కూడా గ్రామీణ శిష్టజన వర్గంతోనే ఏకీభావగుర్తింపుకు ప్రాధాన్యత నివ్వడం వల్ల ఈ నియంత్రణ పట్టు సులభమౌతుంది. వీరు గ్రామీణ శ్రామిక వర్గంలో సంఘీభావాన్ని ప్రకటించక పోవడం తరుచుగా కనిపించే అంశం కూడా. గ్రామీణ ధనికుల పట్ల ఏకీభావంపై పేదలు మొగ్గు చూపడానికి గత జీవ నిర్ణాయక (biological determinant) స్థితిని మూలకంగా భావించ వచ్చు. అంతేగాక , ఈ సంఘీభావ ప్రకటన సులభతరం కావడంలో చట్ట వ్యవస్థ నిర్ణయాత్మకమైన పాత్రను పోషించింది. ప్రతి రైతు కూడా తన హక్కులకుండే చట్టపరమైన భద్రత దాదాపుగా వివిధ వర్గాలకు కూడా ,అదే సమానమైన హోదాను సంప్రాదాయంపై పనిచేస్తుంది కనుక ఇతరరైతాంగవర్గాల కుండే హోదాలో చిన్నరైతులకు దృక్పధరీత్య విభేదాలను పెద్దగా పాటించడానిక్టిష్టపడరు. స్పష్టంగా చూస్తే 'రైతు' కుండే సాధారణ చట్ట భద్రతరైతాంగాన్ని సామాజిక పరంగా ఏక సముదాయంగా మల్చడానికి సంఘీ భావ సాధనంగా ఉపయోగపడ్డది ఈ రకంగా బ్రిటిష్ భారత పాలనా కాలంలో విదేశీ పాలనను సుస్థిరం చేయడానికి ఉపకరించిన చట్ట స్వభావమే తదనంతర పాలకులకు కూడా చక్కగా ఉపకరించింది.

## వ్యవసాయ రంగం - ఆర్థికాభివృద్ధి

బ్రిటిష్ భారత దేశ పాలనా కాలంనాటి వ్యవసాయ శాసన స్వభావం ప్రధానంగా ఆర్థిక పెరుగుదలను సాధించేదాని కన్న రాజకీయ దృక్పథం కలిగివున్నటు వంటిది. (రాజకీయ దృక్పథం అంటే అవిచ్ఛిన్నమైన రాజ్యపాలనను కొనసాగించే ప్రయోజనం ఇమిడి ఉండడం అని అర్థం చేసుకోవాలి . భూకమతాలపై విధించిన అంక్షలు తప్పిస్తే ఇదే స్వభావ దృష్టిని స్వాతంత్ర్యానంతర వ్యవసాయ సంస్కరణ శాసనాల్లోనూ చూడవచ్చు. జనాభా వత్తిడి, ప్రత్యేక ప్రయోజనాలను పరిరక్షించడం వంటి అంశాల వల్ల రూపొందించిన భూకమతాల వర్గీకరణ ఉత్పత్తులను ఇతోధికం చేసేందుకు దోహదపడేటట్టుగా పనిచేయలేదు. అందువల్ల పెరుగుతున్న నగర పారిశ్రామికీకరణ అవసరాలు తీరడం కూడా జరుగలేదు. చాలా తక్కువ సంఖ్యలో భూకమతాలు సరి అయినరీతిలో గరిష్ట ప్రయోజనకారిగా సాగుచేయగల సమర్థవంతంగా వ్యవసాయ మిగులును మార్కెటు చేయగల వారి చేతుల్లో ఉండటం కూడా ఈ సందర్భంలో గమనించాలి. దేశ జనాభాలో 60% మంది ఐదింట ఒక శాతం భూమనురులను మాత్రమే కలిగి ఉండటం మూలాన అదనపు వ్యవసాయ ఉత్పాదితాన్ని తెచ్చేందుకు అవకాశం లేకుండా పోయింది. ఇటువంటి చిన్న కమతాలను కలిగిన వారిని కనీస జీవన సాగుదారులుగా పిలువడం సమంజసం. వారికి తమ కమతాలపై పూర్తిగా దృష్టిని, శ్రమను కేంద్రీకరించే వసతిగానీ, వనరుగానీ లేవు. పూర్తిగా తమకుండే సృజనాత్మక శక్తిని వినియోగించే అవకాశమూ ఎట్లాగు లేదు. ఫలితంగా తాము జీవించేందుకు ప్రత్యమ్నాయ ఏర్పాట్లను ఈ రైతు వర్గాలు చూసుకోగల్గాలి. అంతేగాక తాము చేస్తున్న పని స్వభావం కూడా యాజమాన్య వర్గాలకు అనుకూలంగా ఉన్నాయా లేదా అన్న విషయాన్ని కూడా గణనలోకి తీసుకొనే అంశంగా చూడాలి.

మరొకవైపు ప్రభుత్వం చౌకగా సరకులను అందించడానికై సంకల్పంగానే వ్యవసాయ ధరలను నొక్కి పెట్టి చౌకగా ఆహారాన్ని అందించే ప్రయత్నాలను చేపట్టింది. ఇంగ్లాండులాంటి దేశాల్లో కూడా ఆహార ఉత్పత్తుల కరువు కాలాల్లో విదేశీ దిగుమతులు చేసుకొనేటప్పుడు ఇటువంటి 'చౌక ఆహారపు' అందించే ఏర్పాటు ఉండేది. ఇటువంటి ఏర్పాటు ఇంగ్లాండు వ్యవసాయ రంగం పోటీ స్వభావాన్ని పొంది ఆధునీకరణ, ప్రత్యేకీకరణ పొందడానికి ఉపయోగపడితే, భారత దేశంలోని ''గోదాముల రుణం'' మాత్రం వ్యవసాయ రంగాన్ని స్తబ్ధు చేసింది. పునరావృతమైన కరువులు సంభవించడం వర్షాలు లేక పోవడం వల్ల వ్యవసాయ రంగం తీవ్రంగా దెబ్బతినడం వల్ల అరుదైన ఉత్పత్తులకు ధరలు ఆకాశాన్నంటే స్థితి ఏర్పడడంతో వ్యవసాయ ధరల విధానం సరళతరమౌతూ వచ్చింది. ఈ విధంగా అనూహ్యమైన రీతిలో పంట ధరలు పెరగడం, కొన్ని ప్రాంతాల్లో దిగుబడులు అధికంకావడాన్ని బట్టి అస్పష్టంగా

సస్యవిప్లవంలో కేవలం పదిశాతం కుటుంబాలు మాత్రమే పాల్గొన్నట్లు తేలింది. సమృద్ధిగా వర్షాల అందుబాటు, సరి అయిన ధరల లభ్యం కావడం వల్ల కొంతకాలం సస్య విప్లవం సజావుగా కొనసాగింది. కానీ 1970లో సంభవించిన కరువులు ఈ సస్య విప్లవ ప్రభావాన్ని వెనుక్కునెట్టి వేసింది. ఫలితంగా ఊహించిన ఆశలు చిన్నాభిన్నమైనాయి. అంతవరదాకా అనూహ్యంగా పెరిగిన వాస్తవ అంచనాలు ఒక మేరకు ఊహ లుగా మారినాయి. అంతేగాక, రాజకీయ, ఆర్థిక, కారణాల వల్ల కూడా సస్యవిప్లవ పరిధిని విశాలతరం చేయడం అనివార్యమైనదని కూడా భావించినారు. ఈ విధమైన వైయుక్తిక (practical) భావనే మరొక్క సారి భూసంస్కరణ ప్రతిపాదనకు దారి తీసిన అంశం కూడా. భారత ప్రభుత్వం కూడా అంతరంగికంగా వివిధ ప్రాంతాలలో ఏర్పడుతున్న వ్యవసాయ అశాంతిని గమనంలోకి తీసుకున్నది. ఈసారి ఏర్పడిన అశాంతి భూస్వాముల కౌలుదార్లకన్నా భూస్వాములకు, వ్యవసాయ కూలీలకు మధ్య జరిగిన దృష్టాంతముగా పై పరిణామానికి ఉదహరణగా వివరించవచ్చు. సారవంతమైన నేలలతో అందిన నీటి వనరులతో, వరి పంటల సమృద్ధితో వున్న ఈ జిల్లా అత్యధికమైన భూస్వామ్య సంబంధాలను కూడా కలిగి వున్నది. నీటి వనరులు అందడంతో అధికమైన వరి పొలాల్లో అవసరమయ్యే శ్రమడిమాండ్‌ను వ్యవసాయకూలీలు గుర్తించారు. పొలాల్లో అవసరమయ్యే కూలీలను స్థానికేతర ప్రాంతాల నుంచి తీసుకొని వచ్చేసరికి తాంజావూర్ జిల్లాలోని అన్ని కులాలు ఏకమైనాయి. సంప్రదాయ బద్ధంగా అణిగిమణిగి వుండే కూలీజనం తమ ఎత్తుగడలను ప్రశ్నించే సరికి భూస్వాములు హింసాత్మక అణిచివేత పద్ధతులను అవలంభించినారు. తంజావూర్‌లో జరిగిన ఈ ఘటన మాదిరిగా అన్ని ప్రాంతాల్లోనూ జరిగేందుకు అవకాశాలు తక్కువ. ఎందుకంటే అనేక ప్రాంతాలలో వ్యవసాయ కూలీలు ఎక్కువ శాతం ధనికరైతులపై ఆధారపడి ఉన్నందువల్లనే అని చెప్పవచ్చు. అంతేగాక భారతదేశం యావత్తు వ్యవసాయం కూలీల సంఖ్య సమరూపంగా లేదు. ఉత్తరాది ప్రాంతాల్లోకన్నా రైత్వారీ వ్యవస్థ అమలులో వున్న దక్షిణాదిలో వ్యవసాయ కూలీల సంఖ్య ఎక్కువ. ఉత్తరాధిలో భాగస్వామ్య సాగు, ఇతరత్ర ఏర్పాటు, చిన్న కమతంపై ఆధారపడి బ్రతికే చిన్న రైతుల సంఖ్య అధికంగా వుండడం మూలానా ఆధారిత రైతుకు వ్యవసాయ కూలీ మధ్య విభజన కష్టమౌతుంది. అందువల్లనే బీహార్ లాంటి రాష్ట్రాలలోని అనేక జిల్లాల్లో వ్యవసాయక అశాంతి భాగస్వామ్య సాగుదార్ల (share croppers) తోనే కేంద్రీకృతమవ్వడం గమనించదగ్గ అంశం. తరుచుగా, భాగస్వామ్య సాగుదార్లను సాగు ఒప్పందం నుండి భూస్వాములు తొలగించడం, అట్లా తొలగించబడ్డ వారికి రక్షిత కౌలుచట్ట వ్యవస్థ లేక పోవడం వల్ల వారి వునికికి ఏరకమైన పరిష్కారం లేకపోయింది. స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం ప్రవేశపెట్టిన క్రొత్త కౌలుదారీ చట్టం భాగస్వామ్య సాగుదార్ల హక్కులకు సంబంధించిన సూచనలను చేసింది. అయితే కేంద్ర ప్రభుత్వం సూచించిన లంశాలపై శాసన రూపకల్పన చేసే వివేచనాధికారం వివిధ రాష్ట్రాలకే వదిలివేయడం జరిగింది. అయితే ప్రతీ రాష్ట్రంలో

వున్నటువంటి బలీయమైన స్వార్థశక్తులు తమ ప్రయోజనాలకు ఆటంకం కలిగించే ఈ విధమైన శాసన ప్రయత్నాలను అడ్డుకోవడం సహజంగానే జరిగింది.

మరోకవైపు అభివృద్ధి ఫలితాలు ధనికరైతులకు దక్కినప్పటికీ అవి అత్యధిక గ్రామీణ ప్రజానీకానికి చేరువకాలేక పోయినాయి. ఈ పరిస్థితే ప్రతిపక్ష పార్టీలకు భూఆక్రమణ ఉద్యమాలను నిర్మించేందుకు చేయూత నిచ్చింది. అయితే ఈ ఉద్యమాలు పెద్దయెత్తున సాగలేక పోవడానికి ఆయా పార్టీలకు కావలసినంత విస్తృత పునాది లేక పోవడం ఒక ముఖ్యకారణం. అట్లాగే ఆక్రమిత భూములనుద్దేశించి జరిపిన పెద్ద ప్రదర్శనలు కూడా ఈ పార్టీలు ఊహించినంతగా శ్రేణుల పరంగా పునాదిని పదిలపరుచుకోలేక పొయ్యాయి. అయినప్పటికీ సమస్యలపైన వున్న అవగాహనను తెల్పే ఒక సంకేతరూపంగా ఈ ఉద్యమాల ఉనికిని అర్థం చేసుకోవచ్చు.

ఇంకొక విధంగా ఆర్థికాభివృద్ధి కూడా వ్యవసాయరంగాన్ని ద్రవ్యోల్బణానికి గురిచేసి ఉద్రిక్తమయం చేసింది. ప్రభుత్వం దృష్టి నుండి ఈ ద్రవ్యోల్బణం ఉపయోగకారి. ఇన్ని రోజులుగా వ్యవసాయ రంగంపై ప్రభుత్వం, ప్రత్యక్ష పన్నులను విధించడానికి సంసిద్ధంగా లేకుండెడిది. కాబట్టి ఈ పరిస్థితి పరోక్షంగా విధించబడే పన్నులకు సాధనంగా ఉపయోగపడుతూ ప్రభుత్వ అభిలషణీయమైన అంశానికి చేరువకాగలగేటువంటిదిగా మారింది. ధరలు అదే పనిగా పెరగడం వల్ల మరొక వైపు వ్యవసాయ ఉత్పత్తులను పెంచేందుకు వడ్డీ వ్యాపారస్తులు తమ తమ వడ్డీ రేటును పెంచుకోకుండా బాధలకు గురి అవుతున్న రైతంగానికి ఋణపరిహార సహాయాన్ని అందచేసేందుకు ద్రవ్యోల్బణ స్థితి ఉపయోగపడిందని కూడా తెలుస్తుంది. అయితే దీని వల్ల పన్నులు చక్కగా చెల్లించ గల శక్తి వున్న గ్రామీణ సంపన్న శ్రేణులకు ఋణపరిహార చర్యలను చేపట్టడం ద్వారా మేలు చేసినట్లయింది. దీర్ఘకాలికంగా ఈ చర్యలు అటు వ్యవసాయ రంగాన్ని వృద్ధిచేయడానికి గానీ, పారిశ్రామిక రంగంపై వనరుల మళ్ళింపుకు గానీ ఉపకరించలేదనే చెప్పాలి. ఫలితంగా పారిశ్రామిక రంగం విస్తారం కాలేకపోయి పెరుగుతున్న గ్రామీణ నిరుద్యోగ జనాభా వత్తిడికి ప్రభుత్వం ఉపాధి కల్పించలేని పరిస్థితికిలోనైంది.

ఈ పరిస్థితిని సవరించటానికి తప్పనిసరిగా కొన్ని పరిష్కార మార్గాలు అవసరం. రాజకీయ పరిధిలో రక్షణను పొందుతున్న, పొందేందుకు కావలసిన మెళుకువలు తెలుసుకొన్న ఉన్నత వర్గ శ్రేణులు సంస్కరణల సాఫల్యతను నిరసిస్తాయి. రైతాంగం సాధారణంగా పెరిగిన వ్యవసాయ పన్నును చెల్లించడానికి, వ్యవసాయకూలీకి రోజు వారీగా చెందవలసిన కూలీ గురించి పెంచడానికి గానీ విముఖతను చూపెడ్తారు. భాగస్వామ్య సాగుదార్లను, వ్యవసాయకూలీలను పీడించే వారు తమ అదనపు అధికారాన్ని వదలు కోవడానికి ఇష్టపడరు. అందులో కొంత మంది ఆధునిక సాగు పరిజ్ఞాన పద్ధతుల అవలంబన వల్ల మనిషిని కొల్ల గొట్టడం కాదని భూమిని

సారవంతం చేయడంలో మక్కువను చూపెట్టినారు. సంపన్న రైతుల సంఖ్య అధికమైనందువల్ల క్రొత్త ఆర్థిక, రాజకీయ పరిణామాలు చోటుచేసుకొనే వీలుండేది. వ్యవసాయం పట్ల వీరికి ఉండే నవీన దృక్పథం అలవరచుకోవడం వల్ల ప్రత్యక్ష పన్నులను చెల్లించేందుకు సిద్ధపడుతారు. ప్రత్యక్షపన్నులద్వారా నిధుల సమీకరణ చేయ్యలేని ప్రభుత్వం ప్రత్యక్షంగా ప్రగతిని సాధించలేదు. బ్రిటిష్ పాలనా వారసత్వ సంక్రమణ ప్రభావం తదనంతర భారత ప్రభుత్వ పాలనా సరళిపై విషపూరితమైన విధ్వంసకర ప్రభావాన్ని కలిగివుంది. విదేశీపాలకుల పాలనా ప్రవృత్తికి స్వాభావిక లక్షణం ఉంటుంది. పరస్పర స్వార్థ ప్రయోజన శక్తుల మధ్య సమతౌల్యం సాధించడం ద్వారా తమ స్వంత పాలనను స్థిరీకరించుకొనే స్వభావ లక్షణం దీనికి వుంటుంది. అంతేగాక, కేవలం మధ్య వర్తి పాత్రను పోషించడంపైన దృష్టిని నిలిపి ప్రభుత్వ నడవడిపై ప్రభావం చూపే భావి నాయకత్వ ఏర్పాటు పట్ల కావలసిన పాత్రను బ్రిటిష్ పా [illegible] పోషించలేదు. జాతీయోద్యమ ఆశయాలకు, సామాజిక ఆర్థిక ప్రగతి లక్ష్యాల సాధనకు కావలసిన నిబద్ధతకు ఏమాత్రం బ్రిటిష్పాలనా వారసత్వం ఉపకరించనటువంటి అంశం. నిర్దుష్టమైన సామాజిక ఆర్థిక ప్రగతి లక్ష్యాల అడ్డంకులు అధిగమించే సాధనాలను వెదికే క్రమంలో ఈ పాలనా వారసత్వ స్వభావాన్ని స్పష్టంగా గమనించడం ఎంతో అవసరం.

# ఆంగ్ల - తెనుగు సాంకేతిక పరిభాష (సంక్షిప్త) వివరణ

| | | |
|---|---|---|
| Determinants | = | నిర్ణాయకాలు |
| Dependent Cultivators | = | ఆధీనసాగుదారులు |
| Peasant Economy | = | రైతాంగ ఆర్థిక వ్యవస్థ |
| Permenent Settlement | = | శాశ్విత శిస్తు విధానం, శాశ్విత నిర్ణయాలు |
| Base line | = | గీటురాయి |
| Time Proximity | = | సమయకాల వ్యాప్రుతలు |
| Deserted villages | = | బీడు గ్రామాలు |
| Rentiers | = | కౌలు ఇచ్చేవారు |
| Mofisilization | = | విషమ గ్రామీకరణ |
| Maritime power | = | సముద్రయాన అధికార సంబంధం |
| Absentee land lord | = | నివాసేతర భూస్వామి |
| Crop sharing | = | పంట భాగస్వామ్యం |
| Share cropper | = | పంట భాగస్వామి, పాలుదారుడు, భాగస్వామ్య రైతు |
| Rent | = | బాటకం, అద్దె |
| Tenant-at-will | = | అభీష్టానుసార కౌలుదారుడు, ఏ హక్కులు లేని సాగుదారు |
| Map | = | నక్షా, పటం |
| Settlement Officer | = | నిర్ధారణ అధికారి |
| Code of civil procedure | = | పౌర విధాన స్మృతి |
| Land Alienation | = | భూపరాయికరణ |
| Exparte Decree | = | ఏకపక్ష ఉత్తర్వు |
| Fixed Tenure | = | నిర్ణీత కాలపరిమితి |
| Free Transfer | = | స్వేచ్ఛాయుత బదిలీ |
| Fair rent | = | సరసమైన భాటకం |
| Prohibitive Rent | = | నిషేదాత్మక బాటకం |
| Prescriptive Rights | = | అనుపాదిత హక్కులు |
| Co-ownership | = | సహాయజమాన్యం |
| Subinfeundation | = | ఉప భూస్వామ్యీకరణ |
| Occupancy Tenants | = | స్వాధీనకౌలుదార్లు, స్వాధీన సాగుదార్లు |
| Occupancy Right | = | సాగు యజమాన్య హక్కు, ఆపాదిత హక్కు |
| Fragmentation of holdings | = | కమతాల విభజన, విఘటన |
| Secretary of State | = | రాజ్య కార్యదర్శి |
| Record of Rights | = | భూమిపై ధృవీకరణ లిఖిత హక్కులు |
| Primogeneature | = | జ్యేష్టత్వం |
| Practical | = | వైయుక్తికమైన, లౌక్యంతో కూడుకొన్న |

## రచయిత - అనువాదకుల పరిచయం



ఈ గ్రంథాన్ని రాసిన ప్రొ. డీట్‌మార్ రోథర్ మూండ్ సుప్రసిద్ధ దక్షిణ ఆసియా చరిత్రకారుల్లో ఒకరు. భారతీయ సమాజాన్ని చారిత్రక దృష్టితో విశ్లేషించి తనదంటూ ఒక ఒరవడిని ప్రవేశపెట్టిన వ్యక్తి రోథర్‌మూండ్. వలసవాద కాలంలో భారతీయ ఆర్థిక వ్యవస్థ, భారత దేశ ఆర్థిక చరిత్ర, భారతదేశ జాతీయోద్యమం, గాంధీజీ ఆలోచనా విధానంపైన విస్తృత పరిశోధనలను ప్రొ. రోథర్‌మూండ్ గత ఐదు దశాబ్దాలుగా కొనసాగిస్తున్నారు. విశ్లేషకుడిగానే కాక, భారతదేశ సమాజశాస్త్ర ఆలోచనా పరంపరను, భారత - జర్మనీ మైత్రీ సంబంధాల్లో పాలనాపరంగా ఎన్నో కీలకమైన కమిటీల్లో సభ్యత్వాన్ని కలిగివుంటూ క్రియాశీలక పాత్రను ప్రొ. రోథర్‌మూండ్ పోషిస్తున్నారు. సౌత్ ఏషియా ఇనిస్ట్యూట్, యూనివర్సిటీ ఆఫ్ హైడల్‌బర్గ్‌కు సంస్థాపకుడిగా, డైరెక్టర్‌గా, చరిత్ర శాస్త్రాచార్యులుగా రోథర్ మూండ్ ఎనలేని సేవలను అందిస్తున్నారు. దాదాపు 20 పుస్తకాలను, వందకు పైగా వ్యాసాలను, జర్మనీ, ఇంగ్లీషు భాషల్లో ఆయన రచించినారు.

డా॥ బి. జనార్ధన్‌రావు కాకతీయ విశ్వవిద్యాలయం పాలనాశాస్త్ర విభాగంలో రీడర్‌గా పనిచేస్తున్నారు. ఈ పుస్తక అనువాదాన్ని చేపట్టడం మూడవ ప్రపంచ దేశాల్లోని రాజకీయ ఆర్థిక పరిణామాలను చారిత్రకంగా అధ్యయనం చేయడంలో భాగం. జర్మనీకి బాడెన్ వ్రోటెమ్‌బర్గ్ ఫెలోషిప్‌పై 1990లో వెళ్లిన సందర్భంగా ఏర్పడిన బౌద్ధిక సంబంధంలో భాగంగా ఈ అనువాదాన్ని చేపట్టడం జరిగింది. జనార్ధన్‌రావు ఇప్పటికి 62 జాతీయ సెమినార్‌లలో, 11 అంతర్జాతీయ సెమినార్‌లలో పరిశోధన పత్రాలను సమర్పించారు. డా॥ రావు 4 పుస్తకాలను, 42 వ్యాసాలను ప్రచురించారు. 1993-95 మధ్యకాలంలో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్స్, న్యూఢిల్లీ, పోస్ట్ డాక్టరల్ ఫెలోగా ఎంపిక చేయబడ్డారు. వివిధ జాతీయ స్థాయి పరిశోధనా, అధ్యయన కమిటీలలో సభ్యులుగా ఉంటూ, మూడవ ప్రపంచ దేశాల పాలనా వ్యవస్థ - అభివృద్ధి, గ్రామీణ గిరిజన సమాజాల అధ్యయనం, దేశీయ వనరుల వినియోగం, పాలనా వ్యవస్థల పరిణామం, వలసవాద - సమకాలిక రాజ్య-ప్రభుత్వ విధానాల విశ్లేషణ వంటి అధ్యయన రంగాలలో ప్రస్తుతం డా॥ జనార్ధన్‌రావు తన పరిశోధనా దృష్టిని కేంద్రీకరిస్తున్నారు.

256

